

శ్రీమదాంధ్ర వాల్మీకి

# వచన రామాయణము

## ఉత్తర కాండము




శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ



రచయిత్రి శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ

పతిదేవులు (పరమపదవాసులు) శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులు అయ్యవార్లతో

Published by

www.pravachanam.com

# శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము

(రిజిస్టర్డ్ ట్రస్ట్ 327/95, తేది 18-8-95)

శ్రీ జీయర్ స్వామివారి కార్యాలయం
7-7-41, రామారావు పేట
కాకినాడ - 533 004
తూ॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్
ఫోన్స్ : 0884 - 2371064, 2371070.



వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ
రామానుజ జీయర్ స్వామివారు

తేది : 18-09-2020

## మంగళాశాసనములు

శ్రీమద్రామాయణం శ్రీరామానుజ సంప్రదాయానికి మూలాధారమని, సాక్షాత్తు వేదమని, శ్రీరాముడు వేద పురుషుడని మన పూర్వాచార్యుల వాక్కు.

అట్టి శ్రీమద్రామాయణమును సంప్రదాయానుగుణముగా, సరళ వచనములో రచించారు పండితురాలైన శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ గారు. వీరు శతాధిక వృద్ధులు. వారికి అనేక మంగళాశాసనములు.

శ్రీమతి సీతమ్మగారి శతజయంతి సందర్భంగా ప్రకటిస్తున్న ఈ సరళ వచనరూప రామాయణము అందరికీ ఉపయోగ పడాలని మా ఆకాంక్ష.



ఈ పుస్తకం ముద్రణకి ప్రవచనం.కామ్ వారు సహకరిస్తున్నట్లు తెలిసింది. వారికీ అనేక మంగళాశాసనములు.

(శ్రీరంగ రామానుజ జీయర్,
కాకినాడ)



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారి

## శతజయంతి సందర్భంగా

కుటుంబ సభ్యుల కానుక



# ఉత్తరకాండము



పరిష్కర్త

శ్రీ వింజమూరి శేషఫణి శర్మ

ముద్రణా సహకారం
pravachanam.com బృందం

# ఉత్తర కాండము

**శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**



ముద్రణ

**నవంబరు, 2020**

వెల

**అమూల్యం**

ముద్రణా సహకారం

**pravachanam.com బృందం**

సంప్రదించుటకు

**శ్రీ ఎస్.టి.పి.ఎస్.వి.రాఘవాచార్యులు**

9490942884

ప్రింటర్

**ముద్రిక ప్రింటర్స్, విజయవాడ**

# నివేదన

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ నారాయణుల కటాక్షముచే మంచి ఆరోగ్యముతో మా మధ్య కదలాడుచూ ఈ శార్వరి నామ సంవత్సర ఆశ్వయుజ బహుళ ద్వాదశి, హస్తా నక్షత్రము అనగా 12-11-2020 నాడు నూఱవ వసంతము పూర్తిచేసుకొనుచున్నారు మా కుటుంబపెద్ద శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారు. ఈమె పతిదేవులైన పరమ పదవాసులు శ్రీమాన్ వేంకటరాఘవాచార్యులువారు గొప్ప ఉపాసకులు, మంత్రశాస్త్రవేత్త. వీరికి నలుగురు కుమారులు మఱియు ముగ్గురు కుమార్తెలు. ప్రస్తుతము రెండవ కుమారుడైన శ్రీమాన్ శ్రీవెంకటేశ్వర్లుగారి కుటుంబానికి సేవా భాగ్యము కలిగించుచు హైదరాబాదు నందు నివసించుచున్నారు.

ఆమె పుట్టింటి నుండి సంగీత సాహిత్యాలు, సంప్రదాయకత, పఠనాసక్తి, ఆర్షజ్ఞానము, దైవచింతన అరణంగా తెచ్చుకొని మెట్టినింట పతిదేవుల సాహచర్యములో దైవోపాసన, పరోపకారము అలవరచుకున్న ఉభయవంశ పవిత్ర. తల్లిదండ్రులైన శ్రీమాన్ మొలుగు వెంకట నరసింహాచార్యులు, వెంకటనరసమ్మ శిక్షణలో వాల్మీకి రామాయణము ఆమెకు నిత్యపారాయణ గ్రంథమైనది. అదియే ఈ గ్రంథ రచనకు నాందియైనది. అజరామరమైన శ్రీమద్రామాయణానికి ఎన్ని వ్యాఖ్యానములు, అనువాదములు ఉన్నా వేటి తీరు వాటిదే. ఆయా రచయితల అనుభూతులు కూడా వాటి వాటి ప్రత్యేకతలు కలిగి ఆస్వాదయోగ్యంగా ఉంటాయి. 'ఆంధ్రవాల్మీకి' శ్రీ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) గారి 'ఆంధ్రవాల్మీకి రామాయణ' పద్యకావ్యము పఠన ఆమెకు రామాయణముపై మరింత అవగాహన పెంచడమేగాక సామాన్యులకును

అర్థమగునట్లు తనదైన శైలితో తెలుగు వచనములో రామాయణమును ఉత్తర కాండ సహితముగా అనువదించుటకు మూలమైనది. ఆమె రచన స్నిగ్ధమైన తేటనీటిధార, సహజమైన శైలీప్రవాహము.

ఈ సంకల్పమునకు తగిన ప్రేరణ యిచ్చి ప్రోత్సహించినవారు ఆమె సోదరులైన ఆధ్యాత్మికవేత్త శ్రీమాన్ మొలుగు రంగాచార్యులుగారు కాగా రచనలోని సహజధారను పరిష్కరించినవారు పెద్దకుమారుడైన రాధా కృష్ణమాచార్యుని మిత్రులు, పండితులు, కవులునైన శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. ఆమెపై నున్న వాత్సల్యముతో 'ప్రవచన శిరోమణి' శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు వారి అభినందనములను తెలియజేయగా 'న్యాయ-ఉభయవేదాంత ప్రవీణ' శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులు గారు వారి ఆశీస్సులను అందజేశారు.

ఈ రామాయణ కథానాయకుడైన శ్రీరాముని అన్నదమ్ములవలె నుండెడి ఈమె కుమారులు తొలి ప్రయత్నముగా వీరి రచనలలోని 'రామానుజ చరిత్ర', 'బాలకాండము'లను మూడవ కుమారుడైన శ్రీమాన్ నరసింహాచార్యులు - లీల దంపతులును, 'సుందరకాడము'ను శ్రీమాన్ రాధాకృష్ణమాచార్య - భూదేవి దంపతులును, 'దశరథుని కోడళ్ళు'ను మూడవ అల్లుడైన శ్రీమాన్ కరి రాధానాథాచార్యులు - విజయలక్ష్మి దంపతులు ప్రచురింపజేసిరి. ఈమెకు సేవచేసి ఈ రచనలు చేయుటకు చక్కని వాతావరణము కల్పించినవారు నాల్గవ కుమారుడైన శ్రీమాన్ శ్రీమన్నారాయణ, సీత దంపతులు.

అటు పిమ్మట సీతమ్మగారు ఈ వచన రామాయణ మూలప్రతులను శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము (కాకినాడ) వ్యవస్థాపకులు అయిన శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారికి సర్వహక్కులతో సమర్పించినారు. అంతేగాక వీరి కథా

సంపుటీకరణములైన సన్మార్గదర్శనము, ఆత్మజ్ఞానమునకాధారము, అహం వేద్మి మొదలగునవి స్వామివారి ఆధ్యాత్మిక మాసపత్రిక 'శరణ్య'లో ప్రచురితమైనవి.

శతజయంతి సందర్భమునకు తగిన బహుమాన రూపములో ఈ వ్రాతప్రతులను వెలుగులోనికి తీసుకురావలెనను, శాశ్వతముగా నిక్షిప్తపరచ వలెనను కోరికతో ఈ వచన రామాయణమును (ఏడు కాండలు) నేటి సరళి ననుసరించి అంతర్జాలమునందు ఉంచినచో అందరికీ అందుబాటులో నుండునని తలచి, పెద్దల అనుమతితో ప్రవర్తించుచుంటిమి. ఇందుకుగాను పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు తమ దివ్య మంగళాశాసనములను కృపజేసినందున ఆమె మఱియు ఆమె కుటుంబము తరఫున స్వామివారికి అనేకానేక దాసోహములు. అలాగే అంతర్జాలము నందుంచుటకు, ముద్రణకు సహకరించిన 'ప్రవచనం.కాం' బృందము వారికి మా ధన్యవాదములు. ఈ ఆలోచన చేసి, సాకారము చేయుటలో ముఖ్య భూమిక వహించిన వారి మనుమలైన శ్రీమతి కొమాండూరి శిరీష, కులశేఖర్ దంపతులు ఎంతో అభినందనీయులు. ఈ గ్రంథము www.pravachanam.com నందు ఎల్లవేళలా లభ్యమగును గాన ఈ అవకాశమును అందరూ సద్వినియోగపరచుకొనవలసినదిగా మనవి.

ఈ పుస్తకము పఠించు సహృదయులకు శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రులవారు కరుణా కటాక్షముల ననుగ్రహించి సర్వశ్రేయాలు కలిగించుగాక!

**కుటుంబ సభ్యులు**

**(12-11-2020)**

# ఀ ముందుమాటలు ఁ

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ ప్రసాద సిద్ధికొరకై యా దివ్యమహిషిని ప్రార్థన చేసి నే చెప్పబోవు తొలి పలుకులు రసజ్ఞులైన మహనీయ పాఠకులందరు ఆలకింతురు గాక.

నా చిన్నతనమున మా తండ్రిగారైన మొలుగు వెంకట నరసింహాచార్యులు గారు నాకు అక్షర జ్ఞానముతో బాటు కావ్యపఠనమందు ఎంతయో అభిమానము కలిగించిరి. సంస్కృత వాల్మీకి రామాయణముపై మక్కువ వారివలననే కలిగినది. దానిని చదివినను పూర్తిగా అవగాహనము చేసుకొనలేనను భయముతో సంస్కృతమునకు సరియగు ఆంధ్ర పద్య కావ్యమునకై యెంతయో యత్నించితిని. నా తపన ఫలించి అట్టిది లభించినది. కాని యెంత హృద్యముగ నున్నను పద్యమును చదువువారు నేడు కరవైపోవుచున్నారు. పండితులకు సంస్కృత మైనను, ఆంధ్ర పద్యమైనను, వచనమైనను ఒకటే ఉపాదేయమే. వచనమైనచో సామాన్యులును చదివి యానందించగలరు. నేను ఆంధ్ర రామాయణ గ్రంథలభ్యతకై పడిన తపన – వాల్మీకి రామాయణమునకు సరియగు తెలుగు వచన రామాయణమునకై మరి యెవ్వరును పడరాదని తలచి – యీ రచనకు పూనుకొంటిని.

నాకు లభించిన ఆంధ్ర వాల్మీకి రామాయణ పద్యకావ్యము మూలానుసారియై యున్నది. ఆంధ్ర వాల్మీకి, వాసుదాసు వంటి సార్థక నామములు గల శ్రీ వావిలికొలను సుబ్బారావు గారిచే రచింపబడినది. కనుక దానిని చదివి వచన రూపమునకు తెచ్చుటకు ఉత్సాహపడితిని. రామాయణము వంటి కావ్యమును అందరు చదివి ఆనందించునట్లు ప్రసన్న మాధుర్యమైన వచనములో వ్రాయుట నాకు సాధ్యపడునా? అను శంక నన్ను బాధించుచుండగా, మా ఇలవేల్పులు శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ అమ్మవారును, శ్రీ ఆపదోద్ధారక ఘోర వీర లక్ష్మీనృసింహస్వామివారును, శ్రీ పంచాయతన వేణుగోపాల స్వామి వారును రచనకు ఉపక్రమించుమని నన్ను ఆదేశించిరి.

శ్రీమాన్ మాంత్రిక రాణ్మౌళి, శ్రీమత్పండిత మంత్రరత్న బిరుదాంకితులైన నా పతిదేవులు శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకట రాఘవాచార్యుల వారి యాదేశము లభించినది. వారి ఆదేశముల ననుసరించి, ఆదేశకర్తల పైననే భారముంచి రచనకు ఉపక్రమించితిని.

మా పొరుగువారైన శ్రీ అవ్వా జగన్నాధశాస్త్రిగారి సతీమణి సుశీలాదేవిగారు కావ్య పఠనమునందు ప్రీతి కలవారు. పరహృదయములను అవగాహన చేసుకొను సహృదయ స్నేహపాత్ర. వారు నేను వ్రాసిన దానిని చదువుచు సూచనలనిచ్చుచు ప్రోత్సహించిరి. నా మనుమలు శ్రీధర్, శ్రీకాంత్ లు శ్రద్ధతో భౌతిక సౌకర్యములు కల్పించుచు వచ్చిరి. నా సోదరుడు మొలుగు రంగాచార్యులు రచనలో మెళకువలు తెలుపుచు, వాక్య నిర్మాణమున సూచనలిచ్చి సహాయపడినాడు. నా పెద్దకుమారుడు రాధాకృష్ణమాచార్యులు కోరగా గ్రంథమును పరిష్కరించుటేకాక శుద్ధప్రతిని కూడ వ్రాసియిచ్చిన పండితులు, ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు నగు శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. వీరు కవులు, సాయిభక్తులును. కాళిదాస విరచిత రఘువంశమును ఆంధ్రమున పద్య కావ్యముగా 'రఘువంశ తిలక చరితము' అను పేరున, మయూర కవి విరచిత సూర్యశతకమునకు వ్యాఖ్యను వ్రాసి ప్రచురించినవారు, ఇంకను అనేక రచనలు చేసినవారు. వీరికి నాయందు గల సోదరీ వాత్సల్యము, శ్రీరామచరితముపై గల అభిమానమును యింతటి శ్రమ తీసుకొనుటకు కారణములైనవి.

వీరందరికి శ్రీ సీతారాములు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి రక్షింతురు గాక!

ఈ గ్రంథమును శ్రీ సకలభువన సామ్రాజ్య లక్ష్మీ నారాయణ స్వామివారికి తత్కటాక్ష లబ్ధికోరి నా హృదయ కుసుమముతో జతచేసి సమర్పించుచున్నాను. ఇందలి గుణములను గ్రహించి దోషములు విసర్జించ గోరుచున్నాను. కథానాయకుడు శ్రీరామచంద్రుడు సాగరమును దాటించి హనుమను అనుగ్రహించినట్లు యీ సంసార సాగరము నుండి నన్ను తరింపజేసి పరమపదము ననుగ్రహింప గోరు భాగవత పదదాసి.

**(సం) శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**

**(అయ్యవారి రుద్రవరము)**

శ్రీరామ శ్శరణం మమ

# అభినందనము

శ్రీమాన్ శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకట రాఘవాచార్యులుగారు మంత్రానుష్ఠానము చేసి సిద్ధి నొందిన మహనీయ చరిత్రులు. వారి ధర్మపత్ని వెంకట సీతమాంబగారు, వారి ధర్మపత్నియై జన్మసిద్ధమైన భగవద్భక్తికి మెరుగుపెట్టుకొనిన ధన్యురాలు. ఆమె లౌకిక విద్యలలో ప్రావీణ్యమును సంపాదింప యత్నించలేదు. కాని ఉత్తమ గృహిణిగా శ్రీ రాఘవాచార్యులుగారి సాహచర్యమున, భగవదుపాసనమున పరినిష్ఠితురాలై భగవదనుగ్రహ పాత్రతనందినారు. భగవత్కటాక్ష విశేషముచే దివ్యమైన జ్ఞాన వైశద్యము, సౌమ్యమైన వాక్కు, ప్రకృతిసిద్ధమైన మాధుర్యము వారి కలవడినవి. ఈమె పతివ్రత యగుటచే పతివ్రతయై కారుణ్యరూపిణియై ఛాయవలె శ్రీరామచంద్రుని అనువర్తించి, తన నడవడిచే లోకాన్నే కాక ప్రియుని కూడ పరవశింపజేసిన ధన్యచరిత. భూజాత సీత చరిత మీమె మనసు నాకర్షించినది.

''సీతాయాశ్చరితం మహత్'' అని పేరుపొందిన శ్రీరామాయణము ఆంధ్ర వాల్మీకి నుండి వెల్వడినది. అది ఈమె భాగ్యవశముచే నిత్యపారాయణ గ్రంథమైనది. పెద్ద పాండిత్యము కాని, భాషాజ్ఞానము కాని లేదని చెప్పు కొనుచున్న ఈమెకు ఆ రామాయణము నంతను తన వాక్యములతో తెనుగున వ్రాయవలెనని కోరిక కలిగినది. ఇది పూర్వజన్మ సుకృత ఫలము. శ్రీరాముని చరితము చదువుట, అనుభవించుట మాత్రమే కాక తామాస్వాదించిన దానిని తమదిగా చేసుకొని తన వాక్కులతో ఆవిష్కరించవలెనని కోరిక కలిగినది. దానికి తగిన భాష, ఆవిష్కరణ శక్తి వారి ఉపాస్యదైవము వారికి అనుగ్రహించినారు.

ఆంధ్ర వాల్మీకి విరచిత శ్రీరామాయణము వాల్మీకి ప్రతి శ్లోకమునకు అనువాదము మాత్రము కాదు. రహస్యార్థ ప్రతిపాదకములగు శబ్దములను విడువక అనువాదము

నందిచ్చిన మహత్తర గ్రంథము, దాని నర్థము చేసుకొనుట కష్టము - కాని అర్థము చేసుకొనినారు. చేసుకొని సులభము, నిర్దుష్టము, స్పష్టము, అన్వయ క్లేశరహితము నగు మధుర ప్రసన్న భాషలో వచనముగా అందించి జీవితాన్ని సార్థకము చేసికొనినారు. శ్రీరామాయణము ప్రాచేతసుల నుండి వెల్వడిన వేదము. వేదమున పూర్వభాగార్థమును వాల్మీకి వాచ్యార్థమున కవిగా ప్రతిపాదించినాడు. అంతరమగు ధ్వన్యర్థమున ఆధ్యాత్మిక మైన వేదోత్తర భాగార్థమును మునిగా సూచించినాడు. ఈ రామాయణమున శ్లోకమును కాని, పాదమును కాని అధ్యయనము చేసినంతనే భగవత్సాయుజ్యము నొందెదము అని పెద్దలు చెప్పుదురు. అట్టిచో ఈమె ఏడు కాండలు చదివి అనుభవించి జీర్ణము చేసుకొని తనదిగా తెనుగు వచనమున ఆవిష్కరించి ధన్యత నందినారు. ఈమె భాగ్యమే భాగ్యము.

ఈ అనువాదము అనువాదము వలె లేదు. స్వతంత్రముగా సాగినది. భాష సహజము, మధురము, ప్రసన్నము. వాక్యము సంస్కృతమునకు అనువాదముగా ఉండక అచ్చమైన తెనుగుదనమును సంతరించుకొన్నది. బాలకాండములో అశ్వమేధయాగ సందర్భమున ఆమె చేసిన అనువాదము ఆశ్చర్యజనకముగా నున్నది. పండితులకు కూడ దురవగాహమైన యాగక్రమ వివరణము పండితులకు కూడ సంశయము తీరునట్లు, పామరులకు కూడ సులభముగ అర్థమగునట్లు వ్రాసినారు. ఇది చదువుకొనిన జ్ఞానము కాదు. భగవదుపాసనచే వచ్చిన భాష-విషయ వైశద్యము. తెనుగున ఇంతవరకు ఎన్నో - గ్రాంధికభాషలో, వ్యావహారిక భాషలో గూడ అనువాదములు వచ్చినవి. భాషలో, వాక్య నిర్మాణములో ఇంత అందము సౌలభ్యము వేరొకదానిలో చూడమనుట అతిశయోక్తి కాదు - వాస్తవము.

ఆమె అనుభవించిన శ్రీరామచరితమును లేశమాత్రమనుభవించి ధన్యత నొందిన వాడనగుటచే అనువాదమును చూచి ఆనందించి ఆమె చేసిన ప్రయత్నమును అభినందింపకుండా ఉండలేకనే యీ మాటలు వ్రాయుచున్నాను. కాని ఆమె ద్వంద్వాతీతురాలు. ఆమెకు వెనుక బలము ఆమె ఉపాస్యదైవము. ఆ దైవబలము పలికించగా వాల్మీకి నోటినుండి శ్రీరామాయణ మంతయు బ్రహ్మానుగ్రహముచే వెల్వడినట్లు ఈ వచన శ్రీరామాయణము ఈమె నోటి నుండి వెల్వడినది. ఆంధ్ర పాఠక లోకము అన్యూనాతిరిక్తముగ వాల్మీకి రామాయణమును గ్రహించుటకు ఈ గ్రంథము సాయపడును.

ఆమె తరించుటయే కాక అందరిని తరింప చేసిన ధన్యచరిత, మా సీతమ్మగారికి శ్రీ సీతారామచంద్రులు తమ విశేష కటాక్ష ప్రసాదముచే ఇతోధికముగ లోకానికి తమకున్న దైవీ సంపదను పంచిపెట్టు శక్తిని, భక్తిని ప్రసాదింతురు గాక అని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

**(సం) శ్రీ భాష్యం అప్పలాచార్యులు**

26-12-1989



శ్రీ హయ వదన పరబ్రహ్మణే నమః
శ్రీమతే రామానుజాయ నమః

# ఆశీస్సు

**సుఖాయ కర్మాణి కరోతి లోకః నతైస్సుఖంవా న్యదుపారమం వా।**
**విందేత భూయాస్తత ఏనదుఃఖం యదత్ర యుక్తం భగవన్వదేన్నః॥**

అని నటుల ఈ ప్రపంచమున ప్రకృతి బద్ధులగు చేతనులందరును సుఖా పేక్షచే కొన్ని కార్యములందు ప్రవర్తించుచున్నారు. అందువలన వీరికి సుఖప్రాప్తి గాని దుఃఖ నివృత్తి గాని సంభవించకపోవుటయే గాక అధికముగా దుఃఖములు సంభవించుచున్నవి. ఇటుల ప్రకృతి పిశాచికావిష్టులై ప్రకృతి సామ్యము ననుభవించుచు స్వభావ సహజమగు జ్ఞానానందమలత్వాదికమును, పరమపురుష శేషత్వమును విస్మరించి నానావిధ సాంసారిక దుఃఖముల ననుభవించుచున్నను క్షణకాలము కూడ ప్రకృతి సంబంధము లేక యుండ జాలరు. ఇది యొక విచిత్ర సంఘటన. ప్రకృతి సంబంధ విచ్ఛేద మెటుల సంభవించును? ఇందుల కుపాయమెద్ది? దీనిని తెలుసుకొనుటకు సాధనములేవి? యని విచారింపగా ప్రత్యక్షము అతీంద్రియార్థములను గోచరింప చేయనందునను, అనుమానము ప్రత్యక్షా పేక్ష మగుట చేతనున్నూ – ఇవి సాధనము లన వీలులేదు. ఇక శబ్దమును సాధనముగా గ్రహించవలెను. అదియు పౌరుషేయమైనచో సజాతీయ పురుషులయందు విశ్వాసముండదు గాన వారు చెప్పినదాని ననుసరించుట అసంభావితము. దీనిని విచారించి నిరుపాధిక వత్సలుడును దయాసముద్రుడును సర్వశక్తుడు నగు భగవానుడు అపౌరుషేయము నిత్యనిర్దోషము సకల పురుషార్థబోధకము నగు వేదమును తన నాభికమలమున జన్మించిన చతుర్ముఖుని కుపదేశించెను. ఆ వేదమింత వరకు అవిచ్ఛిన్నముగా పాఠక్రమమున వచ్చుచున్నది. దీని కర్థము దుర్బోధక మగుట వలన వివరణ మపేక్షిత మగుటచేత సర్వేశ్వరుడు మహాత్ముల కొందరి నవతరింపజేసి వారిలో తా నంతః ప్రవిష్టుడై వారి ముఖమున వాటిని వివరించుటకు ప్రవర్తించిన వాడాయెను.

ఆ వివరణములు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ఆగమములు – అని వ్యవహరింపబడుచున్నవి. ఇందు స్మృతులు మానవ పారాశర్యాదులు. ఇవి భగవదారాధన రూపమును ఫలాపేక్షి జనానుగ్రాహకము నగు కర్మ కాండమునకు వ్యాఖ్యారూపములు. ఇతిహాసములు – రామాయణ భారతాదులు. ఇవి మహాపురుష చరిత్ర బోధకములగుచు వేదాంత భాగ వ్యాఖ్యారూపములు. పురాణములు – విష్ణుపురాణ, భాగవతాదులు. ఇవి సర్గాదిలక్షణపంచక సమేతములై వేదాంతార్థ ప్రకాశకములు. ఆగమములు పాంచ రాత్రాదులు. ఇవి దేవతారాధన బోధకములు. ఇందు ఇతిహాసము సాక్షాదుపనిషద్వ్యాఖ్యాన మగుటచే స్మృత్యాదికమున కంటె ప్రశస్తము. ఇందు రామాయణము సీతారామ రూప మానుష వేషధారులగు శ్రీ శ్రియఃపతుల యొక్క చరితమును బోధించు నదియు, చతుర్ముఖ ప్రేరితుడగు వాల్మీకి మహర్షిచే రచింపబడినదియు మోక్షసాధనమగు భగవచ్చరణాగతిని సీతా రూపమును ధరించిన శ్రీదేవి యొక్క పురుషకార వైభవమును ప్రతిపాదించునదియునై యున్నది. కనుకనే –

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।**
**వేదః ప్రాచేత సాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా ॥**

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథ కుమారుడుగా నవతరించగా – ప్రమాణము ప్రమేయానుసారి కనుక – ప్రమాణమగు వేదము వాల్మీకి మహర్షి వలన రామాయణ రూపమున నవతరించినదని ప్రశంసించబడి యున్నది.

శ్రీమద్రామాయణము సీతారాముల చరిత్రమైనను ఇందు ప్రధానముగా సీతాచరిత్రమే చెప్పబడినదనియు, ఇది గొప్పదనియు, "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్" అని వాల్మీకి మహర్షి చెప్పియుండెను. సీతాచరిత్ర దేనికంటె గొప్పది? అనిన రామచరిత్రకంటె గొప్పదని యభిప్రాయము. పూర్వాచార్య గృహీతమగు నీ క్రింది శ్లోక మీ విషయమును స్పష్టపరచుచున్నది.

**"మాతర్మైథిలి రాక్షసీస్త్వయి తదైవార్ద్రా పరాధాస్త్వయా**
**రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా।**
**కాకంతం చ విభీషణం శరణ మిత్యుక్తి క్షమౌ రక్షతః**
**సానస్సాంద్ర మహాగస స్సుఖతు క్షాంతిస్తవా కస్మికీ ॥**

రావణ సంహారానంతరమున హనుమంతుడు సీతా సమీపమునకు వెళ్ళి రాక్షస స్త్రీలు నీ విషయమున అపరాధము చేసి యున్నవారు గాన వీరిని సంహరించుటకై అనుజ్ఞ నీయవలసినదనగా రాజాశ్రితులు రాజాజ్ఞచేతనే గదా ఏపనినైన చేయుట. అట్టి వారి విషయమున కోపించుట యుక్తము కాదని రాక్షసస్త్రీలు తమ రక్షణను ప్రార్థించక పోయినను వారిని రక్షించెను. శ్రీరామచంద్రుడు శరణ ప్రార్థన చేసిన కాకాసుర విభీషణుల రక్షించెను. ఇందువలన రామచరితము కంటె సీతాచరితము గొప్పదను ఆశయము చేతనే "సీతాయాశ్చరితం మహత్" అని చెప్పెను.

ఇట్టి శ్రీరామాయణమును సర్వజనులకు సులభగ్రాహ్య మగునటుల వచన రూపమున వ్రాసి లోకోపకారము గావించినదీ సీతామతల్లిక. సీతమ్మకు సీతాచరితమే మనోహరము ఆనందావహము కదా! కనుకనే భగవచ్చరితము లనేకము లున్నను ప్రథమమున శ్రీరామాయణము వ్రాయబడినది. ఇటుల భగవచ్చరిత బోధకములగు యితర గ్రంథములను కూడ సుగ్రాహ్యము లగునటుల వచన రూపమున వ్రాయుట కీమెకు భగవాను డాయురారోగ్యోత్సాహాదుల నొసంగుగాక!

(సం) **మొలుగు రామానుజాచార్యులు**
**ముగ్గుళ్ళ**

## విషయసూచిక



శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమ త్సమేత
శ్రీరామ చంద్ర పర బ్రహ్మణే నమః
శ్రీ శారదాయై నమః
శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమదాంధ్ర వాల్మీకి వచన రామాయణము

(శ్రీవావిలికొలను సుబ్బారాయ ప్రణీతమైన పద్యకావ్యమునకు వచనము)
శ్రీమతి యస్.టి.పి.వి. సీతమ్మగారు

## ఉత్తరకాండము

**కం॥ శ్రీ శ! నతకమలభవ! సీ**
**తేశా! దేవాధి నాథ! భృతధీరా! గౌ**
**రీశేడ్యా! యమిరాట్చర**
**ణా! శివకర! యభవ! మండన ప్రియకనమః**

[పట్టాభిషేకమున కుత్తరకాలమున జరిగిన చరిత్ర చెప్పునది కావున ఉత్తరకాండము. ఉత్తరమనగా శ్రేష్ఠమనియు అర్థము. సీతాశ్రీరాముల మహిమయుఁ బరత్వము పూర్వభాగమున కంటే నిందు విశేషముగఁ దెల్పబడినవి కదా.] [పై పద్యమున ద్వయమంత్రోత్తరార్థము సంపుటితము. పూర్వార్థము పూర్వభాగమున గలదు]

# మొదటి సర్గము

## అగస్త్యాది మహర్షులు శ్రీరామ దర్శనార్థులై వచ్చుట:

శ్రీరామచంద్రుడు యుద్ధము నందు బలవంతులైన రాక్షసులను సంహరించి రాజ్యమును పొంది పాలించుచుండగా రామచంద్రుని స్తోత్రము చేయుటకై సకలమైన మునులు చూడవచ్చిరి. కౌశికుడు, యవక్రీతుడు, గార్గ్యుడు, కణ్వుడు, మేధాతిథిపుత్రుడు, గాలవుడు మొదలైన పవిత్రమైన మనస్సులు గల తూర్పుదిక్కున నివసించు మాహర్షులును, నముచిస్వస్త్యాత్రేయుడు, ప్రముచి, కుంభసంభవుడైన అగస్త్యుడు, భగవంతుడైన సుముఖుడు, అత్రివిముఖుడు మొదలుగా గల శ్రేష్ఠులైన దక్షిణ దిశ నివసించు మౌనులును, పడమటి దిక్కున నివసించు జటాధారులు కవషుడు, ధౌమ్యుడు, మిక్కిలి ధన్యుడైన రౌద్రేయుడు, సూర్య తేజుడైన వృషద్గుడు, సత్యవచనుడు మొదలైన వారును, కశ్యపుడు, వశిష్ఠుడు, జమదగ్ని, గౌతముడు, అత్రి, గాధి పుత్రుడైన విశ్వామిత్రుడు, భరద్వాజుడు అను పేర్లు గలిగి ఉత్తర దిక్కున నెల్లప్పుడు నుండెడి మునీశ్వరులేడ్వురును (సప్తఋషులు) అందఱు అగ్నితేజస్సు గలవారు, మహాత్ములు, వేదవేదాంగముల నెఱిగిన వారిలో శ్రేష్ఠులు కుతూహలముతో సందడిగా గుంపులుగా వచ్చి రాజసింహుని మందిరము మందు నిలిచిరి. వారందఱిలో అగస్త్యుడు ద్వారపాలకుని జూచి నీవు రాజేంద్రునితో ఈ మునులందఱు వచ్చియున్నారని చెప్పుము అనగానే ధీరుడును, సమర్థుడును, ఆచారధర్మములనెరిగిన వాడును, నీతి, ఇంగితమెఱిగి నడచువాడును అయి ద్వారపాలకుడు వేగవేగముగా వెళ్లి పూర్ణచంద్ర సమానుడైన కాకుత్థ్సవంశ శ్రేష్ఠుడగు రాముని జేరి నమస్కరించి ఓ రాజశేఖరా! కుంభసంభవుడు మొదలుగా గల ఋషి సంఘములు మిమ్ములను జూచు కోరికతో ద్వారము నొద్ద నిలిచియున్నారని చెప్పగానే ఆ సీతానాథుడు బాలసూర్యుని వంటి తేజము గల మునుల రాకకు సంతోషమంది గౌరవముతో తీసికొని రమ్మని చెప్పగా, ఆ ద్వారపాలకుడట్లేయని ఆ ఋషులను తీసికొని వచ్చెను. అట్లు వచ్చుచున్న ఋషులను జూచి భక్తితో ఎదురువెళ్లి చేతులు జోడించి నమస్కరించి ఆ రాజశ్రేష్ఠుడు పాద్యము అర్ఘ్యమునిచ్చి ఆవును కూడ ఇచ్చి నిర్మలములైన బంగారముతో అలంకరింపబడిన దర్భాసనములను సముద్రము నాపోశనము చేసిన అగస్త్యుడు మొదలైన ఋషులకు

వేరువేరుగా నిచ్చెను. వారందఱును నిండైన సంతోషముతో గూర్చున్న సమయమున రామచంద్రుడు మహాత్ములారా! మీరందఱును సుఖముగా నున్నారా? మీ శిష్యులందఱు ఆరోగ్యముగనున్నారా? వనములన్నియు భయము లేకుండ నున్నవా? అని ప్రేమతో కుశల ప్రశ్న సేయగా ఆ వేదవేదాంతములనెరిగిన ఋషులు సంతోషముతో గూడిన మనస్సులతో శ్రీమంతుడైన రాజును జూచి అనురాగముతో ఇట్లు పలికిరి.

## మౌనులు శ్రీరాముని ప్రశంసించుట:

ఓ సీతానాథా! మా భాగ్యవశముచేత దర్పించిన విరోధులను సంహరించి విజయముతో నున్న నిన్ను జూడగంటిమి. అటువంటి మాకు భద్రము కలుగుటలో కొఱతలుండునా? ఓ రామభద్రా! నీవు ధనుస్సును చేతబట్టినచో లోకములన్నియు అల్లకల్లోలమగును గదా. అట్టిచో భువనముల నన్నింటిని మొత్తుకొనజేసిన రావణుని కొడుకులతోను మనుమలతోను సంహరించుట భారమా? మహాత్మా! దుష్టచరిత్రులైన ఆ పౌలస్త్యులను సంహరించి విజయమును పొందినవాడవై ప్రాణప్రియమైన సీతను, అధికమైన భక్తిప్రపత్తులు గలిగి నీ హితము గోరునట్టి సౌమిత్రిని గూడి [ఈ విశేషణములు లక్ష్మణుని భగవచ్ఛేషత్వమును సూచించెడివి] ఈ విధముగా నీ తాతముత్తాతలు సంపాదించిన రాజ్యలక్ష్మిని సుఖముగా నున్న నిన్ను మా పుణ్యము చేత చూచితిమి. రాజా! తల్లులతో, తమ్ములతో మనస్సు సంతసమునందగా నుండి ఈ భూమిని తల్లివలె కాపాడుచున్న నిన్ను మా కన్నులు చల్లబడునట్లు మా పూర్వపుణ్యవశముచేత చూడగలిగితిమి కదా. రాజచంద్రా! ఎవరి రూపమును జూచినచో విరోధుల గుండెలు బ్రద్దలగునో, ఏ క్రూరచరిత్రులు ఎఱుగని శస్త్రాస్త్రములు ఇంకెందును లేవో, ఈ భూమి యందెవరి నెదిరించి యుద్ధమునందు మానప్రాణములను దక్కించు కొనలేరో అట్టి కాలాంతకయమునితో సమానులైన మత్తుని యుద్ధోన్మత్తుని, ఉగ్రచరిత్రుడైన అకంపనుని దేవాంతకుని, నరాంతకుని, అతికాయుని, కుంభుని, వికటుని, ప్రహస్తుని, నికుంభుని, త్రిశిరుని, మత్తుడైన విరూపాక్షుని, మహోదరుని, ధూమ్రాక్షుని, యజ్ఞకోపుని సంహరించితివి. ఔరా! పరిమాణముతో సాటి చెప్పరాని ఆ భయంకరరూపుని, దేవతలకు భయము కలిగించు శీలముగలవానిని కుంభకర్ణుని ఓ మానవనాథా! మా పుణ్యముచే సంహరించితివి గదా. యుద్ధమునందు కనుబొమ్మలించుకయైన ముడియిడని నిన్ను లోకములన్నియు ముక్కుపై వ్రేలుంచి చూచెను గదా. దేవతలనెడి దావాగ్నికి మేఘము వంటివాడును, మూడులోకములనేకము చేసినవాడును అయిన దశ కంధరుని అతివేగముగా సింహపు గోళ్ల వంటి వాడి బాణములచే వధించితివి గదా. అతనిని

జంపుట సామాన్యమైన పనియా? అది యట్లుండనిమ్ము. ఓ పురుషపుంగవా! యుద్ధమున శత్రుసమూహములను నశింపజేయు ప్రళయకాలయముని వంటివాడును, దేవతల గర్వమణచినవాడును, ఎన్నియో మాయలు తెలిసినవాడును, అయిన రావణపుత్రుని సంకులము గదా. యమసదృశములైన నాగపాశములు దొంతరలుగా కురిసి మిమ్ము బాధింపగా ఓ రాజా! మీరు విడివడితిరి. ఔరా! మా మహాపుణ్యము ఇంతయంతయని చెప్పశక్యమా? ఎన్నియో మాయలు నేర్చిన నేర్పరియు, ఎవరిచేతను జయింపరానివాడును, కన్నులకు కనబడనివాడును, యుద్ధమందతి కఠినుడును అయిన ఇంద్రజిత్తను రాక్షసుడు యుద్ధమునందు సంహరింపబడుటను విన్నయంతనె మాకింతింతనరాని సంతోషమును ఆశ్చర్యమును కలిగెను గదా. కామరూపులును కఠినమైన దేహములు గలవారును, క్రూరాత్ములును అయిన రాక్షసులను సంహరించి మాకీవిధముగా అభయమనెడు దక్షిణనిచ్చితివి. మాయదృష్టమేమి చెప్పుదుము. అని సంస్తుతించుచున్న ఋషుల వాక్యములను విని సీతానాథుడు విస్మయ సముద్రమున మునిగినవాడై చేతులుజోడించి ఆ తపోధనుల కిట్లు విన్నవించెను.

## శ్రీరాముడు మునులను ఇంద్రజిత్తు ఆధిక్యమునకు కారణమడుగుట:

అపరిమితమైన పరాక్రమము గలిగిన రాక్షసరాజైన రావణుడును, సాటిలేని అమేయమైన శరీరబలము గల కుంభకర్ణుడును ఉండగా, అతికాయుడు, త్రిశిరుడు, ప్రహస్తుడు, ఖరుడు, ధూమ్రాక్షుడు, కుంభుడు మొదలైన మహావీరులుండగా రావణపుత్రుడైన యింద్రజిత్తునే యేల ప్రశంసించుచున్నవారలు? మత్తుని, దేవాంతకుని, ఉన్మత్తుని, మహోదరుని, వికటుని, మకరాక్షుని యుద్ధమునందు మృత్యుసమానులైనవారిని చెప్పక ఇంద్రజిత్తునే ఏల చెప్పుచున్నారు? వాని పరాక్రమమెట్టిదో, వాని ప్రభావమెట్టిదో, వాని బలమెంతయో, రావణాసురుని కంటే వాని శౌర్యధైర్యములు ఎట్లు గొప్పవియో రహస్యము కానిదైనచో చెప్పుడు. గౌరవింపదగిన శీలము గల మునీంద్రులారా! వినుటకు నా మనస్సు ఉవ్విళ్లూరుచున్నది. మునీంద్రులారా! నేను విననర్హుడనైనచో వినిపింపుడు. వినయముతో మిమ్ము వేడుకొనుచున్నాను. ఇది ఆజ్ఞగా తలంపకుడు. మీకు చేతులు జోడించి నమస్కరించెదను. ఏ విధముగా ఇంద్రుని జయించెను. వరముల నేవిధముగా పొందెను. ఎట్లు తండ్రికంటే శూరుడై విరాజిల్లెను? ఆ విధము సమస్తమును మౌనులారా నాకు తెలియజెప్పుడు.

★★★

# రెండవ సర్గము

## అగస్త్యుడు శ్రీరామునకు రావణుజన్మాది వృత్తాంతము దెల్పుట:

అను రామభూపాలుని వాక్యములను విని సంతోషము పొంగుచుండగా అగస్త్యుడు రాముని జూచి మాటలనేర్పరితనమొప్పగా ఇట్లనెను. గుణములచే మనోహరుడవైన రామా! ఆ రావణపుత్రుని ప్రతాపము, అతని బలము, విరోధులను జయించునేర్పు, ఇంద్రుని గర్వము నణచుట, ఘోరయుద్ధములందు జయింపరానివాడయి ప్రకాశించుటకు హేతువు రాక్షసులనెడు కలువలకు భాస్కరుని వంటివాడా! వినుము నీ మనస్సు సంతసించునట్లు చెప్పెదను. ఇంద్రజిత్తు చరిత్రకు ముందుగా రావణుని కులము జన్మము వరములు పొందిన విధము నేను వివరించెదను. అది మూలమైయుండుటచే ఆ వృత్తాంతమును పూర్తిగా వినుము. ఓ పద్మాక్షా! పూర్వము కృతయుగమునందు శ్రేష్ఠగుణములు గలిగిన బ్రహ్మపుత్రుడు బ్రహ్మతో సమానుడై బ్రహర్షి పులస్త్యుడను పేరుగలవాడు కలడు. పొగడబడిన శీలమహిమ యందును ధర్మము నందును ఆ మహనీయుని భూమియందెవ్వరికైన కీర్తించుట శక్యమా? బ్రహ్మపుత్రుడను మాట మాత్రమే చెప్పుటకు శక్యమగును. అతడు బ్రహ్మపుత్రుడగుటచే దేవతల కందఱకును మన్నింపదగిన వాడై మంచిగుణములచేత సర్వలోకములకు ఇష్టుడై ధర్మమార్గమును విడువక మేరుపర్వతము ప్రక్కన నున్న తృణబిందుని ఆశ్రమమున నిశ్చలమైన బుద్ధితో వేదములు చదువుచు పుణ్యమును గోరి తపస్సు చేసెను. ఆ ఋష్యాశ్రమము అన్ని ఋతువులందును సుఖకరమై అందమైన హంసలు, బెగ్గురు పక్షుల విహారముచే మనోహరములైయున్న సరోవరములు గలదియై మొగ్గలు, పుష్పములు, ఫలముల సమూహములతో విరాజిల్లు వృక్షములతో మనోహరమై సుఖకరములైన గాలులు గలదై యొప్పుచుండెను. ఆ యందమైన ప్రదేశమున ఆడుచు, పాడుచు, చిత్రచిత్రములైన ఆటలతో ఆనందించుచు విలాసముగా వీణను మీటుచు పలుమారులు దేవ స్త్రీలు, నాగకాంతలు, రాజపుత్రికలు సంతోషము నిండిన మనస్సులతో ప్రీతితో విహరించుచుందురు. ఆ ఉత్తమ చరితలైన స్త్రీల ఆటపాటలు ఆ పులస్త్యుని నిష్ఠకు హాని కలిగించుచుండెను. అందుచే కోపించి ఆ మౌని ఏ యువతి నన్ను

చూడవచ్చునో ఆ కాంత వెంటనే గర్భము ధరించును. అని శపించెను. ఆ మాటలను విన్న ఆ స్త్రీలందఱును శాపభయముచేత అచ్చటికి వచ్చుట మానివేసిరి. కాని తృణబిందుని కుమార్తె ఒక్కతె ఆ శాపమును వినకపోవుటచే ఎప్పటివలెనే విహరించుచు అక్కడెచ్చటను ఒక్క కాంతనైనను చూడజాలదయ్యెను. అప్పుడా బాలికకు పులస్త్యుని వేదాధ్యయన రవములు చెవులకు మనస్సునకు సంతోషకరముగా విననయ్యెను. దానిని విని యిది ఎవ్వరి ధ్వనియోయని దగ్గఱకు వెళ్లి ఆ మునిని జూచెను. వెను వెంటనే శరీరమంతయు తెల్లబారెను. ఆ కన్యకకు గర్భచిహ్నములు బయల్పడెను. ఆమె ఆ గర్భచిహ్నములను తెలిసికొని ఇది యేమని దిగులు చెంది తానలసటతో తండ్రియాశ్రమ ప్రదేశమునకు వెళ్లి తండ్రి చెంతనిలిచెను. అంతనా తృణబిందుడు ఆ కన్నెవంక ఎగాదిగ జూచి ఆమె శరీరము నందు గర్భచిహ్నములు ఇస్సిస్సీయని చంచలములైన కన్నులు గల ఆ బాలికను జూచి నీ కన్నెఱికము చెడి తగని విధముగా ఇట్లగుటకు కారణమేమి చిన్నికుమారీ చెప్పుమనగా ఆ కాంత సిగ్గుతోను భయముతోను చింతించుచు ఇట్లనెను. తండ్రీ! నేను అన్నెమును పున్నెము నెఱుగను. ఇట్లగుటకు కారణము నేను చూచినది లేదు. ఎప్పటివలెనే విహరింపగోరి నేను ముందుగా ఒంటరిగా స్నేహితురాండ్ర నందఱను వెదకుచు పులస్త్యుని యాశ్రమమును ప్రవేశించి అందొక్క కాంతయైనను కనబడకుండుట కారణమేమియో యని యచ్చటచ్చట వెదకుచుండగా ఇటువంటి రూపము కలిగినది. దీనిచే గలిగిన భయముచే మిమ్ము చూచుటకు పరుగెత్తి వచ్చితిని మహాత్మా! యనెను.

## తృణబిందుడు తన కుమార్తెను పులస్త్యున కర్పించుట:

అట్లు తన కుమార్తె చెప్పగానే ఆ రాజఋషి ధ్యానము నందుండి సమస్తమును జూచి ఇది మౌని కృత్యమని తెలిసికొని తొందరగా తన కన్యను తీసికొని ఆ మునీంద్రుని సన్నిధి కేగి ఓ మహాత్మా! ఇది నా కుమార్తె. సహజములైన సద్గుణ సమూహములచే అలంకరింపబడినదియు, స్వయముగా వచ్చినదియు, ఇతర దుర్లభమైన రూపముగలదియు, సాటిలేని మంచితనము గలదియు అగు ఈ కన్యకామణిని, నన్నును కృపతో చూచి కన్యాభిక్షగా దీనిని గైకొనుము. మాన్యులలో శ్రేష్ఠుడా! మహాత్మా! సాటిలేని తపస్సుచే శ్రమచెందిన నీకు ఎల్లప్పుడును ఉపచారములచే తృప్తి కలుగునట్లుగా నడచుకొనును. ఇది నిజము సుమా. నీ అగ్ని హోత్రముల నెల్లప్పుడు కాపాడుచుండును అని ప్రార్థింపగా మునిచంద్రుడు కోరిక దీరునట్లు ధర్మపద్ధతిగా మంచి మనస్సుతో ఆ కన్యకను

గ్రహించెను. అట్లు కన్యను మునికర్పించి తృణబిందుడు తన యాశ్రమమునకేగెను. ఆ కాంతయు సద్గుణముల చేత పులస్త్యునకానందము కలుగుజేయుచు పరిచర్యలు చేయుచుండగా పుష్పమువలె సుకుమారముగా నున్న ఆమె యొక్క నిర్మలమైన శీలము నడవడి బ్రహ్మపుత్రుడైన పులస్త్యునకు సంతోషమును కలిగింపగా ఒకనాడా ఆ పద్మముఖిని జూచి ప్రియముతో నిట్లనెను. ఓ అందమైన కనులు గల కాంతామణీ! నీ గుణములకు మెచ్చితిని. నీవు మంచిశ్రేష్ఠమైన గుణములు గల సచ్చరితుని నాతో సమానమైన పుత్రుని వేగముగా పొందెదవు. నీకు వరమిచ్చుచున్నాను. అతడు రెండు వంశములను ఉద్ధరించగలడు. నీవానాడు నావేదాధ్యయనము విని గర్భము ధరించుటచే విశ్రవసుండను పేరున ప్రఖ్యాతి నందును. పౌలస్త్యుడని కీర్తిచెందును అని చెప్పగా ఆ కాంత సంతోషమును పొందెను. కొంతకాలము గడవగా మంచిబుద్ధిగల వాడును, మూడులోకములందు ప్రఖ్యాతిని చెందినవాడును, సాటిలేని సమదృష్టిగలవాడును, మంచికీర్తిగలవాడును, ఉత్తమమైన ధర్మమునందు నడచువాడును, తన తండ్రితో సమానమైనవాడును, మంచినియమములు గలవాడును, సర్వకళలయందును నేర్పుగలవాడును, వేదములు నేర్చినవాడును అయిన విశ్రవసుడనువాడు పుట్టెను. అతడి తండ్రి వలెనే అధికనియమములు గలవాడై నిరంతరము అధ్యయనము చేయుటచే సమస్తభోగములయందును విరక్తిగలిగిన మనస్సు గలవాడై యెంతయో ధర్మపరాయణుడై ప్రఖ్యాతి గాంచెను.

★★★



# మూడవ సర్గము

## విశ్రవసునకు కుబేరుడు జన్మించుట:

అతని గుణములను విన్నవాడై భరద్వాజముని తన కుమార్తె యయిన దేవవర్ణియను కన్యను మహానుభావుడైన విశ్రవసున కిచ్చి పెండ్లి చేసెను. ఆమెను స్వీకరించి రెండవ ఆశ్రమమును బొంది ఆమె యందు భద్రగుణములు గలవాడును, అధికమైన బలము గలవాడును శ్రేయోవంతుడును అగు పుత్రుని గాంచెను. బ్రహ్మతో సమానమైన సద్గుణములు గలవాడును ముమ్ముందు ధనములకధిపతి కాగలవాడును అగు మనుమని జూచి తాతయైన పులస్త్యుడు అధికమైన సంతోషమును పొంది దేవఋషులతో గూడి విశ్రవుని తనయుడు గాన వైశ్రవణుడని ప్రఖ్యాతి గాంచునని పేరు పెట్టెను. అతడు పెద్దవాడై తపోవనము నకు వెళ్లి నియమపరుడై యుండెను. ఆహుతులచే మండుచున్న అగ్నిహోత్రుని వలె అతడు తపస్సంపదతో వెలిగి తన మనస్సునందు ధర్మమొక్కటే యుత్తమోత్తముమైన గతి యని తలంచి సాటిలేని నిశ్చలమైన నియమవ్రతములు గలవాడై నీళ్లను మాత్రమే తీసికొనుచు, గాలిని మాత్రమే తీసికొనుచు, ఏమియు తీసికొనక ఒక్కొక్క వేయి సంవత్సరములు తపస్సు చేసెను. ఈ విధముగా వేయి సంవత్సరము లొకయేడుగా ఘోరమైన తపస్సుచేయుచుండగా అచ్చటికి బ్రహ్మదేవుడు దేవగణములతో గలసివచ్చి ప్రీతితో వత్సా నీ గొప్ప నిష్ఠకు మెచ్చితిని. ఇక లెమ్ము. వేగముగా వరమును కోరుకొనుము అనగా అతడు తగు విధముగా బ్రహ్మకు నమస్కరించి ఈ విధముగా పలికెను. ఓ సరస్వతీపతీ! దిక్పాలకత్వమును కోరుచున్నాను. ధనరక్షకత్వమును కోరుచున్నాను ప్రేమతో నీయవేయని వేడగానే ప్రీతితో అతనిని జూచి బ్రహ్మ యిట్లనెను.

## బ్రహ్మ కుబేరుని ఉత్తరదిక్కున కధిపతిగా జేయుట:

నేను నలుగురు లోకపాలురను సృష్టింపదలంచి ఇంద్రుని యముని వరుణుని వరుసగా ఆయా స్థానములందు నిలిపితిని. అందు నీవు నాల్గవవాడవై యుండుము. నిధులకు నాయకుడవై వృద్ధి చెందుము. ఈ దివ్యమైన సూర్యసన్నిభమైన విమానమును గ్రహించి

దేవతలతో సమానుడవై వేడుకతో విహరించుచుండుము. నీకు స్వస్తి కలుగునుగాక. ఇక నేను వెళ్లెదను. నీకీ రెండు వరములనిచ్చుటచే నేను కృతకృత్యుడనైతినని చెప్పి దేవతాసంఘములతో గలసి బ్రహ్మ తన నివాసమున కేగెను. ఇట్లు బ్రహ్మ వరములనిచ్చి వెళ్లగానే వైశ్రవణుడును తన తండ్రి చెంతకేగి చేతులు జోడించి బ్రహ్మప్రసన్నుడై యిచ్చిన వరములను చెప్పి తండ్రీ! ఆ బ్రహ్మ నేను నివసించుటకు ఒకచోటును చెప్పడాయెను. నాకెల్లప్పుడును సౌఖ్యమునిచ్చునదియు బాధలు లేనిదియు అగు ఒక నివాసమును చెప్పవేయని ప్రార్థింపగా ఆ మౌని దక్షిణ సముద్రమునందు త్రికూటాద్రియను పర్వత శృంగమున సుందరమైన లంకయను నొక పట్టణము రాక్షసుల నివాసము కొఱకు పూర్వము ఆ దేవతాశిల్పిచే నిర్మింపబడి ఎంతయో అందము గలదియై యున్నది. నీవనుమానింపకుము. అధి భూమియందు ఇంద్రుని పట్టణము వంటిదై ఒప్పుచున్నది. స్వర్ణప్రాకారములతోను, శస్త్రయంత్రములతో గూడిన పరిఖతోను, వైడూర్యములతో గూడిన బంగారుతోరణముల తోను చాలా శోభిల్లుచుండును. పూర్వము శ్రీహరికి భయపడి రాక్షసులు ఆ పట్టణమును విడచిపెట్టి వెళ్లి రసాతలమును చేరుటచే ఇప్పుడు ప్రభువు లేక ఆ పురము శూన్యమై యున్నది. అది సుఖకరమై బాధలు లేనిదై దోషరహితమై యున్నది. కాన నీవు దానిని నివాసముగా జేసికొనుము. అని తండ్రి చెప్పగా ఆ మాటలకు సంతోషించి లంకకు వెళ్లి అందు అనుమానము లేక రాక్షస సమూహముతో గూడి అనేక విధములైన ధనసమృద్ధితో గూడి ఇష్టము వచ్చిన విధముగా నుండెను. ఇట్లు ధనాధిపతి సముద్రమే పరిఖగా గల పురము నందుండి యోగులచేతను దేవతలచేతను స్తుతింపబడినదియు దేవతాస్త్రీల విలాసములతో గూడినదియు అయిన పుష్పకవిమానము నందు పద్మమిత్రుడైన సూర్యునివలె కిరణములతో వెలుగొందుచు తండ్రియొద్దకు వెళ్లివచ్చుచు సంతోషమును గలిగించుచుండెను.

★★★

# నాలుగవ సర్గము

## శ్రీరాముడగస్త్యుని పూర్వ రాక్షస వృత్తాంతమడుగుట:

అని అగస్త్యుడు చెప్పగానే అగ్నిసమానముడైన ఆ మునీంద్రుని పలుమారులు చూచుచు కడు విస్మయముతో ఆ పద్మాక్షుడు ఏమీ! లంక పూర్వము రాక్షసుల నివాసమా? వినగా చాలా ఆశ్చర్యము గలిగెను. మునీంద్రా! రాక్షసులు పులస్త్యుని వంశము వారని మున్ను వినియుంటిమి. మీరలిప్పుడన్యులు గలరని చెప్పితిరి. ఇప్పటి రావణ కుంభకర్ణులు వారి పుత్రులు మంత్రులే గొప్పవారో లేక పూర్వముండిన వారలే శౌర్యవంతులో చెప్పుడు. వారలెవ్వరు? వారల పేర్లేవి? వారల బలమెంత? ఏమి దోషము చేత శ్రీహరి వారలను లంకాపురి విడచి పరుగెత్తునట్లెట్లు తరిమెను. ఈ నా కుతూహలమును సూర్యుడ చీకటులను పోగొట్టునట్లు పోగొట్టుము అనగా ఆ మహాత్ముడు చిఱునవ్వుతో భూపుత్రి యొక్క మనస్సనెడు పద్మమును వికసింపజేయు సూర్యుని వంటి రాముని జూచి పూర్వవృత్తాంతము నంతయును చెప్పెదను వినుము.

## యక్ష రాక్షసుల యుత్పత్తి:

అని అగస్త్యుడిట్లు చెప్పదొడగెను. పూర్వము పద్మమునందు పుట్టిన బ్రహ్మ నీళ్లను సృష్టించి వాటి రక్షణకై అనేకమైన జంతువులను సృష్టించెను. అవి ఆకలి దప్పులచే పీడింపబడి దైన్యముతో తమ్ము సృష్టించిన బ్రహ్మ నిట్లడిగిరి. మేము చేయవలసిన పనియేమిటో తెల్పుము అని వినయముతో విన్నవింపగా వానిని జూచి నవ్వుచు బ్రహ్మ నాచే సృష్టింపబడిన జలములను జాగ్రత్తగా రక్షించుచుండుడు. మీకిదియే కర్తవ్యమని చెప్పగానే అబుభుక్షితములైన కొన్ని సత్వములు దేవతలచే పూజింపబడువాడగు బ్రహ్మతో రక్షామయని చెప్పెను. బుభుక్షితములు జక్షామ అనెను. [అబుభుక్షితములు = ఆకలిగొననివి. బుభుక్షితములు = ఆకలి గలవి. రక్షామ = రక్షించెదము గాక. జక్షామ = భక్షించెదము గాక] ఆ సత్వము లిట్లుపల్కగానే బ్రహ్మ ఆ భూతములతో ఇట్లనెను. మీలో రక్షామయనినవారలు భూతరాసులలో రాక్షసులగుదురు. జక్షామ యనిన వారలు

యక్షులగుదురని వారలతో ననెను. అట్లే వారలు రాక్షసులు యక్షులునైరి. వారిలో హేతి ప్రహేతులను పేర్లుగల సోదరులు పుట్టిరి. వారు భయంకరులైన రాక్షసులు. గొప్పనైన బలమునందు మధుకైటభులతో సమానులు. అధికమైన బలదర్పశౌర్యములతో శత్రువులను సంహరించినవారలు. అందు ప్రహేతి ధర్మనిరతి గలవాడై వనమునకు వెళ్లెను. హేతి చంద్రుని వంటి ముఖము గల్గిన, యముని ప్రీతిపాత్రమైన చెల్లెలిని భయ యను దానిని ప్రేమతో వేడి వివాహమాడి తగిన విధముగా ఆ సుందరియందు శూరశ్రేష్ఠుడును, కాంతిచే సూర్యునివంటివాడును అగు విద్యుత్కేశుడను కుమారుని గాంచెను. అతడు అపరిమితమైన తేజస్సు గలవాడై పెరుగు నీళ్లలో నున్న పద్మమువలె వృద్ధి పొందుచుండెను. యౌవనవంతుడై యొప్పుచున్న పుత్రుని జూచి హేతి సంతోషముతో అతనికి పెండ్లి చేయదలచి కాంతిచే సంధ్యనే పరిహసించు సంధ్యాపుత్రి తన కుమారునికై కోరెను. స్త్రీ జన్మించగానే పరుల సొత్తు అను విషయమును తలంచి సాలకటంకయను పేరు గల కన్యనీయగా ఆ దంపతులు ఇంద్రుడు శచీదేవి వలె కోరిక దీరునట్లుగా సుఖసముద్రమున దేలి యాడుచుండగా సముద్రము వలన మేఘము గర్భము దాల్చిన విధముగా ఆ కాంత గర్భము దాల్చెను.

## సుకేశుని జన్మవృత్తాంతము:

అంతట ఆ సాలకటంకట మందర పర్వతముచెంతకు ఒంటరిగా వెళ్లి అగ్ని వలన కలిగిన గొప్పనైన గర్భమును గంగాదేవి వలె, మేఘగర్భము వంటిదైన తన గర్భమును ప్రసవించి ఆ శిశువును అందే విడచి తాను భర్తతో రతిసుఖములు పొందు కోరికతో స్వేచ్ఛగా తన భర్తయొద్దకు వెళ్లెను. అక్కటా ఆ స్త్రీ తనకు పుట్టిన బిడ్డ గతి యేమయ్యెనో ఆలోచించుట మరచెను. క్రూరురాండ్రయిన ధూర్తస్త్రీలు మన్మథబాణములచే పీడింపబడినవారై యెంతటి పనులైనను చేయుదురు గదా. ఆ బాలుడు శరత్కాలసూర్యుని తేజస్సుతో వెలుగుచు తనంత తాను వేళ్లను నోటియందు గ్రుక్కుకొనుచు పెద్దగా ఏడ్వసాగెను. త్రిపుర వైరియు, అవ్యయుడు, నాశములేనివాడు, పర్వతనివాసుడు అయిన శివుడు పార్వతితో గూడి వృషభవాహనారూఢుడై ఆకాశమార్గమున వెళ్లుచు ఆరోదన ధ్వనిని విని గౌర ప్రబోధముచే కరుణగల మనస్సు గలవాడై రాక్షస బాలకుని జూచి అతనికి తల్లితో సమానమైన వయస్సును, ఆకాశమున సంచరించు పురమును, అమరత్వము నొసగెను. పార్వతియు ఆ బాలుని జూచి కరుణ అతిశయించుచుండగా రాక్షస

సమూహములకు సద్యోగర్భప్రాప్తియు, సద్యఃప్రసవమును, తల్లితో సమానమైన వయస్సు గలిగియుండుటయు, సద్యోయౌవనమును విచిత్రముగా దేవతలాశ్చర్యము చెందునట్లు ఒసగెను. శివుని వరదానగర్వముచే సుకేశుడను పేరు గల ఆ రాక్షసుడు ఆకాశమున దిరుగు పట్టణమును పొంది ఇచ్ఛానుసారముగా సంచరింపదలచి మూడులోకములందు ఇంద్రుని వలె సంచరించుచుండెను.

జయింపరాని పరాక్రమము గలవాడును, ధర్మము నందాసక్తి గలవాడును, సిద్ధశ్రేష్ఠుడను అయిన సుకేశుని జూచి ప్రీతిచెందినవాడై గ్రామణి యను గంధర్వశ్రేష్ఠుడు విశ్వావసువుతో సమానమైన తేజస్సు గలవాడు లక్ష్మీదేవితో సమానమైనదియు, సౌందర్యవంతురాలును, యౌవనవతియు అయిన తన ముద్దుల కుమార్తెను ఇచ్చి వివాహము చేయగా ఆ కాంత వరముచే లభించిన సాటిలేని ఐశ్వర్యము గలవాడును, మంచి నడవడిగలవాడును, అయిన తన భర్తను దారిద్ర్యములోనున్నవాడు భాగ్యమును పొందిన విధముగా పొంది అమందానందము నొందెను. ఆతడును ఆ కాంతతో గూడి మన్మథుని తగు విధముగా పూజించుచు అంజనమను దిగ్గజము నుండి పుట్టిన యేనుగు వలె ఆనందించుచుండెను.

★★★



# ఐదవ సర్గము

## సుకేశునకు మాల్యవదాదులు జన్మించుట:

ఇట్లు వారు ప్రకాశించుచుండ సుకేశుని పత్నియైన దేవవతీ సతి మూడులోకములను, మూడు కన్నులను, మూడగ్నులను, మూడు రోగములను మూడు మంత్రములను ధిక్కరించు వారగు ముగ్గురు కుమారులను గాంచెను. వారు మాల్యవంతుడు, సుమాలి, మాలి యను పేరులతో వైద్యము చేయక వదలిన వ్యాధులవలె బలవంతులై పెరిగిరి. వారు క్రమముగా పెరిగి పెద్దవారై తమ తండ్రి తపస్సు చేత సంపదలను పొందుట నెఱింగి తామును తపస్సు చేయదలంచి ఆ సోదరులు బంగారుకొండ చెంత కేగి అతినిష్ఠతోను, శమము, సత్యము, ఆర్జవము జితేంద్రియత్వము కలిగి సర్వభూతములును భయము చెందునట్లు తపస్సు చేయగా దేవలోకము, గంధర్వలోకము, మానవలోకము ఉపద్రవము నొందెను. అంత బ్రహ్మదేవుడు దేవతలతో గలసి ఆ సుకేశుని పుత్రుల యొద్దకు వచ్చి నాయనలారా! మీ కోరికను దెల్పుడు తీర్చెదననెను. వారతనిని ఇంద్రుడు మొదలయిన దేవతలతో గూడి కోరిక లీయవచ్చిన సరస్వతీ భర్తయని తెలిసికొని వృక్షముల వలె కంపించినవారై చేతులను జోడించి యిట్లనిరి. ఓ పద్మోద్భవా! వరముల నిచ్చువాడవేని, చిరాయువును, జయింపబడకుండుటయు, శత్రువుల నెదిరించుశక్తియు, మా సోదరులలో ఒకరియందొకరికి ప్రేమయును ప్రభావ వత్వమును కరుణింపవే దయామయా! నమస్కరించిన వారినెడు పద్మములకు సూర్యుని వంటివాడా! వికారములు లేనివాడా యని మ్రొక్కిరి. బ్రాహ్మణ వత్సలుడైన బ్రహ్మ అట్లే యగుగాక యని చెప్పి తన పురమున కేగెను. ఈ విధముగా వరములను పొంది ఆ రాక్షసులు భయములేనివారై లోకములను బాధింప దొడగిరి.

## మాల్యవదాదులు లంక యందు చేరుట:

వారు దేవతలను, దానవులను, మునులను వధించుచుండగా వారెల్లరు నరకము నందలి జీవకోటి వలె తమను రక్షించువాడెవ్వడును లేక బాధనొందిరి. తరువాత ఆ రాక్షసులు దేవశిల్పియైన విశ్వకర్మను సమీపించి యిట్లనిరి. నీవు మాకు గృహములతో

నున్న పట్టణమొకటి వేగముగా నిర్మింపుము. ఓజస్సు తేజస్సు బలము కలిగిన దేవతలకు నీవే చాలా సుందరమైన దివ్యమైన నివేశనములను నేర్పుతో నిర్మింతువు గదా. మాకును నీవే మేరు పర్వతమునగాని, మందరగిరియందు గాని, హిమవత్పర్వతమున గాని మంచి సంపదతో గూడినదియు, శంకరుని నివాసము వంటిదియు అగు ఒక గృహమును చాలా ప్రకాశవంతమై యుండునట్లు నిర్మింపుము అని చెప్పగానే ఆతడు దక్షిణ సముద్ర తీరమున సాటిలేనిదై త్రికూట పర్వతశ్రేష్ఠము గలదు. మేఘసదృశమైన దాని మధ్య శిఖరమున పక్షి సంఘములకైనను చేరరానిదై నాలుగు దిక్కులందును టంకములు పొదిగినదై నూరు ఆమడల పొడవును ముప్పది యామడల వెడల్పును గలిగి బంగారు ప్రాకారములతో, స్వర్ణతోరణములతో సుందరమై ఇంద్రునియాజ్ఞచే మయుడు నిర్మించిన గొప్ప నగరము లంకయను పేరు గలది గలదు. దానియందు నిస్సంశయముగా ప్రవేశించి అమరావతిని దేవతల వలె శత్రువులకు కలలోనైనను చెనకరానివారై పాలింపుడు. అని విశ్వకర్మ చెప్పగా వేలమంది యనుచరులతో ఆ రాక్షస నాథులు వెళ్లి పరిఖలతో బంగారు గృహములతో నున్న లంకయందు సుఖముగా నుండిరి. వారిట్లు స్వేచ్ఛగా విహరించుచుండగా నర్మదయను గంధర్వస్త్రీ కీర్తి, ధీ, శ్రీ సమానురాండ్రైన ముప్వురు పుత్రికలను ఆ దానవులకిచ్చెను. వారును వరుసగా ఉత్తర ఫల్గునీ నక్షత్రమందు ఆ కాంతలను పెండ్లియాడి దేవకాంతలతో దేవతల వలె క్రీడించిరి. అంత మాల్యవంతుడు తన భార్యయైన సుందరి యను పేరు గల దానియందు సుప్తఘ్నుడు, దుర్ముఖుడు, ఉన్మత్తుడు, యజ్ఞకోపుడు, మత్తుడు, వజ్రముష్టి, విరూపదృష్టి, విరూపాక్షుడు అను పుత్రులను, అనల యనెడు పుత్రికను కనెను. సుమాలి తన ప్రాణముల కన్న అధికమైన కేతు మతి యను దానియందు అకంపనుడు, కాలకార్ముకుడు, భాసకర్ణుడు, సుపార్శ్వుడు, సంహ్రాది, ప్రఘసుడు, ప్రహస్తుడు, వికటుడు, ధూమ్రాక్షుడు, వికట శీలుడైన దండుడు అను గొప్ప బలవంతులైన పుత్రులను తరువాత రాక, పుష్పోత్కట, కైకసి, కుంభీనసియను పుత్రికలను కనెను. మాలి వసుధయను పేరు గల భార్యయందు అనిలుడు, అనలుడు, సంపాతి, హరుడు అను పుత్రులను గనెను. వీరలే విభీషణుని మంత్రులై తరువాత ప్రఖ్యాతి గాంచిరి. ఇట్లు వారి వంశములు పెరిగెను. ఆ రాక్షసులు ముగ్గురును నూర్గురు పుత్రులతో గూడి గర్వితులై బ్రహ్మచే పొందిన వరబలముచే ప్రజలమేలు తలంపక చెలరేగి ఇచ్ఛానుసారముగా దేశములన్నియు వాయువు వలె తిరుగుచు ఋషులను, నాగలోకవాసులను, ఇంద్రుని, దేవతలను, యక్షులను తేరి చూడరానివారై కొట్టుచు, తిట్టుచు, తలపడుచు బాధించిరి.

★★★

# ఆఱవ సర్గము

## మాల్యవదాదులకు వెఱచి సురలు శివుని శరణు వేడుక:

దుర్మార్గులైన వారు పెట్టెడి బాధలను భరింపలేనివారై దేవతా సమూహములను, మునీశ్వరులును భయార్తులైన వారందఱును గలసి ఒక్కటిగా మన్మథ విరోధియు, త్రిపుర వైరియు, మూడు కన్నులు గలవాడును, పార్వతీ పతియు, జగత్తునకు కారణమైనవాడును, జగత్తును సంహరించువాడును, లోకములచే నమస్కరింపబడువాడును, దేవతలకు అధిపతియు అయిన శంకరుని చేరనేగి చేతులు జోడించి భయముచే మాటలు తొట్రుపడుచుండగా ఓ శంకరా! ఆ సుకేశుని పుత్రులు బ్రహ్మ యిచ్చిన వరముల వలన గర్వముచేత దేవతాసంఘములను, ప్రజలను బాధపెట్టుచు క్రూరత్వముతో భూత కోట్లకెల్లను కీడు కలుగజేయుచున్నారు. దేవా! స్వర్గము నుండి దేవతలను తరిమివేసి దేవతలవలె ఉద్యానవనము లందు జూదములతో నిర్భయముగా క్రీడించుచున్నారు. నేనే విష్ణుడను, నేను రుద్రుడను, నేనే బ్రహ్మను, నేనే యింద్రుడను, నేను యముడను, నేను వరుణుడను, నేనే చంద్రుడను, నేనే సూర్యుడను, నేను సముద్రుడను అని యుద్ధము చేయవలెనను మదముచే సర్వలోకముల నున్న వారలను బాధలు పెట్టుచున్నారు. గాన భర్గా! మమ్ము రక్షింపవే. ఏదైనను భయంకరమైన రూపమును దాల్చి దేవతా విరోధిని సోదరులతో గూడిన ఆ మాల్యవంతుని యుద్ధమున సంహరించి జగములను రక్షింపుము అనగా ఆ సుకేశుని యందలి ప్రేమ చేత శంకరుడు ఓ దేవతలారా! వారు నాచే చంపబడరు. నేను వారలను సంహరింపజాలను. ఐనను ఒక యుపాయమును చెప్పెదను. వారిని సంహరించుటకై మీరు శ్రీహరిని శరణు వేడుడు. ఆతడు వారి నందఱను శౌర్యముతో సంహరించును వెళ్లుడనగా వారలు జయశబ్దములు పల్కుచు వేగముగా

## దేవతలకు విష్ణువభయమిచ్చుట:

బయలుదేరి వెళ్లి శంఖచక్రములు ధరించిన విష్ణుని జూచి తమ దుఃఖములనన్నిటిని ఆ కమలాధవునితో నిట్లు విన్నవించిరి. దేవా! విశ్వశరణ్యా! మేము పడుచున్న పాట్లను వినుము. మూడగ్నులవలె సుకేశుని పుత్రులు ముప్వురు ఇంద్రవిరోధులు ఆత్రికూట పర్వతము మీద నున్న లంకాపురమును రాజధానిగా చేసికొని యుండి బ్రహ్మ వరములచేత

గర్వముతో దర్పముతో లోకములను చీకాకు పెట్టుచున్నారు. మా దుఃఖముల నెట్లు నీతో మొరపెట్టుకొందుము. వారలను వేగముగా సంహరింపుము. ఓ నిఖిల లోకేశ్వరా! మాకు నీవే దిక్కు సుమా. భూతజాలములకు శరణమైనవాడా! నీవే మాకు శరణము. ఓ రమాపతీ! మా భయము తొలగించుటకు నీవొక్కడవు తప్ప మాకు వేరు దిక్కు లేదు గదా. మంచును విరియించు సూర్యుని వలె హితులతో బంధువలతో గూడ రాక్షసులను వధించి జగమును సంతోషముతో నింపి పంచాయుధములను హస్తములందు ధరించిన శ్రీహరీ! మమ్ము దయతో పాలింపుము. అని వేడగా క్రొత్తపద్మముల వంటి నేత్రములు గల శ్రీహరి ఆ దేవతల భయము చెందవలదని వారించి యిట్లనెను. ఓ దేవతాలారా! ఆ శివునిచే వరములు పొంది మత్తుడైన సుకేశుని, బ్రహ్మచే వరములు పొంది అతి కఠిన శీలుడైన అతని పెద్దకుమారుడైన మాల్యవంతుని అతని తమ్ములను నేనెఱుగనా? తమ శక్తి పరిమాణములను తలపక మదముతో విజృంభించి తిరుగుచున్న దుష్టులైన శత్రువులను ఆ రాక్షస శ్రేష్ఠులను వేగముగా నేను సంహరించెదను. ఓ దేవతా శ్రేష్ఠులారా! మీరలు చింత తొలగిన మనస్సు గలవారలై సంతసముతో మీమీ నివసించుచోట్లకు తిరిగి వెళ్లుడు. అనగానే సంతోషము నిండిన మనస్సులు గలవారై ఆ విష్ణుని, సర్వసమర్థుని, ప్రకాశస్వభావుని, శత్రువులను సంహరించువానిని, జయశీలుని, బలవంతుడై వృద్ధి నందువానిని సుందరమైన రూపము గలవానిని, ఓర్పుగలవానిని, తన భక్త సంఘములకు హితమొనరించు వానిని ప్రార్థించుచు మ్రొక్కుచు, మునులును, దేవతలును తమ తమ నెలవులకు సంతోషముతో వెళ్లగా దేవతలు చేసిన ఈ సమాచారము నంతయును తెలిసికొన్న వాడై మాల్యవంతుడు బలవంతులైన తన తమ్ములను పిలువనంపి యిట్లనెను. తమ్ములారా! ఆ దేవతావరులు చేసిన పనిని మీరు వినలేదా? వినుడు.

## మాల్యవంతుడు దేవతలపై దండెత్త దలంచుట:

దేవతలును మునులును గలసి శంకరుని జూడనేగి వరబలము చేత గర్వితులైన సుకేశ నందనులు మమ్ములను పెట్టుచున్న పాట్ల నేమని చెప్పుదుము. మేము మా స్థానములందుండుటే కష్టముగా నున్నది. ఇంక వారల నెట్లైనను సంహరింపుము త్రిలోచనా! ఓ త్రిపురారీ! జగములకు హితము కోరుము అని విన్నవింపగా శివుడు తన చేతులను జోడించి తనలాడించుచు వారలతో నిట్లనెను. ఓ దేవతలారా! ఆ రాక్షసులను నేను సంహరింపలేను గాని ఆ దుష్టులు సంహరింపబడు నుపాయము నొకదానిని చెప్పెదను వినుడు. శంఖచక్రధరుడును, లక్ష్మీ భర్తయునగు ముకుందుని భక్తితో సేవింపుడు. అట్లు

శరణు వేడినచో దయతో జనార్ధనుడు ప్రతాపముతో వారిని సంహరించి దేవతల మనస్సులందలి దుఃఖమును దొలగించును. అని గౌరీ పతి చెప్పగా దేవతలును, మునులును నారాయణుని నివాసమున కేగి ఇది యంతయు చెప్పగా శ్రీహరి వారల భయమును మాన్పి ప్రేమతో ఓ దేవతలారా! ఆ రాక్షసులను నేను వధించెదను. మీకు సుఖమును కలుగజేసెదను. మీరు మీ నివాసములకు యధాసుఖముగా వెళ్లుడు అని చెప్పెనట. నేను వింటిని. అట్లు విష్ణువు దేవతల కెల్లను అభయమిచ్చెనట. మనలను చంపుదునని ప్రతిజ్ఞ చేసెనట. కాన తమ్ములారా! ఇప్పుడు మనము జరిగింపవలసిన తంత్రమేదియో చెప్పుడు. ఆ శ్రీహరి హిరణ్యకశిపునంతటి వానిని సంహరించెను. కాలనేమిని యమపురమునకు బంపెను. సంహ్రాదుడను పర్వతమునకు వజ్రాయుధమయ్యెను. మహాబలవంతుడైన నముచి యను వాని పేరు లేకుండ చేసెను. శుంభనిశుంభుల గర్వమణచెను. అమితబలుడైన హార్దిక్యుని జంపెను. యమళార్జునులను సమూలముగా నాశనము చేసెను. చాలా మాయలు దెలిసిన రాధేయుని భంగపరిచెను. బలవంతులను, వీరులను, సాహసవంతులను, అఖిల శస్త్రాస్త్రములందు నేర్పరులైన రాక్షసశ్రేష్ఠులను గొప్ప ప్రతాపముతో దానవులను సంహరించెను. తలంచి చూడగా పితాంబరధారియైన శ్రీహరి సామాన్యుడా? అందఱును మాయలలో నేర్పరులు, అందఱును నూరు యజ్ఞములు చేసినవారు. అందఱును శౌర్యవంతులు. లోకాధ్యక్షుడైన ఆ విష్ణువు చేత ఎందఱో రాక్షసశ్రేష్ఠులు సంహరింపబడిరిగదా. కాన మీరిది యంతయు ఆలోచించి మంచిది చేయదగినది యయిన కార్యమును చెప్పుడు. ఏ విధముగా నడచుకొందము? అని అడుగగా భయంకరమైన బలము గల తమ అన్నను ఇంద్రుని అశ్వీనీ దేవతల వలె జూచి తమ్ములిట్లు పల్కిరి. లోకపాలకుల కలతకు కారణమైనవాడా! మనము ప్రతాపమును చూపుటే ఇప్పుడు చేయవలసిన కార్యము. ఎల్లవేదములను శాస్త్రములను చదివితిమి. అమితమైన భాగ్యసంపదలోలలాడితిమి. జాగ్రత్తగా కొదువలేకుండ దానములను ప్రఖ్యాతిగా జేసితిమి. లెస్సగా రోగరహితమైన ఆయుర్దాయమును పొందితిమి. తగిన ధర్మములను పూర్తిగా చేసితిమి. అంతేగాక నివారింపరాని ఆ దేవతాసముద్రమును గొప్ప శస్త్ర సమూహములచే కలత చెందించి విరోధుల నందఱను సంహరించినచో మనకు మరణభయము లేదు గదా. ఆ నారాయణుడును, ఇంద్రుడును, గౌరీపతియును, యముడును మనలను యుద్ధమున నెదుర్కొందురా? మన పేరు చెప్పగానే భయముచే ఎల్లప్పుడును వణకుచుందురు గదా. ఆ శ్రీహరియందు దోషములేదు. మన విరోధుల దోషము వలన ఆ పద్మాక్షుని మనస్సు చెడినది గాన ఇప్పుడే దూషింపదగిన శీలము గల దేవతలను వేగముగా హింసించి వారిని

మిగులకుండ నశింపజేసి వచ్చుటయే మా మనస్సులందు శుభమని తోచుచున్నది. అని యిట్లు సుమాలియు, మాలియు పల్కగా మాల్యవంతుడట్లే యని దేవతా సంఘముల మీద యుద్ధమునకు వెళ్లుటకై సర్వరాక్షసుల కాజ్ఞ ఇచ్చుచు సైన్యములను సిద్ధము చేయుడని సైన్యాధ్యక్షులకు చెప్పగా ఆ గొప్ప శౌర్యము గల సేనాపతులు యుద్ధమునకు ప్రయత్నములు చేయుచుండిరి.

## మాల్యవంతుడు దేవతల మీదికి యుద్ధమునకు బోవుట:

అంత మాల్యవంతుడు తన సోదరులతో, సైన్యములతో గలసి రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, ఒంటెలు, గాడిదలు, ఎడ్లు, శింశుమారములు, భయంకరములగు సర్పములు, పక్షులు, తాబేళ్లు, చేపలు, గరుత్మంతుని బోలు పక్షులు, పందులు, మొసళ్లు, అడవిపందులు, సింహములు, పులులు మొదలగు అనేక సత్త్వములు వాహనములుగా గలిగి స్వర్గమును ముట్టడించుటకు దాడి వెడలెను. ముందు కాలము నందు లంకకు రాబోవు వినాశమును తలచి లంకలో నివసించు సమస్తప్రాణులు దేవతలతో గూడ దైన్యమును బొందుచు వారితో పాటుగా లంకను వీడి పోయిరి. రాక్షసుల వినాశమును తెలియజేయుచు ఆకాశమునను భూమియందును ఉత్పాతములధికముగా గనిపించెను. కాలునిచే ప్రేరేపింపబడినవై మిక్కిలి భయంకరములై మేఘములు వేడిరక్తముతో గూడిన ఎముకలను గురియించెను. పర్వతములు అల్లలాడెను. సముద్రము పొంగి పొరలి చెలియలి కట్టను ముంచివేసెను. ఉరిమినట్లుగా నక్కలు భయంకరముగా అరచెను. గ్రద్దలు గుంపులు రాక్షససేనలపై చుట్టు తిరిగెను. కాల విధిచేత ఆ రాక్షస సేనాసమూహముపై ఎఱ్ఱని కాళ్లు గల పావురములు తిరిగెను. కాకులు, పిల్లుల గుంపులు భయంకర ధ్వనులతో హెచ్చుగా అరచెను. బలమైన కాలపాశముల చేత బంధింపబడినవారు గాన మాల్యవంతుడును, సుమాలియు, మాలియును ఏమియును సందేహింపక భయపడక కీడును తెలియజేయు చిహ్నములను చూచియు రాక్షసశ్రేష్ఠులు తమ వెంటవచ్చుచుండగా తాము మండుచున్న అగ్నులవలె సైన్యమున కంతటికిని ముందు ముందుగా పోయిరి. మాల్యవంతమను పర్వతము వలె అచలుడైన మాల్యవంతుని గొలుచుచు చుట్టు నుండి రాక్షసులందఱును బ్రహ్మదేవుని గొల్చు స్వర్గనివాసులవలె ప్రకాశించుచు ఆ మాలి యధీనమున నుండి స్వర్గమును జయింపవలెననెడు కాంక్షతో మేఘముల వలె గర్జించుచు దిక్కులు బ్రద్దలు చేయుచు వేగముగా వెళ్లిరి.

★★★

# ఏడవ సర్గము

## విష్ణువు దేవతలకు తోడ్పడి రాక్షసులను పారద్రోలుట:

ఆ రాక్షస సమూహములు దేవతానివాసముపైకి వచ్చుచుండుటను దేవతలు పంపిన దూత తెలియజేయగా యుద్ధము చేయ సమకట్టిన వాడై మాధవుడు సాటిలేని కోటిసూర్య సమానమైన కాంతితోనున్న కవచమును దొడిగి భయంకరములైన బాణసమూహములతో నిండిన తూణీరమును గట్టుకొని నడుము బిగించినవాడై శంఖచక్రములు శార్ఙ్గ ధనువు, నందక ఖడ్గము మొదలగు ఆయుధములను ధరించినవాడై బంగారు కొండతో సమానమైన ఆ గరుత్మంతు నెక్కి దుష్టులైన రాక్షసులనెడు కంటకములను నాశనము చేయవలెనను సంభ్రమముతో త్వరపడి ఆ నారాయణుడు దేవతలు, ఋషులు, సిద్ధులు, యక్షులు, మునులు చేతులు జోడించి మ్రొక్కుచు తనను మనోహరములైన తియ్యని మాటలతో స్తోత్రము చేయుచుండగా బయలు వెడలెను. అప్పుడు బంగారు వస్త్రము ధరించిన మేఘశ్యాముడైన లక్ష్మీవల్లభుడు హేమాద్రిపై నున్న మెరుపు తీగతో గూడిన మేఘమోయనునట్లు జగములు సంతసించుచునట్లుగా ఉండెను. పక్షిరాజైన గరుడుని రెక్కల గాలిచే నెగుర గొట్టబడిన కేతువులు గలదియు, ఎగిరిపడిన శస్త్రములు గలదియునై కదలుచున్న శిలలు గల నీలాద్రి శృంగమోయనునట్లు కనిపించుచు ఆ రాక్షసేంద్రుని సైన్యమంతయు విభ్రాంతితో తూలి భయపడుచుండగా ఆ సైన్యమున కడ్డుగా నిలిచి వారిపై ముజ్జిద్దుగా బాణములను వేయగా భయపడకరాక్షసులు రోషములధికమగుచుండగా తమ సైన్యమంతయు నొక్కటియై గొప్పయుత్సాహముతో తమ శరీరములు నెత్తుటిలో మాంసములలో మునిగియున్నను లెక్కచేయక ఆ దానవారిపై మొత్తములుగా బాణవర్షమును గురుపించిరి. ఆ రాక్షసులనెడు మేఘములు తమ గర్జనలతో దిక్కులు అదరునట్లుగా విరోధులు భయము చెందునట్లు ఆ నారాయణుడనెడు పర్వతము మీద అడ్డులేక బాణవర్షమును గురియించెను. నల్లని శరీరము గల శ్రీహరి నల్లని రాక్షస సమూహము బాణజాలమును గురిపింపగా వర్షించుచున్న నల్లని మేఘములచే గప్పబడిన అంజన పర్వతము వలె మెరసెను. వరిచేనిపై మొసరు మిడుతల

వలెను మంటపై వ్రాలెడు దోమల విధముగా, దేనె కుండపై మూగుటకు పూనిని ఈగల వలెను, సముద్రము నందలి మొసళ్ల వలెను రాక్షసుల విండ్లనుండి వెడలిన బాణములు ప్రళయకాలము నందు లోకముల వలె ఆ శ్రీహరి యందు బ్రవేశించెను. రథములపై నున్నవారు, ఏనుగుల మీద నున్నవారు, గుఱ్ఱములపై నున్న రౌతులు కాల్బంటులు అట్లే ఆకాశమున కెగసి రాక్షసశ్రేష్ఠులు బాణముల వరుసలను, యష్టితోమరాద్యాయుధములను చిమ్ముచు దామోదరుని ప్రాణాయామము చేయు బ్రాహ్మణుని వలె స్తంభించిన ఉచ్ఛ్వాసము గలవానిగా నొనర్చిరి. చేపలచే గదలింపబడిన సముద్రము వలెనై శార్ఙ్గధనువును మ్రోయించి నందకహస్తుడైన విష్ణువు వజ్రసదృశములు, వాయువేగము గలవియైన భయంకరబాణములను పూర్తిగా చేతితో లాగి రాక్షసశ్రేష్ఠులపై వేసి వేనవేలుగా నేల గూలునట్లు తెగిన శిరస్సులు గల వారిగా నొనర్చెను. సౌజన్యమే ధనముగా గల శౌరి యిట్లు వాడి బాణ సమూహముల వృష్టిచే రాక్షసులను దైన్యము నొందజేసి బలశాలియై పాంచజన్యమను శంఖమును పూరింపగా ఆ ధ్వనిని విని యుద్ధమునకు వచ్చిన దేవ విరోధుల గుంపులు సింహగర్జనను విన్న అడవి యేనుగల వలె హృదయములు భయముతో నిండగా పరువెత్త దొడగెను. మూడు లోకములను బాధనొందునట్లా ధ్వని నిండగా గజములు మదము విడచి సొమ్మిసిల్లి నేలకొరిగెను. గుఱ్ఱములు చచ్చిపడెను. రథికులు రథములను వీడి తేజోరహితులై తూలిపడిరి. పదాతి దళములు నిశ్చేష్టులై నేలబడిరి. పద్మాక్షుడదేపనిగా వెంటవెంటనే దట్టముగా బాణవర్షమును రాక్షససంఘములపై గురియింపగా భిన్నములైన శరీరములు గలవారై ఇంద్రునిచే ఱెక్కలు నరుకబడిన పర్వతములవలె రాక్షససైన్యములు తెగి, నరుకబడి, తీరుచెడి మడిసెను. శ్రీహరి చక్రముచే తెగిన గాయములనుండి రాక్షస సైనికుల శరీరములందు నెత్తురులు పర్వతములందు కారెడు గైరి కాది ధాతువుల వలె ఎఱ్ఱని రంగులతో కారుచుండెను. పాంచజన్యధ్వని, దుర్వారమైన శార్ఙ్గధనువు అల్లెత్రాటి ధ్వని, శత్రువుల కంఠముల నుండి వెడలు ధ్వని వీనినన్నింటిని పీతాంబరుని భయంకరమైన హుంకార ధ్వని మించి మ్రింగి వేసెను. సూర్యబింబము నుండి వెలువడు కిరణముల వలెను, సముద్రము నుండి వెడలిన ఏరుల విధముగాను, పర్వతరాజముల నుండి వెలువడు నాగరాజుల వలెను, మేఘములనుండి వెలువడు జలధారలవలెను శౌరిచే వేయబడి శార్ఙ్గధనువు నుండి వెలువడుచున్న బాణముల వరుసలు తమ మీదకు రాగా తెగిన మెడలును, నరుకబడిన శరీరములును, బ్రద్దలైన రథములును, విరిగిన

విండ్లును, నేలబడిన వాహనములును, చచ్చిన ఏనుగులును, తెగిన కేతనములును విరిగిన చేతులును గలదై రాక్షస సైన్యములు కలత జెందెను. దుఃఖము నందెను. బాధ చెందెను. సంహరింపబడెను. శరభమృగమును జూచి పరువెత్తు సింహముల వలెను, సింహమునకు భయపడు ఏనుగులవలెను, ఏనుగులకు కలత జెందు పెద్దపులులవలెను, పెద్దపులులకు వెఱచు సివంగులవలెను, సివంగికి జడియు కుక్కలవలెను, కుక్కకు వెఱచు పిల్లులవలెను, పిల్లికి బెదరు సర్పముల వలెను, సర్పమునకు భయపడు ఎలుకలవలెను, ఆ శ్రీహరికి భయపడి నేలబడి రాక్షససేన నాశనమునందగా ఆ నీల దేహుడు పర్జన్యుడు మేఘమును వలె శంఖమును పూరించెను. మందర గిరిధారియైన శ్రీహరి బాణములకు భయపడి రాక్షసుల బలములు ధైర్యములు విడచి లంకానగరాభి ముఖముగా వెళ్లుచుండగా తిరిగి అధికమైన రోషముతో సుమాలియు పరాక్రమముతో

## విష్ణువు సుమాలితో బోరుట:

సూర్యుని గప్పివేయు మంచువలె విష్ణునిపై తలపడి బాణములచే ముంచగా పారిపోయిన సైన్యమంతయు పూర్తి ధైర్యమును బొంది చెలిరేగి వెనుకకు వచ్చెను. ఆ సురవిరోధియు విష్ణునిపై బాణములను వేసి రాక్షసుల జీవితములను నిలువబెట్టగలుగు రీతితో అత్యధికమైన ధైర్యముతో గొప్పగా అరచెను. బంగారు ఆభరణములతో మెరయుచున్న హస్తమును గర్వముతో ఊచుచు పీతాంబరుని పిల్చుచు మెరుపుతో గూడిన మేఘమోయనునట్లు గొప్పధ్వనిని ఆకాశము బ్రద్దలగునట్లు నిండించుచుండగా ఆ హరియు సూర్యసదృశమైన కాంతి గల బాణముచే అతని చెవుల యందలి ప్రకాశవంతమైన భూషణములను త్రుంచి సారథి శిరమును ఖండింపగా అతని గుఱ్ఱములు తికమక పడుచు హెచ్చైన భయముచే గిరగిరమని ఆ రాక్షసుని రథమును వేగముగా త్రిప్పెను. ఈ విధముగా రథహయములు భ్రాంతిచే తిరుగుడు పడగా అంతలో సుమాలియు, సంభ్రాంతములైన ఇంద్రియాశ్వములచే చింతనొంది ధృతిని గోలుపోవు నరునివలె భ్రాంతిచే చలించెను. ఆ విధముగా చలించుచున్న అన్నను జూచి గొప్ప రోషముతో మాలియు పిడుగులతో సమానమైన బాణములు హంసలు క్రౌంచ పర్వతమును దూరి వెళ్లునట్లు విష్ణుని శరీరమును దూరి వెళ్లునట్లుగా వేయగా మనోవ్యథకు వశము గాని జితేంద్రియుని విధముగా మాధవుడు ఇంచుకంతయును మనస్సు నందు కలత చెందడయ్యెను.

## విష్ణువు సుమాలిని వధించుట:

అట్లు విజృంభించిన సుమాలిపై విష్ణువు వింటినారి మ్రోతలు దిక్కులనిండగా భయంకరమైన మెరుపు వంటి కాంతి గలిగిన వ్రజసన్నిభమైన నివారింపరాని శరములను నాటివేయగా అవి ఆ దానవుని సర్వావయవములందును దూరి పాములు అమృత సారమును గ్రోలిన విధముగా మనస్సు తృప్తి తీరునట్లు నెత్తురలను ద్రావగా రాక్షసుడు విభ్రాంతి చెందెను. అంతటితో విడువక శ్రీహరి ఆ రాక్షసాధముని కిరీటమును, ధ్వజమును, వింటిని ఇంతింతలుగా ద్రుంచి గుఱ్ఱములను జంపగా మాలి అధికమైన వేగముతో గదను ధరించి వెళ్లి పక్షిరాజైన గరుడుని శిరః పార్శ్వము నందు ఈశ్వరుని యముని వలె రెండు చేతులతో మోదెను. వజ్రాయుధముచే గొట్టబడిన పర్వతము వలె చలించి ఆ సర్వవిరోధి దిగ్భ్రాంతి మలగి బాధతో మాధవునకు వెనుక ముఖము పెట్టెను. అంత రాక్షస సేనలొక్కపెట్టున ఆకాశమునంటునట్లుగా పెద్దగర్జనలు చేసిరి. వారి సంతోషమునకు కారణమైన ఆ ఘోరమైన ధ్వనికి శ్రీహరి ఆగ్రహమును చెందినవాడై గరుడునిపై అడ్డముగా తిరిగి తొందరపాటుతో చేత ధరించి ప్రక్కవాటుగా అయి సూర్యునితో సమానమైన కాంతితో ప్రకాశించునదియు, తన కాంతితో దిక్కులను నింపివేసి నదియు, భయంకరమైన రూపము గలదియు, విరోధుల శిరస్సులను ఖండించు సామర్థ్యముగలదియు, కాలచక్రము బోలినదియు అయిన చక్రమును రాక్షసశ్రేష్ఠునిపైకి వేసెను. అది పూర్వము రాహువు శిరమును ద్రుంచిన విధముగా మాలి శిరమును నేలగూల్చెను. అది చూచి దేవతలు హర్షముతో గర్జనలు చేసిరి.

## రాక్షససేన పలాయిత మగుట:

అట్లు మాలి సంహరింపబడుటను జూచి మాల్యవంతుడును సుమాలియు శోకమున మునిగినవారై తమ సైన్యముతో భయముచే లంకాభిముఖముగా పారిపోయిరి. ఇంతలో గరుత్మంతుడు తెప్పిరిల్లి ఆక్రోధముచే తన రెక్కల గాడ్పు దెబ్బచే వారిని నొప్పింపగా పెద్దగాలికి ఎగిరిపోవు ఎండుటాకుల వలె చెల్లాచెదరై సైనికులందఱు చెదరిపోగా బాణములచే తెగిన శరీరములు గల వారును, చక్రముచే తెగిన శిరస్సులు గలవారును, ఖడ్గముచే చీల్చబడిన మేనులు గలవారును, ముసలపు దెబ్బచే పగిలిన శిరములు గల వారును, నాగలిచే నొప్పింపబడిన మెడలు గలవారును, గద దెబ్బచే నొచ్చిన వక్షము గలవారును, విరిగిన

చేతులు గలవారునై వెండ్రుకలు వీడిపోగా యుద్ధమును వీడి రాక్షసులు పారిపోవుచుండగా శ్రీహరియును వాడియైన వేలకొలది బాణముల వర్షము చేత గొడుగులు తెగిపోవునట్లును, గుఱ్ఱములు చచ్చునట్లును, రథములు విరుగునట్లును, ప్రేవులు ప్రోవులై పడునట్లును చేసి సైన్యములు బిగిచెడునట్లు, భయభ్రాంతులగునట్లు దద్దరిల్లునట్లు చేయగా కనులు తిరుగుచుండగా, పాదములు తడబడగా, గుండెలు దడదడలాడగా పిచ్చివారివలె నయి పట్టుదలలు వదలి పారిపోయిరి. వారిని జూచి శ్రీహరి గర్జింపగా సింహగర్జనలను విన్న ఏనుగుల వలె విభ్రాంతిని బొందుచు వింటినుండి వెలువడిన బాణ సమూహములనెడు గాలిచే కొట్టబడిన మేఘబృందముల వలె అయిరి. వారి బంగారు ఆభరణములు జారిపడి భూమియంతయు నిండిపోయెను. నల్లని మేఘములవంటివారును, వ్రేలాడుచున్న హారములతో ప్రకాశించువారును అగు రాక్షసులు శ్రీహరి బాణముల వరుసలచే కలత చెందిన మనస్సులు గలవారై నల్లని కాటుక కొండలవలె నేలబడిరి. పరువెత్తుచున్న రాక్షసుల పాటును, వెన్నాడుచున్న శౌరియుద్ధమును జూచి ఆ రాక్షసనాయకుడైన మాల్యవంతుడు సముద్రము గట్టును దాకి వెనుకకు మరలినట్లు వెనుకకు తిరిగి విష్ణువును జూచుచు గర్వముతోను, కోపముతోను శిరమునూచుచు విజృంభించుచు ఇట్లనెను.

★★★



# ఎనిమిదవ సర్గము

## మాల్యవంతుడు విష్ణుని నిష్ఠురము లాడుట:

ఓరీ! నారాయణా! అల్పపుజనులవలె నీవీవిధముగా క్షత్రియ ధర్మమెఱుగక యుద్ధము కోరని వారలను భయపడునట్లుగా జంపదగునా? సత్యవిచారా! వినుము యుద్ధమును వదలి పారిపోవుచున్న వారలను వెన్నాడి చంపునట్టి పురుషుడు కోట్లకొలదిగా గొప్పపుణ్యములు చేసియును స్వర్గమునకు వెళ్లలేడు సుమా. ఓ చక్రధారీ! యుద్ధము చేయవలెనని అంతటి యుత్సాహము గల దేని రమ్ము. నేను సిద్ధముగా నున్నాడను ప్రశస్తముగా నీదు శౌర్యమును బలమును చూపింపుము. అని మాల్యవత్పర్వతము వలె మాల్యవంతుడు నిలబడగా శ్రీహరి యిట్లనెను. మీవలని భయముచే దేవతలు నన్ను శరణువేడగా దయదలచి మిమ్ము చంపెదనని అంగీకరించితిని. ఓ రాక్షసనాథా! ఆ మాట నిలబెట్టుకొనువాడను. నా ప్రాణముల కంటేను స్వర్గనివాసుల కార్యము నాకు ప్రియమైయుండును.కాన మీరలు రసాతలమునకుపోయి నివసించినను ఓ దురాత్ములారా! మిమ్ములను చంపక విడువను. అని చెప్పుచుండగా రాక్షసుడు శక్తితో విష్ణుని వక్షమందు నాటునట్లు గొప్పశక్తిని వేయగా అది దానవారి వక్షమున మేఘమునందు మెఱుపువలె మిక్కిలి అందముగా వెలిగెను. బలవంతుడును శక్తి ధరుడగు కుమారస్వామికిష్టుడును అయిన విష్ణువు మఱల దానిచేతనే ఆ రాక్షసుని గొట్టెను. ఆ శక్తియును పర్వత శిఖరముపై బడు పిడుగువలె మాల్యవంతుని రొమ్ముపై బడెను. దానిచే ఆతని కవచము పగిలిపోయెను ఎదలో దూరిన దాని తాకిడిచే నెంతయో బాధనొంది చలించియు తిరిగి మదముతో తెప్పిరిల్లి ఆ గొప్పబలవంతుడు గొప్ప పర్వతమువలె నిల్చి బలమైన ముండ్లతోనున్న శూలమును త్రిప్పి శ్రీహరి వక్షమున నాటించెను. అంతతో విడువక పిడికిటి పోటుతో దానవవైరిని నొప్పించుటే గాక గరుత్మంతుని గ్రుద్ది ఆ చతురుడు నాలుగు మూరల దూరము వెనుకకు దూకెను. అంత వినతానందనుడగు గరుత్మంతుడు రోషవివశుడై రెండు రెక్కలను వీచెను. రాక్షసాధిపతియగు మాల్యవంతుడు ఆ గాలివేగమునకు ఎండిన ఆకువలె నిలువ జాలక దూరముగా బడెను. అన్నయొక్క గతిని జూచి తమ్ముడు మిగిలిన సైన్యములను దీసికొని సిగ్గుతో వంచిన ముఖము గలవాడై లంక దిక్కుగా వెడలెను.

## రాక్షసులు పరాజితులై లంక జొచ్చుట:

ఈ విధముగా అనేక పర్యాయములు శ్రీహరిచే భంగపడుచు రాక్షసనాథులుపద్రవము నొందిరి. శ్రీపతి నెదిరించుట రాక్షససేనకు శక్యమగునా? పద్మాక్షునకు భయపడి రాక్షసులు లంకాపురమును విడచి తమ స్త్రీలతో గలసి ధైర్యము చెడినవారై గుండెలు ఝల్లుమనుచుండ పాతాళలోకము నివాసముగా జేసికొని నిలిచిరి. [పాతాళము – ఇప్పుడు దీనిని అమెరికా యనుచున్నారు. 'అమేరుక' యే అమెరిక యయ్యెను. చెండువలె నుండు భూమికి పైభాగమున మనదేశమున్నది. దీనికి చక్కగ అడుగున అమేరుక యున్నది. అ+మేరు+క.] రామా! ఈ రాక్షసులు సాలకటంకటులని ప్రఖ్యాతి చెందిన వారలు. యుద్ధమున నీవు చంపినవారలు పౌలస్త్యులను పేరుతో ప్రసిద్ధులు. రామచంద్రా! మాల్యవంతుడు మొదలగువారు పౌలస్త్యులకంటెను బలవంతులు, మఱియు యుద్ధచతురులు ప్రజ్ఞావంతులు, ధైర్యస్థైర్యలక్ష్మీ సంపన్నులు. ఆ దేవతా బాధాకరులైన రాక్షసులను సంహరించుటకు పద్మాక్షుడును, చక్రము, శంఖము, శార్ఙ్గము, గద అను ఆయుధములు ధరించినవాడును అయిన నారాయణునకు దప్ప నితరునకెవ్వనికి శక్యమగును? ఓ రామా! నీవే నారాయణుడవు, నీవే నాశరహితుడవు, సనాతనుడవు. కలువల వంటి దేహము గలవాడా! నీవే దేవతలకు వరదుడవైన చతుర్భుజుడవు. ఓ మాధవా! ఓ మురారీ! నీవే జయింపరానివాడవు. నీవే ప్రభుడవు. నీవు రాక్షసవధార్థమై మనుష్యుడవై జన్మించితివి. ధర్మములు క్షీణించినప్పుడు అప్పుడప్పుడు మఱల వ్యవస్థను చక్కబరచుటకై యీ భూమియందు శత్రువులను చంపుటకును, సాధువుల బాధలను మాన్పి రక్షించుటకును జన్మింతువుగదా. శరణాగత రక్షణా! ధర్మవీక్షణా! [పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతామ్। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥ భగవద్గీత] తామరల వంటి నేత్రములు గలిగిన రామచంద్రా! నీకీవిధముగా రాక్షసుల జన్మవృత్తాంతమును చెప్పితిని. ఓ శ్రీకరా! ఇంక రావణాసురుని చరిత్రను అతని జన్మము బలము శౌర్యములను చెప్పెదను. చాలాకాలము విష్ణుమూర్తి భయముచే రాక్షసులతో గలసి సుమాలి తన ముఖమును భూమిపై చూపక రసాతలమునందే యుండెను. ఈశ్వర మిత్రుడైన కుబేరుడు కొడుకులతోను మనుమలతోను గూడి లంకాపట్టణమును స్థిరమైన సౌఖ్యముతో ఏలుచుండెను. ఇట్లెంతో కాలము క్రమముగా గడచుచుండగా

★★★

# తొమ్మిదవ సర్గము

## సుమాలి కూతురును దోడ్కొని భూలోకమునకు వచ్చుట:

ఒక్కనాడు సుమాలి ప్రకాశవంతమైన శరీరము గలదియు, పద్మము విడచి వచ్చిన లక్ష్మిని పోలునదియు అయిన తన కుమార్తెను తీసికొని భూలోకమునకు వచ్చి వరుని వెదకు అభిలాషతో తిరుగుచుండగా ఒకచోట తండ్రికి నమస్కరించి వెళ్లుచున్న వాడును, స్వేచ్ఛాసంచారుడును, ఇంద్రునితో సమానమైన వాడును సుందరమైన రూపము గలవాడును, ధననాథుడును అయిన పులస్త్య వంశజుని జూచి తిరిగి తన లోకమునకు వెళ్లి ఏ విధముగా చేసిన ఈ రాక్షస వంశమునకు మేలు కలుగును? ఇది యభివృద్ధి చెందుటెట్లు? అని ఆలోచించి తన కుమార్తెను చేరబిలిచి యిట్లనెను. బాలా! నీకు యౌవనము వచ్చినది. పెండ్లిచేయదగిన కాలమిదే. తిరస్కరింపబడుదునేమో యను భయముచే మన దగ్గఱ చుట్టములలో నెవ్వడును నిన్ను వరింప ముందునకు రాడయ్యెను. కూతురా! నీవు లక్ష్మీదేవితో సమానమైన దానవు. విశిష్టములైన గుణమలు గలదానవు. కావున నీకు తగిన మహానుభావుని పెనిమిటిగా గూర్పవలెనని ప్రయాసపడుచున్నాను. ఓ వెలదీ! నీ మూలమున నీ వంశము వృద్ధిపొందుటయే నాయభీష్టము. గౌరవమును గోరెడు పురుషునకు ఒక కుమార్తె పుట్టినచో యీ రమణికి తగిన భర్త యెవడు లభించునో యను చింతతో దుఃఖమావేశించును. తల్లి వంశము వారిని, తండ్రి వంశమువారిని, తన భర్తవంశమువారిని, కన్యక ఏమియపకీర్తిలో ముంచునో యని సదాసంశయము పొందజేయును. కాన నీవు బ్రహ్మవంశము వాడగు విశ్రవసుడను మౌనిని మంచిమనస్సుతో భర్తగా వరింపుము. ఆ మహాత్ముని దయావిశేషము చేత సూర్య సమానతేజోవంతులును ప్రఖ్యాతి చెందిన ప్రభావము గలవారును ధనాధిపతితో సాటివచ్చువారును అగు పుత్రులను పొందెదవు.

## కైకసి విశ్రవసు నాశ్రమంబునకు వచ్చుట:

ప్రకాశమానమైన తేజస్సు గలదానా! ఉల్లాసముగా వెళ్లుచున్న యక్షరాజును నీవు కూడా చూచితిని గదా. ఓ అబలా వెళ్లుమని చెప్పగా తండ్రి యానతి వెంబడి స్త్రీలలో

శ్రేష్ఠురాలైన కైకసి వెళ్లి మౌని ఆశ్రమ ప్రదేశమును ప్రకాశింపజేయుచు వికసించిన ముఖపద్మము గలదై యొప్పుచు సన్నుతింపబడిన శీలము గల మౌని సమీపమునకు వెళ్లెను. అప్పుడు సాయంసంధ్యావేళయందు హోమకార్యము నిర్వర్తించి మండుచున్న నాల్గవ యగ్నియోయనునట్లు ప్రజ్వరిల్లుచుండగా ఆ సమయము క్రూరమైన దనికూడ తలంపక కోరికతో ఆ మునిని జూచుచు తన కాలిబొటన వ్రేలితో నేల వ్రాయుచు నేల జూచుచు నిలబడెను. తామరల వంటి నేత్రములు గలిగి సింహము నడుము వంటి నడుము గలిగి పూర్ణచంద్రుని వంటి ముఖము గలిగిన ఆమెను జూచి ఆ కులపతి యిట్లనెను. ఓ కోమలీ! యెవ్వరిదానవు? ఎందులకై ఇచ్చటికి వచ్చితివి? ఏమి పనియో చెప్పుమనగా చేతులు జోడించి ఆ సుకుమార శీలయగు కైకసి మునిసత్తమునకు నమస్కరించి యిట్లు చెప్పెను. మునిశ్రేష్ఠా! నేను తండ్రి యాజ్ఞను పొంది మిమ్ము చూడవచ్చితిని. నా పేరు కైకసి. ఓ బ్రహ్మవంశ శ్రేష్ఠుడా! నా మనస్సును నీ ప్రభావముచేతనే చూడనగును అనగా ఆతడొక క్షణమాలోచించి సర్వమును దెలిసికొన్నవాడై ఆ కైకసితో నిట్లనెను. మగువా! నీ తలంపును నేను తెలిసికొంటిని. నీవు పుత్రులను పొందవలెనని యభిలాషతో వచ్చితివి. కాని యిది క్రూరమైన సమయమని తెలియవైతివి. కాన నీకు క్రూరాత్ములు, భయంకరాకారులు, అయిన రాక్షసాగ్రేసరులు పుత్రులుగా జన్మింతురు.

## రావణ కుంభకర్ణ విభీషణ జననము:

అని విశ్రవసుడు చెప్పగా ఆ కాంత యిట్లనెను. బ్రహ్మ వాదులలో శ్రేష్ఠుడా! నన్ను క్షమింపుము. నీకు కలిగెడు పుత్రులు కఠినచిత్తులు దురాచారులు నగుట నేను సమ్మతింపననగా ఆ మౌని ఓ బాలా! నీకడగొట్టు పుత్రుడు నన్ను బోలిన వాడై ధర్మాత్ముడై యుండగలడు ఇది నిజము సుమా యనెను. అందులకు సమ్మతించి నిండు మనస్సుతో అటు నివసించి కొంతకాలము గడవగా ఆ కైకసి ఒక కొడుకును గనెను. అతడు పెద్ద కోరలు ప్రకాశవంతమైన వెంట్రుకలు కలిగి ఎఱ్ఱని పెదవులు, అంజన పర్వతము వంటి ఆకారము, భయంకరమైన రూపము, ఇరువది భుజములు గలిగి యుండెను. మహాక్రూరుడు రాక్షసాకారము గల ఆ దశగ్రీవుడు పుట్టిన సమయమున పిడుగులు పడెను. నెత్తురులు వానగా గురిసెను. గాడిదల అరపుల వంటి ధ్వనులతో మేఘములురిమెను. జంతువులు అపసవ్యముగా తిరిగెను. భూమి గడగడ వణకెను. సూర్యుడు ప్రకాశము

తగ్గెను. స్వచ్ఛమైన కీర్తి గలవాడును, బ్రహ్మతో సమానుడును అయిన ఆ మౌని వచ్చి తనయుని పరీక్షించి చూచి పది తలలు గలవాడగుటచే దశకంఠరుడని పేరుపెట్టెను. [పుట్టినప్పుడే రావణుడు పది తలలవాడనియును, కోరిన రూపమును ధరించు శక్తి గలవాడు గాన నొంటి తలతో నప్పుడప్పుడు విహరించుచుండెను అని తెలియదగును.] ఇంతింతయని చెప్పరాని భయంకరరూపము గల కుంభకర్ణుడను కొడుకు పుట్టెను. తరువాత మాయావినియు, వికృతమైన ముఖము గలదియు నగు శూర్పణఖయను కూతురు పుట్టెను. చివటి కొడుకుగా ధర్మాత్ముడైన విభీషణుడు తల్లి సంతోషమందునట్లు పుట్టెను. అతడు జన్మించు సమయమున పుష్పవర్షము గురిసెను. దుందుభులు మ్రోగెను. ఆకాశ సంచారులైన భూతములు మేలు మేలు మేలని మెచ్చుకొనిరి. వారలందఱు ఆ ముని యాశ్రమము నందే పెరిగి మహాతేజస్సు గలవారై వృద్ధి నందుచుండగా చిన్నతనము నుండియు, దశకంఠుడును కుంభకర్ణుడును జగములకు బాధ కలిగించు చుండిరి. అందు కుంభకర్ణుడు మునులను జంపి తినుచు దుర్మార్గప్రవర్తనముచే మిక్కిలి సంతోషము నందుచుండెను. విభీషణుడు వేదములను జదువుచు జితేంద్రియుడై మితమైన సాధువను కీర్తిని పొందెను. ఇట్లు కొంతకాలము గడువగా తరువాత ఒక దినమున యక్షరాజైన ధనాధిపతి తండ్రికి నమస్కరించి వెళ్లుచుండగా ఆ గొప్ప తేజస్సుతో నున్నవానిని జూచి కైకసి తన పెద్ద కుమారునితో నిట్లనెను. పుత్రా! నీ అన్న ఏ విధముగా మహావిభవములను పొంది మహానుభావుడై ప్రకాశించుచున్నాడో చూచితివా? మీరలు కూడా ఆ విధముగా ఎప్పుడుండెదరో గదా అనగానే ఆ దశగ్రీవుడు అధికమైన రోషమును పొంది తల్లిని జూచి యిట్లనెను. అమ్మా! అధికమైన వైభవముతో ఇతని కంటే అధికుడనై నీయొద్దకు వచ్చెదనని బాస చేసెదను. అట్లు జరుగకున్నచో అతనితో సమానుడనైన నయ్యెదను. నీ మనోవ్యథను విడిచిపెట్టుము. నేను గొప్పనైన తపస్సు చేసి దానివలన నాకార్యమును నెరవేర్చుకొనెదనని చెప్పి గోకర్ణమునకు వెళ్లి తమ్ములతో గూడ తపము సల్పి బ్రహ్మ చేత ఇష్టమైన వరములను పొందెను.

★★★

# పదవ సర్గము

## అగస్త్యుడు శ్రీరామునకు రావణాదుల తపోవిధము చెప్పుట:

అని అగస్త్యమౌని చెప్పగా విని శ్రీరాముడు ఓ సముద్రమును పానముచేసిన సమర్థుడా! ఆ దేవవిరోధులేవిధముగా తపస్సు చేసిరో తెల్పుమని యడుగగా కలశ సంభవుడిట్లు చెప్పదొడగెను. ధర్మమార్గము తప్పకుండ కుంభకర్ణుడు అతిఘోరమైన విధముగా మండుటెండలందు పంచాగ్నుల మధ్యము నందును, వానకాలమున జడివానలందును, మంచుకురియు శీతాకాలమున నీటి మధ్య మందును నిలిచి పదివేలయేండ్లు తపస్సు చేసెను. విభీషణుడు గొప్ప ధర్మమార్గమున ఒంటిపాదమున నేలపై నిలబడి ఐదువేల యేండ్లు తపస్సు చేసి, తిరిగి అంతకాలమే సూర్యుని యెదుట నిలిచి వేదమార్గమున దృఢమైన మనస్సుతో ఆకాశమునకు చేతులు చాచి ముఖముపై కెత్తి మోహమును విడచి నందన వనమున దేవుని వలె తపస్సు చేసెను. ఇట్లు చేయుచున్న అతనిపై పుష్పవర్షము గురిసెను. అంత దేవతలు కలత చెంది భయపడుచుండగా దశకంఠుడు వట్టి యుపవాసముతో పదివేలయేండ్లు తపస్సు చేసెను. వేయివత్సరములు గడవగానే తన తలనొకదానిని గోసి అగ్నియందు హోమముచేసెను. ఇట్లు వేయిసంవత్సరములకొకటి చొప్పున తొమ్మిది తలలను బ్రహ్మదేవుని గూర్చి అగ్ని కాహుతి చేసెను. పదవ వేయి సంవత్సరము పూర్తియైన వెంటనే పదవ తలనరికి హోమము చేయునున్న యంత దేవతలతో గూడి సరస్వతీపతి వానియొద్దకు వచ్చి ఓ పంక్తి కంఠా! నీ తపస్సునకు మెచ్చితిని వత్సా! నీ యిష్టమును చెప్పుము. నీ శ్రమను ఫలింపజేసెదననగా

## బ్రహ్మరావణునకు వరములిచ్చుట:

రావణుడు సంతోష సముద్రమున మనస్సు తేలియాడగా చేతులు జోడించి యిట్లనెను. ఓ వనజాసనా! వరదా! భక్తవత్సలా! దేవా! జీవునకు మరణభయము గాక ఇంక యేభయమును లేదు గదా. ఎల్లప్పుడును జీవునకు మృత్యువుతో సమానమైన విరోధి లేదు

గాన అమరత్వము నీయవే యనగా బ్రహ్మ యిట్లనెను. దశగ్రీవా! ఎవ్వరికైనను అమరత్వము నొసగుటకు శక్యమా? నీవింకొక వరమును గోరుకొనుము అనగా ఆ దశగ్రీవు డిట్లనెను. ఓ పద్మోద్భవా! దేవతల చేతను, దానవులచేతను, యక్షులచేతను, రాక్షసులచేతను, నాగులు గరుడులు మొదలయిన వారిచే మృత్యువు చెందకుండునట్లను గ్రహింపుము. దయతో ఈ వరమునిమ్ము. మనుజులను, తక్కిన వారలను గడ్డిపోచల విధముగా దలంచెదను. వారిని నేను లెక్కచేయుదునా? యనగా బ్రహ్మ ఆ వరము నిచ్చి తిరిగి యిట్లనెను. దశగ్రీవా! నీయందు సంప్రీతుడనైతిని. నీకింకొక మేలు కలుగజేసెదను. నీవు హోమము చేసిన తలలు ఎప్పటియట్లు నీవు తిరిగి పొందెదవు గాక. ఇంకను నీవేరూపమును ధరింపగోరిన ఆ రూపమును నావర బలముచే పొందగలవని చెప్పుచుండగనే ఆ రాక్షసుడు లోకములన్నియు చూచుచుండగా అగ్నియందు హోమము చేసిన తొమ్మిది శిరస్సులును అందఱును ఔరా యనుచుండగా వెనువెంటనే మొలిచెను.

## బ్రహ్మ విభీషణునకు వరములిచ్చుట:

తరువాత బ్రహ్మ విభీషణుని చేరనేగి విభీషణా! నీవు ధర్మబుద్ధి గలవాడవగుటచే నిన్ను మెచ్చితిని. ఓ ధర్మశీలా! నీ కోరిక నెరింగింపుము. తప్పక యిచ్చెదను అనగానే దేవతలచే నుతింపబడనవాడగు విభీషణుడు తొందరగా చేతులు జోడించి యిట్లనెను. లోకగురుండట తనంత తాను నాకెదురుగా నిల్చి మెచ్చితినని పల్కెనట. ఇంతకంటే వేరే శుభము గలదా? అయినను ఇచ్చెదనంటివిగాన గొప్ప ఆపదలు గలిగిన సమయము నందైనను మనస్సు చలింపక ఎప్పుడును ధర్మము నందే నిలుచుగాక. ఎవ్వరును నేర్వకయే బ్రహ్మాస్త్రము నాకలవడునుగాక. ఏయేయాశ్రమమున ఏయే బుద్ధి పుట్టునో ఓ ఈశ్వరా! అది ధర్మమునందే నడచుగాక. ఇట్లు వరములనిచ్చితివేని నేను సంతోషించెదను. వాణీనాథా! శ్రేష్ఠధర్మమునందు నడచువారికి దుష్కరమెందును లేదుగదా అనగా బ్రహ్మ యిట్లనెను. ఓ సుకృతాత్మా! నీవు కోరిన వరములనిచ్చితిని. నీవు రాక్షసకుల మందు పుట్టినను నీకధర్మమునందు ఆసక్తి కల్గదు గాన నీకు సాటిలేని శుభము కలుగజేసెదను. నీకు ఆనందము కలుగునట్లుగా అమరత్వము నిచ్చితినని పల్కి బ్రహ్మ వేగముగా ఆ కుంభకర్ణుని డాయనేగగా.

## బ్రహ్మ కుంభకర్ణునకు నిద్రనిచ్చుట:

అట్లు వెళ్లుచుండగా దేవతలు ఓ విధాతా! దేవహితా! వీనికి వరము లీయరాదు. వీడు దేవతావిరోధి. అమిత శూరుడు. లోకభయంకరుడు. ఏడుగురు అప్సరసలను మ్రింగెను. నందన వనమునందు ఇంద్రుని సేవలకులగు దేవతలను పదిమందిని జంపెను. క్రూరుడై శ్రేష్ఠులైన మునులను సంహరించెను. ఏ వరములు లేనప్పుడే ఈ విధముగా కలుషాత్ముడై లోకములకు భయము కలిగించుచున్నాడు గదా. దేవా! నీవు గనుక వరములనిచ్చినచో వెంటనే లోకములన్నింటిని తన నోట వేసికొనడా? అందుచే ఏవిధముగా నైనను దయతో వానికి మతిమరపు వచ్చునట్లు చేసినచో జగత్కల్యాణము కలుగును దేవాధిదేవా! యని ప్రార్థింపగా అంత బ్రహ్మ తన భార్యయగు సరస్వతిని తలంచెను. తలచినంతనే ఆమె చేతులు జోడించి నిలిచి నెమ్మదితో నేను చేయదగిన కార్యమెయ్యది అని అడుగగా బ్రహ్మ ఇట్లు చెప్పెను. దేవీ! ఈ రాక్షసుని నోటియందు నీవుండి వరములు కోరు సమయమున దేవతల కోరికను నెరవేర్చుమని చెప్పగా భారతీదేవి వేగముగా వెళ్లి రాక్షసుని నోటియందు నిలిచెను. తరువాత బ్రహ్మ కుంభకర్ణుని సమీపమున కేగి నీ మనస్సు నందున్న కోరికను చెప్పుమనగా వాడు చాలా యేండ్లు నిద్రను కోరుకొనెను. [నిత్యత్వమనబోయి నిద్రాత్వమనెనట] సరియే. అట్లేయగుగాక అని చెప్పి బ్రహ్మ దేవతలతో గూడ తన నివాసమున కేగెను. ఆ రాక్షసుని నోటినుండి బయల్వెడలి సరస్వతి వెళ్లెను. అట్లామె వెళ్లగానే రాక్షసుడు తెలివి నందినవాడై తన మాటకు అనేక విధములుగా విచారించి అయ్యో! ఏమని పలికితిని. ఇంత తెలిసియు యిట్లు నేను మోహపడుట పాపాత్ములైన ఆ దేవతల పని కదా యని మనస్సులో మండిపడెను. ఆ సోదరులీ విధముగా బ్రహ్మచే వరములను పొంది శ్లేష్మాతక వనము దారిబట్టి తమ జనకు డెల్లప్పుడు తపము చేయుచున్న నెలవునకు వెళ్లి అందు ఇష్టము వచ్చిన విధముగా విహరించుచు సుఖముగా నుండిరి.

★★★

# పదునొకండవ సర్గము

## సుమాలి రావణాదుల జూచుటకు భూలోకమునకు వచ్చుట:

అట్లు రాక్షసులగు రావణాదులు వరములను పొందుటను విని సంతోషముతో సుమాలి తన మంత్రులగు విరూపాక్షుడు, మారీచుడు, ప్రహస్తుడు, మహోదరుడు అనువారలు తన్ను సేవించుచుండ నిర్భయముగా భూలోకమునకు వచ్చి రావణుని గ్రుచ్చి కౌగిలించి ఆనందముతో నిట్లనెను. నాయనా! నీవు బ్రహ్మచే వరములను పొందుటచే నా కోరిక తీరినది. నాయనా! లంక యను పురము మనదే సుమా. విష్ణుభయముచే అందుండ వెరచి పట్టణమును విడచి రసాతలమునకు వెళ్లినారము. మేము పడెడి పాట్లనేమని చెప్పుదుము. రాక్షసుల నివాసమునకు తగినదియై అందముగా నున్న ఆ లంక మనది తండ్రీ! ఇప్పుడు నీ సవతి తల్లి కుమారుడగు ధనదుడు నివాసముగా చేసికొన్నవాడు గాన దానిని తిరిగి పొందుట న్యాయము. ఓ బలవంతులలో శ్రేష్ఠుడా! సాయము చేతగాని, దానముచేతగాని, అపరిమితమైన పరాక్రమము చేతగాని ఆ పురమును నీవు పొందుము. దుఃఖమహాసముద్రములో మునిగిన రాక్షసకులమును తిరిగి ఉద్ధరించి లంకాధిపతి యను ప్రఖ్యాతిని వేగముగా పొందుము అని చెప్పగా దశకంఠుడిట్లనెను. ఓ తాతా! అన్నయనగా తండ్రితో సమానుడు గదా. ఇట్లు నీవీమాట చెప్పదగునా? యనగా వాని మనస్సు తెలిసినవాడై సుమాలి మిన్నకుండెను. తరువాత కొంతకాలమునకు ఆ రాక్షసశ్రేష్ఠుడట్లే పలుకగా ప్రహస్తుడు వినయముతో ఆ దశవదనునితో ఇట్లనెను.

## ప్రహస్తుడు లంకను గ్రహింప రావణునకు బోధించుట:

ఓ శూరాగ్రణీ! ప్రశస్తమైన బలము గలవాడవై యుండియు ఈ విధముగా నీవు పలుకదగునా? ఓ ఉత్తమమైన నడవడి గలవాడా! శూరులలో అన్నదమ్ముల వరుసలున్నవా? అదితియు దితియు అక్కచెల్లెండ్రై మిక్కిలి ప్రేమతో మెలగుచు కశ్యపమునికి భార్యలైరి. వారిలో అక్కయైన అదితి భువనపతులైన దేవతలను గనెను. దితియు రాక్షస సమూహములను గనెను. ఓ కీర్తిధనా! పర్వతములు, సముద్రములు, వనములతో గూడిన

భూమి యెల్లను వారలదిగా నుండెను. ఆ వంశమునందు నీవు సాటిలేని విక్రమధనాఢ్యుడవై జనించితివి. ఆ విష్ణువు దైత్యులను జంపి అడ్డులేని విక్రమముతో మూడు లోకములను దేవతా సమూహమునకిచ్చెను. ఆ జ్ఞాతులు తమ్ములు, అన్నలు అని నీతులు చెప్పరుసుమా. నా మాట ప్రకారముగా నడచుకొనుము. అని చెప్పగానే ఆ దశగ్రీవుడు ఆలోచించి సంతుష్టి చెందిన మనస్సుతో సరేయని సాహసమావహింపగా అతనితో గూడ తన వనమునకు వెళ్లి ఆ దినముననే త్రికూట పర్వతము జేరి మాటనేర్పరియగు ప్రహస్తునితో నిట్లనెను. ప్రహస్తా! నీవు ధనపతిని జూడబొమ్ము. అతనితో నా మాటగా నీతియుక్తముగా నిట్లనుము. ఓ రాజేంద్రా! ఈ లంక ఇంతకు పూర్వము పరాక్రమశాలురైన రాక్షసులది గదా. నీ విందు ప్రవేశించుట నీవంటి పుణ్యాత్మునకు అర్హమైన పనిగాదని చెప్పవలెనా? కాన ఈ పట్టణమును వెంటనే తిరిగి నాకిచ్చి వేసితివేని నేను సంతోషించెదను. నీవును ధర్మమును నిల్పినవాడవగుదువు. అని అతనితో చెప్పుమనగా అతడు వెళ్లి గొప్ప ఉదారుడైన కిన్నరరాజును జూచి యిట్లనెను. ఓ రాజా! నీ తమ్ముడైన దశాననుడు నన్ను నీయొద్దకిప్పుడు దూతగా పంపించెను. అతడు చెప్పిన మాటలను వినిపించెదను వినుము. దేవా! పూర్వమీ పురమును గొప్ప శక్తి సంపన్నులై సుమాలి మొదలుగా గల దైత్యముఖ్యులేలిరి. ఇప్పుడు నీ సోదరుడైన దశగ్రీవుడు కీర్తిమంతుడవైన నిన్ను తిరిగి ఈ పురమును తనకీయవేడెను. తండ్రీ! ఇప్పుడు నీవు వారల సొత్తును వారలకిచ్చుట మంచిది గదా

## కుబేరుడు లంక విడచి పోవుటకు సమ్మతించుట:

అనగానే ఆ ధనాధిపతి యిట్లనెను. ప్రహస్తా! పూర్వము రాక్షసులు దీనిని విడచి వెళ్లగా నా జనకుడు నన్నిచట నుండనియమింపగా నేను యక్షులతో గూడియున్నవాడను. ఓ రాక్షసశ్రేష్ఠుడా! నీవు తక్షణమే వెళ్లి దశాననునితో చెప్పుము. నా రాజ్యమును నగరమును విత్తమును హాయిగా ఏలుటకై ఇచ్చటికి రమ్మనుము. పొమ్ము అని అతనిని బంపివేసి, రామచంద్రా! కుబేరుడు తన తండ్రియొద్దకు వెళ్లి పాదములపై వ్రాలి రావణుని యుదంతమును సర్వమును చెప్పెను. తండ్రీ! ఈ లంక పూర్వము వారి వారిదట. తిరిగి దానిని కోరుచున్నాడట. నేనెక్కడికి పోవువాడను. నాకు తగిన నెలవును చెప్పుము. అనగా విశ్రవసుడిట్లనెను. ఈ విషయమును నాయొద్ద ధైర్యముతో అనేక పర్యాయములు వాడు చెప్పెను. నేను చీకొట్టితిని. కాని వాడు మనస్సునందు భయము చెందడు. నా మాటను లెక్కచేయడు. ఇక వాడెట్లును మానడు కాన వానితో ఊరక అల్లరి యేల? వాడు

మహనీయమైన వరగర్వముచే మత్తిల్లి యున్నాడు. తన మనస్సునందు వీరు పెద్దలు చిన్నలు అని ఎఱుగలేకున్నాడు. నిమిత్తములను బట్టి చెప్పిన నా వచనానుసారముగా వానికి మిక్కిలి దారుణమైన స్వభావము కలిగినది. కాన నీకు శ్రేయస్సును గలిగించు విధానమును చెప్పెదను వినుము. పుత్రా! నీవు కైలాసమున కేగి అచ్చట నివాసము నేర్పరచుకొనుము. ఆ లంకను వీడుము. నీ అనుచరులతో గూడి ఆ రమ్యమైన మందాకినీ తీరము నందు నివసింపుము. ఆ జలము సూర్యసదృశములైన వికసించిన పద్మములతో నిండినదై మీకు గొప్పదైన ఆనందమును కలుగజేయును. అచ్చట అప్సరస్త్రీలు దేవతలు గంధర్వులు కిన్నరులు మున్నగువారితో ఎల్లప్పుడును అధికమైన ఆనందముతో స్నేహముతో కలిసి విహరించుచుందురు. ఆ దుష్టరాక్షసునితో నీవు కలహములకు వెళ్లకుము. అతడు బ్రహ్మచే పొందిన వరవిధానము నీకు దెలిసినదే అనగా వినయము గలవాడై అతని యానతి నంది కుబేరుడు భార్యాపుత్రులతోను, మంత్రులతోను, వాహములతోను, ధనములతోను గూడినవాడై ఆ నిమిషము నందే గొప్పదైన కైలాస పర్వతమును జేరి హాయిగా నుండెను.

★★★



# పంద్రెండవ సర్గము

## రావణుడు లంకాప్రవేశము చేయుట:

అంత ప్రహస్తుడు వెళ్లి దశానునుని జూచి ఇట్లు చెప్పెను. రావణా! ఆ ధనాధిపతి వచ్చిన దారినే లంకను వీడి వెళ్లినాడు. ఇంక ఏ చింతయు లేదు. పట్టణము చేరి రాక్షస సమూహము పాలిటి కధిపతివై స్వధర్మమును రక్షింపుము అని పల్కగా పంక్తికంఠుడు సోదరులతో గూడి శూన్యముగా నున్న లంకానగరమును అమందానందముతో ఇంద్రుడు అమరావతిని వలె ప్రవేశించెను. ఇట్లు లంకలో ప్రవేశించి సంతోషముతో నుండుచు, దానవరాజ్యమునకు పట్టాభిషేకమును పొంది ఘనత గాంచి, కోరికలన్నియు తీరినవాడై తనకెదురు బెదురు లేకయుండెను. తరువాత తన ప్రియసోదరి యైన శూర్పణఖకు తగిన వరునికై వెదకి కాలకాపుత్రుడైన విద్యుజ్జిహ్వుడను రాక్షసునకిచ్చి పెండ్లి గావించెను.

## రావణునకు మయుడు మండోదరీ వృత్తాంతము చెప్పుట

అటు తరువాత నొక్కనాడు దశవదనుడు వేట యందభిలాషగలవాడై సంచరించుచు ఒకచోట సుకుమారి యైన ఒక కన్యకను వెంటగొని త్రోవను వచ్చుచున్న మయుని జూచి వెంటనే అతని యొద్దకు వెళ్లి యిట్లు పల్కెను. అయ్యా! నిర్మానుష్యమైన ఈ వనమందు సంచరించుచున్న మీరలెవ్వరు? లేడికన్నులవంటి కన్నులు గలిగిన ఈ బాలికతో మీరేమి నిమిత్తముగా తిరుగుచున్నారు? చెప్పుడనగా ఆ మయుడు రావణునితో జరిగిన వృత్తాంతమును ఆదరముతో ఈ విధముగా చెప్పెను. నాయనా! నీవు హేమయను స్త్రీపేరు వినియుందువుగదా. శచీదేవి నింద్రుని కిచ్చినట్లు లాస్త్రీని దేవతలు నాకు భార్యగా నిచ్చిరి. నేనును దాని గూడి సుఖములనుభవించుచు ఇన్ని వందల సంవత్సరములు వీడకుంటిని. తరువాత దేవతల ఆజ్ఞతో ఆహేమ నన్ను విడచి వెళ్లి పదునాలుగేండ్లయినది. నేనా స్త్రీ నిమిత్తమై బంగారముతో పట్టణమును నిర్మించి అందామెతో గలిసియుంటిని. ఇప్పుడామె లేకపోవుటచే తను విరహాగ్నిచే తపించి పోవుచున్నవాడనగుట చేతను అందుండుటకు నాకు మనస్సు వచ్చుటలేదు. కాన ఆ పురమును విడచి హేమపుత్రిక యైన ఈ నా

కుమార్తెను ఈ బాలికను తీసికొని యిట్లు భూమియంతయును సంచరించుచున్నాను. ఎచ్చటనైనను దీనికి తగిన వరుడు లభించునా యని తిరుగుచుంటిని. కన్యకు తండ్రిగా నుండుట అభిమానవంతులకు మిక్కిలి దుఃఖకరము. కన్యక శీలము గల దౌనా యను శంకచే రెండు కులములను దైన్యమున ముంచును. ఆ దేవతా సుందరియందు నాకిద్దఱు పుత్రులు గలరు. పెద్దవాడు మాయావియను పేరు గలవాడు. రెండవవాడు శ్రేష్ఠమైన బలము గలవాడు జగత్తునందు దుందుభియను పేరు గలవాడు. నా చరిత్రను చెప్పితిని కాన ఇంక నీ కథను తెలియజేయవయ్యా! నీవెవ్వడవో వినగోరుచున్నాను. అనగానే ఆ కైకసి పుత్రుడు వినయముతో నిట్లనెను. నేను పులస్త్యుని మనుమడను. బ్రహ్మకు మూడవవాడైన విశ్రవసుని పుత్రుడను. పంక్తి కంఠుడను పేరు గలవాడను అని చెప్పగా విని అతనిని మునిశ్రేష్ఠుని పుత్రుడని మయుడు తెలిసికొని సంతోషముతో తన పుత్రిక నతని భార్యగా దానము చేయ తలంచినవాడై

## మయుడు రావణునకు మండోదరినిచ్చి వివాహము చేయుట:

ఆదరముతో రావణుని చేతిని తన చేతితో పట్టుకొని యిట్లు చెప్పెను. అసురోత్తమా! ఇది దేవకాంతయైన హేమకు జన్మించిన నా పుత్రికయై మండోదరి యను పేరు గల కన్య. దీనిని నీకు భార్యగా నొసంగెదను. సంతోషముతో స్వీకరింపుము అని చెప్పగా సమ్మతించి రావణుడట్లే యని పల్కగా పితామహుని వంశము వాడనియును ప్రఖ్యాతుడైన ముని యొక్క శాపవిధానమును ఎఱిగియుండుట చేతను [తానుగా నీయకున్నను రావణుడు క్రూరుడు బలవంతుడు నగుటచే బలాత్కారముగా నైనను అత్యంత సుందరియైన మండోదరిని గ్రహించునని యెఱిగి మయుడిచ్చెనని భావము] ఆ కన్యను మయుడియ్యగా రావణుడగ్ని సాక్షిగా ఆ కన్యను భార్యగా స్వీకరించెను. శ్రేష్ఠమైనదియు, తపస్సుచే లభించినదియు, గొప్ప ఆశ్చర్యకరమైనదియు, వ్యర్థము కానట్టిదియు అయిన శక్తిని మయుడల్లునకిచ్చెను. ఆ రాక్షసుడు దాని చేతనే మన లక్ష్మణుని నొప్పించెను.

## రావణుడు తన సోదరులకు వివాహము చేయుట:

అట్లు భార్యాసహితుడై లంకాపురమును ప్రవేశించినవాడై కుంభకర్ణునకు వైరోచమని పుత్రిక యొక్క పుత్రికయైన పద్మము వంటి ముఖము గల వజ్రజ్వాలయను ఒక్కప్రేయసిని కూర్చి విభీషణునకు గంధర్వరాజైన శైలూషుని పుత్రికను సరమయను

ఉత్తమ ధర్మజ్ఞురాలిని పెండ్లి చేసెను. ఆమె చిన్నతనము నందు మానస సరోవరము చెంత సంచరించుచుండగా వానలచే ఆ కొలను పొంగగా భయము చెందినదై రామచంద్రా! ఆమె తల్లి ప్రేమాతిశయముచే ఇట్లరచెను. 'సరో మా వర్ధయ' అని ఆ తల్లి పల్కుటచే ఆ కాంతకు భూమియందు సరమయను పేరు ముద్దుపేరుగా నిలిచిపోయెను. ఇట్లు వివాహమాడి వీరవరులైన ఆ దశకంఠాదులు, గంధర్వులు నందనవనమున విహరించినట్లు ఆ భార్యలతో విహరించుచుండగా కొంతకాలమునకు రావణుని భార్యయగు మండోదరి ఒక్కపుత్రుని గనెను. అతడు భూమిమీద పడగానే మేఘగర్జతో ధ్వనిచేయగా, ఆ ధ్వనిచే లంకాపట్టణమంతయు నిశ్చేష్టము కాగా రావణుడానందము నంది చాల ఆసక్తితో ఆ తనయుని మేఘనాథుడని పిలిచెను. మీరింద్రజిత్తుడను పేరుతో పిలుచువాడు వాడే. అతడు రాక్షస స్త్రీలచే రక్షింపబడుచు సమిధలచే రక్షింపబడు అగ్నివలె పెరుగుచుండెను.

★★★



# పదమూడవ సర్గము

## రావణుడు లోకములను బాధించుట:

బ్రహ్మచే ప్రేరేపింపబడినదై నిద్ర ఆపుటకు శక్యముగాకుండగా తన నాక్రమింపగా కుంభకర్ణుడన్నను సేవింపవెళ్లి నిద్ర ఆవహించినది తగిన యొక శాలను కట్టింపు మనగా రావణుడు పనివాండ్రను నియమింపగా వారలు వేగముగా సాటిలేని పని తనముతో ఒక యోజనము వెడల్పును, రెండు యోజనములు పొడవును గలదై స్ఫటికపు బంగారపు స్తంభములును, చిరుగంటల కిటికీలును, దంత నిర్మితములైన అందమైన తోరణములను స్ఫటికపు వేదికలును వైడూర్యపు సోపానములును గలిగి సుందరముగా నుండు విధముగా విశ్వకర్మ నిర్మించిన విధముగా మేరు పర్వత గుహవలె గట్టిదిగా నిర్మించిరి. అందు కుంభకర్ణుడు తనను నిద్రముంచి వేయగా చాలా యేండ్లు నిద్రించుచుండెను. ఆ దశకంఠుడు దేవతలను, యక్షులను, ఋషులను నిరంకుశుడై పట్టి క్రూరముగా వధించుచుండెను. ఆ రావణుడు తోటలను చూచినచో పెనుగాలి వలె విజృంభించి ఆ చెట్లను అల్లలనాడించును. ఏరులను జూచినచో ఏనుగు వలె అందు ప్రవేశించి దాని అందము నశించునట్లు కలచివేయును. కొండలను జూచినచో తీవ్రమైన వజ్రాయుధము వలె పిండిపిండిగా జేసి నేల బడవైచును. నందనోద్యానపు టందమును జూచినచో ఆధిక్యముతో విజృంభించి నాశనము చేయును. దేవతలను పట్టును. గంధర్వులను కొట్టును. సిద్ధులను గట్టును. స్త్రీలను చెఱబట్టును. సాధువులను గూలద్రోయును. కిన్నర సమూహములను మొట్టును. ఈ విధముగా కైకసి పుత్రుడు చెలరేగి ప్రవర్తించుచుండెను.

## కుబేరుడు రావణునకు నీతి దెలుప దూతనంపుట:

ఆ రావణుని దుష్టచేష్టలన్నిటిని కుబేరుడెరింగి తమ్ముడను ప్రీతితోను, తన వంశము యొక్క మంచి నడవడిని, ధర్మమును తలంచి లంకకు దూతను బంపెను. వాడును వేగముగా వెళ్లి ముందుగా ప్రఖ్యాతి చెందిన కీర్తి గల విభీషణుని దర్శించి అతడు ప్రశ్నింపగా

తాను వచ్చుటకు కారణమును వివరించెను. అది విని అతడు సభయందాసీనుడై యున్న రావణుని జూపింపగా దూత వియనముతో జయము పలికి రాక్షసరాజుతో నిట్లనెను. రాజా! యక్షవిభుడైన మీ అన్న ప్రేమతో నన్ను దూతగా ఇచ్చటికి బంపించెను. కులమును మీ తల్లిదండ్రుల గుణమును తలచి మీతో కొన్ని మాటలను చెప్పుమనెను. వానిని వినుము. పూర్వము ఏమేమియో చేసితివి అవి చాలును. ఇంక అట్లు చేయకుము. చేయుటకు శక్యమైనచో రాక్షసులకు శుభము కలుగువిధముగా ధర్మపద్ధతిగా నడువుము. బహుకాలము నుండి వృద్ధి నందిన నందన వనము నీవు పాడుచేయుటను జూచితిని. ముని సంఘములను బాధలు పెట్టితివని వింటిని. దేవతాశ్రేష్ఠులు నీ కొంటె తనముల నాపు కుతూహలముతో నున్నారని వింటిని తమ్ముడా! నీకీ విధముగా జగములను బాధించు తలంపు తగునా? నన్ను చాలా పర్యాయములు చాలా తేలికగా జూచితివి. దానిని సహించితిని సుమా. బాలుడు దుడుకువాడైనచో అతని బంధువర్గములకు వానిని నిగ్రహించి కాపాడుట ధర్మము గదా! మేరు పర్వతము సమీపమునకు ఘోరమైన తపము చేయవెళ్లియుంటిని. అందు పార్వతీ సహితుడైన శంకరుని జూచితిని. గొప్ప తేజస్సుతో గూడిన శరీరముతో నున్న పర్వతరాజపుత్రికను చూడగానే ఆమె కోపకారణమున నా యెడమ కన్ను దగ్ధమయ్యెను. ఆ కన్ను ధూళిచే కలుషితమైన జ్యోతివలె నుండగా ఆ పర్వతము నందింకొక శిఖరమున కేగి నూట యెనిమిది సంవత్సరములు శ్రీమహేశ్వరుని గూర్చి తీవ్రమైన వ్రతమును ఆచరించితిని. వ్రతము పూర్తికాగానే శంకరుడు వచ్చి కరుణ గలిగిన కన్నులతో నన్ను జూచుచు ఇట్లు పల్కెను. ఓ అనఘా! ఈ వ్రతము నిది వఱకు నేనొక్కడనే చేసియుంటిని. ఇప్పుడు నీవు చేసితివి. మనమే చేసినవారలము. ఇతరులెవ్వరును చేయలేదు. ఈ వ్రతమును పూర్వము నేనే సృష్టించితిని. నీ ఒకకన్ను దేవిచేత పింగళత్వము (పచ్చదనము)ను పొందుటచే ఏక పింగళుడను పేర ప్రఖ్యాతి గాంచుము. నీ తపోనిష్ఠ చేత నేను జయింపబడితిని. మన్నింపదగినవాడా! నా స్నేహమును కోరుకొనుము అని నన్ను కరుణించి వెళ్లుటకు అనుజ్ఞ నిచ్చెను. ఆ శంకరు నాజ్ఞ పొంది నా నివాసమునకు వచ్చి నీ అధికమైన పాపకృత్యములను వింటిని. కులోచితమైన ధర్మ మార్గమును దప్పుట నీతియా? లోకములలో నింద పడుట మేలా? దేవతాసంఘములు నిన్ను సంహరింప తగిన యుపాయములను వెదకుచున్న వారు అని చెప్పగా

**రావణుడు కుబేరుని దూతను వధించుట:**

కోపాధిక్యముచే చెక్కిళ్లదరుచుండగా, ఎఱ్ఱవైన కన్నులు గలవాడై రావణుడు ధనపతి దూత ముఖమును జూచి యిట్లు పలికెను. ఓరీ! నీ మాటలందలి భావము తెలియవచ్చుచున్నది లేరా! ఖలధూర్తుడా! నీవు దూతవు గావు, నిన్ను పంపినవాడును నన్ను సహోదరుడని తలంపడు. ఇది నిజము. ఇక నీవు ప్రేలుచున్న మాటలు నీతులు గావు. మూఢుడా! ఆ శంకరుని స్నేహము కల్గెనని తన ఖ్యాతిని చాటుకొనుటకై ఇచటకు నిన్ను పంపించెను. తాను పెద్దవాడు గురుడు గదా యని ఇంతవఱకు అతనిని పీడింపరాదని తలచియుంటిని. ఓరీ! ఇంక సహించి యూరకుండుట తగదు. వీని కారణముగా ఇప్పుడే దిక్పతులను నలుగురను త్రుంచెదను. పొగడబడిన నా బాహుబల సంపదచే మూడు లోకములను గెలిచెదను. గండడనై దేవతా సంఘములను కలంచెదను. అని పలికి రాక్షసరాజు క్రూరుడై అతివేగముతో వాని శిరమును ఖండించి దానిని చెంతనున్న రాక్షసుల గుంపునకు భక్ష్యముగా నొసంగెను. అప్పుడే తొందరగా స్వస్త్యయనమును గావించి లేచి దిక్పాలకులను ముప్పున ముంచ దలంచుచు రావణుడు ఉత్తర దిశాభిముఖముగా బయలు దేరెను.

★★★



# పదునాలుగవ సర్గము

## రావణుడు కుబేరుని జయింపబోవుట:

ఆ విధముగా ధనదుని గెలువదలచి రథము నెక్కి ధూమ్రాక్షుడు, సారణుడు, శుకుడు, మహోదరుడు, శూరవర్యులైన ప్రహస్తుడు, మారీచుడు తన వెంట రాగా జగములను తగులబెట్టు క్రోధముతోను, యుద్ధకాంక్షతోను, పురములు, పర్వతములు, వనములు, నదులు, వేగముగా దాటి ఒక క్షణములోననే కైలాస పర్వతమును జేరగా యక్షులతనిని జూచి యక్షరాజు తమ్ముడు గదా యని తలపడ మనస్సులు రాక చక్కగా వెళ్లి ఈశ్వర స్నేహితుడైన కుబేరునకు తెలిపి అతని ఆజ్ఞను పొంది తిరిగివచ్చి కైలాస పర్వతమును చలింప జేయుచు మీదకు వచ్చుచున్న రాక్షససైన్యమును తాకగా రాక్షస యక్షసైన్యములకు భయంకరమైన యుద్ధము జరిగెను. యక్షుల ధాటికి తాళజాలక పారిపోవుచున్న సైన్యమును జూచి దశాననుడు అహంకారముతో గూడిన హుంకారముతో దాని నెదిరించెను.

## యక్షరాక్షస యుద్ధము:

వెంటనే వాని మంత్రులును సహాయపడిరి. రెండు సైన్యములును వేయికి వేయి సమానముగా వీడని రోషములతో తాకగా యక్షవీరులు కేకలు వేయుచు తాకి అరచుచు శక్తి, ఖడ్గము, గదలతో కొట్టుచుండగా వానధారలచే తడుపబడుచున్న పర్వతము వలె ధైర్యముతో కలత చెందక రావణుడు ప్రళయకాలయముని చేతి దండము వంటి పెద్ద గదమును బలముతో త్రిప్పుచు శత్రు సైన్యమునందు ప్రవేశించి కుప్పలు కుప్పలుగా యక్షులను సంహరించి వాయుసఖుడగు అగ్ని యెండు గడ్డిని కట్టెలను తగులబెట్టు విధముగా విరోధుల సైన్యములను ఒక్క త్రుటిలో సంహరించెను. ప్రఖ్యాతి గలిగిన శౌర్యము గల శుకుడు, మహోదరులను మంత్రులు వెంటబడి తరుమగా యక్షసేనాపతులందఱును గాలికి చెదరు మబ్బులవలె కొందఱు పారిపోయిరి. ఆ యుద్ధభూమియందు కొందఱు చచ్చిరి. కోపముతో పెదవులు గొరుకుచు గుంపులు గూడుచు విరిగిన అస్త్రశస్త్రములతో ఒకరినొకరు గ్రుచ్చుకొనుచు పొంగిన నది కోతచే ఒడ్డువలె యక్షులు నిలిగిరి.

భూమియందు యుద్ధము నందు చచ్చి స్వర్గము నకు వెళ్లుచున్న వారి అలజడిచే ఆకాశము నుండి చూచుచున్న ఋషి సమూహములకు నిలుచుటకు స్థలము కలుగదయ్యెను. ఇట్లు చెల్లాచెదరైన సేనలను జూచి అధికమైన కోపముతో యక్షరాజైన కుబేరుడు పంపగా వచ్చి సంయోధకంటకుడను నొక యక్షుడు రాక్షసులను బాణములచే నొప్పించెను. హెచ్చిన శౌర్యముతోను దర్పముతోను ఎచ్చట జూచినను తానే యయి వచ్చుచున్న అతనిని మారీచుడెదిరించెను. అతడట్లెదిరింపగా రేగి ఆ యక్షుడు సుదర్శన సమానమైన చక్రముతో మారీచుని నిశ్చేష్టుని జేసి నేలబడజేయగా వాడును తిరిగి లేచి అధికమైన బలముతో అతనిని అవలీలగా పారద్రోలెను. అట్లు పారిపోవుచున్న వానిని జూచి యుద్ధము నందు జయింపరాని వాడగు దశవదనుడు మహాసంతోషముతో బంగారు రత్నములతో నున్న ద్వారమును ప్రవేశించెను. వానిని బలవంతుడైన సూర్యభగవానుడనువాడు ఎదిరించి అడ్డుకొని స్థిరుడై నిల్చి ఒక స్తంభముతో వేగముగా ఆ దేవతా విరోధి తలమీద మోదెను. ఆ తోరణస్తంభవు దెబ్బచే కొండ ధాతువులను గ్రక్కిన విధముగా రావణుడు రక్తమును గ్రక్కెను. వరబలముచే ఏ బాధయు లేక ఆ స్తంభముతోనే వానిని రాక్షస రాజు కొట్టెను. యక్షుడా దెబ్బచే ఆ క్షణముననే భస్మమై నశించెను. భయముచే పక్షులవలె తక్కిన యక్షులు నదులందు గుహలయందు దూరిరి.

★★★



# పదునైదవ సర్గము

## కుబేరుడు మాణిభద్రుని యుద్ధమునకు బంపుట:

ఇట్లు చెదరిన సైన్యమును జూచి కుబేరుడు మాణిభద్రునితో నిట్లనెను. పాపాత్ముడైన దశకంఠుని సంహరించుటకు వెడలుము. యక్షులకు సహాయుడవుకమ్ము. అనగా వాడు వల్లెయని నాలుగువేల శూర యక్షులు వెంటరాగా చాలా వేగముగా వెళ్లి తీవ్రములైన గదలు, ముసలములు, శక్తులు మొదలగు ఆయుధములతో బలమొప్ప రాక్షసులను నొప్పించి వారు భయముతో నిశ్చేష్టులగునట్లు డేగవలె యుద్ధరంగమున లాఘవముతో విహరించెను. దేవతలు, ఋషులు మెచ్చునట్లు యుద్ధము చేసెను. ఆ యక్షులలో ఒక వేయిమందిని ప్రహస్తుడు సంహరించెను. మహోదరుడును శ్రేష్ఠులైన యక్షులను వేయి మందిని జంపెను. ఉగ్రమూర్తియైన తాటకపుత్రుడగు మారీచుడు రేపబడిన కోపవేగముతో రెండువేల యక్షులను నేలగూల్చెను. ధూమ్రాక్షుడు మాణిభద్రుని యెదపై ఒక రోకటిచే గట్టిగా బొడిచెను. ధర్మమార్గమున బోరాడు ఆ యక్షులసైన్యము లెక్కడ? మాయావిద్యచే గర్వించు రాక్షసులెక్కడ? ఆ కారణముననే సుమా ఆ రాక్షసులధికమగుట. ఆ ముసలపు దెబ్బచే మాణిభద్రుడించుకైనను జంకక అతిశయించిన కోపముతో వేగముగా ధూమ్రాక్షుని గదచేత తన కసి తీరునట్లు నెత్తురు గ్రక్కునటులు మోదెను. అట్లు దెబ్బతిని పడిన మంత్రిని జూచి రావణుడు క్రోధము నంది వేగముగా మాణిభద్రుని మీదకు వచ్చెను. వచ్చుచున్న రావణుని జూచి బలమైన మూడు శక్తులచే వేయగా అతడును ఒప్పుచున్న గదతో శత్రువు న్యూనత నొందునట్లు అతని కిరీటముపై గొట్టెను. ఆ దెబ్బచే ఆ మహాయక్షుని కిరీటమొక ప్రక్క కొరగెను. కాని ఆతడు భయపడడయ్యెను. ఆ కారణముచే ఆ గొప్ప బలవంతుడు పార్శ్వమౌళి యని ప్రఖ్యాతి గాంచెను.

## కుబేరుడు రావణుని నిష్ఠురములాడుట:

అంత ధనాధిపతి దూరమున నుండి ఆ రాక్షస నాథుని బలమును జూచి అతివేగముగా పద్మము శంఖము అను నిధులతో గూడినవాడై తనకు హితుడయిన

శుక్రుడను మంత్రితో గలిసి ఆ రాక్షసుని సమీపించి మర్యాద నెరుంగని వాడును, వర గర్వముచే క్రొవ్వి కన్నుగానని వాడును, మహాఘోరచరిత్ర గలవాడును అయిన అతనిని జూచి ఈ విధముగా పలికెను. రావణా! కీడు చేయుపనులను చేయవలదని సోదరుడవని బుద్ధి చెప్పినను వినవైతివి. ఇది యుక్తము, ఇది అయుక్తము అని తలంచనేరవుగదా. దీని ఫలితము దుర్గతిని పొందు సమయమున తెలియగలవు. ఆహా! ఘోరమైన పాపమును చేసితినే! పుణ్యమును చేయనైతినే! యని విచారించెదవు సుమా. విమర్శించి చూడగా ముందు చూపులేక గరళమును ద్రావినవాడు పరిణామవేళ అది జీవస్థానములను క్రూరముగా కోయుచుండగా కర్మఫలమును తలచుకొనును. ఏదో కొద్దిపాటి ధర్మమును చేసినట్టి నిన్ను జూచి సంతసించుచున్న దేవతలు, ఇట్టి క్రూరమైన బుద్ధితో దుష్టకార్యములు చేయుచున్న కారణమున అసహ్యపడెదరు. ఓ దుర్మతీ! తల్లిదండ్రులను, ఆచార్యులను అవమానించువాడు యమునకు జిక్కి నరక యాతనల ననుభవించు సమయమున తన దుష్కృత్యములను తలచి దుఃఖము నందును, శరీరమశాశ్వతము. భూమియందు జీవించియున్న సమయముననే తపస్సు చేయక మానినచో తన గతికి వెళ్లిన తరువతా మానవుడు తన మదిలో పరితాపము నొంది విచారించును. ధర్మము వలన రాజ్యము ధనము సౌఖ్యము, అధర్మము వలన సంతాపమును కలుగును. కనుక బుద్ధిమంతుడు సౌఖ్యము నందుటకొఱకు దుష్కర్మములను వదలి ధర్మము చేయవలయును. పాపము చేసినచో దానికి ఫలితము దుఃఖమే యగును. దానినిచ్చుటనే మానవుడనుభవించును. అట్లు గాన మూఢుడు తన వినాశనము నకే పాపసమూహము నాచరించుచుండును. గురువులను పూజింపకయే దుష్టునకైనను మంచిబుద్ధి కలుగబోదు. ఓ రాక్షసరాజా! ఎట్టి కర్మమును జేయునో అట్టి ఫలమునే అనుభవించును. పుణ్యకర్మల నాచరించిన పురుషులకు వారి బుద్ధికి తగిన ఫలములే సంభవించును. ఓ బుద్ధిహీనుడా! శౌర్యముగాని, పుత్రులు గాని ధైర్యముగాని తన బుద్ధి ననుసరించియే యుండును సుమా. పాపాత్ముడవై నరకము నాచరించు పనులను చేయుచున్నవాడవగుటచే ఛీ నీతో మాటాడుటయు తగదు. సుజనుడెప్పుడును నియమముతో పాపులతో మాటాడకుండును.

### రావణ కుబేరుల యుద్ధము:

అని పల్కుచు మారీచాది రాక్షసులు తనను సమీపింపగా యక్షరాజు ఆ రాక్షసులను గొప్పవైన బాణపరంపరలచే వారిని నొప్పించి తొలగజేసి రాక్షసరాజును తనచేతనున్న

గదతో శిరస్సుపై మోదెను. ఆ రాక్షసుడు కొంచెమైనను చలింపక ధైర్యముతో నిలిచెను. శ్రమయనునది లేక రాక్షసేశ్వరుడును, యక్షాధీశ్వరుడును లోకసామాన్యము గాని యుద్ధ పరాక్రమమును జూపుచు రోషముతో ప్రజ్వలించుచు యుద్ధోత్సాహముతో అన్యోన్యము నొప్పింపగా, అంత యక్షరాజు ఆగ్నేయాస్త్రము నేయగా దైత్యరాజు పర్జన్యాస్త్రముచే దాని నార్పెను. శత్రు సంహారము చేయుటకై మాయతో అతడు పులులు గాను, వృక్షములు గాను, అడవిపందులు గాను, కొండలు గాను, మేఘములు గాను, సముద్రములు గాను, యక్షులవలెను రాక్షసులవలెను అనేక విధములైన రూపములను వందలు వేలుగా ధరించెను. అతని మాయా రూపములను బాణవర్షమును యక్షరాజు చూచెనే గాని ఆ రాక్షసాధముని చూడలేడయ్యెను.

## రావణుడు కుబేరుని జయించి పుష్పకము గొనుట:

అంత రావణుడు ఒక మహాస్త్రముతో కుబేరుని నపరిమితమైన వేగముతో గొట్టగా అతడు శరీరము రక్తసిక్తము కాగా మొదలు నరికిన అశోకవృక్షమా అనునట్లు మూర్ఛితుడై నైల వ్రాలెను. పద్మము మొదలుగా గల నవనిధులు సమీపించి సేదదీర్చుచు ఆ ధనాధిపతిని నందనవనమునకు తీసికొని పోగా ఆనందించినవాడై రావణుడు ధనదుని నగరిలోనికి పోయి అందు అందముగా నున్న పుష్పకవిమానమును జయ చిహ్నముగా మదించినవాడై తీసికొనెను. పుటము పెట్టబడిన బంగారు స్తంభములు గలదై, వైడూర్య తోరణములతో ప్రకాశించునదై, మంచిముత్యముల దండలతో అలంకరింపబడినదై, కోరికలనిచ్చు కల్పవృక్షములు గలదై, కామరూపమై, కామవేగమై, కామగమనమై, ఆకాశగామియై బంగారము మణులతో చేయబడిన సోపానములు గలదై మేలిమి బంగారు అరుగులు గలదై దేవతలచే అధిష్ఠింపదగినదై, క్రొత్త క్రొత్త యందములు గలదై, చూపులకు హృదయమునకు సుఖకరమై, దివ్యమై, అన్ని ఋతువులయందును సుఖము నిచ్చునదై, వేడిమి గాని చలిగాని లేనిదై బ్రహ్మచే నిర్మింపబడినదైన ఆ విమానమును పరాక్రమముతో ఆ దురాత్ముడు దక్కించుకొని జగములనన్నింటిని పడగొట్టినట్లు పొంగుచు తన సేనలతో గూడినవాడై వేగముగా వెండి కొండ దిగెను.

★★★

# పదునాఱవ సర్గము

## కైలాస ప్రాంతమున పుష్పకము నడవకుండుట:

అట్లు సేనలతో విమానముపై నెక్కి రావణుడు కుమారస్వామి జన్మ స్థానమగు శరవణము గల ప్రదేశమును, బంగారుమయమై సూర్యుని వలె వెలుగుచున్న పర్వతశ్రేష్ఠమును దాటి వెళ్లు చుండగా ఒకచోట ఒక అందమైన ఆరామమును చూచెను. అచ్చట ఆ యక్షరాజు విమానము కదలక నిలిచిపోగా రావణుడు తన మంత్రులను చేరబిల్చి ఈ పుష్పకము ఇష్టము వచ్చిన విధముగా వెళ్లునదే కదా. దీని నీవిధముగా ఎందులకు ఎవ్వడు స్తంభింపచేసెనో అని అడుగగా బుద్ధిశక్తి గల మారీచుడు ఇది నిష్కారణముగా నిలువదు. దీనికేదియో కారణముండియుండును. లేక ఆ కిన్నరరాజునే గాని యన్యులను మోయదేమొ అని యిట్లు యోచించుచున్న సమయమున నల్లని యెఱ్ఱని శరీరము గలిగి బోడి తలతో వికారముగా నున్నవాడు, కురుచ చేతులవాడు పొట్టివాడు, బలవంతుడు మిట్టపండ్లవాడు అయిన ఈశ్వరసేవకుడగు నందీశ్వరుడు రావణాసురుని సమీపించి మనస్సునందే మాత్రము భయము లేక నిలిచి రాక్షస సమూహము వినుచుండగా గంభీరమైన వాక్కులతో వానిచో నిట్లనెను. దశకంఠా! తిరిగి వెళ్లుము. ఈ దిక్కుగా రాకుము. శంకరుడును పార్వతీదేవియు క్రీడించుచున్నారు. దేవతలకు, నాగులకు, యక్షులకు గూడ ఇటు వెళ్లుటకు శక్యము గాదు అని పలుకగా కదలుచున్న కుండలములు గలవాడై రావణుడు రోషముతో ఎవడురా ఆ శంకరుడు? అని పుష్పకము దిగి ఆ పర్వతము మొదటికి వెళ్లి అచ్చట రెండవ శంకరుడో యనునట్లు ప్రకాశించు శూలమును చేబూని ప్రకాశించుచున్న కోతిముఖము గల నందిని జూచి ఆ రాక్షసుడు మేఘము గర్జించి నట్లు తిరస్కారముతో పకపకమని నవ్వగా ఆ భద్రుడిట్లనెను.

## నందీశ్వరుడు రావణుని శపించుట:

ఓరీ! కోతి ముఖము గలవాడనని అవమానము కలుగునట్లు నవ్వదగునా? నీతో వాదమేలరా? వినుము. యుద్ధము నందు నేర్పుగలవారును, నాతో సమానమైన బలము

ఆకారము గలవారును, కఠినమైన శరీరములు గలవారును, పర్వత సమానులును అగువారు పుత్రులు మిత్రులు సేవకులు మొదలైన నీ బలములను యుద్ధరంగమున చంపగలవారు ఈ భూమి యందు జన్మించెదరు. ఓరీ! మందుడా! నిన్నిప్పుడే చంపుటకు శక్తి గలవాడనైనను నీవు నిందలతో ఇదివఱకే చచ్చియున్నవాడవు. ముందే చచ్చిన వానిని చంపదగునా? అని పలుకుచున్న నందీశ్వరునిపైన ఆకాశమార్గమునుండి పుష్పవర్షము గురిసెను. గొప్పనైన దేవదుందుభుల మ్రోత విననయ్యెను. దశకంఠుడు దానిని లెక్కచేయక మదముతో ఓ బసవడా! చూడుము నా విమాన గమనమును భంగము చేసిన ఆ రుద్రుని శక్తినశించునట్లు వేగముగా ఈ పర్వతమును బట్టి మొదలంటగా బెకలించెదను. ఏ బలముతో శివుడు తనకాసన్నమైన భీతిని తలంపక ఎప్పుడును నందనవనమున రాజు వలె క్రీడించుచున్నాడు.

## రావణుడు కైలాసమును పెల్లగించుట:

ఆ మహిమ యేమియో చూచెదను గాక అని రావణుడా పర్వతమును చేతులతో బెఱికి ఆడించగా ఆ పర్వతము మొదలునుండి శిఖరము వఱకు అల్లలనాడెను. ఆశ్చర్యకరముగా అతడా కొండను బలముతో ఊచగా అందున్న ప్రమథగణములు వణకెను. అధికమైన వణకుతో పర్వతపుత్రి శంకరుని కౌగలించెను. అంత ఆ శివుడు తన పాదపు బొటనవ్రేలితో అదుమగా ఆ పర్వతము మొదటి వలె నుండెను. ఆ గిరి క్రింద చేతులిరికికొన్న రావణుడు పెద్దగా బాధ కలుగుటచే జాలి పుట్టునట్లు బిగ్గరగా వాపోయెను. ఆ ధ్వనిని విని మూడు లోకములను అదరెను. సర్వసముద్రములు క్షోభించెను. పర్వతములు కదలిపోయెను. దేవతలు, యక్షసంఘములును దిగులుతో బెదరిరి. ఇదేమియని ఇంద్రునితో గూడ దేవతలు తమ స్థానములనుండి తొలగిరి. అతని మంత్రులు ప్రళయకాలమున పడు పిడుగుల ధ్వనియేమో యని భ్రమించి భయపడిరి. రావణుడిట్లేడ్చుచుండగా అతని మంత్రలందఱును వాక్కుల యందు వినయము ప్రకటమగుచుండగా రాజా! నీ వాహరుని, భర్గుని, ఉమేశుని, మహాదేవుని వేడికొనుము. అతడే దిక్కయి ఈ చిక్కునణంచును అని చెప్పగా రావణుడట్లే ఆ కృపాళుడును భక్తపాలుడును అయిన గౌరీపతిని నుతించెను.

## శివుడు రావణునకు వరములిచ్చుట:

ఈ విధముగా దశవదనుడు ఒక వేయి సంవత్సరము లేద్వగా ఆ కైలాసాధిపతి యయిన శంకరుడు ఆ రాక్షసుని చేతులూడివచ్చునట్లు చేసి ప్రేమరసము కనిపింపజేయుచు రాక్షసశ్రేష్ఠా నీయొక్క ధైర్యాతిశయమునకు పరాక్రమమునకు పూర్ణమైన ముదము నందితిని. పర్వతముచే ఆక్రమింపబడినవాడవై నీవీవిధముగా సర్వజగములను కల్లోలమగునట్లు చేయుటచే నీకు రావణుడను పేరు కలుగునట్లు చేసెదను. ఇక నుండి దేవతలు,నదులు,యక్షులు భూమియందు గల భూతజాలములన్నియు జగతీరావణుడవగు నిన్ను ఓ రాక్షసరాజా! రావణుడని పిలిచెదరు గాక. ఇక ఎక్కడకు వెళ్లెదవో యధేచ్ఛగా నిశ్శంకముగా వెళ్లుము అని పల్కగా ఆ రాక్షసరాజు సంతోషముతో ఆ త్రిశూల ధారియగు శంకరునితో ఓ ఆర్తశరణ్యా! నీవు నాయెడల ప్రీతుడవైనచో నేనొక్కటివేడెదను దయతో నిమ్ము. బ్రహ్మదేవతలు, నాగులు, దానవులు, గుహ్యకులు, యక్షుల రాక్షసులు మొదలైన వారలచేత చావు లేకుండ వరమిచ్చెను. నేను యుద్ధమున అల్పులైన మనుష్యులను లెక్కచేయను. ఇంకను ఆ విధాత దీర్ఘాయువును ఇచ్చెను. ఆ బ్రహ్మ యిచ్చిన ఆయువు కొంత నశించినది కాన నీవు దానిని తిరిగి పొందునట్లు ఘటింపుము. గొప్పనైన దయతో నీ మహనీయ శస్త్రమును గిరిశా! నాకు దయచేయుము అని అడుగగా ఆ దేవశ్రేష్ఠుడు నూర్గురు సూర్యులవలె ప్రకాశించు చంద్రహాసము నిచ్చెను. ఈ విధముగా తన ఖడ్గము నిచ్చి గడచిన ఆయువును పూర్తిగా నిండించి ఆ శివుడు రాక్షసునితో నిట్లనెను. రావణా! నీవు నాయీ శస్త్రమును స్థిరమైన భక్తితో యధావిధిగా పూజలను చేయక కుటిలత్వముతో అనాదరము చేసినచో నది శీఘ్రముగా మమ్ము చేరును. ఇది నిజము సుమా! పొమ్ము అని చెప్పగా శివునిచే ఈ విధముగా పేరును పొంది ఆ దురాత్ముడు శౌర్యవంతులగు రాజులను నొప్పించుచు, ఎదురు తిరిగినచో యుద్ధమునందు సంహరించుచు, శరణు ఓడితిమి అని చెప్పువారిని రక్షించుచు గర్వముతో పుష్పక విమానమున స్వేచ్ఛావిహారము చేయుచు ఒప్పుచుండెను. ఇట్లు సంచరించుచు

★★★

# పదునేడవ సర్గము

## రావణుడు వేదవతితో సంభాషించుట:

హిమవత్పర్వత సమీపమున మధ్యమందు జడలును, మృగచర్మమును ధరించి సాధువు వలె వేద చోదితమైన శుభవ్రతము లాచరించుచున్నదైన దేవరూపిణియు సౌందర్యవతియునగు నొక కన్యకను జూచి ఆ కుటిలాత్ముడు కామవశుడై ఆహా ఈ బాలికచిక్కినదిరాయని నవ్వుచు ఓ తరుణీ నీవెవ్వతెవు? యౌవనమునకు విరుద్ధములైన ఈ నిష్ఠలందు ప్రవర్తించుటేలనే? సాటిలేని ప్రాయము, సౌందర్యము ఏ పురుషుని నైనను వెఱ్ఱివానిగా చేయను గదా! ఓ సుమగాత్రీ! ఓ కృశోదరీ! నీయట్టి సుందరి కూడా తపస్వివలె శరీరమును కందజేయదగునా? బాలా! నీవెవ్వరిదానవు? నీ భర్తయెవ్వడు? లేడికూన కన్నుల వంటి కనులు గల నిన్ను మన్మథక్రీడల దేల్చు ఆ శ్రేష్ఠపురుషుడెంతటి పుణ్యము చేసెనో గదా! ఓ పద్మముఖీ! ఓ పడతీ! నిన్నడగుచున్నాను. నీ వీ యడవిలో నిట్లు కష్టపడనేల? సర్వమును చెప్పుమనగా ఆ జడలు ధరించిన తాపసస్త్రీ యతనిని శాస్త్రసమ్మతముగా రావణునకు

## వేదవతి రావణునకు తన వృత్తాంతమును దెలుపుట:

ఆతిథ్యము నిచ్చి యిట్లనెను నా జనకుడు బ్రహర్షి. పేరు కుశధ్వజుడు. అతడు బృహస్పతి పుత్రుడు, బుద్ధివైభవము చేత బృహస్పతితో సమానుడు. పుణ్యమూర్తి. అతడు ప్రతిదినమును వేదాభ్యాసమొనరించుచుండును. అప్పుడు వాఙ్మయినైన నేను కన్యనై పుట్టిన కారణమున [కావుననే అయోనిజ అతడు వేదవతి యనుపేరు నాకు పెట్టెను. దేవతలు, గంధర్వులు, యక్షులు, నాగులు, దైత్యులు నన్నిమ్మని నా తండ్రిని వేడిరి. (సతుల పాతివ్రత్యమును జెఱచు రావణు వంశమును నిర్మూలించుటకు నెపము గల్పించుటకై యిట్లు లక్ష్మీదేవియే జన్మించెను] కాని నా జనకుడు మూడులోకముల నేలువాడైన ఘనుడు విష్ణుడొక్కడే నాకు యోగ్యుడైన పెండ్లికొడుకని చెప్పుచుండెను. అతని మాటలను విని

దంఘుడనెడి రాక్షసవీరుడు క్రోధముతో వచ్చి అర్థరాత్రి సమయమున నిద్రించుచున్న నా తండ్రిని దుర్మార్గుడై చంపిపోయెను. నా తల్లియు దుఃఖభారముతో తన భర్తను కౌగిలించి అగ్నిజ్వాలలకు తన శరీరము నర్పించెను. నా తండ్రి సంకల్పమును సత్యమొనర్చుటకై నేను ప్రతిజ్ఞ చేయుచు ఇట్లు నిష్ఠతో తపము చేయుచున్నదానను. నారాయణుడే నా భర్త. ఆతడు గాక వేరెవ్వడును కాడు. ఓ దైత్యుడా! ఇది నా చరిత్రము. సర్వమును దెలిపితిని. పులస్త్యుని మనుమడా! వెడలిపొమ్ము. నేను జగత్తు నందలి సర్వవిషయములను దెలిసికొను శక్తి గలదానను. అని ఆ మహానిష్ఠాపరురాలు తనతో చెప్పుచుండగా రావణుడు పుష్పకము నుండి దిగి మన్మథ బాణములచే గొట్టబడిన వాడై ఆ ఋషి కన్యను చేరబోయి తన మనస్సు తెలియజేయుచు నిట్లనెను.

## రావణుడు వేదవతిని దురుక్తులాడుట:

ఓ సుందరీ! ఎంత గర్వము గలదానవే? శరీరము బడల జేయుచున్నావు. గొప్పనైన తపస్సులచే కృశించి ఎడతెగని నిష్ఠలతోను సద్వ్రతములతోను కష్టపడ దగునా? ఓ చిగురాకువంటి పెదవిగలదానా! నీ అందమును చందమును దలంపక యిట్లు పలుకదగునా? ఓ లేడికన్నులదానా! నీవు జగత్సుందరివై యుండియు కేవలము పిరికిదానవయి సుఖము లేక యున్నావు. ఓ కాంతా! నీకు యౌవనము పోవుచున్నది. ఇంక యెన్నడు నీవు హాయిగా మన్మథక్రీడల దేలుచు సుఖపడెదవే? నేను లంకా రాజ్యమునకు రాజును. మహాబలవంతుడను. పంక్తి కంఠుడను పేరు గలవాడును. నా భార్యవై భోగభాగ్యములతో సుఖింపుము. నీ నెవ్వని విష్ణుడని ఎన్నుదువో వాడెవడైననేమి? ఓ జవ్వనీ! భోగము, దర్పము, బలము, శౌర్యము, తపస్సు, సంపద లందు నాకెవ్వడును సాటిరాడు. ఇది నిజము. అని పల్కుచున్న ఆ మదించిన రావణుని మాటలకు ఆ పూబోణి యిట్లు పలికెను. ఓ రాక్షసా! అట్లనబోకుము ఓరీ! ఆ శ్రీహరిని, నారాయణుని, సర్వలోకముల చేతను పూజింపదగిన వానిని సర్వలోకనాథుని, విష్ణుదేవుని నీవుకాక సుజనుడెవ్వడైనను ఇట్టి కఠినమైన మాటలనాడునా? అని పలికి తొలగిపోవుచున్న వేదవతిని దానవాధముడు తలవెంట్రుకలు నొడిసిపట్టి లాగెను. ఆ కన్యకయు తన చేతితోనే కత్తితో వలె తటుకున ఆ తల వెంట్రుకల నంతవఱకు నఱికివేసెను.

## వేదవతి రావణుని శపించి యగ్నిలో బడుట:

ఇట్లు తెగగోసి ఆ వేదవతి అతి రోషముతో ప్రజ్వలించు అగ్ని వలె మండుచు తన చూపుల చేతనే రాక్షసుని మాడ్చునట్లు చూచి శరీరమును విడువ నిశ్చయించి రాక్షసరాజుతో నిట్లనెను. ఓ దేవాతా విరోధీ! నీచే ముట్టబడిన ఈ శరీరము నింక నిలుపబోను. నీవు చూచు చుండగానే అగ్నిలో ప్రవేశించెదను. ఓ పాపాత్మా! నేను వనములందు తపస్వినినై నివసించుచుండగా నన్ను బాధించుటకు నీ విచ్చటికి వచ్చితివా? నేను అబలనై యుండుటచే పురుషడవైన నిన్ను చంపజాలను. శాపమిచ్చినచో నా తపస్సు నశించును గాన నిన్ను నాశనమొనర్చుటకు నేను మరల జన్మింతును సుమా రావణా! [లక్ష్మణుడు తనతో నుండిన రావణాపహృతయై లంకఁజేరుటకు, రావణుని కొంపదీయుటకు వలను పడదు కావుననే నిష్ఠురము లాడి ఆయన తొలగిపోవునట్లు సీత చేసెను. వేదవతియే సీతాదేవి] నేను కొంచెమైనను హోమమును దానమును చేసియుండితినేని ధర్మము నందత్యంతాసక్తి గల వానికి పుత్రికనై, అయోనిజనై, సాధ్వినై శరీరమును దాల్తును చూడుమని పలికి దేవతల సంఘము తథాస్తు అనుచు పుష్పవృష్టి గురిపించుచుండగా ఆ నిర్మల శీలవతి అగ్నియందు ప్రవేశించెను. ఓ రామచంద్రా! ఆ వేదవతియే విదేహ రాజపుత్రి యగుచు భూమి యందు పుట్టి సర్వలోకనాథుడవైన సనాతనమూర్తిని విష్ణుని నిన్ను ఆ స్త్రీ శ్రేష్ఠురాలు భర్తగా పొందెను. ఆమె క్రోధము చేతనే ఎవ్వడు శవప్రాయుడయ్యెనో ఆ దేవతా విరోధియే భూమియందు మనుష్యుడుగా బుట్టి మానవులను మించిన తేజస్సు గలవాడవైఆ సుందరికే భర్తవైన నీయొక్క భయంకరమైన బాణాగ్ని జ్వాలలయందు మిడుత వలె ఇప్పుడు నశించెను సుమా. ఈ మహాభాగ యిట్లు మానవలోకమందు పొలమునందు పూజింప తగిన విధముగా యజ్ఞవేదిక యందగ్ని శిఖవలె జన్మించినది సుమా! విశ్వవివుతా! రమ్యగుణభద్రా! పట్టాభిరామభద్రా! వేదవతి యను పేరుతో కృతయుగము నందు జన్మించినది త్రేతాయుగము నందు రాక్షసనాథుని సంహరించుటకై జనక వంశము నందు జన్మించినది. సీత యందు (నాగటి చాలు నందు) పుట్టుటచే సీత యయినది.

★★★

# పదునెనిమిదవ సర్గము

## రావణుడు మరుత్తు యజ్ఞశాలకు బోవుట:

అట్లు వేదవతి అగ్నియందు ప్రవేశించుటను జూచి రావణుడు పుష్పకము నెక్కి భూమి యందు సంచరించుచుండగా దేవతలతో గూడి యుశీరబీజమను ప్రదేశమున మరుత్తను రాజు యజ్ఞము చేయుచుండుటను జూచెను. రామచంద్రా! బలవంతుడును, దుస్సాధుడును అయిన అతనిని జూచి దేవతలందఱును తిర్యగ్రూపములను ధరించిరి. అందు దేవేంద్రుడు నెమలిగా మారెను. యముడు కాకి యయ్యెను. కుబేరుడు తొండ యయ్యెను. వరుణుడు హంస అయ్యెను. తక్కిన వారలును అచ్చట నిలుచుటకు భయపడి అనేకములగు ఇతర రూపములతో కనబడకుండ దాగిరి. ఆ యజ్ఞశాలలోనికి రావణుడు కుక్క వలె ప్రవేశించి అచ్చట నున్న మరుత్తును జూచి రాజా! యుద్ధము చేయరమ్ము. శక్తి లేనిచో 'జితోస్మి' యనుము. ఊరకే పోదు ననగా ఆ రాక్షస రాజుతో మానవనాథుడు ఇట్లు పల్కుచున్న నీ వెవ్వడవు రా? అని అడుగగా ఆ రాక్షసుడు పకపక నవ్వి నీ తెలివి తక్కువతనమునకు సంతసించితిని. శివుని చెలికాడైన కుబేరుని సోదరుడను. అమితమైన బలము గలవాడను. అట్టి ఈ రావణునే యెఱుగవా? అన్నను యుద్ధము నందు జయిచిం అపురూపమైన ఈ పుష్పకమును హరించిన వీరుడనగు నన్నెఱుగని వాడు ఓ రాజా! నీవు గాక మఱియొక దుండునా? అని పల్కగా మరుత్తుడిట్లనెను. నీవే ధన్యుడవు. అన్నను యుద్ధమున జయించితివి. ఓ మాంసభక్షకుడా! నీవంటి పొగడదగిన పురుషుడు భూమండలమునందు లేడు. లోకము మెచ్చు కార్యమును ప్రఖ్యాతిగా చేసి చెప్పువాడు ధరణి యందుందును గాని లోకవిరుద్ధమైన అధర్మమును ఈ విధముగా చేసి చెప్పు శూరునినే నెఱుగను. కేవలము నీవు ధర్మవ్రతముల చేత వరములను పొందుటను పూర్వము వినియున్నాను. ఓ రాక్షసుడా! ఇప్పుడు నీవే చెప్పిన ఆ వృత్తాంతము నేను వినియుండలేదు సుమా. ఓరీ దుర్మతీ! నిలు నిలుము. ఇప్పుడే భయంకరములు కఠినములునైన నా బాణములచే నిన్ను యమపురమునకు బంపెదనని పల్కుచు వింటిని బాణములను పట్టుకొని క్రోధము నందినవాడై వెడలుచుండగా అడ్డము వచ్చి నిలబడి ఆ బలవంతుని జూచి బృహస్పతి

సోదరుడును ఋత్విజుడును మహాత్ముడును అయిన సంవర్తుడనెడి బ్రహ్మర్షి శ్రేష్ఠుడు స్నేహభావముతో నిట్లనెను.

## సంవర్తుడు మరుత్తుని శాంతుని జేయుట:

ఓ రాజా! వినదగియున్నచో నా మాటను వినుము. యుద్ధము చేయుట నీకు భావ్యము కాదు. ఇది మాహేశ్వరమైన సత్రయాగము. దీనికి కొంచెమైనను అంతరాయము కలిగినచో కర్తయొక్క వంశమును నాశనము చేయును గాన రాజా! దీక్షలోనున్న నీవేడ? యుద్ధము చేయుటేడ? దీక్ష యెక్కడ? ఇట్టి క్రోధము గల్గుటెక్కడ? ఆ రాక్షసుడు దుర్జయుడు. యుద్ధములో నీవే గెలిచెదవను నమ్మకమేమున్నది? అని చెప్పిన గురుని వాక్యము విని రాజచంద్రుడు వింటిని బాణములను విడచి శాంతుడై యజ్ఞమును పూర్తి చేయుటకై తిరిగి వెళ్లెను. దానిని జూచి శుకుడను రాక్షసుడు రావణుడు గెలిచెనని సైన్యమునందు చాటింపజేసెను. ఆ రావణుడు యాగమునకు వచ్చిన ఋషులను సంహరించి వారినెత్తురులు త్రాగి తృప్తి చెంది వెడలెను.

## ఇంద్రాదులు మయూరాదులకు వరములిచ్చుట:

అట్లు రాక్షసరాజు వెళ్లగానే దేవతలు తమ నిజరూపములు ధరించి మిక్కిలి సంతోషముతో ఆ తిర్యక్కులను చూచి ప్రీతితో నిట్లనిరి. నల్లని పింఛములు గల నెమిళ్లను జూచి ఇంద్రుడీ విధముగా వరములిచ్చెను. ఇటమీద మీకు సర్పభయము లేకుండును. మీ తోకలందు వేయికన్నులు గల పురి వెలయును. నేను వర్షము గురిపించినచో మీకు సంతోషము కలుగును గాక యనగానే అవి ఆనందముతో వెడలెను. హవిర్గృహమునకు ముందుభాగమున నున్న కాకులను జూచి యముడిట్లనెను. నేనే ప్రాణులకు రోగబాధలను కలిగించువాడను గాన ఇకముందు మీకు ఏ రోగభయము లేకుండును. మృత్యుభయము మీకు లేదు. ఎంతకాలము మిమ్ము జనులు చంపరో అంతవఱకు బ్రతికి యుండెదరుగాక. నా లోకమున ఆకలి బాధ నొందువారు భూలోకమున మీరు భక్షించిన చుట్టములును తామును చాలా తృప్తి నందెదరు అని యముడు చెప్పెను. అంత వరుణుడు హంసలను జూచి యిట్లనెను. హంసలారా! చంద్రునివంటి నురగ వంటి తెల్లని మనోహరమైన ఆకారమును గొప్పవేగమును మీకు కలుగును. మఱియు మీరు నీటిలో స్నానమాడగానే మనోహరమైన కాంత్యతిశయము కలుగును అనగానే శరీరము లందలి నల్లదనము పోయి

హంసలు మనోహరమైన తెల్లని కాంతులతో నొప్పెను. ఓ రామచంద్రా! పూర్వము హంస నీలవర్ణము గలవి. వాని ఱెక్కలు అంచులు నలుపై కోమలములై యుండెడివి. వరుణుని వరముచే తెల్లని వర్ణము గలవి యయ్యెను. తొండలకు యక్షరాజగు కుబేరుడు మీ శిరస్సు బంగారు కాంతి గలదై చకచక మెరయుచుండుగాక యని నిర్మలబుద్ధితో వరము నొసగెను. అంత నా మరుత్తు యజ్ఞమును పూర్తి చేయగానే దేవాధిపతులు తృప్తి నంది శుభమతులై ఆ రాజుతో స్వర్గమునకు వెడలిరి.

★★★



# పందొమ్మిదవ సర్గము

## అనరణ్యుడు రావణునితో యుద్ధము చేయుట:

ఆ రావణుడు యుద్ధకాంక్షతో భూమియంతటను దిరిగి గొప్ప పరాక్రమవంతులైన రాజులను చేరి యుద్ధమునకు రండు. లేకున్న ఓడిపోయితిమని శరణువేడుడు. నా ధాటి కోర్చుకొనుట కింకొక దారిలేదు అనుచుండ ఆ రాజులందఱును ప్రాజ్ఞులు భీతిలేనివారు పరస్పరము బాగుగా యోచించి ఇతడు వరములు గలవాడగుటచే జయింపరాని వాడని తలచి ఓడిపోయితి మని పలికిరి. ఓ పద్మాక్షా! అట్లు పలికిన వారు సగరుడు, గాధి, పురూరవుడు, గయుడు, దుష్యంతుడు అనువారు. వీరందఱు నిట్లు పల్కగా ఆ వీరుడైన రావణుడు యుద్ధ కాంక్షతో అయోధ్యకు వచ్చెను. అప్పుడు ధైర్యవంతుడు, ఇంద్ర సమానవీరుడు అయిన అనరణ్యుడనెడు రాజు ఇంద్రుడు స్వర్గమును వలె భూమిని పాలించుచుండగా దశకంఠుడతనిని జూచి యుద్ధమున కైన రమ్ము లేక భయముతో కలత చెందినచో ఓడిపోతి ననుము. ఇది నా యాజ్ఞ అని చెప్పగా ఆ రాజచంద్రుడు కోపావేశము చేత కన్నులెఱ్ఱబడగా ఓ రాక్షసుడా! ఒక్క నిమిషము నిలువుము. నేను యుద్ధము చేయవచ్చెదను అని పలికి పూర్వరావణుని వృత్తాంతము సమస్తము విని యుండుటచే సిద్ధముగా నున్న చతురంగ బలములతో గూడిన సైన్యము భూమియంతయు నిండగా ఆ సైన్యమును తీసికొని వెళ్లి రాక్షససైన్యము నతిశౌర్యముతో దాకి సూర్యసమానతేజుడైన ఆ రాజు శ్రేష్ఠమైన పరాక్రమముతో అనేక దినములు యుద్ధము చేసెను. అగ్నిజ్వాలలలో బడిన మిడుతల వలెను అగ్ని బడుచున్న హవిస్సుల వలెను తన సైన్యములు సంహరింపబడుచుండుట చూచి అనరణ్యుడు పటు రోషముతో సముద్రమందు కలిసిపోయెడు నదుల వలె నశించుచున్న తన సైన్యములను జూచి ఇంద్రధనువు వలెనున్న భయంకరమైన విల్లు చేబూని దశముఖుని దాకి మృగరాజు అల్పమైన మృగములను దోలిన విధముగా తన నెదిరించు ప్రహస్తుడు శుకుడు మొదలైన రావణుని మంత్రులను పారద్రోలి ఎనిమిది వందల బాణముల నా రావణుని శిరస్సు నందు దట్టముగా దూరునట్లు వేయగా కొండ పెద్ద జడివానకు కరగని విధముగా కంపము నందక రావణుడు అనరణ్యుని మీదకు దూకి చేతికొలది మోదగా ఆ

రాజు కలత చెందిన వాడై వణకు చున్నవాడై పిడుగుపాటున గూలు వృక్షము వలె రథము నుండి క్రిందబడెను. ఇట్లు నేలబడి యున్న పవిత్రుడగు అనరణ్యుని జూచి రావణుడు నవ్వుచు నిట్లనెను. ఓ రాజా! నన్నెదిరించి ఏమి ఫలమును బొందితివి? యుద్ధము నందు నన్నెదిరించి ఏ మగవాడయినను శరీరముతో వెళ్లునా? నీవు స్త్రీలతో కామభోగా సక్తుడవగుటచేతనో నా బలాధిక్యమును వినియుండవు సుమా. అనుచున్న ఆ దానవునితో ఆ రాజు సన్ననైన కంఠధ్వనితో నిట్లనెను.

**అనరణ్యుడు రావణుని శపించుట:**

ఓ రాక్షసరాజా! ఇట్లేల ప్రగల్భములు పల్కెదవు? నన్నిప్పుడు నీవు గూల్చలేదు. కాలముచే గూలితిని. ఎవ్వరోగాని కాలమును మీరజాలరు. నీవు కారణమాత్రుడవే సుమా. ఇక నీమాటలు చాలింపుము. ప్రాణము పోవువేళ నాకేది యైనను చేయశక్యమా? పిరికి వాడను గాక వీరుడనై నిన్నెదిరించి యుద్ధము చేసితిని. యుద్ధమునందు నన్ను జయించితివి. అది నీకు యుక్తమే. అంతటితో బోక దుర్మార్గుడా! నా వంశమున సహ్యమైన మాటలతో అవమానము చేసెదవా? దానిని నేను సహింపజాలను. ఓ రాక్షసరాజా! నామాటను వినుము. నేనేమాత్రమైనను దానము, హోమము, పుణ్యము చేసియుండినను, ధర్మబద్ధుడనై ప్రజలను పాలించియుండినను, దానవవంశాధిపుడా! నా వాక్యము తథ్యంబగును గాక. రావణా! నా వంశము నందు రాముడను పేరుతో దశరథనందనుడు జన్మించి ఆ శ్రీమహితుడు యుద్ధరంగమున వధించునుగాక అని పల్కుచుండ ఆకాశమున దుందుభులు మ్రోగెను. దేవతాపుష్పములా రాజుపై గురిసెను. ఆ రాజు స్వర్గమునకు వెడలెను. అంత దశకంఠుడు.

★★★



# ఇరువదవ సర్గము

## నారదుడు రావణునకు మనుష్యులను చంపుట మానుమని బోధించుట:

ధరణినున్న రాజులకు భయంకరుడై గర్వముతో వెళ్లు ఆకాశమార్గమున నారదమునిని జూచి నమస్కరించి క్షేమమడిగి మునీశ్వరా నీ విచ్చటికి వచ్చుటకు కారణమేమియో చెప్పుమనగా మేఘములపై నున్న నారదుడా దేవ విరోధితో నిట్లనెను. ఓ రాక్షసరాజా! పులస్త్యవంశదీపా! నీ విక్రమమును విని మిక్కిలి సంతోషము నందితిని. కొంచెము నిలువుము. వినదలచినచో నేను చెప్పెడు ఒక్కమాటను వినుము. ఆ శ్రీహరి దైత్యులను వధింపగా జూచి సంతోషము చెందువాడను. నీ వా విధముగా నాగులను, గంధర్వాదులను సంహరింపగా చూచి ఆనందము నందుట యెన్నటికి కల్గునో గదా. తండ్రీ! నీవు దేవతల చేతను, గంధర్వులచేతను యక్షుల చేతను రాక్షస శ్రేష్ఠుల చేతను చంపబడువాడవు కావు గదా. మృత్యువుచే చచ్చియే యున్న ఈ నరులనే మని చంపదలచితివో చెప్పుము. మేలైన పనులను చేయజాలని మూఢులు అనిష్టములు కలిగి వ్యాధుల చేతను ముసలితనము చేతను ఏడ్చువారలు, ఆకలి దప్పుల చేత, ఇష్టజనుల బాసి యేడ్చుట చేత స్రుక్కిదైవోపహతులై ఎల్లప్పుడు నశించు నరులను జంప నీకు న్యాయమా? నాయనా! ఇంతవఱకు నీవిది ఆలోచించి చూడలేదేమో గదా! తరువాతి గడియకు ఏమి వచ్చునో తెలిసికొనజాలరు. క్షుద్రమైన విచిత్ర వస్తువులను సంపాదించుట యందే తమ కాలమును గడిపెదరు. వాద్యధ్వనులచే మిక్కిలి సంతోషము నందుచు అర్ధరాత్రియందు కన్నీటిధారలు కారగా నేడ్చుచుందురు [వాకిట కంచుతాళాలు, ఇంట్లో నోటి తాళాలన్నట్లు] అయ్యో! అటువంటి మూఢులైన మానవులను జూచితివా? తల్లియని, తండ్రియని, పుత్రుడని, భార్యయని, తమ చుట్టములని లంపటములను బెట్టుకొని తామేర్పరచుకొన్న బంధములచేతనే దుఃఖపడుచుందురు. కాన మోహముచే నిరాకరింపబడిన వారును, మిగుల కష్టములను పడుచున్నవారును అగు మానవులను నీవు జయించితివా? చాలు చాలును. ఈ జనులందఱును చివఱకు యముని జూడ నేగెదరు. కావున నా మాట విని ఆ

దండధరుని యుద్ధమున గెలువుము. అట్లు నీవతని గెల్చినచో అందఱిని జయించినట్లగును. ఇది నిజము సుమా యని ముని చెప్పగా విని

## నారదునితో రావణుడు తాను యముని జంపనేగుదుననుట:

రావణుడు నవ్వుచు ఆ మౌనికి మ్రొక్కి యిట్లనెను. మహాత్మా! సంగీతప్రియా! గొప్ప యుద్ధములందు ప్రీతి గలవాడా! జయకాంక్షతో నేను రసాతలమునకు నీవు చెప్పినట్లు పోయి మూడులోకములను గెలిచి దేవతలను, నాగులను నా ఆజ్ఞ తలదాల్చునట్లు చేసి అధికమైన బలముతో అమృతనిధానమైన సముద్రమును అమృతము కొఱకై మధించెదను. అని చెప్పగా నారదుడు ఓ రాక్షసరాజా! ఆ యమపురమునకు పోవు మార్గము కడు దుర్గమము నీవు గాక ఎవ్వడు పోగలవాడు? అని పల్కగా శరత్కాలమేఘము వలె తెల్లగానున్న ఆ నారదునితో రావణుడిట్లనెను. నీవు చెప్పిన దంతయు చేయబడినట్లే. ఓ దేవమునీ! ఇదే ఆ యముని జంపుటకై దక్షిణ దిక్కుగా వెళ్లుచున్నవాడను. కోపగించి దిక్పతులలో నల్వురను యుద్ధభూమి యందు జయింతునని ప్రతిజ్ఞ చేసితిని. ఆ మాట నిలబెట్టకొనుటకై ప్రాణులనందఱను కష్టపెట్టు ఆ సూర్యపుత్రుడైన యముని మృత్యువు పాలబడ జేయుటకు వెళ్లుచున్నాను. అని ఆ మునికి మ్రొక్కి మంత్రులతో గూడి మనస్సు నందానందించుచు ఆ రాక్షసరాజట్లే దక్షిణ దిక్కుగా దండధరుని పురమునకు వెడలెను. రావణుడట్లు పోగా పొగలేని యగ్నివలె నున్న బ్రహ్మపుత్రుడు ఏ విధముగా యుద్ధరంగమున యముని రావణుడు జయించునా యని ఒక మార్గము నాలోచించెను.

## నారదుడు రావణుడెట్లు యముని జయించునని యోజించుట:

ఇంద్రునితో గూడ చరాచరములతో గూడిన మూడు లోకములును చావు మూడు సమయమున ధర్మవిధానము తప్పక యెవని చేత బాధింపబడునో అట్టియముని నెట్లీ దశకంఠుడు గెలువగలుగు నొక్కో? మఱియు ప్రాణులు చేసిన దానవిధికి సత్కర్మలకును ఎవడు సాక్షియో, రెండవ అగ్ని వలె ఎవడు ప్రకాశించుచుండునో, ఏ మహాత్ముని యనుగ్రహము చేత పుణ్యము చేసినవారు దిరుగుచుందురో, ఎల్లలోకములును పనులయందు ఎవనికి భయము చేత అడలు చుందురో అట్టి దండధరునీ రాక్షసుడెట్లెదిరించునో గదా. పుణ్యపాపములకు తగిన విధముగా ఇంతయో అంతయో ఫలము నిచ్చువాడు, తానే ఈ భువనముల నన్నిటిని గెలిచినవాడు. ఆ గొప్ప బలవంతుడు

ఎట్లు గెలువబడునో గదా. కాలమే అన్ని పనులను గావింపశక్తి గలది కదా. పంక్తి కంఠుడే ఇతర బలమును బూని దక్షిణ దిక్కున కధిపతియైన ఆ దండధరుని యుద్ధమున గెలుచునో కదా. ఆ యమరాక్షస నాథుల యుద్ధము చూడవలెనని ఆశ కలుగుచున్నది. కాన నేను వేగముగా ఆ యముని జేర వెళ్లెదను అని నారదుడు ఆ యమధర్మరాజు పురమునకు వెళ్లెను.

★★★



# ఇరువది యొకటవ సర్గము

## రావణుని యుద్దేశమును నారదుడు యమునితో జెప్పుట:

అట్లు వెళ్లి గొప్ప విక్రమము గలవాడును అగ్నిహోత్రునితో గూడియున్న వాడును ప్రాణికోటులు చేసిన పుణ్యపాపములకు తగిన ఫలములకు తగిన ఫలములను ఎంచి శాసన మొనరించువాడును అయిన యముని దర్శింపగా ఆతడు వేగముగా ధర్మపద్ధతిగా మునిశ్రేష్ఠుని అర్ఘ్యమిచ్చి పూజించి ఆసనమున సుఖముగా గూర్చుండబెట్టి మునినాథా! మీకు క్షేమమా? ధర్మము నశించుట లేదు గదా. గంధర్వుల చేతను దేవతలచేతను సేవింపబడువాడవు. మీరలిచ్చటికి వేంచేసిన కారణమేమియో ఆనతిండనగా ఆ ఋషి శ్రేష్ఠుడు ఓ ధర్మరాజా! వినుము. ఈ యుదంతము నంతయును విని యేది యుక్తముగా నుండునో ఆలోచింపుము. ఓ జయించుటకు శక్యము గానివాడా! రాక్షసరాజైన దశాస్యుడిప్పుడు పరాక్రమముతో నిన్ను యుద్ధమున గెల్చుటకై వచ్చుచున్నవాడు. ఇది నేనెఱుంగుటచే మునుముందుగా నీకు తెలియజేయవచ్చితిని. కాలదండమును ధరించి ప్రకాశించు నీకు ఏమి జరుగునో యని వచ్చియున్నాడను. అని చెప్పుచుండగానే ఆ రాక్షసనాథుని విమానము దూరమున ఆకాశమున గనిపించెను.

## రావణుడు యమలోకమున బాధింపబడు జీవులను జూచుట:

అప్పుడే ఉదయించుచున్న సూర్యుని వలె కాంతి దిక్కులందు నింపుచు అన్ని దిక్కుల చీకట్లను పారద్రోలుచు రావణుని విమాన మా యముని పట్టణమును సమీపించెను. ఆ పట్టణమునకు వెలుపలి ప్రదేశము నందే జీవులు తమ పుణ్యపాపముల ఫలములను అనుభవించుచుండుటను రావణుడు చూచెను. యముని అనుచరులతో గూడియున్న ఘోరమైన రూపములుగలవారును క్రూరమైన మనస్సులు గలవారును అయిన సైనికులను జూచెను. కట్టబడు వారిని, కొట్టబడుచున్నవారిని, అయ్యయ్యోయని అరచువారిని, బాధల కోర్వలేక దుఃఖించువారిని పురుగులు తొలచుచుండగా బాధనొందువారిని భయంకరములైన కుక్కలు నోటితో కండలను పీకుచుండగా హా! హా! యని అరచువారిని, విన్నవారి గుండెలు పగులునట్లు విలపించుచున్న వారిని, రక్తమే నీరుగా గల వైతరణీ

నదిలో లాగబడుచున్నవారిని, మండుచున్న యిసుకయందు బడవైచి దొరలించు చుండ ఏడ్చుచున్నవారిని, అసిపత్రవనమున కష్టపెట్టబడుచున్న అధర్మపరులను, ఎక్కువైన దప్పికతో నీళ్ల నియ్యరేయని గోలపెట్టువారిని కష్టాత్ములను జూచెను. ఆకలితో అలమటించుచున్న వారిని ఘోరమైన నరకమున బడి గోలపెట్టు చున్నవారిని, ఉప్పుటేరులలో బడి కష్టపడుచున్న వారిని మంగలి కత్తులచే కోయబడుచున్న వారిని, పీనుగులవలెనై వెలవెలబోవు వారిని, బక్కచిక్కి బాధపడువారిని జుట్టు ముడి వీడి విరిసి వ్రేలాడుచున్న వెండ్రుకలు గలవారిని, ఏడ్చుచు బాధచే పరుగుపెట్టువారిని, మన్ను బురద శరీరము నిండ కలిగిన వారిని, రంగు మారిన వారిని రావణుడు వందలు వేలుగా తాను వచ్చు దారిలో ప్రేత సంఘములను చూచి వేరొకచోట సంగీతము, వాద్య ధ్వనులు మొదలగు వాటితో అనేక విధములుగా చెవుల పండువుగా ఆలకించుచు సంతోషముతో తాము చేసిన పుణ్యముల ఫలితముల ననుభవించు వారలను చూచెను. ఆవులను దానము చేసిన వారలు గోవుల పాలను త్రావి సుఖించుచుండుట, అన్నదానము చేసిన వారలు మృష్టాన్నములను మెక్కి సంతోషముతో తిరుగుచుండెను. గృహదానములు చేసిన వారలు శ్రేష్ఠమైన గృహములందు సంతోషముతో సౌఖ్యములందుచుండుట, బంగారము మణులు, ముత్యములు గల ఆభరణములు గలిగిన స్త్రీ సమూహములతో కొందఱుండగా, వారు వారుచేసిన పరమ పుణ్యములను బట్టి కొందఱు ధార్మిక శ్రేష్ఠులు నిర్మలమైన శ్రేష్ఠమైన దివ్యతేజముతో ప్రకాశించుచుండగా వారినందఱను జూచి రావణుడు తమ తమ పాపములకు తగినట్లు యమభటులచే బాధింపబడుచున్న ప్రేతములను బలాత్కారముగా విడిపించి హాయిగా సంచరింపజేసెను.

## యమభటులు రావణునితో పోరుట:

అనుకొననిదైన ఊహింపరానిదైన విధముగా జీవులు ఒక్క ముహూర్తకాలము ఈ విధముగా సుఖము నొందగా ఆ ప్రేతములను రక్షించు యమభటులు కోపముతో విజృంభించి గుంపులు గుంపులుగా వేగముగా ఆ దశగ్రీవునితో తలపడిరి. హలహలమను ధ్వనులతో అన్ని దిక్కుల కోలాహలము జనింపగా యమభటులు యుద్ధమునకు వెళ్లి ఆగని జడివానవలె పరిఘములు, ప్రాసములు, తోమరములు, శక్తులు, ముసలములు మొదలైన అనేకవిధములైన ఆయుధములను ఆ రాక్షసుని విమానముపై ఎడతెరపి లేక కోట్ల కొలదిగా గురిపించిరి. ఆ మహాబలవంతులు ఒక ముహూర్తకాలముననే తుమ్మెదల

బారులవలె పుష్పకమునందలి తోరణములను, సౌధములను, వేదికలను రాక్షసుల గుంపులు భయపడునట్లుగా ఛేదించిరి. అట్లు యమభటులచే భగ్నమై పోయినను, దేవనివాసమై యొప్పునట్టి ఆ విమానము బ్రహ్మ మాహాత్మ్యముచే పూర్తిగా పూర్వము వలెనే చక్కబడి ప్రకాశించెను. ఆ మహాత్ముడైన యముని భటులు శౌర్యము గల వారై వందలు వేలుగా గూడి యుద్ధ మొనర్పగా గొప్పబలవంతులైన రాక్షసులును వృక్షములు, కొండలు, ప్రాసములు గుంపులుగా విసరుచు వారి యిష్టము వచ్చిన విధముగా తమ తమ బలముల కొలది గర్వముతో ఉగ్రులై పోరు సల్పిరి. ఇట్లు పోరుచు అనేకమైన ఆయుధముల చేత తెగిన అవయవములు గలవారై నెత్తురులతో తడిసినవారై రావణాసురుని మంత్రులు యుద్ధము చేయుచుండగా, ఆ యమభటులు విజృంభించి వారిని నొప్పించి బడలికలు కలుగజేసి రావణుని మీదకు వెళ్లి శూలముల వర్షముచే శరీరమంతయు చిల్లులు పడునట్లు మోదగా రక్తముతో తడిసిన శరీరము గలవాడై పుష్పకము మధ్యమందు పూచిన మోదుగు వలె నొప్పెను. అతడు తీవ్రమైన శక్తితో అస్త్రబలముచేత పెద్దరాళ్లను, తోమరములను, గదలను, శక్తులను, శూలములను, వృక్షములను, బాణములను వేయగా అవి వర్షము వలె ఆ యమకింకరులపై వేగముగా కురియగా ఆ యమభటులును ఆతని భయంకరమైన శరవర్షము నాపుచు కొండపై వ్రాలు పెనుమబ్బులవలె ఆ రాక్షసరాజు మీద వ్రాలి వాడియైన శూలములను, గండ్ర గొడ్డళ్లను అను ఆయుధములతో ఊపిరాడనీయక, యించుకైనను సందీయక ఆ పాపచరిత్రుని బాదగా ఆ దెబ్బలచే వ్రీలిన కవచము గలవాడై నదుల వలె పారుచున్న రక్తములలో మునిగి కోపించిన మనస్సు గలవాడై ఆ రాక్షసరాజు విమానమును వీడి నేలపై నిలబడెను. అట్లు నిలిచి విల్లును బాణములును బట్టి కఠినాత్ముడై తిరిగి బలమును పొందినవాడై ప్రళయకాలుని వలె వింటినారియందు పాశుపతాస్త్రమును సంధించి నిలుడు నిలుడని యఱచి పూర్వము నీలకంఠుడు త్రిపురములపై వేసిన విధముగా దృఢమైన శౌర్యము గలవాడై చెవి వఱకు లాగి వేయగా పొగలేని యగ్నివలె ఆ శంకరుని యస్త్రము దావాగ్ని వేసవియందు ఎండిన అరణ్యములను అందలిప్రాణికోటితో గూడ దహించినట్లు చెట్లను, పొదలను గాల్చుచు యముని వీరభటులకు జ్వాలలు గలదై వేగముగా ప్రళయమును గలిగించెను. కారుచిచ్చుచే గాలిన చెట్లవలె యముని సేనలు సంహరింపబడగా మంత్రులతో గూడిన రాక్షసరాజు భూమి వణకునట్లు అధికముగా గర్జనలను చేసెను.

★★★

# ఇరువది రెండవ సర్గము

## యముడు రావణునితో యుద్ధమునకై వెడలుట:

ఆ గొప్పనైన ధ్వనిని విని యముడు తన సైన్యము సంహరింపబడుటను శత్రువు యొక్క విజయమును తలంచి క్రోధముతో మిక్కిలి ఎఱ్ఱబడిన కన్నులు గలవాడై సారథిని జూచి రథమును దెమ్మనగా వాడు రథమును సిద్ధపరచి తేగా దాని నతడెక్కి వెడలెను. అవ్యయమైన లోక సమూహము దేనిచే సంహరింపబడునో అట్టి మృత్యు దేవత చేతియందు పాశముద్గరములను దాల్చి అతని ముందు నిలిచెను. మూర్తిమంతమై కాలదండమను యముని సాధనము అగ్ని ప్రకాశముతో అతని ప్రక్క నిలచెను. కాలపాశములతని ప్రక్కలందు బ్రకాశించెను. ముద్గరము అగ్ని సమానమగు ఆకృతి దాల్చిన అతనిని జూచి లోకము హాహాకారములు చేసెను. సారథిచే నదలింపబడిన రథపు గుఱ్ఱములు మనోజవము గలవి ఆ యింద్రుని గుఱ్ఱముల వలె వెడలి యుద్ధము జరుగు ప్రదేశమును ముహూర్తకాలములో జేరెను. మృత్యువుతో గూడిన ఆ రథమును గొప్ప వికృత రూపము గల దానిని జూచి గుండెలు పగులగా ఆ రావణుని మంత్రులు మనమా ఈ తని నెదుర్కొని జీవించు మార్గము కల్ల అనుచు గర్వము నశించి బలము లేకపోవుటచే భయముచే పీడింపబడినవారై మనస్సులు చెదరిపోవుచుండగా వేగముగా లేచి పారిపోయిరి.

## యమ రావణ యుద్ధము:

అట్టి భయంకరమైన రూపముతోనున్న మహారథమును జూచి దశకంఠుడు ఏమియును బెదరక యెదుట నుండగా యముడు వాని మీద తోమరాద్యాయుధముల వర్షమును నేర్పుతో గురియింపగా ఆ రావణుడును అధికమైన ధైర్యముతో ప్రేతపతి రథముపై బాణసమూహము మేఘము వలె గురియించెను. అప్పుడు యముడు రాక్షసుని విశాలమైన ఱొమ్మునందు శక్తులతో బాణముల సమూహములతో గ్రుచ్చగా నొచ్చియు మహాడంబరముతో పరాక్రమముతో పోరుచు, మారుచేయలేక ఏడురాత్రులు

అభిమానముతో పోరుసల్పెను. అనేక విధములయిన ఆయుధముల దెబ్బలచే అనేక విధములుగా బాధింపబడి ఆ రాక్షసుడు తెలివిదప్పుచు, యుద్ధవిముఖుడగుచు తిరుగ విజృంభించి జయింపవలెననెడి యాశచేత తిరిగి దండధరుని దాకెను. ఆ వీరశ్రేష్ఠులు భయంకరమైన పరాక్రమముతో తప్పుకొనక మారు మొగము పెట్టక బాహుబలముతో నిట్లు యుద్ధము చేయుచుండ ఆకాశము నందు మహర్షులును, బ్రహ్మ మొదలుకొని దేవతల సమూహమును యుద్ధము చూచుటకై వచ్చి నిల్చిరి. యమునకు దశముఖునకు యుద్ధము జరుగుచుండగా జగముల కెల్లను నశించు సమయము వచ్చెనో యన ఆ రాక్షసుడు ఇంద్రుని వజ్రాయుధమును దలపించు విల్లు గొప్ప ధ్వని కలుగజేయుచుండ ఆకాశము నిండ బాణములను వేయుచు క్రోధముతో మృత్యువును నాల్గు బాణములతోను, సారథి నేడు బాణములతోను, ప్రేతపతిని నూఱువేల శరములతోను కొట్టగా క్రోధావేశము నందిన ఆ యముని నోటినుండి జ్వాలల వరుసలతో భయంకరమైన మహాగ్ని ధూమసహితమై భువనము వణకునట్లుగా ఆ కాలుని నిశ్వాసముతో పాటు జన్మించి బయలువెడలెను. దేవదానవుల సన్నిధియందామహాశ్చర్యమును జూచి మృత్యువు, కాలము అధికమైన సంతోషమును రోషమును పొందెను. అప్పుడు అధికముగా కోపించిన మృత్యువు దండధరునితో నిట్లనెను. నీవు నన్నిప్పుడే పంపుము. ఈ దేవవిరోధిని లీలగా వధింతును. నాకిది సహజసిద్ధమైన దృఢశక్తి తెంపరియై ఈ పాపాత్ముడు నిన్నే ఢీకొనుచున్నాడు. హిరణ్యకశిపుడును, ధూమకేతుడును శంబరుడును, నముచియు, విసంధియు, బలియు, శంభుడను దైత్యరాజును, బాణుడును, శాస్త్రవిజ్ఞానము గల రాజర్షిశ్రేష్ఠులును దైత్యులు, యక్షులు, నాగులు, గంధర్వులు, అప్సరసలు, ఋషులు మొదలగు వారందఱును, నదులు, కొండలు, చెట్లతో గూడిన భూచక్ర మెల్లను ప్రళయకాలము నందు ఎదురులేని పరాక్రమముచే గొప్ప వారలును వారిపై నాయొక్క చూపులు పడిన వెంటనే నశించిపోరా? ఈ నిశాచరుడెంత? నన్ను పంపించుము దేవా! నీకు శుభము కలుగజేసెదను. ఓ అంతకా! ఎంతటి బలవంతుడైనను నాదృష్టి సోకినచో జగత్తు నుందు బ్రతుకుటకు స్వాతంత్ర్యము గలదా? ఓ ధర్మచిత్తుడా! నన్ను విడువుము. వీని పాటును చూడుము. దేవా! ఇది నాశక్తి గాదు. నాకు స్వభావము చేతనే ఇట్టి బలము కలిగినది. నా కనుల జంటకు గానవచ్చిన వాడు ఒక గడియ సేపైనను బ్రతుకజాలడు. ఓ శ్రార్ధదేవా! ఇది నిజము. అని పల్కగా

**యముడు రావణుపై యమదండము వైవదలంచుట:**

ఆ ధర్మరాజు నిలువుము. వీనినిప్పుడే వధించెదను అని హెచ్చైన క్రోధముతో అమోఘము, భయంకరము, కఠినమునైన యమదండమును చేతబట్టెను. అతని ప్రక్కనే అగ్నివలె దారుణముగా నున్న ముద్గరము రూపము దాల్చియుండెను. కాలపాశములు మిక్కిలిగా నాల్కలను చప్పరించుచుండెను. చూచిన మాత్రముననే ప్రాణిసమూహము యొక్క ప్రాణము తీయునట్టిది యగు దండమును ప్రేతరాజు చేతబట్టి వేగముగా త్రిప్పి వేయబూనినంత దాని రూపపు తీరు నేమని చెప్పవలెను. మంటలతో నిండినదై అవలీలగా రాక్షసుని జంపుటకై భయంకరముగా ఆ మహాసాధనము బలవంతుడగు యముని చేతి యందు గదలు చుండగా జూచుచు యుద్ధరంగమున నున్న వారందఱును ఆ చోటును విడిచి చిందఱవందఱగా పారిపోవుచుండగా విశ్చేష్టులై ఆకాశమున నున్న దేవతలు దండమును పైకెత్తియున్న సూర్యనందనుని జూచి హృదయములందు కలత చెందిరి.

**దండమును వేయవలదని బ్రహ్మ యముని వారించుట:**

అట్లు యముడు రావణుని మీద దండమును వేయ సిద్ధపడుచుండగా బ్రహ్మ ఆ ధర్మరాజు ముందుకు వేగవేగముగా వచ్చి నిలిచి యిట్లనెను. ఓ శమనా! తాళుము తాళుము. చంపకుము. ఈ రాక్షస శ్రేష్ఠుని నీ దండము చేత చంపకుము. ఈతడు చావకుండ నేను వరమిచ్చితిని. గాన నా మాట నబద్ధము చేసినచో అతడు ముల్లోకములన సత్యము చేసిన వాడగును. ఓ బుద్ధిమంతుడా! నన్ను కల్లరిని చేయు తలపు నీ మనస్సు నందు లేకున్నచో నీ దండమును విడువకుము. జయమును గోరి కోపవశమున దండమును వేసితివేని వీడు ప్రియుడు వీడప్రియుడు అను బేధము నెంచక ఇది లోకములకు భయము కలిగించుచు ప్రాణులనెల్లను సంహరించును. నేనే దానిని దుర్జయముగా అమోఘముగా నుండునట్లు మృత్యువు కొఱకై నిర్మించితిని. నీ విప్పుడీ రాక్షసునిపై నిష్ఠురమైన దండమును వేసినచో వీడు చావకుండ ఒక్క ముహూర్తమైన నుండజాలడు. చచ్చినను చావకున్నను ఇప్పుడీ రెండింటి చేతను నా వచన మసత్యమగును గాన ఓ శమనా! నన్ను సత్యవాదిగా జేయుము. దశముఖునిపై దండమును విడువకుము. అని చెప్పగా ధర్మరాజు ఓ విధాతా! దండమును విడుచుట మానితిని. నీవు మాకధిపతివి. నీ మాటలే మాకాజ్ఞలు సుమా. ఓ వనజాసనా! వీడు వరములు పొందుటచే చంపదగడంటివి. ఇక యుద్ధరంగమున నిల్చియేమి చేయగలను.

కాన ఆ రాక్షసుడి దృష్టిలో నిలువ సమ్మతిగా దని చెప్పి తన గుఱ్ఱములు శస్త్రములు రథము మున్నగు వానితో గూడ మాయమై యముడు వెళ్లగానే ఆ రావణుడు యముని గెలిచి తినని ప్రజ్ఞలు పలుకుచు గొప్ప సంతోషముతో తన విమానము నెక్కి యమపురమును విడిచి స్వేచ్ఛగా వెళ్లెను. ఆ సమవర్తియు మనస్సునందు సంతుష్టుడై దేవమునియైన నారదునితో యుద్ధవిషయములను చెప్పుకొనుచు బ్రహ్మదేవునితో గూడ దివంబున కేగెను.

★★★



# ఇరువది మూడవ సర్గము

## రావణుడు నివాత కవచులతో సంధి చేసికొనుట:

రావణుడట్లు యముని జయించి ఆలస్యము చేయక తన సహచరులను జూడ వెళ్లగా బాణములచే తూట్లుపడిన శరీరము గలవాడును రక్తముచే తడిసిన శరీరము గలవాడును అగు రాక్షస రాజును ఆశ్చర్యము చెందినవారై చూచుచు వారెల్లరు జయము జయము అను వాక్యములతో పొగడిరి. మారీచుడు మొదలైన వారలందఱను సంతోషపెట్టి పుష్పకము నెక్కి రాక్షసుడు ఉరగులు, దైత్యులు, యక్షులు గలదియు వరుణునిచే రక్షింపబడినదియు అగు సముద్రము నందు వాసుకిచే పాలింపబడుచున్న భోగవతీ పురమును జూచి నాగులను జయించి యుద్ధకాంక్షతో మణిమయమను పురమును జేరెను. రావణుడట్లు యుద్ధమునకు వచ్చుటను విని వరములను పొందినవారైన నివాతకవచములనెడి రాక్షస శ్రేష్ఠులు విజృంభించి యుద్ధకాంక్షతో వెడలి వచ్చి శౌర్యముతో తలపడిరి. దైత్యులకును రాక్షసులకును భయంకరమైన యుద్ధము జరిగెను. శూలములు, పరిఘలు, పట్టిసములు, కుఠారములు, ఖడ్గములు మొదలైన ఆయుధములతో ఒకరి నొకరు కొట్టుకొనుచు ఒక సంవత్సరము యుద్ధము సాగగా ఆ రెండు పక్షముల యందేదియును ఓడిపోవుటగాని, గెలుచుటగాని జరుగదయ్యెను. అంత వేగముగా విమానమున బ్రహ్మదేవుడు వచ్చి ఆ రాక్షసులను యుద్ధమును మానుడని శాసించి యిట్లనెను. ఓ దైత్యులారా! నేను చెప్పినట్లు మీరు నడచుకొనుడు. ఈ రావణుడు నాచే వరలాభము పొందుటచే దేవతాసంతతులకును దానవ సంఘములకును చంపరానివాడు. ఇది తథ్యము. మీరును అట్టివారలే. కావున మీలో మీకు తగని పోరెందులకు? మీరందఱును పరాక్రమముతో స్నేహముతో నుండుడు. స్నేహితుల వస్తువులేవైనను పరస్పరము భోగ్యములే యగును. ఐకమత్యముతో అట్టి ఫలము కలుగును. అని చెప్పి బ్రహ్మ వెళ్లగా ఆ దశముఖ రాక్షసుడగ్ని సాక్షిగా వారలతో స్నేహముచేసి ప్రీతినొందెను. సంతోషముతో అతడు తన పట్టణమునందు వలెనే

అమితమైన ఇష్టసౌఖ్యముల నాపట్టణము నందును తనివిదీర ననుభవించుచు ఒక సంవత్సరముండి వారి వలన దనుజ మాయల నొక నూరింటిని నేర్చుకొని పాతాళమున వరుణుని పట్టణమును దృఢమైన ప్రయత్నముతో వెదకుచు

## రావణుడు కాలకేయులను జయించుట:

కాలకేయ గణములు పాలించుచున్న అశ్మనగరమును జూచి కలహమునకు వారలను బిలిచి మహాబలముతో దుర్వారమైన బలము గల వారి ననేకులను వధించెను. బలముతో తన వారిని మ్రింగుచున్న శూరుడైన రాక్షస శ్రేష్ఠుని తన మఱదిని శూర్పణఖ భర్తయైన విద్యుజ్జిహ్వుని అధికమైన శక్తితో తన ఖడ్గముతో తల నరికి ఆ క్షణము నందే నాల్గు నూఱుల దైత్యులను చంపి జయమును పొంది తెల్లని మేఘము వంటి కాంతి గలదై కైలాస పర్వతమునే పరిహసించునదియు పూర్ణచంద్రుని వంటి ప్రకాశము గలదియు అయిన వరుణుని పట్టణమును జూచెను.

## రావణుడు వరుణనగరముపై బోవుట:

రాక్షస శ్రేష్ఠుడచ్చట పాలధారలను గార్చుచున్న సురభిని జూచెను. ఓ రామచంద్రా! ఆ యావే తన పాలచే సముద్రమును పాలసముద్రమను పేరుగలదాని నొనర్చెను. అచ్చట నందీశ్వరును గన్నతల్లియు, మనోహరుడైన చంద్రుని పుట్టుకకు హేతువైనదియు, నురుగు మాత్రమే త్రాగి జీవించు ఉత్తమ ఋషి సంఘములకు ప్రాణాధారమై యున్నదియు దేవతల కమృతమును, పితృదేవతలకు స్వధను ఒసగునదియు, జనులందఱును సురభియని పిలుచునదియు పరమచిత్రమైనదియు అగు నాధేనువును జూచి రాక్షసుడు ప్రదక్షిణము చేసి మ్రొక్కి వెళ్లి చాలమంది సైనికులచే అనేక విధములుగా రక్షింపబడునదియు, పెద్ద శరత్కాల మేఘము వంటిదియు, భయంకరమైనదియు, జలప్రవాహములచే వ్యాపింపబడినదియు, సుకుమారమైనదియు, ఎల్లప్పుడు హర్షముతో నిండినదియు అయిన వరుణుని సౌధమును జూచి కావలియున్న భటులను వధించి బలవంతులైన యోధులచే దెబ్బలు పడినవాడై ఆ యోధులతో నిట్లనెను. ఓరీ! దుర్వారపరాక్రముడయిన దేవతావిరోధియగు దశకంఠుడు యుద్ధమును గోరి వచ్చినాడని మీరు వేగముగా వెళ్లి మీరాజుతో చెప్పుడు. యుద్ధము చేయ సాహసము లేకున్నచో చేతులు జోడించి జితోస్మియన్నచో వెళ్లిపోయెదనని చెప్పుడు. అని రావణుడు చెప్పుచుండగా

## వరుణ తనయులు రావణునితో పోరుట:

అంతలో ఆ వరుణుని పుత్రులును, మనుమలును క్రోధముతో గోపుష్కరులను సేనాపతులతో గలిసినవారై బలము ధైర్యము పరాక్రమము గలవారై వారి సైన్యములు వెంటరాగా కామగమనములైన రథముల నెక్కి యుద్ధము చేయుటకై వెడలి వచ్చిరి. అంత ఇరుపక్షముల సైనికులకు మిక్కిలి భయంకరమైనయుద్ధము జరిగెను. రాక్షసరాజు సేనలచే మర్దింపబడి వరుణ సైన్యములు చెడుటయు, రావణుడు క్రూరాత్ముడై పుష్పకము నెక్కి యాకాశమార్గమున నుండుటను జూచి వరుణుని పుత్రులు దుర్వారమైన వేగముతో పైకెగసిన భయంకరములు ప్రకాశవంతములునైన రథములతో ఆకాశమున కెగిరి బాణములతో రావణుని విముఖుని చేయగా తమరాజు దుస్థితిని వరుణపుత్రుల ఉదుటును చూచి మహోదరుడు యుద్ధకాంక్షతో మృత్యుభయమును వదలి వేగముగా గదను చేతబట్టి వారి కెదురు వెళ్లి గుఱ్ఱములను రథములను నేలగూల్చగా ఆ వరుణపుత్రులు నేలబడిరి. రథములు లేని ఆ శత్రువులను జూచి ఆ మహోదరుడు సంతోషముతో పెద్దగా అరపుల నించెను. నశించిన గుఱ్ఱములు రథములు గలవారై నేలబడియు వరుణపుత్రులు వ్యథచెందక తమ మహిమచే ఆకాశమున కెగిరి చేతులందు ఎక్కుపెట్టిన విండ్లు కలిగి భయంకరులై అధికమైన బాణవర్షముచే మహోదరుని శరీరమును జీల్చి ప్రకాశవంతములైన శ్రేష్ఠములైన ఆయుధములతో మేఘము పర్వతమును గప్పిన విధముగా రాక్షసరాజును కప్పివేయగా రావణుడును ప్రజ్వరిల్లుచున్న తీవ్రమైన ప్రళయాగ్ని వలె నేర్పుతో వారి మర్మములను ఛేదించెను. ముసలములు, విచిత్రములైన బాణములు, వాడియైన తోమరములు, శక్తులు, బల్లెములు, పట్టిసములు భయంకరములు శక్తిమంతములైన శతఘ్నుల సమూహములు కోపముతో ఒక్కపెట్టున ఎదురులేకుండ దొప్పలు దోరలుగా గురిపింపగా బురదలో అరువది యేండ్ల (ముసలి) యేనుగులు మునిగిన రీతిగా నేలబడి లేవలేక తపించుచుండగా వారలను జూచి రావణుడు గొప్ప సంతోషముతో పెను మేఘము వలె గర్జించి అనేక సాధనములతో వారిని బాధించుచుండగా వారు యుద్ధమును వీడి తమ వారలెత్తుకొని యిండ్లకు చేర్చుచుండగా వారితో దశాస్యుడిట్లనెను. నా రాకను మీరు ప్రచేతసునకు మీరలెరింగింపు డనగా ఆ రాక్షసరాజుతో ప్రభాసుడను వరుణుని మంత్రి 'ఓ రాజా! వరుణుడు పట్టణమున లేడు. బ్రహ్మ లోకమునందు గాంధర్వమును వినుటకై వెళ్లినాడు. ఆ రాజు లేనప్పుడు నీవు వృథాశ్రమ పడనేల? అతని పుత్రులు వీరు నీ చేత జయింపబడిరి

గదా. అని చెప్పగా రావణుడు గెలిచినాడని ప్రకటించుట కాజ్ఞాపించి సంతోషముతో గొప్పగొంతుతో నఱచి వెంటనే ఆ పట్టణమును విడచి వచ్చిన మార్గముననే విమానముపై శీఘ్రముగా చుట్టును తన మంత్రులు సేవించుచు తన్ను అధికముగా స్తోత్రములు చేయుచుండగా లంకకు పోవుచుండెను.

★★★



# ఇరువది నాల్గవ సర్గము

## రావణుడు నానా స్త్రీలను చెఱపట్టుట:

అట్లు రావణుడు తన బలసంపద ప్రకటమగుచుండ మదముతో తాను వెళ్లుచున్న మార్గమందు రాజకన్యలను, మునిపుత్రికలను, రాక్షసకాంతలను, దేవతాస్త్రీలను వీరు వారను భేదము లేక కనపడిన యువతులందఱను, కులకన్యకల సమూహమును బలాత్కారముగా పట్టి అడ్డము వచ్చిన బంధువులను పడగొట్టి చేతులు జుట్టుముడులు బిగబట్టి ఆ స్త్రీలు గోలపెట్టుచుండగా తిట్టుచుండగా ఈడిగిలబడుచుండగా ఈడ్చికొనుచు వెళ్లి అధికమైన గర్వముతో వెనుదీయక పాపమని తలంపక ఆ రాక్షసుడు మోహితుడై ఆ స్త్రీల నందఱను పుష్పకమునందుంచెను. ఈ విధముగనే నాగకన్యలను, మానవకాంతలను, రాక్షసస్త్రీలను, దేవతాస్త్రీలను, యక్షస్త్రీలను, దానవకాంతలను విమానమున నెక్కించెను. వారలు శోకాగ్నిచే భయముచే బుట్టిన బాష్పములను అగ్నివలె ప్రకాశించువాటిని గార్చిరి. వారల కన్నీరు నదులు సముద్రమును వలె ఆ పుష్పకము నంతను నిండించెను. పొడవైన వెండ్రుకలు గలవారును, చంద్రబింబముల వంటి ముఖములు గలవారును, పెద్ద స్తనములు గలవారును, వేదికల వంటి నడుములు గలవారును, మిక్కిలి మనోహరమైన శరీరములు గలవారును, బంగారు రంగు గలవారును, రథముల వంటి మనహోరమైన కటిప్రదేశములు గలవారును, యౌవనవంతురాండ్రును, కన్యలును దేవతాస్త్రీలవంటి వారును అగు ఆ స్త్రీలు శోకము, దుఃఖము, భయము అధికమగుచుండగా కలత చెందిన వారై వెలవెల్లనై దిక్కులైక దీనురాండ్రై తపించిరి. వారల నిట్టూర్పుగాడ్పులు అడ్డులేకుండా అగ్నివలె ప్రకాశించుచు నలుదిక్కులు నిండగా ఆ పుష్పక విమానము ఘోరమైన అగ్నిజ్వాలలతో నిండిన కుండయో యనునట్లుండెను. దశముఖుని వశమైన ఆ స్త్రీలందఱును అడవిలో సింహమునకు వశపడిన ఆడేనుగుల వలె తెలివి తప్పినవారై దీనములైన ముఖములు కన్నులు గలవారై ఇట్లు విలపించసాగిరి.

## రావణునిచే చెఱబడిన స్త్రీలు విలపించుట:

అక్కటా నన్నీ రాక్షసుడు కోపము నంది భుజించునేమో గదా! అని ఒకతె యేడ్వగా ఈ పరమదుష్టాత్ముడు నన్ను ముక్కలు చేయునేమోయని వేఱొకతె మొఱపెట్టగా, మఱికొందఱు తమ తోడబుట్టిన వారిని తమప్రాణనాథులను, తల్లులను తండ్రులను తలంచి దుఃఖించిరి. ఎల్లప్పుడును ప్రేమతో తన ప్రాణముతో సమానముగా బుజ్జగించుచు నన్ను కులదీపమా! గుణముల ప్రతిమా! అని మెచ్చి పిల్చునట్టి ఓ తండ్రీ! ఇప్పుడెట్లయితివో? కష్టమును ఎట్లోర్చుకొందువో కూతురైనను పుత్రునితో సమానమైనదని యెంతయో సంతసించు ఓ తండ్రీ! ఏ గతిబట్టితివో గదా! నాకొక్కతే కూతురు. గుణములకు నిధి, అందమైనది తగిన భర్తతో ప్రేమతో గూర్చెదనని గొప్పగా పెండ్లి ప్రయత్నములు చేసితివే. దిక్కులేని విధముగా ఈ కఠినాత్ముడైన రాక్షసుడు నన్ను హరించెను. తండ్రీ ఈ దురంతమైన తాపమునే విధముగా సహింతువో గదా. ఓ కన్నతల్లీ! నన్ను గర్భమున మేసి పడరాని పాట్లను పడుటలును, కంటవత్తిపెట్టుకొని కంటికి రెప్పవలె నన్ను సాకి పెంచిన విధములన్నియును, నేను తెలిసి తెలియక చేసిన దోషము లన్నియు క్షమించి బుద్ధులు చెప్పుటలెల్లను, కులము, శీలము, గుణము, యోగ్యత కలుగజేయుటకు నీతులు జెప్పుటెల్లను, పాదములు నేలమోపిన అరిగిపోదునని అఱచేత పెట్టుకొని పెంచిన పాట్లన్నియును చివఱకు దుష్టుడైన క్రూరరాక్షసునకు చిక్కి నేను కష్టపడుటచే వ్యర్థములై పోయెను గదా. నేనాటలకు వెళ్లినచో ఒక్క నిమిషము నన్ను చూడకున్న మాటిమాటికి నన్ను వెదుక వచ్చెడిదానవే! తల్లీ! యిక నెవ్వరి పల్కులు విందువో గదా! కూతురా యని పెద్దగా గొంతెత్తి యెంతగా నేడ్తువో గదా తల్లీ! కటకటా! ఇది యెంతటి దుర్దినము. కులము, మానము, శ్రేష్ఠమైన సద్వ్రతము నశించి పోయెను గదా. సాటివారలలో నగుబాటు కలిగెను గదా. ఈ కుటిలాత్ముని నిర్బంధముచే తండ్రికి ప్రాణభర్తకును భూమిపై తలవంపులు తెచ్చితినే! స్పష్టముగా నేను మందభాగ్యురాలను. అయ్యయ్యో! ఓ ప్రాణనాథా! నీవభిమాన మానవంతుడవు. నానిమిత్తముగా నీ కవమానమునే విధముగా భరించెదవో? ఎట్లయ్యెదవో కదా. ఈ దానవుని చేత జిక్కి ఇట్లు తత్తరమందుచున్నాను ఓ ప్రాణేశ్వరా! ఓ వల్లభా! నీ ముఖమునెట్లు చూడగల్గుదునో గదా. నీ మనస్సు నెంతటి శోకము చుట్టుముట్టినను నా ముఖము చూచినచో ఆ దుఃఖమంతయును దొలగి సంబరపడెదవు. ఎల్లప్పుడును ఇంక దుఃఖమెట్లు పొందెదవో గదా. నాథా! నేనొంటరిగా నుండగా బాలా అని బాలచంద్రుని వంటి నుదురు గలదానా యని పిలుచుచు ఏవేవో లీలల తేలించెదవు కదా. ప్రాణేశా!

ఇంక విరహముచే తపించి నీ వెట్లొదువో గదా. అందరిలో పని సందడిలో నేనుండగా ఏమి తెలియని వానివలె దూరముననే యుండి చేతులతో ఏదో పని చేయుచు క్రీగంటి చూపు నాపై నెచ్చటెచ్చటనో పరపి సందు చూచి పరిహాసముతో గూడిన సంజ్ఞలచే నన్ను నవ్వింతువు. అది పెద్దలు చూచినచో బిడియపడుదువు. నీ ఆరాటమును జూచి నేను నవ్వగా అదియేమి అని అడిగినవారికి ఏవో అబద్ధపు సమాధానములు చెప్పుచుందును. ప్రాణనాథా! నీకు సంతోషమును గలిగించుటకై నే నవకాశమును గల్పించుకొని వచ్చిపోవుచుందును గదా. నీ ప్రేమ గొప్పదనమును నీ వలపు సొంపును అప్పుడు తెలిసికొన జాలనైతిని. ఇప్పుడిట్ల నాథనయితిని. వనములందు జలకేశులందు మనము విహరించునప్పుడు నా మనస్సునకు తెలియునట్లు పువ్వుగుత్తులను ఫలములను జూపించి పలికెడి నర్మభాషణములను తలచుకొని బాధనొందుచున్నాను. నాథా! ఓ అన్నలారా! ఆడుబిడ్డనని, అత్తవారింటికి వెళ్లుదాననే గాని ఇంట నుండనని నన్ను మీరధికమైన ప్రేమతో ఆదరింతురు గదా. అక్కటా! ఏ అపురూపపు పదార్థము లభించినను మీరేమియు ముట్టక యింటికి దెచ్చి చెల్లెలా! యని అక్కా! యని పిల్చి చనవుతో నాకిచ్చుచుందురే. నా గతి యిట్లగుటకు ఓ తోబుట్టువులారా! మీరలెట్లు తపింతురో గదా. అన్నలారా! మీరు భార్యలతో సంసారములు చేసికొనుచుండగా నేను నా భర్తతో గలిసి యచ్చటికి వచ్చి ఆడుబిడ్డతనము చేయుదునని సంతోషించుచుందుదానను గదా. పాలు ద్రావుచున్న తొలిచూలు చిన్నారిని ఈడ్చివైచి బిగ్గరగా ఏడ్చుచుండగా ఈ నీచుడు నన్ను లాగికొని తెచ్చెను. అయ్యయ్యో నేను గన్న నా ముద్దుబిడ్డ గతియేమైనదో గదా. అయ్యో! నా కన్న బిడ్డకు ఏ కరుణ గల కాంతయైనను స్తన్యమిచ్చి తల్లియై పెంచునా? నోరెరుగని నా బిడ్డకు ఏ కాంతయైనను దయయుంచి వేళకు అన్నము పెట్టునా? మంచి చెడ్డ యెఱుగనివాడు. మంకుపట్టు వీడనివాడు. ఆకసుగందుకు ఏ గతి పట్టునో గదా. ఆటలను మరగి ఆకలెరుగడు. వానిని పిలిచి యెవ్వరింత పిడుచ పెట్టెదరో గదా. అక్కటా! పుత్రా! నాయనా! హా కుమారా! తండ్రీ! ఏల పుట్టితివిరా ఇట్టి భాగ్యహీనురాలి కడుపున? తల్లిలేనట్టి బిడ్డవై ఓ తనయకుఞ్జా! ఏ విధముగా బ్రతికెదవో గదా! నెల తప్పినది మొదలు మిక్కిలి సంతోషించి ముద్దు కుమారుని కనెదనని ఆ సుందరమైన బిడ్డని ఎంతయో లాలించుచు, ముద్దులాడుచు, కలకలమని నవ్వించుచు, పనియున్నదని కారణము చెప్పి ప్రేమతో తండ్రి చేతికిచ్చి ఆ నెపముతో భర్తను సంతోషపెట్టెదనని తలంచితినే. అయ్యో! అన్నా! కుమారా! నిన్ను కడుపార కనుటే గాని బాల్యపు చిన్నెలో వన్నెలో అందమైన పనులనో తేనెలు గారు మాటలనో అందమైన ఆటలనో చూచు పుణ్యమును చేయనైతిని. కుమారా!

పూర్వజన్మమున నే స్త్రీరత్నమును పుత్రవిహీనను చేసితినో గదా. కటకటా! పూర్వము నేనెంతటి పాపమును చేసితినో. ఈ విధముగా సహింపరాని విధముగా కష్టసముద్రమున మునుగ వలసి వచ్చినది. ఇంకెట్లు తీరమును జేరుదాననో గదా. ఓ మృత్యువా! నీకు నమస్కరించెదను. వ్యసనము నందియున్న నన్నొక్కత్రుటిలో తటాలున తీసికొనిపొమ్ము. నీకు పుణ్యముండును. ఏల ఈ మానుష్య లోకము. ఇంతకంటే అధమమైన దున్నదా? ఇస్సీ! సూర్యుడుదయ కాలమందే చుక్కల సమూహమును నశింపజేయునట్లు బలహీనుల యిన మా పతులనితడు చంపెను గదా. ఇతడు చంపుట యందాసక్తిగలవాడు. క్రొత్త క్రొత్త వధోపాయములందాసక్తుడై సంకోచమును వదలి అనేక పాపములను చేయుచుండును. అయ్యయ్యో! ఈ పాపాత్ముడు పరాక్రమమందును దుష్కర్మలనాచరించుట యందును సాటిలేనివాడు. వీనిని సంహరించు వాడొక్క రాజైనను లేడయ్యెను గదా.

## చెఱబడిన స్త్రీలు రావణుని శపించుట:

పరాంగనలందు కుతూహల పడుట సాటిలేని పాపహేతువు. వీడు దుర్బుద్ధియై పరస్త్రీలమైన మమ్ము ఇష్టముతో చెరపజూచుచున్నాడు. ఈ పాపాత్ముడు పరస్త్రీ కారణముగా సంహరింపబడుగాక. మేము పతివ్రతలమైనచో ఇదియే సత్యమగును గాక అని తిట్టగా ఆకాశమున దేవదుందుభులు మ్రోగెను. పుష్పవర్షము గురిసెను. అంత నాక్రూరాత్ముడు పతివ్రతల శాపముచే కళావిహీనుడయ్యెను. పరమపతివ్రతలైన స్త్రీలు తిట్టినచో ప్రభ తరుగుట ఆశ్చర్యమా? ఆ సాధ్వులైన స్త్రీల కోపపు మాటలచే మనస్సునందు చిన్నబోయినవాడై రాక్షస సమూహముచే పూజింపబడుచు హాయిగా లంకకు పోయెనో లేదో అంతలోనే సంతాపము నందిన మనస్సు గలదై ధారలుగా కారుచున్న కన్నీటితో రావణుని పాదములు కడుగుచు శూర్పణఖ హా యని నేల వ్రాలెను.

## శూర్పణఖ రావణుని నిష్ఠురము లాడుట:

అట్లు పాదములపై బడిన చెల్లెలిని లేవనెత్తి ఓదార్పు మాటలతో అమాయికురాలా! యేల యేడ్చెదవు. నీలో గలిగిన కోర్కెయేమో చెప్పుము వేగముగా తీర్చెదను. అని అడుగగా ఎఱ్ఱనైన కన్నులు గల శూర్పణఖ కనుల వెంట కారుచున్న కన్నీటిని తుడుచుకొని అన్నా! యేమని చెప్పుదానను. నీవు బలాఢ్యుడవు. నీయొక్క బలముచే నన్ను భర్తృహీనను గావించితివి. నీవు వీరులైన కాలకేయులను సంహరించుచు నా ప్రాణప్రియుడైన భర్తను చేతులార చంపితివే. అయ్యయ్యో! ఇది నీకు న్యాయమేనా? ఈ విధముగా స్వబంధువుచేతనే

నా ప్రాణముల కన్నను ప్రియమైన నా భర్తకు మరణము సంభవించినది. రావణా! నీచే నా సౌఖ్యమంతయును చెడిపోయెను గదా. నా పాలికి నీవు అన్నవా? నీ వీ విధముగా నన్ను విధవను జేసి హింసించితివి. ఇంక నిన్నెన్నియనిన నేమి ఫలమున్నది? నీవంటి యన్నలు జగత్తు నందుందురా? ప్రీతియున్నచో అందములైన భూషణములో వస్త్రములో ధనములో చెల్లెంద్రకై యిచ్చుచు ప్రీతితో సంచరింతురు. లేకున్న సంతోషముతో మృదువైన మాటలాడి మన్నింతురు లేదా మాటలాడక యున్నను మేలే గదా. అంతేగాని అన్నా! నీవలె చెల్లెలినెవరైనను విధవను చేయగలిగిరా? యుద్ధము లందైనను ఎవ్వరును అల్లుంద్రను చంపరాదుగదయ్యా! సంగరమున నీవే మరదిని సంహరించితివి గదా. అట్లు చేసినను ఇది దుర్మార్గమని సిగ్గును పొందవుగదా. నీ కారణమున నాకు భూమియందు బ్రతికి నన్నినాళ్లు అధికమైన దుఃఖము కలిగెను గదా. అయ్యయ్యో విధవయను పేరు పొందితిని గదా.

## రావణుడు శూర్పణఖ నూరార్చుట:

అని యేడ్చుచున్న చెల్లెలిని ప్రేమతో ఓదార్చి అమ్మా! ఇదేమిటి కమ్మ నీవిట్లు పరితపించెదవు. ఎవరి వలనను నీవు భయపడకుము. నీ యిష్టము వచ్చినచోట సంతోషముగ నుండుము. నీవు కోరిన వన్నియు నేను సంతోషముతో ఇచ్చెదను. ఏ కొరత లేకుండా ప్రేమతో జూచెదను. యుద్ధమత్తతతో జయమును గోరి దట్టముగా బాణములను వేసితిని. ఆ యుద్ధరంగముననెవరు మనవారో యెవరు శత్రువులో యెఱుగనైతిని. ఆ సందడిలో నీ భర్తను జంపితిని. జరిగినదానికి ఏడ్చిన ఫలము గలదా? ఇప్పుడు జరుగవలసిన కార్యమును చెప్పెదను వినవమ్మా! నీ తల్లి తోడబుట్టిన దాని కొడుకు ఖరుడను సోదరుడు సిరి గలవాడు దండకాటవి యందు పదునాల్గువేల రాక్షససేనతో నుండి బలవంతుడై నీ యాజ్ఞలో నడచుచు దానము, ప్రయాణము, సమ్మానము మొదలైన కార్యములనెల్లను, అతడు నీకు సమకూర్చును. విచారింపవలదు. వీరిని వేగముగా దండకాటవికి బంపెదను. దూషణుడతనికి సేనాపతిగా నుండును. అట్లు ఖరుడు మన రాక్షసులకు రాజై నాయాజ్ఞచే ఏలుచుండును. నీవతని యొద్దనుండుము. అని పలికి పదునాల్గువేల ఘన శూరులతో ఖరుని దండకాటవికి బంపెను. అతడందుండ శూర్పణఖయు సుఖముగా అతనియొద్ద నివసించెను.

★★★

# ఇరువది యైదవ సర్గము

## రావణుడింద్రజిత్తును జూడ నికుంభిలకు బోవుట:

అట్లు రావణుడు దండక నేలుటకు ఖరుని నియమించి చెల్లెలికి ఎక్కుడు సంతోషమును గలుగజేసి తాను స్వస్థత జెందిన మనస్సు గలవాడై కొడుకును జూచుటకై నికుంభిలయను నుపవనమున కేగెను. అచ్చట నూరు యూపస్తంభములు గలదియు, యజ్ఞశాలలు గలదియు కాంతిచే సొంపు గలిగియున్న యజ్ఞమును జూచి, అందుకమండలువు, శిఖ, ధ్వజము ధరించినవాడును, సూర్యసమానతేజుడును లేడి చర్మమును ధరించినవాడును, భయంకరుడును అయిన తనపుత్రుడైన మేఘనాదుని జూచి కౌగిలించుకొని నా పుత్రరత్నమా! నీ వాచరించిన కార్యమేదియో సమస్తమును ఎఱిగింపుమనగా దానికి శుక్రుడిట్లు చెప్పెను. ఓ రావణా! నీ కుమారుడు చాల యజ్ఞములు చేసినాడు. విజృంభించి గోమేధము, అగ్నిష్టోమము, వైష్ణవము, రాజసూయము, అశ్వమేథమును దక్షిణలతో చేసినాడు. దుష్కరమైన మహేశ్వర యజ్ఞమును చేసి ప్రత్యక్షమైన శంకరుని చేత అద్భుతములైన వరముల నందినాడు. ఆకాశ గమనము, కామగమనము గల స్థిరమైన ఒక దివ్యరథమును, తామసి యను పేరు గల దారుణమైన మాయను పొందినాడు. తేజముతో ప్రకాశించినాడు. ఆమాయా బలముచే నితడు యుద్ధమున ఆకాశమున తిరుగుచున్నవాడై గొప్పవారైన దేవాసురులకు గూడ ఏ మాత్రము కనుపింపక విరోధులను బాధించును. అక్షయములగు బాణములతో నిండిన అమ్ములపొదులును, శత్రుదుర్భేద్యమైన ధనుస్సును, శత్రువు ప్రాణముల దీయు గొప్ప శక్తి గల అస్త్రమును ఈ వరములనన్నింటిని ఓ రావణా! నీ పుత్రుడు పొందెను. యజ్ఞము కూడ పూర్తిగా నెరవేరినది. నీ రాకకై యెదురు చూచుచున్నాడు అని చెప్పగా ఆ రావణుడిట్లనెను. దీనివలన మేలేమియులేదు. మన విరోధులగు ఇంద్రాది దేవతలను భక్తితో మేలైన వస్తువులతో యజ్ఞములలో పూజింతురా? అయినదేమో అయినది. అదియైనను మేలే కదా. నిజము. బుధులలో శ్రేష్ఠుడవైన ఓ శుక్రాచార్యా! మాతోరండు మా నివాసమునకు పోవుదము అనుచు రావణుడు విభీషణునితోడను తనపుత్రుని తోడను గూడినవాడై వెళ్ళి కన్నీరు కార్చుచున్న ఆస్త్రీలను పుష్పకము నుండి దింపగా ఆ స్త్రీలను జూచి

## విభీషణుడు రావణునితో మధుడు కుంభీనసి నపహరించెనని చెప్పుట:

వారియందు రావణాసురునకు గల కాంక్ష నెఱింగి ధర్మాత్ముడైన విభీషణుడిట్లు పల్కెను. అన్నా! కీర్తిని ధనమును, వంశమును నాశన మొనర్చునట్టి కార్యమును సల్పుట నీకు తగినదేనా? వారి జ్ఞాతులను జంపి యధేచ్ఛగా పరస్త్రీలను వారలు కన్నీరు గార్చుచుండగా ఇట్లు దెచ్చుట నీకు తగునటయ్యా! ఈ స్త్రీలను వారి చుట్టములను జంపి నీవు తెచ్చినట్లే నిన్ను మనస్సు నందు లెక్కచేయక మదించినవాడైన మధుడు కుంభీనసిని బలవంతముగా నెత్తుకొనిపోయెను అనగా రావణుడు క్రుద్ధుడై యిదియేమియో నేనెఱుగను. మధుడెవ్వడు? నీవే చెప్పుమనగా విభీషణుడిట్లనెను. నీవు చేసిన అనేక విధములైన పాపఫలితము వెను వెంటనే యిట్లు దాపరించినది. చెప్పెదను వినుము. అసుర శ్రేష్ఠుడును, ప్రాజ్ఞుడును, గొప్ప చరిత్ర గలవాడును అగు మాల్యవంతుడనువాడు మన తల్లితండ్రియయిన సుమాలికి అన్న. మన తల్లికి పెదనాన్న. కనుక అతడు మనకు తాత. ఆ వీరుని పుత్రిక అనల – ఆమె యొక్క ప్రియపుత్రికయే కుంభీనసి యను పేరు గలది. మన తల్లి చెల్లెలికి కూతురు గాన మనకు చెల్లెలే గదా. ఆ వావి (వరుస) ఇప్పుడైనను జ్ఞప్తికి వచ్చినదా? ఆమె పెండ్లి కెదిగిన చిన్నపడుచు. నీ పుత్రుడు యజ్ఞము చేయుచుండెను. నేను నియమముతో నీటిలోనుండి తపము చేయుచుంటిని. మన సోదరుడైన కుంభకర్ణుడు నిద్రలో మునిగి యుండెను. కాన నీ మంత్రలయిన రాక్షసులను జంపి నీ యంతఃపురమున నిద్రావస్థలో నున్న ఆ బాలికను మధుడు అత్యధికమైన మదముతో తీసికొని వెళ్లెను. శాంతి వహించి మేమతనిని జంపబూనమైతిమి. కన్యను ఒక యోగ్యుడైన భర్తకిచ్చుట ఆమె సోదరులకు అర్హమైన కార్యము గాని యయ్యయ్యో! అటువంటి కన్యాదానముచే కలుగు పుణ్యమును పొందు భాగ్యము పొల్లుపోయినది గదా. నీవుచేసిన పాపమే ఈ విధముగా ఇప్పుడే దాపరించినది. ఘోరమైన పాపములు వ్యర్థములై పోవునా? అని విభీషణుడు చెప్పగా

## రావణుడు మధుని మీదికి దండయాత్రకు బోవుట:

రావణుడు తాను చేసిన మహాపాపముల చేత పీడితుడై క్షోభించు సముద్రము వలె తన సైన్యనాథునితో నిట్లనెను. నారథమునిప్పుడే సిద్ధపరపుము. సైన్యమును నాల్గువేల అక్షౌహిణుల నిప్పుడే బయలుదేర దీయుము. కుంభకర్ణుడు మొదలైన రాక్షసశ్రేష్ఠులు రథములపై నెక్కుదురు. ఇప్పుడే రావణుడన్న భయములేని యీ మధుని వధించి దేవతల

పురమును జయింప వెళ్లెదను అని క్రోధము నందినవాడై పలుకగా ఆ మంత్రియు విజృంభించి సర్వసైన్యములతో తాను ప్రయాణమై వెళ్లెను. ఆ సైన్యములకు ముందుగా మేఘనాథుడు వెళ్లెను. మధ్యమందుండి దశకంఠుడు వెళ్లెను. గొప్పబలవంతుడైన కుంభకర్ణుడు వెనుక దిక్కున సేనలను గాచుచుండెను. విభీషణుడు తనకు తోచిన ధర్మకార్యములు చేయుచు లంకయందే యుండెను. తక్కిన వారందఱును గాడిదలను మొసళ్లన, పాములను, గుఱ్ఱములను ఎక్కివేగముగా ఆకాశము నిండునట్లుగా శబ్దములు చేయుచు మధుని పురమార్గమును బట్టిపోయిరి. దేవతల మీది విరోధమును తలంచుచు రావణుడింద్రుని గెలుచుటకై వెళ్లుచున్నాడని తెలిసినవారై రాక్షసశ్రేష్ఠులు రావణాసురుని వెనుక నడచిరి.

## కుంభీనసి మధుని రక్షింప రావణుని వేడుకొనుట:

రావణుడిట్లతివేగముగా మధుని పట్టణమునకు వెళ్లి అందు మధుని గానక తన చెల్లెలైన కుంభీనసిని జూచెను. అదియు రావణుని జూచి గుండెలదరగా తలవంచి రావణుని పాదములపై వ్రాలెను. అతడు భీతిలకుము చెల్లెలా! లెమ్ము నీకేమి చేయవలెనో చెప్పుము చేసెదను అనగా ఆ కుంభీనసి అన్నా! నాపై నీకు దయయున్నచో నా భర్తయైన మధుని చంపవలదు. ఓ శౌర్యవంతుడా! కులస్త్రీలకు భయములలో నెల్ల దుస్సహభయము వైధవ్యభయము. సాధ్వులకు దానిని మించిన జడుపు వేరొకటి లేదు. [విధవ శూర్పణఖ చర్యవలనను, కుంభీనసి వాక్యముల వలనను పతివ్రతలగు రాక్షసస్త్రీలు గూడ విధవావివాహము గర్హ్యమని భావించిరనియు, విధవా వివాహము బహిరంగ వ్యభిచారమునకు మారుపేరనియు నేర్పడుచున్నది] నీవు సత్యవచనుడవు కమ్ము. రాక్షసకులేంద్రా! నా ప్రార్థనను మన్నించి ఆదరింపుము. నీవు భయపడవలదని ప్రేమతో పల్కితివి. అసురనాథా! ఆ మాటనే పాలింపుము అని చెప్పుచున్న చెల్లెలిని జూచి రావణుడిట్లనెను. చెల్లెలా! ఏడీ నీ భర్త? నేను దేవతాసమూహములను యుద్ధభూమిలో గెలుచుటకై వెళ్లుచున్నాను. విషయమును నీ పతికి వినిపించి వేగముగా నాకు తోడుగా రమ్మనుము. ఇంక నీ స్నేహముచే ఆతనిని చంపనొల్లను సోదరీ! అనగా అట్లేయని కుంభీనసి యింటియందు నిద్రించు భర్తను మేల్కొలిపి నా సోదరుడైన రావణుడు శత్రువులను గెల్వబోవుచు నీదుసాహ్యమును పొందు కోరికతో వచ్చినాడు గాన రాక్షసనాథా! నీవు నీ చుట్టములతో గలసి స్నేహభావముతో అతనికి తగిన విధముగా అర్ఘ్యపాద్యములనిచ్చి

బాసటగా వెడలుడు. అనగా అట్లేయని న్యాయమైన విధముగా రాక్షసనాథుని జూచి ఆదరముతో తగిన విధముగా పూజించెను. ఈ విధముగా మధుపురమున రావణుడు వారి పూజలంది ఒక్క రాత్రి యచ్చట నివసించి తెల్లవారుజాముననే బలములతో బయలు వెడలి వెండికొండ సమీపమున విడిసెను.

★★★



# ఇరువది యాఱవ సర్గము

## రావణుడు మధునితో కైలాస ప్రాంతమున విడియుట:

ఇట్లు రావణుడు కైలాస పర్వత ప్రాంతమున విడిసి యుండగా సూర్యుడు పడమటి కొండకు వెళ్లి అందు తన శరీరమును దాచెను. అట్లు సూర్యుడస్తమించగనే తాను విడిసియున్న కొండ యొక్క కాంతులను దాల్చి చంద్రుడు నిర్మలముగాను అందముగాను ఉదయింపగా సైన్యములన్నియును నిద్రించుచుండుటను జూచి ఆ దశకంఠుడు రాగరసావశాత్ముడై చంద్రుని కిరణములచే ప్రకాశించు ఆ వెండి కొండ సొగసులను చూచుటకు కూర్చున్నవాడై వికసించిన పద్మములతో నిండిన మందాకినీ జలముల సొంపును ఆ వనముల అందమును తన కానందమును కల్గించుచుండగా మందారము మామిడి, కలిగొట్టు, తులసి, ఏఱుమద్ది, లొద్దుగు, నందివర్ధనము, డావరడంగి, అడవిమొల్ల, తుమికి, గేదగి, అరటి, మొల్ల, కంకేళి మున్నగు వృక్షములతో అందమైన వనములందు మన్మథుని బాణముల వ్యథతో అనురాగము నంది మధురమైన కంఠములు గల కిన్నర స్త్రీలు మోహాధిక్యముతో తాము వలచిన ఆ దృశ్యములు మనస్సునకు చూపుకు అధికమైన ఆనందమును గలిగించుచుండగా, మన్మథుడు మనసులో హెచ్చైన సందడి పెట్టుచుండగా ఆ రావణుడు మందబుద్ధివలె అట్లే చూచుచుండెను. కావి పాఱిన సోగలైన కన్నులతోను, మత్తుచే సొక్కిన చిత్తములతోను, యౌవనము సౌందర్యము గల స్త్రీలతో విద్యాధరులు కేళి దేలుచుండగా, యక్షకాంతల పాటలు ఆశ్చర్యకరమైన మాధుర్యమును వెలార్చుచు మన్మథుని వింటి చిఱుగంటల రవళియో యనునట్లు కలయ వ్యాపించుచుండగా మందమారుతములచే కంపించుచున్న వృక్షములు తేనెలొలుకుచున్న పూలవాన గురిసి ఆ పర్వతమును బుక్కాము పొడులతో ముంచుచున్నట్లుండగా పంక్తి ముఖుడు తిలకించెను. ఆ తేనెలయొక్కయు పుప్పొడుల యొక్కయు పరిమళములను మోసికొనుచు రావణుడు మనోవికలత్వము బొందునట్లుగా మోహము పుట్టించుచు సర్పముల మేతలైన కమ్మని గాలులు వీచెను. ఆ యక్ష స్త్రీల మధురగానము, అందముగా విరిసిన పూవుల కాంతి, సుగంధ భరితములైన చల్లని గాలుల సొంపు, కైలాసగిరి మనస్సు నందు కలిగించు ఇంపు,

అందరి మనస్సులను హరింపగల అందమైన ఆ రాత్రి తీరు, నిండు చంద్రుని వెన్నెల సౌరు, మదన తాపముచే వ్యథ చెందు జక్కవ దుఃఖము, వెన్నెలపులుగుల ఆహ్లాదము ఇవి అన్నియు ఒక్కటై రాగా రాక్షసరాజు కామవశుడై కలత జెంది విచారించి తాపముచెంది చంద్రుని వంక జూచి నిట్టూర్పులను విడచి విడచి తలయూచి యూచి బాధ నొందెను.

## రంభ కైసేసి కొని రావణుసేనామధ్యంబున జనుట:

అట్లు మన్మథ తాపముతో వేగుచు రావణుడుండ దివ్యమైన ఆభరణములను ధరించి, నందన వనమున పూచిన పువ్వుల మాలలు శరీరమున లంకరించుచుండ, చందన గంధము అందముగా శరీరమున బూసి మందారపుష్పములను కురులందు అలంకరించుకొని అందమైన ముఖము పూర్ణచంద్రుని పరహసించుచుండగా, కన్నులజంటకు విందు చేయు అందముతో నొప్పుచు రతికానుకయై ఒపుచున్న బలిసిన పిరుదులపై జాఱు మొలనూలు మెఱయుచుండగా, చెక్కిటి మీదను, ముఖపద్మము మీదను చుక్కబొట్టు పెట్టి ఆరు ఋతువులందును పూయు పూలదండల వరుసలు సువాసనలను వెదజల్లుచుండగా, సిగ్గు, కాంతి, మెరుపు, కీర్తి అను గుణములచే లక్ష్మికి సాటియో యనునట్లు నీలమేఘము వంటి ముసుగు ధరించి సొగసు తీవి ప్రకటమగునట్లు గర్వముగా వెడలుచుండెను. కనుబొమ్మలు మన్మథుని విండ్లుగా, చంద్రబింబమే అందమైన ముఖపద్మముగా, ఏనుగు తుండములే తొడలుగా చిగురుటాకులే చేతులుగా తన సేనలమధ్యమందు వెళ్లుచున్న మెఱుపు తీగ వంటి మేను గల ఆమెను చూచి మదన పరవశుడై దిగ్గున లేచి వెళ్లి చేయిపట్టుకొని ఆ దుర్మార్గుడగు రాక్షసుడు కోర్కెతో ఆ సుందరితో నిట్లనెను.

## రంభా రావణ సంవాదము:

ఓ కలువకంటీ! యెచ్చటికేగుచున్నావే? ఏమి పొందుటకై ఓ అబలా! నీవే యేగుచున్నావు? ఎవ్వని పుణ్యము లిపుడు ఫలించెనే? చెలువా! ఎవ్వనిని సంతోషమున దేల్చెదవే? ఓ యింతీ! ఇప్పుడెవ్వడు తన మన్మథతాపము తీరుపోవునట్లు నీతో భోగించును? పద్మముల యొక్కయు, కలువల యొక్కయు సుగంధము గల నీ వదనామృతము నమృతము వలె త్రాగుచు ఎవ్వడు మైమరచునే? ఓసీ! పిరికిదానా! ప్రకాశించు నీ స్తనములు ఇరుకుగా నుండి యెదనదుముచున్న విధముగా చూపు నాపై కరుణ చూపుమయ్యా! ఇట్లు పల్కుట సరికాదు మానుమయ్యా! నన్ను పరులు పరాభవించినచో అండగా నిల్చి రక్షించుటకు

తగిన కర్తవు నీవై యుండి పరునివలె నన్ను నగుబాటు పాలు చేయుట న్యాయమా? మామా! ఈ విధముగా పలుకకుము. వలదు, వలదు. నన్ను మన్నింపుము. నాపై కోరికను మానుము. మామయే కోడలిని బట్టి మానము దీయుట మరియాదయగునా? అని చెప్పుచున్న రంభను కేవలము చూచుట మాత్రముచేతనే సంతోషముతో నిండిన మనస్సు గలవాడై దశగ్రీవుడు పాదములపైకి వంచిన ముఖము గల ఆమెను జూచి నవ్వుచు ఇట్లు పలికెను. భామామణీ! నన్ను మామా యని పిలుచుచున్నావు నీకు నేను మామ నెట్లైతినో చెప్పుము ఏమేమీ? భాగ్యశాలినీ! నా పుత్రునకు భార్యవై కాపురము చేసితివటవే? అని యడుగగా రంభ యిట్లనెను. రాక్షసరాజా! ఔను. నేను న్యాయరీతిగా నీ తనయునకు నేను పెండ్లమును. ఇది నిజమ. నీవును ధనాధిపతియు తమ్ముడును అన్నయు నగుదురు గదా. వినుము. ఆ కుబేరుని పుత్రుడే కదా భూమి యందు ప్రఖ్యాతి చెందిన నడవడిగలవాడును శౌర్యము గలవాడును అగు నలకూబరుడు. అతడు శ్రేష్ఠమైన ధర్మగుణము చేత బ్రాహ్మణుడు. శత్రువులకు భయము గలిగించు భుజశక్తిచేత క్షత్రియుడు. ఆగ్రహము చెందిన ప్రళయాగ్ని వంటివాడు. క్షమాగుణమున భూదేవితో సమానుడు సుమా. అట్టివాడు నీ పుత్రుడైన నలకూబరుడు. ఆ మహితాత్మునితోడి యొడంబడిక యుండుటచే నేనిట్టియలంకారములతో అతనికి మెప్పు కలిగించుటకై అచ్చటకు వెళ్లుచున్న దానను. నాకితర పురుషునిపై వలపేమియు లేదు. నా దృఢమైన భావమొకప్పుడైనను నీ పుత్రునిపై నుండి తొలగదు. నా మనవిని వినుమయ్యా! ఓ దశాననా! నన్ను విడచిపెట్టవయ్యా! నీ పుత్రుడు నా రాకకై తత్తరపాటుతో వేచి త్రోవల జూచుచుండును. అతడక్కడ మన్మథ బాణములచే బాధనొందుచుండగా నన్నిచ్చట ఆపుట నీకు తగునా? పుత్రుని సౌఖ్యమును బాపుట న్యాయమా? సజ్జనులు పోవు మార్గమున వెళ్లవయ్యా! భూమియందు మంచి కీర్తిని పొంది బ్రతుకుమయ్యా! నాకు నీవు గౌరవింపదగినవాడవు ఓ మామగారూ! నీకు రక్షింపదగినదానను. రాక్షసేంద్రా! అని యారంభ వినయముగలదై పలుకగా తానామాటలనాలకించి రాక్షసుడిట్లనెను. ఓ పద్మముల వంటి కనులు గలదానా! ఒక్క భర్తనే పొంది సాధ్వివలె వావులు పలుకుటేల? ఆ దేవతా పురమున గల మరియాదలను వావులను నేనెఱుగనా? ఓ పద్మ దళముల వంటి కనులుగలదానా! దేవతా స్త్రీకి ఒక్కడే మగడన్న మరియాద అచ్చట నున్నదా? అమరునకు భార్య యొక్కతే యనునదున్నదా? ఆ దేవతలకెల్ల వేశ్యవై యుండి యిట్లు పతివ్రత వలె పల్కెదవా?

**రావణుడు రంభను చెఱచి విడుచుట:**

అని పలికి ఆ పూబోడిని పట్టుకొని అచ్చటనున్న బండపై పండబెట్టి మన్మథకేళిచే బాధపెట్టి ఆ రాక్షసుడు వెళ్లుమని విడిచిపెట్టగా (ఇది రసాభాస రతి వర్ణనము) ఆ దేవకాంతయు రాలిన పూదండలతోను, చెదరిన భూషణములతోను, జలకేళిచే కలత చెందిన నది వలె విలాసములు తొరగి కలత చెందినదై మెల్లగా వెళ్లెను. చెదరిన కొప్పు వెండ్రుకలతోను, వన్నె తరిగిన చిగురాకుల వంటి చేతులతోను, ఆ కాంత పెనుగాలిచే చెదరగొట్టబడిన పూదీగ వలె వణకును, సిగ్గును బొందినదై భయముతో కుబేర పుత్రుడైన నలకూబరుని చేరబోయి ఆ మానధనుని జూచి చేతులు జోడించి పాదములపై బడగా ఆమె పాటును జూచి ధనాధిపతి పుత్రుడు ఓ చిగురుబోణీ! యిదేమి? యేల నాపాదములపై బడితివి? అనెను. అంత రంభ వెచ్చనియూర్పులను విడుచుచు వణకుచు ఇట్లు చెప్పెను.

**రంభ రావణునకృత్యము నలకూబరునకు దెల్పుట:**

ఓ ప్రాణవల్లభా! ఇంద్రుని భవనము మీదకు వెళ్లుటకై గొప్ప సైన్యముతో పంక్తికంఠుడు ఇందు దండు విడిసినాడు. నేను నీ సన్నిధికి వచ్చుచుండగా చూచి వేగముగా వచ్చి దారికడ్డము నిలిచి నా చేయిపట్టి లాగి ఓ సుదతీ! యెచ్చటికి వెళ్లెదవు? ఎవ్వరిదానవు? అని అడుగగా నేను అంతయును చెప్పితిని, మ్రొక్కితిని, వేడుకొంటిని. అయ్యా! అంటిని. నీ పుత్రుని భార్యనంటిని. నీ కోడలనని చెప్పితిని. నీవు మామవు కాన ఇది కూడదంటిని. వావులు చెప్పితిని. ధర్మమార్గములను చెప్పితిని. నేనేమి చెప్పినను ఆ గుణహీనుడు విడువడయ్యెను. వింటివా? ఆ రాక్షసుని చేతలను ఏమని చెప్పుదును? కాంతుడా! అయ్యో! బలవంతముగా ఒంటిగా యౌవనవతి యగు స్త్రీ చిక్కినచో తుంటరి యేది చేయునో అతడట్టి దోషమునే చేసెను. మంచి గుణములు గలవాడా! దయగల చూపుతో నన్ను జూచి అపరాధమును క్షమింపదగును. నేనబలను. మగవాని బలము మగువలకెచ్చటనైన నుండునా? అనగా విని నలకూబరు డొక్కింతసేపు ధ్యానస్థితుడై ఆ వృత్తాంతమును సర్వమును తెలిసికొని కన్నులెఱ్ఱ బడగా చేతితో నీటిని తీసికొని

**నలకూబరుడు రావణుని శపించుట:**

ఆచమనము చేసి నీటితో ముఖాద్యవయవములను శాస్త్ర విహిత పద్ధతితో తాకి పాపశీలము గల రావణుని గూర్చి ఘోరరూపముగ శాపము నిచ్చెను. తన నిష్టపడని

నిన్ను ఆ నీచుడు పరాభవించినాడు గాన ఓ కాంతా! తననిష్టపడని స్త్రీని అతడెన్నడును తాకకుండనే నొనరింతును. ఇక ముందు రావణాసురుడెప్పుడు తన నొల్లని స్త్రీని చెఱచునో అప్పుడే ఆ రాక్షసుని శిరస్సులు ఏడు ముక్కలై తప్పక నేలగూలునుగాక. [ఇట్టి శాపమే బ్రహ్మ పెట్టియున్నాడు. నలకూబర శాపము ప్రథమము. ప్రాకృత నలకూబర శాపమును లక్ష్యపెట్టక అంతకంటే తపోధికుడైన రావణుడు పుంజిక స్థలను చెఱచెను. కావుననే బ్రహ్మ శాపము పరస్త్రీని చెఱచిననే చచ్చునట్లు నలకూబర శాపము. దుర్వ్యాపారములకై కడగిన చచ్చునట్లు బ్రహ్మ శాపము. అడవియందు మాతృభావము ననే సీతను తాకెను] అని మండుచున్న అగ్ని వంటి ప్రకాశము గల నలకూబరుడని నంతనే దేవతలు పుష్పవర్షము గురియించిరి. ఆకాశమున ఘనముగా దేవదుందుభులు మ్రోగెను. దేవతలును, బ్రహ్మయు, మునులును పంక్తికంఠునకు మూడిన కీడును తలంచి సంతసించిరి. ఆ రావణుడును ఆ శాపవిధమును తెలిసికొని ఆ దినము మొదలుకొని పరస్త్రీలను మదనకేళిలో గూడుటను మనస్సునందు తలంచుట మానెను. భయమను నది యెట్టి వానికైనను తగిన మందు గదా. రావణుడు బలాత్కారముగా దెచ్చిన ఆ సాధ్వులైన స్త్రీలందఱును కుబేర పుత్రుడావిధముగా నిచ్చిన శాపమును విని మనస్సునందు భయము తొలగగా నెంతయో హర్షమును బొందిరి.

★★★



# ఇరువది యేడవ సర్గము

## రావణుడింద్రపురిపై దాడి పెట్టుట విని సురలు యుద్ధప్రయత్నులగుట:

అంత రావణుడు కైలాసమును దాటి సైన్యసమేతుడై ఇంద్రలోకమున కేగగా సముద్ర మథన ధ్వని వంటి ధ్వని పుట్టెను. రావణుని ధాటిని విని ఇంద్రుడు వడవడ వణకుచు తనను జూడవచ్చిన విశ్వేదేవతలను, వసువులను, రుద్రులను, ఆదిత్యులను చూచి యిట్లనెను. పాపబుద్ధియైన దశకంఠుడు మనలను గెలువ వచ్చినాడు. మీరు వేగముగా యుద్ధమునకు సిద్ధపడుడు. అనగా వారు వెళ్లి రావణునెదిరించుటకు తమ సైన్యములతో సిద్ధముగా నుండిరి. అట్లు దేవతా నగరముపై దుర్జయుడగు రావణుడు దండెత్తి వచ్చుటచే ఓడిన బలము గలవాడగు నింద్రుడు ధైర్యము విడచినవాడై దీనవదనముతో వైకుంఠమునకు వెళ్లి

## ఇంద్రుడు విష్ణువును జూడబోవుట:

ఆ శ్రీహరిని జూచి మహాత్మా! యేమి చేయుదును. దుర్మార్గుడైన రావణుడు నేడు యుద్ధకాంక్షతో దేవతాసమూహమును గెల్వవచ్చినాడు. ఆ గొప్ప శౌర్యవంతుడిక ఊరకే పోవువాడు కాడు. వీరబలము చేతను, మదము చేతను కన్నుగాన కున్నాడు. బ్రహ్మవరము గౌరవింపవలెను గదా. కానిచో నాకు వీడొక లెక్కయా? నీ దయచే నేను నముచిని, బలిని, వృత్రుని, శంబరుని, ప్రసిద్ధ బలశాలియైన నరకుని యుద్ధము నందు పరాక్రమముతో గెలిచితిని. ఓ పద్మాక్షా! సచరాచరములైన జగములన్నిటికిని గతియును ఆశ్రయమును నీవే కావా? ఓ దేవదేవేశా! మఱి ఇంతటికిని నీకన్న నాథులెవ్వరు? మధుసూదనుడవు, మాధవుడవు పద్మనాభుడవు సనాతనుడవు నీవే. ఈ జగములన్నిటిని నీవే స్థాపించితివి. నీ వలననే గదా నేను మనుట. సర్వలోకములను నీవే పుట్టించెదవు. అన్నియును ప్రళయవేళ నీలోననే ప్రవేశించును. ఆ రాక్షసుని గెలుచుటకు ఒక ఉపాయమును చెప్పబోవయ్యా! చక్రమును బట్టి నాకు సాయపడెదవా?

## విష్ణువింద్రునితో తాను యుద్ధమునకు రానని చెప్పుట:

భయము చెందిన మనస్సు గలవాడై యిట్లు వేడుకొనుచున్న దేవేంద్రుని జూచి నారాయణు డిట్లు చెప్పెను. ఓ మహేంద్రా! భయము చెందకుము. నీ కార్యము నెరవేరును. వినుము. ఈ రాక్షసుడు దేవరాక్షసుల సమూహములకు జయింపరాని వాడు సుమా. బ్రహ్మవర ప్రభావముచే ఇంక వీనిని సంహరించుట కెట్లు శక్యమగును. నేను సహజమైన బుద్ధిశక్తితో తెలిసికొంటిని. పుత్రునితో గలిసి ఈ రావణుడు చాలా భయంకరమైన కృత్యమును చేయగలడు [ఇది యింద్రుడు చెఱబడుటే గౌతమ శాపము వ్యర్థపరుపరాదు గదా] నన్ను భయంకరమైన యుద్ధమునకు సహాయపడుటకు రమ్మని పిలిచితివి. నేనిప్పుడు వానితో యుద్ధము చేయను. వెడలుటకు మనస్సు నందిష్టము కలుగుటలేదు. ఎందుచేత నంటివేని వినుము. విష్ణువు శత్రువులను యుద్ధమున సంహరింపక మరలడు సుమా. ఆ రాక్షసవరుడు బ్రహ్మవరముచే రక్షింపబడినవాడగుటచే ఆ నియమమిప్పుడు చెల్లదు గదా. అయినను దేవనాథా! నా ప్రతినను తెల్పెదను వినుము. రావణుని నేనే చంపెదను. ఓ శచీపతీ! సమయము చూచి మేలు చేయు తలంపుతో దేవతలకు సంతోషము కలిగింతును ఇది నిక్కము. ధైర్యమును విడువకుము. నీ విస్తృతమైన బలముతో వేగముగా వెళ్లి వానితో యుద్ధము చేయుము అని చెప్పగా

## దేవరాక్షస యుద్ధము:

ఆ పాకశాసనుడును ఆదిత్యులును, వసువులును, రుద్రులును, అశ్వినులును, మరుత్తులును వెంటరాగా యుద్ధమునకై వెడలగా, రాత్రి గతింపగనే రాక్షససేనతో దేవతలసేన తలపడగా అక్షయమైన ఆ రాక్షస సైన్యమును జూచి దేవత లెల్లరును సంక్షోభము నందిరి. క్రూరములైన నానావిధములైన ఆయుధములతో కొట్టుకొనగా రెండు పక్షముల వారికిని ఘోరయుద్ధము జరిగెను. అంతలోన రావాణాసురుని మంత్రులయిన అకంపనుడు, ప్రహస్తుడు, ఖరుడు, నికుంభుడు, యజ్ఞకోపుడు, శుకుడు, నరాంతకుడు, సంహ్లాదుడు, జంబుమాలి, సూర్యశత్రుడు, మారీచుడు, సుప్తఘ్నుడు, సారణుడు, దుర్ముఖుడు, ధూమకేతువు, దూషణుడు, కరవీరనేత్రుడు, త్రిశిరుడు, మహాపార్శ్వుడు, మహాదంష్ట్రుడు, ఘనబలుడైన అతికాయుడు, విరూపాక్షుడు, ఘటోదరుడు, మహోదరుడు, మహాప్రహ్లాదుడు, మహాకాయుడు, దుర్ముఖుడు, అతిబలుడైన దేవాంతకుడు కలిసి రాగా

శౌర్యధురంధరుడైన రావణుని తాత సుమాలి వేగముగా దేవతలను భయమందునట్లు ఘోరమైన అస్త్రశస్త్రములచే గూలనేసి వాయువు మబ్బులను తోలునట్లు పారద్రోలెను. పైనబడి బాదుచున్న రాక్షసుల ధాటికి తాళలేక భయపడి సింహములు తరుమగా హీనమృగములు పారిపోవునట్లోపికలు లేనివారై పారిపోవుచుండగా చూచి యోధశ్రేష్ఠులైన త్వష్టయు పూషుడును ఆక్షేపించుచు విరోధుల సేనలను విక్రమముతో మార్కొనగా అధిక బలశాలియు, వసువులలో నెనిమిదవ వాడును వీరశ్రేష్ఠుడును అయిన సావిత్రుడప్పుడు విరోధులు గగ్గోలు పడునట్లు తాకగా ఆ యుద్ధము భూతజాలములు మహాభీతి నొందునట్లయ్యెను. వాడియైన ఆయుధముల అంచుల దెబ్బలచే దేవతల సేనలను రావణుని సైన్యము వధింపగా దేవతలును శత్రుసేనాసమూహములను వివశమై కూలునట్లు సంహరించిరి. అప్పుడు దేవతలనెడి మేఘములు కురియు బాణవర్షమును తొలగద్రోయుచు వేగముగా భయంకరమైన పెనుగాలి వలె వచ్చి సుమాలి శూలములను కుప్పలుగా పయికి ప్రయోగించి కలత నొందించి తలలు పగుల నేయగా దేవతలు భయకంపితులై తూలి పారిపోయిరి. ఆ సుమాలి సాహసమును, ఈసు లేక దేవతలు బిక్క మొగము వేసిన తీరును జూచి ఆ సుమాలి వలెనే సావిత్రుడు తన సైన్యము వెంటరాగా ఆ రాక్షసున కెదురుగా వెళ్లి జీమూతము వలె నిల్చి వేగముగా బాణముల ధారలచే గప్పుచు ఆ భీమబలుని నిలువరింపగా అచ్చట ఇరువురు వీరులకును యుద్ధము భయంకరమయ్యెను. వసువులలో వీరుడైన సావిత్రుడు వాడియైన బాణసమూహములను గురిపించి శత్రువు యొక్క రథమును మూడు ముక్కలుగా జేసి పొగలేని జ్వాలలతో మండు అగ్నితో సమానుడై కఠినమైన పెద్ద గదతో క్రోధముతో కాలదండమన శిరమున వేయగా ఆ సుమాలి గదా ఘాతముచే ఇది తల, ఇది మాంసము, ఇవి యెమ్ముకలు అని గుర్తింపరాక భస్మమై వేగముగా నేల గూలెను. తక్కిన రాక్షసులది చూచి రోదన ధ్వనులధికముగా జేయుచు భయముతో పారిపోయిరి.

★★★

# ఇరువది యెనిమిదవ సర్గము

ఆ సమయమున మిక్కిలి బలవంతుడగు మేఘనాదుడు వారి నందరిని వెనుకకు తిరుగుడని చెప్పి మహిమగలదియు, కామ గమనమునైన రథముపై అగ్నియోయనునట్లు గాంతితో ప్రకాశించుచు శత్రుసైన్యములను ధైర్యముతో తాకగా వానిని జూచి దేవకోటి భయముతో పారిపోయెను. ఇంద్రుదును తన సేనల యవస్థను జూచి వారందరిని గొంతెత్తి పిల్చి యిట్లనెను. దేవతలారా! మగతనములను విడచి పారిపోవుట తగునా? మరలుడు. యుద్ధము నందు పగవానిని తెగవేయుటకు నా కుమారుడెదుర్కొనుచున్నాడు. ఇదిగో చూడుడు అనగా

## జయంత మేఘనాదుల యుద్ధము:

దేవతలు శూరుడు శచీతనయుడు నైన జయంతుడనువాడు రావణాసుర పుత్రుని దాకుట చూచి ధైర్యము పొందిన వారై తాము కూడా సహాయపడగా యుద్ధమతి ఘోరమై యొప్పెను. రావణియును ఇంద్రపుత్రుడును పట్టుదలను బలమును గోలు పోక యిద్దఱును సరిసరిగా పోరిరి. మండోదరి పుత్రుడు క్రూరమైన బాణములతో జయంతుని సారథియు మాతలి పుత్రుడునైన గోముఖుడను సారథిని నొప్పింపగా బలవంతుడగు జయంతుడట్లే చేసి మేఘనాదుని తీవ్రమైన బాణసమూహముతో నొప్పింపగా వీరుడైన ఆ రాక్షసుడును అట్లే జయంతుని నొప్పించెను. అంతటితో విడువక మాయచే యుద్ధభూమి యందు చిమ్మచీకట్లు గ్రమ్మునట్లు చేసి ప్రాసములు, పెద్దగదలు మొదలయిన ఆయుధములను ముసురుపట్టిన విధముగా గురిపించి పర్వతకూట కోటులను శత్రుసేనలు భయమందునట్లు వైచెను. మాయచీకటి చేత యుభయపక్షముల వారును మోహితులగుటచే రాక్షసులు రాక్షసులను దేవతలు దేవతలను సంహరింపజొచ్చిరి. చీకటి దట్టముగా నుండుటచే జయంతు నెచ్చటను గానక దేవతాసంఘములు నిశ్చేష్టము లయ్యెను. ఇట్లంతటను వ్యాపించియున్న ఆ చీకటిలో శచీదేవికి తండ్రియైన రాక్షసశ్రేష్ఠుడు వీరుడు పులోము డనువాడు వేగముగా వచ్చి తన మనుమని నెత్తుకొని కనబడకుండగా వెళ్లి సముద్రమును ప్రవేశించెను.

దేవతలిచ్చట ఇంద్రపుత్రుని గానక మహాదుఃఖముచే సంతోషములను విడచినవారై భయముతో నిలువజాలక చెల్లాచెదరై వెళ్లగా ఆ మేఘనాదుడు గొప్పసైన్యముతో గూడినవాడై కో యని యరచుచు వారి వెనుకబడి తరుమజొచ్చెను. ఇంద్రుడు తన పుత్రుడచ్చట కనరాకుండుటయు దేవతలు

## ఇంద్రుడు యుద్ధమునకు వెడలుట:

కలవరపాటు చెందుటయు జూచి ఇంద్రుడు వేగముగా రథమును దెమ్మని ఆజ్ఞాపింపగా మాతలి అట్లే చేయగా ఇంద్రుడు యుద్ధమునకు తరలి వెళ్లెను. మెరుపులతో గూడిన మేఘసమూహము గర్జనలు చేయుచు వాయుప్రేరితమై ముందు నడచెను. అప్సరఃస్త్రీలు నాట్యములు చేయదొడగిరి. ఇంపుగా వాద్యములను గంధర్వ సంఘములు మ్రోగించిరి. దేవతలు, వసువులు, మరుత్తులు, రుద్రులు, సాధ్యులు గుంపులుగా సర్వాయుధములతో ఇంద్రుని వెంటజనిరి. ఇంద్రుడు యుద్ధమునకు వెళ్లెడు వేళ గాలి కఠినముగా వీచెను. పెద్ద పెద్ద యుల్కలు పడెను. సూర్యుడు తేజోహీనుడయ్యెను. ఇంతలో పెద్ద శరీరములు గల భయంకరమలైన సర్పములచే ఆవరింపబడినదై ఆ సర్పముల ఊర్పు గాడ్పుల సమూహములచే మండుచున్న విధముగా నగుచు విశ్వకర్మచే నిర్మితమై యొప్పుచున్న రథము నెక్కి దైత్యదానవసంఘములు చుట్టిరాగా రావణుడు ఇంద్రునికెదురుగా యుద్ధము నకు వచ్చెను. అట్లు వచ్చుచునే మేఘనాదునితో కుమారా! నీవింక శ్రమ తీరునట్లుగా యుద్ధమును చాలింపుము. ఇంద్రుని నేను గెలిచెదననగా ఆ మేఘనాదుడు యుద్ధమును జాలించి దూరముగా వెళ్లెను.

## కుంభకర్ణుడు దేవతలతో పోరుట:

అప్పుడు దేవసైన్యములకును రాక్షసకోట్లకును పోరు ఘోరమై యుండెను. కుంభకర్ణుడును యుద్ధమెవ్వరితో చేయవలయునో యెరుగక తన యెదుట గనిపించిన వారి నెల్ల ప్రకాశించు భయంకరమైన అస్త్రసంతతులతో ఉప్పెనవలె నెదుర్కొన సాగెను. అట్లు కుంభకర్ణుడు చేతులతోను, పాదములతోను, కోఱలచేతను, ఖడ్గతోమరములతోను, దేవతలను యుద్ధరంగమున కసిబిసిగా సంహరింపదొడంగెను. అతని పరాక్రమమును జూచి రుద్రులు అధికమైన క్రోధముచే మండుచు ఆ రాక్షసుని ననేక విధములైన ఖడ్గాది సాధనములతో అత్యధికముగా మొదగా రక్తధారలు గారెను. ఆ రుద్రులు విజృంభించి అదరు

బెదరులేని వారై యుత్సాహముతో తిరుగులేని పరాక్రమముతో క్రీడవలె శత్రుసైన్యములను భయంకరముగా బాణములతోను భయంకరములైన యితర సాధనములతోను క్షుద్రమృగములను సింహములు సంహరించు విధముగా తమ పరాక్రమము చూపుచు సంహరించిరి.

## దేవతా సహాయుడై యింద్రుడు రాక్షసులను వధించుట:

మరుత్తులు నానావిధములైన ఆయుధములతో విరోధులను సంగరమందు అధికమైన బలవేగములతో కఠినముగా నరికి వేయుచుండగా రాక్షసులు శక్తిహీనులైరి. కాళ్లు, చేతులు తెగి నేలబడువారును, వాహనములతో గూడ వ్రాలిపోవువారును, రథములను, ఏనుగులను, గుఱ్ఱములను, గాడిదలను, సర్పములను, ఒంటెలను, మొసళ్లను, పందులను కౌగిలించుకొని చచ్చియట్లే యుండువారును, నిలబడిన వారలై అట్లే చచ్చువారును, నిశ్చేష్టులై కొయ్యబారిన వారును నై యుండగా ఆ యుద్ధము చిత్రరచనవలె నుండెను. ఇంద్రునిచే తెగవ్రేయబడి చచ్చిన రాక్షస సమూహముల శరీరములనుండి కారు నెత్తురు అద్భుతముగా గ్రద్దలు కాకులు మొదలగు పక్షులచే కలత నొందింపబడినదై బాణములనెడు మొసళ్లతో గూడినదై నదివలె పారెను. ఇట్లు తన తన సైన్యమునంతను దేవతాకోటులు త్రుంచగా రావణుడు భయంకరాకారముతో పెద్ద ధ్వని చేయునదైన తన వింటినారికి నూర్ల కొలది వాడి బాణములను సంధించి ఆ దేవతా సంఘముల పొగరంతయు నణిగించి ఇంద్రుని దాకగా ఆ పాకశాసనుడును దశదిశలును వింటినారి మ్రోతలు వ్యాపించునట్లు అగ్నివంటి బాణసమూహములను వేయగా దశముఖుడును మదముతో భూమ్యాకాశములు నిండునట్లు వాడి బాణముల నేసెను.

★★★



# ఇరువది తొమ్మిదవ సర్గము

## రావణుడు దేవతాసేనల మధ్య జొచ్చి యుద్ధము చేయుట:

అప్పుడా యధికమైన బాణములచే దట్టముగా చీకటులలమెను. అట్టి చీకటి యందు దేవతలును రాక్షసులును శత్రు సంహరణ దక్షులై యుద్ధము చేయుచుండగా మత్తులై అధికబలవంతులై దేవత లౌద్ధత్వముతో పదవవంతు మాత్రమే మిగులునట్లుగా రాక్షస బలములను యమపురము నకు బంపిరి. తన సైన్యములు క్షీణించు స్థితిని జూచి రావణుడు రోషముచే నెఱ్ఱవడిన నేత్రములు గలవాడై తన రథసారథిని జూచి యిట్లనెను. ఓ సారథీ నేడు ఇంద్రునితో కూడ దేవతల నెల్లను సంహరించెదను. మన రథమును శత్రుసేనల మధ్యకు బోనిమ్ము. నా శౌర్యము ప్రకటమగునట్లు వరుణుని, కుబేరుని, ఇంద్రుని పేరు లేకుండ చేసెదను చూడుము. నేను రెండు మారులు చెప్పుచున్నాను. విషాదమును విడువుము. ఆలస్యమెందులకు? మనమిప్పుడు నందనవన ప్రాంతమున నున్నాము. తూర్పు పర్వత సమీపమునకు రథమును తోలుము. సారథీ! భయము వలదు. అని చెప్పగా సారథి మనస్సు కంటే వేగము గల గుఱ్ఱములను శత్రుసైన్యముల మధ్యకు తోలెను. ఇంద్రుడు కూడ రాక్షసుని నిశ్చయమును గుర్తించి దేవతల సమూహమును జూచి యిట్లనెను. దేవతలారా! వినుడు. పర్వదినమున నుప్పొంగు సముద్రము ప్రవేశించునట్లు రావణుడు

## ఇంద్రుడు రావణుని బంధింప ప్రయత్నించుట:

దేవసైన్యముల మధ్యకు నిర్భయుడై ప్రవేశించెను. బ్రహ్మవరమును తలంచి వీనిని సంహరింపరాదు. కాన బలవంతముగా యుద్ధరంగమున బంధింప దగును. ఆ బలవంతుని బంధించి మూడు లోకములకున సౌఖ్యము గలుగు బాధలు లేకుండునట్లు రక్షింపదగును అని చెప్పి రావణుని విడచి ఇంకొక ప్రక్కకేగి యింద్రుడు రాక్షస సైన్యమును సంహరింపసాగెను. ఆ రావణుడుత్తర దిక్కున దేవతా సేనలలో ప్రవేశింపగా ఇంద్రుడు దక్షిణదిక్కున నున్న బలములలో ప్రవేశించెను. మదముతో నిండిన మనస్సు గల రాక్షసేంద్రుడును ధైర్యమే బాసటగా శత్రుసైన్యములో నూరుయోజనముల దూరము

ప్రవేశించి బాణములచే దేవతలను, గుఱ్ఱములను, రథములను, వీరులను పరాక్రమములు చెడునట్లు నరికివేసెను. ఆ రావణుని వీరత్వమును జూచి శచీభర్త వానిని బంధింప దలంచి దేవతా సైన్యముతోడ్పడగా రాక్షసరాజును అతడు భ్రమతో సుడివడునట్లు తాకెను. ఆ సమయమున నిట్లు దశవదనుడు యుద్ధమున పట్టువడినట్లుండగా హా! అయ్యయ్యో! మేము చచ్చితిమి. అయ్యో యని రాక్షసులు గుంపులై అరవ దొడగిరి.

## మేఘనాదుడు మాయచే నింద్రుని బంధించుట:

అది విని మేఘనాదుడు రథము నెక్కి క్రోధమూర్తియై వేగముగా అధిక శౌర్యముతో దేవతా సైన్యములలో ప్రవేశించి ఈశ్వరానుగ్రహమున లభించిన గొప్ప మాయావిద్యచే దేవతలను వదలి మిక్కిలి పరాక్రమము గనిపించునట్లు మహేంద్రుని నొక్కనిచే నొప్పింప పూనుకొనగా ఇంద్రుడు మేఘనాదుని గానక చింతించుచుండగా అతడు దేవతలచే చింపబడిన కవచము గలవాడై చంపబడుచున్నను మాయ తనను రక్షింపగా శత్రుసేన లేమియు చేయజాలవయ్యెను. అంత రావణనందనుడు తీవ్రమైన బాణములచే మాతలిని నొప్పించెను. తికమక చెందునట్లును, అధైర్య పడునట్లును, బెదరునట్లును వాడి బాణముల వరుసలన్ని దిక్కుల ప్రవాహములవలె వచ్చి గ్రుచ్చుకొనుచుండగా ఇంద్రుడు తెలివిదప్పక మాతలిని రథమును వీడి తెల్లఏనుగు (ఐరావతము) పైనెక్కి విరోధి పుత్రునికై ఆకాశమున నలువంకల వెదకెను. మాయచే రక్షింపబడుచుండుటచే అతడు మహేంద్రునకు కనిపింపక అన్నివైపులను తానేయై వాడియై వేగవంతములైన బాణములచే ఇంద్రుని శరీరము నంతను గ్రుచ్చి నొచ్చునట్లొనర్చి అలసిపోయిన ఆ దేవేంద్రుని గొప్ప అస్త్రములచే మాయా బద్ధుని జేసి తీసికొని పోవుచుండగా దేవతలు చూచి ఏమిది? యెవ్వడో కానరాకుండ నుండి మాయా విద్యలనెరిగిన యింద్రుని తన మాయతో దారుణముగా బలిమితో బంధించెనే యని రోషముతో వసువులును, ఆదిత్యులును మహాక్రోధము గలవారై రావణాసురుని గొప్పబాణముల వరుసల దెబ్బలతో బాధనొందునట్లు చేయగా ఆ రాక్షసరాజు ప్రతిక్రియ చేయ శక్తిలేనివాడై ఆ శత్రువుల దెబ్బలనోర్చుకొని నిరుత్సాహ పడెను. అంతలో అతని పుత్రుడు

## రావణుడు యుద్ధము చాలించి మేఘనాదుని ప్రశంసించుట:

గాఢమైనదెబ్బలచేతనుపోటులచేతనుతూటులుపడినశరీరముతోబాధనొందుచున్న తండ్రిని జూచి నాయనా! ఇంక యుద్ధమును చాలింపుము. మనదే జయము. స్వస్థ

చిత్తుడవై నిజమును తెలిసి కొనుము. వృథాశ్రమయేల? సేనలను మరలింపుము. మూడులోకములకును రాజైన మహేంద్రుడిప్పుడు మనచే బంధింపబడినాడు. దేవతలు పారిపోయిరి. బలముచే విరోధిని గెలిచి సంతోషముతో మూడులోకములను నీవే యేలుము. వృథాగా శ్రమయెందులకు? ఇక యుద్ధము నిష్ఫలము. రమ్ము. దేవతలు యుద్ధమును మానుకొనిరి. అని చెప్పగా రావణుడు మనస్సు కుదుటబడగా ఇంతింతనరాని సంతోషముతో పరవశుడై యుద్ధము చేయుట మాని ఆ వీరుని జూచి యిట్లనెను. అన్నా! తనయా! ఏమి నీ బలము? త్రిదశాధిపతిని బద్ధుని జేసి దేవతా సైన్యములను పారద్రోలితివి. గొప్ప కీర్తిని సంపాదించితివి. పుత్రా! మన వంశమునకు ప్రఖ్యాతిని దెచ్చితివి కాన నీవు ఆ యింద్రుడు నీ రథముపై నుండగా సర్వసైన్యములతో లంకకు తరలి వెడలుము. నేను నామంత్రులెల్లరు సేవించుచుండగా నీ వెనుకనే వచ్చెదను. నీవే గదా జయము పొందినవాడవు. నీ విజయము లెస్సగా పొగడబడును గాక అని చెప్పగానే మేఘనాదుడు మేఘవాహనుని బంధించి తన రథముపై నుంచికొని తన సైన్యములు సేవించుచుండగా తన సౌధమునకు వెడలి ఆ వీరవరులనందరను తమ తమ యిండ్లకు వెడల బనిచెను.

★★★



# ముప్పదవ సర్గము

## బ్రహ్మలంకకు వెళ్లి రావణ మేఘనాదులను ప్రశంసించుట:

ఇట్లు రావణపుత్రుడింద్రుని తన పట్టణమునకు సంతోషముతో తీసికొని వెళ్లగా దైన్యముతో దేవతలు బ్రహ్మను తీసికొని లంకకు వెళ్లగా ఆకాశముననే నిలిచి బ్రహ్మదేవతల దుఃఖముకు హేతువైన వాడును సోదరులతో పుత్రులతో గలిసి నిర్భయుడై మదించి యున్నవాడును అయిన పంక్తి కంఠునితో నిట్లు పలికెను. వత్సా! సాహసశీలుడా! రావణా! యుద్ధరంగమున నీ కుమారుని పరాక్రమమెంతయో మెచ్చునట్లున్నది. నీ కుమారుడు నీతో సమానుడో నీకంటే నధికుడో గాని నీ పుత్రుని బలముచేత నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకొంటివి. మూడు లోకములును నీకు వశమైనవి. ఓ శూరశ్రేష్ఠా! అతిబలవంతుడును వీరుడును అయిన నీ కుమారుడు శాశ్వతముగా 'ఇంద్రజ' అను కీర్తిని బొందును. యుద్ధరంగమున జయింపరానివాడగును. ఇంక శచీభర్తను విడువుము. ఇంద్రుని విడిచి పుచ్చుటకు ప్రతిఫలముగా ఏమి కోరుదువో అడుగుము. అని పల్కగా ఆ రావణపుత్రుడు బ్రహ్మను జూచి యిట్లనెను. ఓ పితామహా! ఈ శతమఖుని విడిచెదను. నాకు దయతో అమరత్వము నిమ్ము అనగా ఆ బ్రహ్మ నాయనా! భూమి యందు గల ప్రాణికోట్ల కెందైనను సకలామరత్వము గల్గునా? పక్షులలోను, నాల్గుపాదములు గల జంతువులలోను సర్వభూతములందును ఎట్టిదానికైనను ఎప్పుడైనను మృతిజెందక కలకాలము బ్రతుకుట తగునా? అని చెప్పగా

## బ్రహ్మ మేఘనాదుడు కోరిన వరములిచ్చి యింద్రుని విడిపించుకొని పోవుట:

ఇంద్రజిత్తిట్లనెను. సరియే. అటులైనచో యుద్ధసమయమున నేను శత్రువులను సంహరించుటకై నియమముతో అగ్నిహోత్రుని యందు హోమము చేసెదను. దానినుండి పుట్టినగుఱ్ఱములతోగూడినరథమునెక్కియుద్ధముచేయునప్పుడుమరణరహితుడనగునట్లు వరమునిమ్ము. అది సమాప్తి నొందకుండగనే నేను యుద్ధమునకు నేను పూనుకొన్నచో మరణించుట కొప్పుకొందును. ఓ పద్మసంభవా! నీ వీ వరమును నాకు దయతో ఇచ్చితివేని ఇంద్రుని విడిచెదను. అందఱను తపస్సుచే నిన్నానందింపజేసి ఎంతయో వినయముతో

దీనిని బొందుదురు. నేను నా భుజబలముతో అమర్త్యత్వమహిమను పొందెదను అనగా బ్రహ్మ అట్లే యగును గాక యనెను. అంత రావణి యింద్రుని విడచి పెట్టెను. దేవతలతని దోడ్కొని స్వర్గమునకు వెళ్లుచుండ దుఃఖముతో చింతతో బాధనొందుచు దీనుడై దేవత్వకాంతి హీనుడై నేల జూచుచు ఎంతో విచారముతో చిన్నబోయిన ఇంద్రుని జూచి అతనికి జ్ఞానోదయమగునట్లు బ్రహ్మ యిట్లనెను.

## బ్రహ్మ యింద్రునితో అతడు బద్ధుడగుటకుఁగారణము చెప్పుట:

మహేంద్రా! నవ్వుచు చేసిన పాపము నెవ్వరైనను తరువాత ఏడ్చుచు అనుభవింపవలదా? క్రొవ్వుతో నీవు చేసిన పాపమే ఈ విధముగా నీకు ప్రాప్తించినది. ఇట్లేల యేడ్చెదవు? ఓ యింద్రా! నా బుద్ధిచే మొదటి ఒకే రూపముతో ఒకే వర్ణముతో ఒకే భాషతో ప్రజలను సృష్టించితిని. చూడగా వారలలో భేదమే కనిపింపదు. తరువాత వేఱొక పద్ధతితో దానికంటే శ్రేష్ఠముగా సృష్టింపదలంచి నేనా ప్రజలయొక్క శ్రేష్ఠములైన అంగములను దీసి రూపము చేతను గుణములచేతను ఖ్యాతిగాంచిన అహల్య యను స్త్రీని నిర్మించితిని. హల మనగా విరూపము. హల్యమనగా తద్భవమగు వైరూప్యము. అది ఆమెయందెచ్చటను లేకుండుటచే ఆమెకు అహల్యయను నామమును నేను పెట్టితిని. ఇట్లు సృష్టించి ఈ సుందరి నెవ్వనికిత్తునాయని నేను చిత్తము నందు చింతించుచుండగా ఇంద్రా! నీవు హెచ్చైన పదవీ గౌరవముతో జగత్ప్రభుత్వముతో నున్న నాకు గాక ఈ సుందరి మఱియెవ్వని కర్హురాలగునని యెంచి మనస్సునందాకామినిని గోరితివి. నేనా కన్యనను గౌతముని యొద్ద పెక్కు సంవత్సరములు ఇల్లడయుంచితిని అతడా సుందరి యెడ నెట్టి దోషకార్యమును చేయకతాన సత్యవాది కాక ఆ కన్యను మఱల నాయొద్దకు బంపెను. నేను మనస్సు నందతని నియతిని తపశ్శక్తిని మెచ్చుకొని ఆ బాలిక నతనికే భార్యగా నిచ్చితిని. నీ వది తెలిసికొని మనస్సునందసూయతో ఆ మునియున్న వనమునకు వేగముగా వెళ్లి అందగ్ని శిఖా సమానముగా ప్రకాశించుచున్న ఆ కాంతను జూచి మన్మథబాధకు వశుడవై ఆమెతో సంగమింపగా అంతలో ముని ఆశ్రమమున దుష్టస్థితి యందున్న నిన్ను ఓ ఇంద్రా! క్రోధముతో దిట్టెను. ఏమిరా! వాసవా! నీవే కామవశుడవై నా భార్యను ధైర్యముతో నిర్భయముగా గూడితివటరా? నీ విరోధి చేతికి చిక్కి అధిక దుఃఖమును పొందుదువుగాక [బాలకాండమున చెప్పబడిన శాపమున కిది పర్యాయము గాదు. సహస్రయోనిత్వము శత్రుకృత పరాభవము రెండునేక కాలమున నిచ్చిన శాపములే.

అందొకటి యిందొకటి చెప్పబడెను.] ఓరీ! కుమతీ! నీవిప్పుడు చేసిన మహాఘోరమైన పాపకృత్యము లోకములో మానవులందును ఇంక బ్రవర్తింపగలదు. ఆ జారత్వ పాపము నందర్ధభాగము కర్తను పొందును. మిగిలిన అర్ధభాగము నిన్ను చెందును. శ్రేష్ఠమగు నీ పదవి ఇంక మీద నీకు నిజముగా అశాశ్వతమగును సుమా. ఓ దుర్మతీ! ఇది నీకే కాదురా! నీవలె యెవ్వడెవ్వడు దేవతాధిపతి యగునో ప్రఖ్యాతిగా అతడును నీవలెనే భ్రష్టుడగును. ఇది యధార్థము. అని మఱియు అహల్యను జూచి హుంకారము చేయుచు ఆ మునిరాజు ఇట్లనెను. ఓసీ! దుష్టురాలా! నీ సౌందర్యము పాడువడగా భూమిపై ఈ యాశ్రమము చెంతనే పడియుండుము. పాపిష్ఠురాలా! సౌందర్యమును, యౌవనమున పొందియు నీ మనస్సు చంచలత్వమును బొందినది గాన నీ పొగరణగునట్లు భువిపై నీవొక్కతెవే సుందరివి గాకుందువుగాక. ఏ సౌందర్యముండుటచే ఈ విధముగా నీవు మిడిసి పడితివో ఓ కృతఘ్నురాలా! వివేక హీనురాలా! ఆ సౌందర్యము జనులలో సామాన్యమగునుగాక అని శపించెను. ఆనాటి నుండి సౌందర్యవంతులగు స్త్రీలు భూలోకము నందన్నిచోట్లను పుట్టిరి. అప్పుడహల్య విధేయురాలై భర్తకిట్లనెను. మహాత్మా! నీ రూపమును ధరించి యింద్రుడీ యాగడమును చేసెను. నేనెఱుగక చెడిపోయితిని. నా యజ్ఞానమును క్షమింపుము. కామ మదముచే నేను పాపము చేయలేదు సుమా [అంకాడనేర్చినమ్మ బొంకాడనేర్వదా] యని వేడుకొనగా మహర్షి ఆమెతో నిట్లనెను. ఇక్ష్వాకు వంశమునందు సత్యనిష్ఠుడగు రాముడను పేరుతో ప్రఖ్యాతి నొందువాడు పుట్టును. మనుష్యరూపము దాల్చియున్న ఆ విష్ణుమూర్తి యొక బ్రాహ్మణుని నిమిత్తమై యిచ్చటికి వచ్చును. నీవతనిని జూచి పవిత్రురాలవయ్యెదవు. ఆ పవిత్రుడు తప్ప నీ పాపము నెవ్వడును పోగొట్టలేడు. [జారత్వదోషము భగవదనుగ్రహముచే గాని పోదు] ఇది యధార్థము. నీవాతని కాతిథ్యము నిచ్చి తిరిగి నన్ను జేరగలవు. ఓ గజగమనా! తరువాత నీవు నాతో నివసింపగలవు అని చెప్పి ఆ మహర్షి తన యాశ్రమమును ప్రవేశించెను. బ్రహ్మ వాది పత్ని యట్లే యొనర్చెను. ఆ మహర్షి తిట్టినట్లులే అంతయు నీకు దాపురించునది. ఎందైనను పాపఫలము విప్రశాప ఫలము తప్పునా? ఓ ఇంద్రా! నీవు చేసిన దుర్మార్గమును జ్ఞప్తికి దెచ్చికొనుము. ఇట్టి దోషము చేతనే నీవీవిధముగా శత్రువు చేత జిక్కితివి. ఆలోచింపగా దీని హేతువిదియే. వింటివా? నీ కుమారునికై విచారింపకుము. అతడు కొనిపోబడినవాడై సముద్రజలములలో మాతామహునిచే రక్షింపబడుచు చింతలను విడచి సంతోషముతో నున్నాడు. కావున

ఇంద్రా! నీవు వైష్ణవ యాగమును జేయుము దానివలన కల్మష చయములు తొలగిపోగా స్వర్గమునకు పోవచ్చునని చెప్పగా అతడట్లే యొనరించెను. రామచంద్రా! ఇంద్రజిత్తనగా ఎంతటివాడో వింటివిగదా! ఇంద్రునే పట్టి కట్టెనన ఇక తక్కినవారలేమి లెక్కయని చెప్పగా రామచంద్రుడును లక్ష్మణుడును వానరులును గొప్ప ఆశ్చర్యమును బొంది ఔరా యని మెచ్చుకొనిరి. ఈ విధముగా మునీశ్వరుడు చెప్పిన వృత్తాంతమంతయును విని రామచంద్రుని చెంతనున్న విభీషణుడు పూర్వమెప్పుడో చూచినది యిప్పుడు పూర్తిగా జ్ఞాపకమునకు వచ్చినదని పల్కగా అగస్త్యమునీంద్రుని మేలైన సుతులతో రామచంద్రుడు మెచ్చుకొనెను. ఈ విధముగా దశకంఠుడు తన కన్నిట మేఘనాదుడు తోడురాగా జగత్కంటకుడై ఎవ్వరిని లెక్కచేయక ప్రవర్తించుచుండెను.

★★★



# ముప్పది యొకటవ సర్గము

## రావణుడు కార్తవీర్యార్జునుని గెలువబోవుట:

అని యిట్లు ముని చెప్పగా ఆ రామభూపాలుడాశ్చర్యమున మునుగుచు మునిశ్రేష్ఠా! క్రూరాత్ముడై రాక్షసుడు సంచరించుచుండ లోకము శూరత్వ శూన్యమై యుండెనా? రాజో రాజు వంటివాడో ఒక్కడైనను ఆ బలవంతుని గెలువలేక పోయెనా? అక్కటా క్షత్రియులు వీరత్వము లేనివారైరి గదా. నిఖిల రాజులును జయింపబడిరి గదా! ఏమి గొప్ప అస్త్రకోవిదులైన వారలు బహిష్కరింపబడిరా? అని యడుగగా మునివర్యుడా మహాత్ముని జూచి నవ్వుచు ఈశ్వరునితో బ్రహ్మ పలికినట్లు ప్రీతితో నిట్లు పలికెను. భూపతులందఱను బాధించుచు బాహుబలగర్వాంధుడై భూమియందు సంచరించెను. దశకంఠుడట్లు వెళ్లుచు శౌర్యము గల మాహిష్మతీ పురనాథుని పేరు విని ఇంద్ర పట్టణముతో సమానమై, అగ్నిదేవుని సాన్నిధ్యము గలదై అగ్నికుండలములందెల్లప్పుడు ప్రజ్వరిల్లుచున్న అగ్నిగలదై అగ్నితో సమానుడైన అర్జునుడేలెడు నా పట్టణమున కర్జునునితో యుద్ధము చేయవలెననెడు అభిలాషతో అధికమైన వేగముతో వెళ్లగా శత్రుసమూహములకు భయంకరుడగు అతడు

## కార్తవీర్యార్జునుడు నర్మదయందు స్త్రీలతో క్రీడించుట:

రావణుడు వచ్చు సమయమునకు స్త్రీలతో నర్మదానదియందు జలక్రీడ లాడుటకు వెళ్లెను. అప్పుడు రావణుడతని మంత్రులతో అర్జునుడెక్కడనున్నాడు. రణశూరుడైన రావణుడు యుద్ధమునకై ఇచ్చటికి వచ్చినాడని మీరు వెళ్లి చెప్పుడు. అనగా వారు మా మహారాజుగారిందు లేడని చెప్పగా విని రావణుడా పురమును విడచి హిమవత్పర్వతమును బోలినదియు, మేఘము వలె నాకసమునంటుచున్నదియు, భూమిని బ్రద్దలు చేసికొని పుట్టినదాయనునట్లున్నదియు, ఆకాశమార్గము నరికట్టుచున్నదియు, వేయి శిఖరములతో ప్రకాశించుచున్నదియు, సింహములతో గూడిన గుహలు గలదియు, చరియలపై బడుచున్న సెలయేళ్ల చప్పుళ్లతో అట్టహాసము చేయుచున్నదా యనునట్లున్నదియు స్త్రీలతోక్రీడించు దేవతలు దానవులు కిన్నరలు గలదై స్వర్గము వలె నున్నదియు

## రావణుడు నర్మదానదీ తీరమున విడియుట:

స్ఫటికపు రాళ్లవలె కడు స్వచ్ఛమైన సెలయేళ్ల జలములు చరియల నుండి జారుచున్న రీతులతో నాలుకలు చాపుచున్న సర్పములు పరువెత్తు విధమును దలపింపజేయుచున్నదియు అయిన వింధ్యాద్రిని ఆ కుటిల చరిత్రుడు చూచి వేగముగా నర్మదానదిని జేరబోయెను. పడమటి సముద్రమును గలియుటకై పరువెత్తుచున్నదియు, రాళ్లతో చలించుచున్న జలములు గలదియు, ఎండచే వడగొట్టబడి ఏనుగులు, వరాహములు, సింహములు దప్పికతో వేగముగా జలములందు దూకి కలంచుటచే మలినమైన జలములు గలదియు, సొంపు గలిగించుచు ఎల్లప్పుడును విడువకుండగా నీటికోళ్లును, జక్కవపక్షులును, బెగ్గురులును, హంసలును కూయుచున్నదియు, వికసించిన పుష్పములతో నున్న వృక్షములే శిరోభూషణముగా గలదియు, చక్రవాకములే స్తనములుగా గలదియు, నీటి నురుగులె స్వచ్ఛమైన మేలిముసుగుగా గలదియు, నల్లకలువలే కన్నులుగా గలదియు, హంసల వరుసలే వడ్డాణముగా గలదియు, విశాలమైన యిసుక తిన్నెలే పిరుదులుగా గలదియు, పుష్పముల పుప్పొడులే మైపూతలుగా గలదియు, పుణ్యజలముల స్పర్శలే మంచి స్పర్శగా గలదియు అయిన నదీ శ్రేష్ఠురాలైన నర్మదానదిని జూచి రావణుడు ప్రియురాలితో సంతోషముతో క్రీడించెడి విధముగా స్నానము చేసి శ్రేష్ఠులైన మునులచే పూజింపబడుచున్న ఆ పవిత్రనదీ తీరమందు ఇసుక తిన్నెమీద సంతోషముతో గూర్చుండి ఇదియే సుమా గంగయని మెచ్చుకొని తన మంత్రులైన శుకసారణులను జూచి యిట్లనెను. సూర్యుడు తన తీవ్రమైన కిరణసమూహముచే జగము నంతయు బంగారము వలె చేయుచు మన తలలపై సూటిగా నిలచెను. దానవులారా! చూచితిరా. అతడు వేడి కిరణములు గల వాడయ్యును నేనిచ్చట తిరుగుచుండుట నెరింగి భయముతో చంద్రుని వలె నున్నాడు. ఇక వాయువో నదీజలముతో తడిసినవాడై సరసమైన పుష్పముల పరిమళ సంపదను కానుకగా దెచ్చి నాకానందమును గలుగజేసి ఎంతయో సుఖమును గలిగించు చున్నాడు. చూచితిరా సంతోషమును వృద్ధి చేయునదై ఈ నర్మదానదియు మొసళ్లు, చేపలు, పక్షులు, అలలతో క్రొత్త అందము గలదై నివ్వెరపడి నిశ్చేష్టయై నిలిచియున్న యువతి వలె సంతసము గలుగజేయుచుండెను. కాన, ఇంద్రునితో సమానులగు రాజులతో యుద్ధము చేసి వారి ఆయుధములచే అవయవములందు గాయములందితిరి. నెత్తురులు హరిచందన ద్రవముల వలె ఒప్పినవి. సుఖము నొసంగునదైన ఈ నర్మదయందు హాయిగా

సార్వభౌమము మొదలైన దిగ్గజముల సముదాయము జాహ్నవి (గంగ) యందు స్నానము చేయువిధముగా మీరలు స్నానము చేయుటకు సిద్ధపడుడు. ఈ నది అన్నివిధముల మాలిన్యములను పోగొట్టునది. నేనును స్నానము చేసి శరత్కాలపు చంద్రుని వలె ఒప్పుచునన ఇసుక తిన్నెయదు ఈశ్వరుని పూజ చేసెదను. మీరు వెళ్లుడనగా రాక్షసరాజు యొక్క ఆజ్ఞతో మంత్రులైన సారణ ధూమ్రాక్షశుకులును ప్రహస్త మహోదరులును సంతోషముతో వేగముగా నదిలో ప్రవేశించిరి. రాక్షసుల ఏనుగులచే కలత పెట్టబడిన నర్మదానది వానమ అంజన పద్మములనెడు దిగ్గజములచే కలత పెట్టబడిన గంగానది వలె నుండెను. వారలావిధముగా జలక్రీడలాడి లేచి రావణునకు పూజకై అడవి పుష్పములు తెచ్చుటకై వెళ్లి కోరినన్ని పూలు కొల్లలుగా నుండుటచే అచ్చట ఒక కొండవలె రాశిపోసిరి. రావణుడు స్నానము చేసి పరమభక్తితో జపము చేసి వేగముగా గట్టునకు వచ్చి

## రావణుడు శివలింగ పూజ చేయుట:

తడిబట్టను విడచి వేరొక పొడి వస్త్రమును గట్టి లింగము నుంచి పూజింపదగిన ప్రదేశమును వెదకుచు చేతులు జోడించి కొని వెళ్లెను. అతని వెంట రాక్షసవరులు రూపము దాల్చిన కొండలోయనునట్లు అతడు వెళ్లిన ప్రతి చోటునకు అతడు ప్రతిదినము పూజించు కనకలింగమును తీసికొని వెళ్లుచుండిరి. ఆ బంగారు లింగమును ఒకచోట సైకత వేదికమీద నిల్పి శ్రద్ధ కలవాడై శ్రేష్ఠమైన గంధములతోను, పుష్పములతోను, గొప్పగా పూజించెను. [దీనివలనను, నికుంభిళవలనను రాక్షసులందును విగ్రహారాధన అనాదిగా గలదని యేర్పడుచున్నది.] అంతట వరదుడును, చంద్రకళచే అలంకరింపబడినవాడును, విషము కంఠమునందు దాల్చిన వాడును, బాధలను పోగొట్టువాడును అగు శివుని గూర్చి పాడుచు రావణుడు చేతులను పైకెత్తి నాట్యము చేసెను.

## అర్జునుడు తన భుజములచే నర్మద నడ్డగించుట:

అతడీవిధముగా శివుని పూజించుచున్న ప్రదేశమునకు సమీపమునందే మాహిష్మతీ పురాధిపతి స్త్రీలతో గలిసి జలక్రీడలాడుచుండెను. ఆ స్త్రీలమధ్య ఆడేనుగల మధ్యనున్న మదపుటేనుగో యనునట్లర్జునుడొప్పుచుండెను. తన వేయి చేతులయొక్క బలమును చూచుటకై అతడాయేటి కద్భుతముగా అడ్డుకట్టెను. వానిని దాటి వెళ్లలేక ఆ నదీ ప్రవాహము వెనుకకు దన్ని మొసళ్లతోను, చేపలతోను అనేక పుష్పములతో దర్భాసనములతో

గలిసి వానకాలము నందువలె వెనుకకు ప్రవహించెను. రావణుని పూజాకార్యమును చెఱుపుటకై ఈ విధముగా అర్జునుడే నదిని పంపెనేమో అనునట్లా ప్రవాహము రావణుని పుష్పములన్నింటిని వరదయందు గలిపెను.

## నర్మదయెదురొడ్డి పారి రావణుని పూజాద్రవ్యములను ముంచుట:

అట్లు సగము పూర్తియైన శంకరుని పూజను మాని నర్మదానది ఇష్టపడని స్త్రీవలె ఎదురై రాగా పడమటి దిక్కునకు ప్రవహించు ఈ నది తూర్పుదిక్కునకు ప్రవహింప కారణమేమి గలిగినది? ఇంతవరకును శాంతస్వభావముతో నుండి గొప్ప భయముతో పక్షులుండగా నిర్వికారయైన స్త్రీ వలె మురిపెము గనబరచుచున్న నర్మదను జూచి ఆ శుకసారణులకు తన కుడిచేతి వ్రేలితో సైగ చేసెను.

## శుకకారణులు నర్మద యెదురెక్కి పారుటకు కారణమును రావణునకు చెప్పుట:

ఆ అన్నదమ్ములిద్దఱును రాజాజ్ఞను బట్టి పడమటి దిక్కుగా ఆకాశమార్గమున వెళ్లగా ఒక అర ఆమడ దూరమునందు స్త్రీల సమూహములతో గూడి నీటియందు క్రీడల దేలుచున్న పెద్ద వృక్షమోయనునట్లు పురుష శ్రేష్ఠుని జూచిరి. నీటియందు మునుగుటచే చెదరిన జుట్టు గలవాడును, యెఱ్ఱనైన కన్నులతో గర్వముతో గూడిన తేజస్సు గలవాడును, భూమిపై మేరు పర్వతము వేయి పాదములు నిలిపినదో యనునట్లు తన వేయి చేతులతో ఆ నదీ జలముల నడ్డుకట్టి క్రీడించు సాటిలేని పరాక్రమము గలవాడును, మదించిన వేలకొలది ఆడేనుగులతో క్రీడించు గజరాజమనునట్లుగా యువతులైన శ్రేష్ఠకాంతలతో చుట్టుముట్టబడి కేళీ విలోలుడై యొప్పువాడును, విరోధులు భయపడునట్టి అద్భుత చరిత్ర గల వాడును అగు అర్జునుని జూచి రావణుని యొద్దకు వచ్చి వారిట్లనిరి. రాజా! వేయి చేతులు గలవాడు నదియందు స్త్రీలతో గూడి జలకేళిలో దేలుచున్నాడు. అతడు తన వేయి చేతులతో అడ్డుకట్టుటచే ఇది ఎదురొడ్డి ప్రవహించినది.

## రావణుడు కార్తవీర్యార్జునునితో పోరజనుట:

అని శుకసారణులు చెప్పగా అతడే అర్జునుడని రావణుడు యుద్ధకాంక్షతో ఆ అర్జునుడున్న చోటునకు వెళ్లుచుండగా పెద్దగా శబ్దము చేయుచు ధూళితో గూడిన గాలులు ఎదురుగా వీచెను. భయంకర శబ్దము చేయుచు మేఘములు రక్తవర్షమును గురిపించెను. అప్పుడు శుకసారణులును, ధూమ్రాక్షుడును, మహోదరుడును, మహాపార్శ్వుడును

విజృంభించి వెంటరాగా వెడలి నల్లని మేఘము వంటి యాకృతి గల రావణుడు కొలది దూరమునందా రాజును జూచెను. స్త్రీలతో నీటియందు స్నేహముతో క్రీడసల్పుచున్న ఆ శూరుని జూచి వేగముగా వెళ్లి కన్నులెఱ్ఱ వడగా మదముతో ఆ అర్జునుని మంత్రులతో నిట్లనెను. వేగముగా వెళ్లి రాక్షస శ్రేష్ఠుడగు దశకంఠుడు యుద్ధమునకై కుతూహలపడి వచ్చెనని మీ రాజునకు చెప్పుడనగా ఆ మాటలను విని ఆ మంత్రులు బలే బలే! రాక్షస నాయకా! యుద్ధము చేయుటకు తగిన సమయమును చక్కగా తెలిసి కొని వచ్చితివి. స్త్రీలతో గూడి మత్తుతో క్రీడించు సమయమున యుద్ధము చేయుటకు పిలుతువా? ఆడేనుగులు చుట్టు నుండగా ఒప్పుచున్న యేనుగు వలె స్త్రీ సమూహములతో గూడి ఆడుచున్న రాజశ్రేష్ఠునితో యుద్ధము చేయుటకిదియేనా తగిన సమయము?

## అర్జున రావణ మంత్రులయుద్ధము:

ఓపిక వహింపుము. దశకంఠా! ఈ రాత్రి గడువనిమ్ము. యుద్ధమందాసక్తియున్నచో తెల్లవారగనే రాజుతో యుద్ధము చేయుటకు రమ్ము. కాదు కూడ దంటివేని రారమ్ము. మమ్ము గెల్చి మారాజును చేరబొమ్ము అని చెప్పగా రావణుని మంత్రులా యర్జునుని మంత్రులతో తలపడగా వారి యుద్ధము పెద్ద అరపులతో భయంకరమై బీభత్సముగా జరిగెను. ఆ యర్జునుని మంత్రులు శూలములు ఖడ్గములు బాణములు మొదలగు సాధనములతో రావణుని ముంచగా ప్రబలులైన ప్రహస్త శుకసారణులు వారిని గొప్పశక్తిచే ఒక్క నిమిషము నందే నేల పాలొనరించిరి. ద్వారరక్షకులు వెళ్లి యీ విషయమును చెప్పగా విని అర్జునుడు నది నుండి లేచి స్త్రీలకు ధైర్యము గలిగించు మాటలను చెప్పి మనస్సునందు జడుపులేకుండగా గదను బట్టి క్రోధముతో ఎఱ్ఱబడిన నేత్రములు గలవాడై ఆ రాక్షసుని మదమడగించుటకై వేగముగా వెడలెను.

## కార్తవీర్యార్జునుడు ప్రహస్తుని పడనడచుట:

గరుత్మంతుని వంటి వేగము గల గదను చేత ధరించి వచ్చు అర్జునుని జూచి వీరుడైన ప్రహస్తుడు వింధ్య పర్వతము భాస్కరుని ఆపునట్లాపి క్రూరమును లోహనిర్మితము నైన రోకలిని రివ్వున విసరి పెద్దగా అరవగా అర్జునుడును అగ్నివలె మండుచు వచ్చుచున్న ఆ రోకలిని అవలీలగా తన చేతి గదచే పడగొట్టి వేగముగా ప్రహస్తుని మీదికి దూకి నల్లని యినుప గద తన చేతుల సమూహముతో త్రిప్పి కొట్టగా వజ్రాయుధపు దెబ్బచే పర్వతము

వలె అతడు నేలపై బడగా మిగిలిన మంత్రులు గర్వములను విడచి తొలగి పారిపోయిరి. భక్తి కంటే ప్రాణభయమే మిన్న గదా. అట్లు మారీచుడు, ధూమాక్షుడు మహోదరుడు శుకుడు సారణుడు భయపడి పారిపోవుటను ప్రహస్తుడు పడిపోవుటను జూచి క్రోధము గలవాడై రావణుడా రాజేంద్రుని దాకెను.

## రావణకార్తవీర్యార్జునుల యుద్ధము:

వేయి చేతులు గల అర్జునుడు ఇరువది చేతులు గల రావణుడును గదలను చేత బట్టి ఉప్పొంగు సముద్రములో, మూలములు వీడి వచ్చి తలపడుచున్న కొండలో, మండుచున్న సూర్యులో, కాల్చెడు అగ్నులో ఆడేనుగునిమిత్తమై యాగ్రహించి కలపడు మదపుటేనుగలో గర్జించు మేఘములో ప్రతాపమును జూపు పెద్దపులులో కోపగించిన వృషభవాహనుడును గద ధరించిన యముడును తలపడిరో యనునట్లు పోరుచుండగా గదలు తాకుచున్న చప్పుళ్లు పిడుగుల మ్రోతకు సమానమై నాల్గుదిక్కులను గొప్ప ధ్వనులను గలుగజేసెను. ఆ రాజశ్రేష్ఠుడు గిరగిర ద్రిప్పి రాక్షసుని విశాలమైన వక్షమున దాకునట్లు గదను వేయగా అది మెఱుపు దీగ ఆకాశమును మెఱయించెడు విధముగా నుండెను. ఆ రావణుని చేతి గద అర్జునుని రొమ్మునందు కొండను తగులు ఉల్కవలె మెఱసెను. సమర్థులైన వారిరువురికి పూర్వము బలికి యింద్రుని వలె యుద్ధము భయంకరముగా జరిగెను. కొమ్ములతో కోడెలును, దంతములతో ఏనుగులును విజృంభించి తలపడు విధముగా వారొండొరులను దాకి భయము కలతలేనివారై గదలతో మొత్తుకొనిరి. అప్పుడు కార్తవీర్యుడు తన శక్తికొలది గదతో రావణుని వక్షము నందు గాఢముగా మోదగా దేవశ్రేష్ఠుల వరములచే రక్షింపబడినవాడగుటచే [బ్రహ్మ శివదత్త దీర్ఘాయువు ఉండుటచే చావడయ్యెను] అతడు చావడయ్యెను. బెండు వలె ఆ గద రెండు ముక్కలై భూమిపై బడెను. అట్లయినను ఆ గదాహుతితో

## కార్తవీర్యార్జునుడు రావణుని బంధించి పురికి గొనిపోవుట:

రావణుడు బాధనొందినవాడై విహ్వలుడై నాలుగు మూరల దూరము వెనుకకు వెళ్లి పడెను. ఆ బలవంతుని పాటు జూచి తటాలున పాముపై కవియు గరుత్మంతుని వలె ఆ రాజు అతనిపై బడి బలిని వామనుడు బంధించునట్లు బలవంతముగా పట్టి బంధించెను. అట్లు రాక్షసరాజును గట్టిన అర్జునుని సిద్ధులు చారణులు మెచ్చిరి. యక్షులు దేవతా సంఘములు

ఆ రాజుపై పుష్పవర్షమును గురియించిరి. సింహము గజమును వలె రావణాసురుని బట్టి అతడు జగత్తు క్షోభించునట్లు గర్జలతో నింపెను. అంత ప్రహస్తుడు తెప్పరిల్లి రావణుడున్న దుస్స్థితిని తేరి పారజూచి తోటి రాక్షసులను జతగలుపుకొనగా కారుమబ్బులు మూగెడు విధముగా ఆ రాజును చుట్టుముట్టి వివిధ సాధనములను విసరి విసరి నిలునిలు పోకు పోకు రాక్షసరాజును విడువు విడువు మని గొప్పకేకలతో పలుకుచు అర్జునునిపై రాక్షస సంఘములు బిలబిల మూగి శూలములను పెద్ద కటారులను వేయగా ఆ బలవంతుడు వారు వేసిన వానినే పట్టుకొని వారు భయపడి పారునట్లు వారిపై వేసెను. పెద్దగాలి తాకిడికి మబ్బుల వలె రాక్షస సమూహములు తూలిపోవుచు పారిపోగా అర్జునుడు రావణునితో పౌరులందఱు జయజయ ధ్వనులతో మెచ్చుచుండగా తన నగరమున ప్రవేశించెను.

★★★



# ముప్పది మూడవ సర్గము

## పులస్త్యుడు రావణుని విడిపించుకొని పోవుట:

రావణుని బంధించుట యనునది గాలిని మూటగట్టిన విధమని దేవతలాకాశమున సంతోషముతో చెప్పుకొనుచుండగా పులస్త్యుడామాటలను విని తమ మనుమడను స్నేహముతో తాను మహావేగముగా ఆకాశమార్గమున వచ్చెను. వాయువేగముతో వచ్చి అమరావతితో సమానమైనదియు, సంతుష్టి చెందిన ప్రజలతో గూడినదియు, అయిన మాహిష్మతీ పురమును ఆ మౌని ప్రవేశించి తనరాక రాజునకు చెప్పబంపగా వారలు రాజునొద్దకు వెళ్లి రాజా! పాదములతో నడచి వచ్చిన సూర్యుని వలె ప్రచండమైన తేజములతో తేరి చూడరానివాడై యొప్పుచున్న పులస్త్యముని వచ్చియున్నాడని చెప్పగానే అర్ఘ్యమును, మధుపర్కమును పట్టుకొని తన పురోహితులు వెంటరాగా ఇంద్రుడు బృహస్పతి నెదుర్కొన బోవు విధముగా చేతులు జోడించి శిరస్సుపై నుంచుకొని వెళ్లి అర్ఘ్యమును, పాద్యమును, ఆవును మధుపర్కమునిచ్చి మనస్సు సంతోషమధికమగుచుండగా లోపలికి తీసికొని వచ్చి ఉత్తమములయిన మాటలతో సంస్తుతించుచు ఆనందముతో గూడిన సంభ్రమముతో గద్గద కంఠముతో ఇట్లనెను. బ్రహ్మ సమానా! నీ విచ్చటికి వచ్చుటచే ఈ మాహిష్మతీపురము స్వర్గసమానమైనది. నేను చేసిన పుణ్యము సాటిలేనిది గదా. ఎవ్వరికిని గనిపింపక దేవతల చేత పూజలందు నిన్ను నా పురము నందు చూచి ఈ విధముగా పూజించుటచే నేను ద్విజేంద్రుడనైతిని. ఇప్పుడు గదా నాకు క్షేమము కలిగినది. ఇప్పుడు గదా నేను చేసిన వ్రతములు పండెను. ఇప్పుడు గదా నా జన్మ సార్థకమైనది. ఇప్పుడు గదా నా తపస్సు ఫలించినది. నేను కృతార్థుడనైతిని గదా. ఓ మునీశ్వరా! ఈ రాజ్యము, ఈ పుత్రులు ఈ భార్యలు అందఱును నేనును నీ వారలమే సుమా! ఓ కారుణ్యమతీ! నేను చేయదగిన కార్యమేదియో ఆజ్ఞనొసంగవే! అని పలుకగా ఆ సద్భావుడగు ముని ఓ హైహయాధిపా! నీనందనులందఱును క్షేమమా? నీ రాణులందఱకును సుఖమే గదా. అగ్నిహోత్రములు చక్కగనున్నవా? ఎందును, ఎప్పుడును లోపము లేక ధర్మము నడచుచున్నదా? అని ప్రశ్నించి. ఓ దశవదనుని గెలిచిన కీర్తిమూర్తీ! ఎవ్వని యుద్ధమును గూర్చి విన్నగాలియు,

మహాసముద్రములును నివ్వెఱ జెంది చలనము లేక నిలుచునో, అట్టి దుర్జయుడైన వీరుని నామనుమని యుద్ధమున పట్టి బంధించి ఈ కుమారుని కీర్తి ప్రవాహమును మదమణగునట్లు త్రాగివేసితివి కోటి విధములుగా నిన్ను మెచ్చు కొనుచున్నాను. ఇంక నీవు మా పిల్లవానిపై కోపమును వీడుము. ఇదియే నా కోరిక. ఓ రాజా! వేగముగా రావణుని చెఱ నుండి విడిపించుము. అనగా ఇంకొక విధముగా తలంపక ఆ రాజచంద్రుడు ముని వర్యుని ప్రీతికై సంతోషముతో రాక్షసరాజును విడిచి వేసెను. వారిరువురును అగ్నిసాక్షిగా స్నేహము గావించుకొనిరయ్యా! రామచంద్రా! ఒకరినొకరింక బాధించుకొనకుండ స్నేహము చేసి ఆ యర్జునుడు నిండు భక్తితో మునిరాజునకు మ్రొక్కి తన గృహమునకు వెళ్లెను. ఆ రాజుచే ఆతిథ్యమును బొంది తాత నీతులు బోధింపగా విని సిగ్గు చెందిన వాడై రాక్షసుడు లంకకు వెళ్లెను. ముని బ్రహ్మలోకమునకు వెళ్లెను. రామచంద్రా! వీరుడైన రాజుచే రావణుడెట్లు బలాత్కారముగా బంధింపబడి తరువాత పులస్త్యుని మాటచే విడువబడెనో వింటివా? తానెంతటి బలవంతుడైనను మూర్ఖత్వముతో ఇతరుల నవమానింపదగదు. భూమిపై బలవంతులను మించిన బలవంతులుండరా? రాక్షసరాజు మాహిష్మతీ పురాధిపతితో స్నేహము చేసి తిరిగి పొగరుతో భూమియందు రాజులను జయించుటకు లజ్జయనుమాటలేక తిరుగుచుండెను.

★★★



# ముప్పది నాలుగవ సర్గము

## రావణుడు వాలితో యుద్ధము చేయబోవుట:

మదించిన గజేంద్రుని వంటి వాడగు రావణుడు మానవలందును, రాక్షసులందును ఏ పరాక్రమవంతుని గూర్చి విన్నను అక్కడకు వెళ్ళి గర్వాంధతతో వానిని యుద్ధమునకు పిలుచుచుండెను. ఇట్లు లోకములందు దిరుగుచు ఒకనాడు కిష్కింధకు వచ్చి హేమమాలికను ధరించిన వాలిని యుద్ధమునకు బిలిచెను. తారుడును, సుగ్రీవుడును, తార తండ్రియగు సుషేణుడును వచ్చి రావణునితో నిట్లనిరి. రావణా! నీకు ప్రతివీరుడైన వాలి యూరలేడు. యుద్ధమున కెవ్వని నాహ్వానించుచున్నావు? ఓ దశవదనా! వాలి తప్ప ఏ వనసంచారి నిన్నెదిరింపగలడు? అతడు సంధ్య వార్చుటకై నాల్గు సముద్రములకు వెళ్లెను. కొంచెము సేపాగుము. అతడిప్పుడే వచ్చును. వాలితో యుద్ధము చేయవచ్చిన వారియొక్క శంఖములవలె తెల్లనైన యెముకల ప్రోవులను చూడుము. నీవమృతము త్రాగి వచ్చినను, వాలిని చెనకినచో అంతటితో నీవు చచ్చెదవు. సర్వజనులకు ఆశ్చర్యమును గలిగించు వాడును, బంగారు మాలికను ధరించిన వాడును అయిన మా వాలితో తలపడితివేని నీవు జీవించి యుండుట దుర్లభము. కాన చక్కగా ఊరికి వెడలుము. కాక చావ దలచినచో వాలి కొఱకు వేగముగా వెళ్లుము. అతడిప్పుడు దక్షిణ సముద్ర తీరమున సంధ్యవార్చుట యందాసక్తుడై ప్రజ్వలించు అగ్నితో సమానమైన తేజస్సు గలవాడై భూమిపై గూర్చొని యుండును అని చెప్పగా ఆ తారుడను వానరేంద్రుని గదిమి వేగముగా పుష్పకము నెక్కి రాక్షసాధిపతి దక్షిణసముద్రమును చేరబోయి అందొక చోట ప్రకాశించు బంగారు కొండవలె నున్నవాడును, ఉదయించుచున్న సూర్యుని వంటి ముఖము గలవాడును, సంధ్యోపాసన గావించుచున్నవాడును అయిన యింద్ర పుత్రుని జూచి ఆ రాక్షసరాజు విమానము నుండి దిగెను. వేగముగా దిగి తన పాదముల చప్పుడు వినబడకుండ వెళ్లి ఇంద్రనందనుని తాను తప్పక పట్టదలచినవాడై నేర్పుగా వెళ్లుచుండగా వాని దౌర్భాగ్యవశమున ఆ వాలి ఎట్లో అనుకొనకుండ ఆ పాపాత్ముని కడగంటితో జూచి తానిటునటు కదలక ఏమియు కలత చెందక ఎప్పటివలె నుండెను. చెవుల పిల్లిని జూచిన సింహము వలెను, పామును జూచిన

గరుడుని వలెను లెక్కచేయక తనను పట్టువచ్చుచున్న రావణుని గూర్చి ఆ వాలి యిట్లు తలంచెను. పాపపుబుద్ధితో వీడు పొంచి నన్ను పట్టదలంచెను. బలవంతముగా నేను వీనిని చంకలో ఇరికించుకొని ఆకసమున తన తొడలు, చేతులు వ్రేలాడుచు గరుడునకు పట్టువడిన సర్పము వలె బాధపడునట్లు ఆకాశమార్గమున మూడు సముద్రములందును స్నానము చేయుటకు వెళ్లుదును. అని తలంచుచు ఒక చెవి అతని మీదనే యుంచి మునులకు దగిన వేదమంత్రమును జపించుచుండెను. ఇట్లు ఘనబలులైన ఆ ఇరువురొకరి నొకరు పట్టు ప్రయత్నముతో నుండిరి.

## వాలి రావణుని చంక నిరికించుకొని సముద్రముల ముంచుట:

[వాలికి సంధ్యయు ప్రతిమంత్ర జపము కలదనుటచే నతడు మృగము గాదనియు వాలము గల మనుష్యుడనియు నేర్పడుచున్నది] ఇట్లు వచ్చు రావణుడు సమీపించిన జాడను వెను దిరిగి యుండియు వానర రాజతని పాదముల ధ్వనిచే గుర్తించెను. ఇంతలోపల రాక్షసుడు వానరుని పట్టుటకై చేతులు చాపగా గ్రక్కున ఆ బలవంతుడైన యింద్రపుత్రుడు పామును గరుత్మంతుడు పట్టు విధముగా తటాలున అట్టెపట్టి గొప్ప దర్పము గల యాతడు చంక క్రింద నొక్కి మహావేగము గలవాడై ఆకసమున కెగసి నెత్తురు కాలువ గట్టునట్లు వానిని గిచ్చుచు వాయువు పెద్దమేఘమును వలె ఆ మోసగానిని లాగుకొని వేగముగా బోవుచుండగా ఇంతలో రావణుని గతిని చూచి అతని మంత్రులు వానిని విడిపించుటకై వానరుని వెంటపడగా అతడాకాశము మార్గమున నున్న సూర్యుని పోలి ప్రకాశించుచు వెళ్లుచుండగా అందుకొన జాలక అలసి అతని బాహువుల యొక్క తొడల యొక్క వేగము వలన పుట్టిన గాలిచే నెగురగొట్టబడినవారై వెనుకకు తగ్గిరి. ఆ వాలి వెళ్లెడిచోట పర్వతములైనను తప్పుకొని మార్గమునిచ్చును. ఇంక ప్రాణులమాట చెప్పనేల? పక్షులైనను వెళ్లజాలని ప్రదేశములందు వెళ్లుచు ఇంద్రపుత్రుడు వరుసగా సముద్రము లన్నింటి యందును తనను స్వర్గమునందలి దేవతల సంఘములు మెచ్చునట్లు సంధ్యోపాసన చేసెను. రావణుని చంకనిడుకొని పడమటి సముద్రమునకు వెళ్లి సంధ్యవార్చి వేగముగా ఉత్తర సముద్రమునకు రావణుని నీడ్చుకొనుచు వెళ్లెను. ఎన్నివేల ఆమడలో ఆ రాక్షసునితో ఆకాశమార్గమున వాలి వాయువు వలె మనస్సు వలె అతి వేగముతో ఉత్తర సముద్రమును విడచి ఓ రామచంద్రా! తూర్పు సముద్రమునకు వెళ్లి అచ్చట నియమముతో తన నిష్ఠను దీర్చి రాక్షసునితో గూడ తిరిగ కిష్కింధ ప్రాంతముననున్న వనమునందు

దిగెను. ఆ దశకంఠుని భారముచే శ్రమ చెంది బలవంతుడగు ఆ మూర్ఖుని చంక నుండి యచ్చట విడిచెను. ఈ విధముగా విడిచి ఆ రావణుని ప్రక్కకు తిరిగి ఎప్పుడు వచ్చితివయ్యా ఇక్కడకు? ఏమి పనో! యెక్కడ నుండి వచ్చితివో అని చిరునవ్వుతో పలుకరింపగా

## రావణుడు వాలితో స్నేహము చేయుట:

రావణుడు విస్మయము చెంది వానర నాథుని చంకలో నలుగుడుపాటు నొంది కన్నులలో ప్రాణములుండగా శ్రమచే చూపులు చలించుచుండగా నిట్లనెను. ఓ వానరనాథా! నేను రాక్షసరాజును. పొగరుతో నీతో యుద్ధమును గోరి వచ్చితిని. నా మదవణగు నట్లు నీకు చిక్కితిని. నేను రావణుడను. వానరనాథా! నీవింద్రుని వంటి వాడవు. ఆహాహా! యేమి నీ బలము? ఆహా! ఏమి వేగము? ఏమి గాంభీర్యము? ఈ విధమునే నీజగత్తు నందెందును చూచి యెరుగను. నా వంటివానిని పశువును వలె ఈడ్చుకొని వెళ్లి నాల్గు సముద్రము లందును ముంచి లాగి తెచ్చితివి. వానరనాథా! మనస్సు నందైనను ఏమాత్రము శ్రమచెందవు గదా! మనస్సునకును, వాయువునకును, వినతాపుత్రుడైన గరుడునకును ఇట్టి వేగము గలదని లోకప్రసిద్ధము. ఓ వానరనాథా! నీవును అట్టివాడవు. ఇందు సందేహింప పనిలేదు. నీ వేగము నీ శౌర్యము విశేషముగా నాకు తెలిసినవి. వానరనాథా! నీతో అగ్నిసాక్షికముగ స్నేహమును నేను కోరుచున్నాను. ఓ వానరనాథా! మనకిరువురకును భార్యలు, పుత్రులు, పురములు, సంపద, రాజ్యములు, భోగములు, వస్త్రములు, సకలమైన ఆహారములు, సమాన భాగములు కాగలవు. అగ్నులను రగిలించి ఈ విధముగా వానర రాక్షసరాజు లిరువురు ఒకరినొకరాలింగనము గావించుకొన్నవారై తగు విధముగ చేతిలో చేయి వేసి జగత్తునకు తెలియునట్లు అప్పుడు స్నేహము చేసికొనిరి. [దేవతాకార్యమును దీర్ప శ్రీరామునకు సహాయపడ వానరులు దేవతలచే సృష్టింపబడిరి. ఈ సమయమునకు విరుద్ధముగా ఇంద్రుని కొడుకే ఇంద్రవిరోధితో చెలిమి చేయుటే కాక శ్రీరామ కార్యముకు సహాయము చేయగల సుగ్రీవుని హింసింపనెంచెను. కావున వాలి వధ్యుడయ్యెను. ఈ యర్థమే 'సమయే తిష్ఠ సుగ్రీవ! మా వాలి పథమన్వగాః' అను శ్రీరామ వాక్యంబుల కననగునుచూ కిష్కింధాకాండము 849 వ పద్యము. శ్రీరామ సాహాయ్యమే తొలుతటి సమయము. రెండవది శ్రీరామ సుగ్రీవ సఖ్యము] అంతట వానర రాక్షసులు మృగరాజులు గుహయందు ప్రవేశించునట్లు పరిశుద్ధమైన మనస్సులతో చేతితో చేయి పట్టుకొని సంతోషముతో మెల్లగా కిష్కింధకు వెళ్లి యచ్చట ఒక నెల సంతోషముతో

చరించిరి. సుగ్రీవుని వలెనే రాక్షసనాథుడును ఏమియు కలత లేక ఉండగా అతనిని మంత్రులు లోకములను బాధింప వెళ్లుటకు పిలువవచ్చిరి. ఆ కర్కశస్వభావుడగు రావణుడు తా నా రాక్షసుల వెంబడి వెళ్లెను. ఓ కాకుత్థ్సవంశాభరణా! పద్మదళాక్షా! ఈ విధముగా పూర్వవృత్తాంతము జరిగినది. రావణుని కథను. వింటివి గదా వాలి శక్తి విధమును. అట్టి బలవంతుడును నీ శరముచే అగ్నియందు బడు మిడుత వలె యయ్యెను గదా ఓ మహాబలాఢ్యా!

★★★



# ముప్పదియైదవ సర్గము

## శ్రీరాముడగస్త్యుని హనుమంతుని గూర్చి ప్రశ్నించుట:

అని చెప్పగా విని భూతనయా మనోహరుడు దక్షిణదిక్కు నివాసముగా గల మునీంద్రునితో నిట్లనెను. మునీంద్రా! వాలియు, రావణుడును మిక్కిలి బలవంతులును గాఢపరాక్రమము గలవారును అయినను మా హనుమంతునితో సరిగారని నా మనస్సునకు తోచుచున్నది. మహాత్మా! ఆలోచించి చూడగా శౌర్యము, నయసాధనము, ధైర్యము, పరాక్రమము, దాక్ష్యము, బలము, స్థైర్యము, ప్రాజ్ఞత, మహిమయు, ఓ ఆర్యగుణా! హనుమంతుని యందు స్థిరమై యుండెను. సముద్రమును జూచి బాధ నొందు వానరులు సంతోషించునట్లు నూరుయోజనముల దూరము పెద్ద శక్తితో దాటినాడు. రావణుని యంతఃపురమున వెదకి సీతను జూచి మాట్లాడి యోదార్చినాడు. సేనానాయకులను మంత్రి తనయులను కింకరులను అక్షుని నొక్కడే సంహరించెను. బంధనముల నూడ దన్ని రావణునితో మాటాడి లంకను అవలీలగా మసి చేసెను. యుద్ధమున హనుమ చేసిన పనులు యముడైనను, ఇంద్రుడైనను, అగ్నిహోత్రుడైనను, యక్షరాజైనను చేయుట వింటిమా మహాత్మా! ఈతని బలపరాక్రమముల చేతనే కదా నేను లంకను గెల్చి చిన్నతమ్మునితోను, సీతాసతితోను, బంధు సమూహముతోను రాజ్యమందు సంతోషమందగంటిని. సుగ్రీవ సఖుడగు నీ హనుమంతుడు లేకున్న నెవ్వరు జానకి వార్తను దెచ్చు నేర్పు గలవారలు? అంతటి మెచ్చదగిన విక్రమము గలవారు లోకములలో నుందురా? సుగ్రీవుని మేలు గోరుచు స్థిరముగా ఆతని యొద్దనే యుండియు సుగ్రీవునకును వాలికిని విరోధము కల్గగా వాయుపుత్రుడు వాలిని దావాగ్ని పొదను గాల్చు విధముగా నాశనము చేయక తన మిత్రుడావిధముగా ఎడతెగని దుఃఖము చేత తపించుచుండగా ఎట్లు చూచుచు ఊరకుండ గలిగెను? ఓ మహాత్మా! హనుమంతునకు తన బలము తనకు తెలియదేమో యని నేను తలచుచున్నాను. మునీంద్రా! ఈ విషయము వినగోరుచున్నాను చెప్పుమా యని యడుగ ఆ ముని హనుమంతుని సమక్షమందే యిట్లు చెప్పసాగెను. శ్రీరామా! నీ యభిప్రాయము నిజము. బలమునందు వేగము నందు ప్రజ్ఞయందు హనుమంతునితో సమానమైన

వాడొక్కడును గనుపింపడు. పూర్వము మునిశ్రేష్ఠులమోఘమైన శాపమిచ్చుటచే ఈ యుత్తమ గుణరాశి తన శక్తి తానెఱుగడు. చిన్నతనమునందు ఈ వీరుడు చేసినది యెంతో గొప్పదైనను బాల్యముచే నితడు తెలియలేడయ్యెను. ఈ పవమానసూనుని చరిత్ర సర్వమును నీకు విననభిప్రాయమున్నచో ఓ విశ్వవినుతమైన రమ్యగుణములు గల దశరథ రామచంద్రా! సర్వమును వినిపించెదను వినవయ్యా!

## ఆంజనేయో పాఖ్యానము:

భాస్కరుని వరముచే బంగారు రంగు గలిగి ప్రకాశించు మేరు పర్వతము గలదు. ఈ వీరుని తండ్రి కేసరి యనువాడు అచ్చట రాజయి యొప్పుచుండెను. అతని భార్య యంజన పేరు గలిగి యుండెను. ఆమె వాయువున కీ యనఘుని వరి గింజ కొనముల్లు వంటి వన్నె గలవానిని కనెను. ఫలములు దెచ్చు కోరికతో ఆమె అడవికి వెళ్ళగా, అధికమైన ఆకలి చేతను, తల్లి విడిచి వెళ్లుటచేతను తాళలేక రెల్లు పొదయందు షణ్ముఖుని వలె ఖేదముతో రోదనము చేసి అప్పుడు జపాకుసుమము వలె కాంతితో నొప్పుచు తూర్పుకొండ పయి ఆకాశమున నుదయించుచున్న సూర్యుని జూచి ఫలమనుబుద్ధితో అతనిని పట్టుటకై ఆకాశమునకు చివాలున నెగిరెను. బాల సూర్యునితో సమానుడు బాల సూర్యునకభిముఖముగా వేగముగా వెళ్లుచుండగా మనోవేగ వాయువేగములతో ఆకాశమున వెడలుచున్న వానరబాలుని మహర్షులు, దేవతలు, రాక్షసులు, యక్షులు మిక్కిలి ఆశ్చర్యపడుచు చూచుచు అయ్యారే! చిన్నతనము నందే యిట్టి శక్తి కలిగియున్నచో నిండైన యౌవనము నందేవిధముగా ఒప్పునో గదా యని భావించిరి. అట్లు వెళ్లుచున్న తన పుత్రుడు సూర్యునిచే దహింపబడకుండ సుఖము గలుగజేయుచు చల్లనివాడై వాయువు కుమారుని వెంటనే వెళ్లుచుండెను. ఆ సూర్యుడును బాలకుని జూచి యేమియు తెలియని బిడ్డడని ఈతని వలన గొప్పకార్యములు తప్పక కాగలవని మనస్సు నందు తలంచుచు తన వేడిమిని చూపకుండెను. ఈతడు జనకుని శక్తి చేతను తన శక్తిచేతను ఆకాశమున వేనవేల యోజనములు వెళ్లి సూర్యుని సమీపించెను. ఆనాడే రాహువు కూడా సూర్యుని పట్టుటకు వచ్చి ఈ వానర బాలకుని జూచి భయపడి పరుగెత్తి యింద్రుని చేరవేగి కోపముతో నిట్లనెను. మహేంద్రా! యేమిది? తొలుత మేము సూర్యచంద్రులను పట్టునట్లు నియమము చేసి ఇప్పుడు వేరొకని నియమించితివేల? నేడమావాస్య నేను వెళ్లగా సూర్యుని పట్టుటకు ఇంకొక రాహువు వచ్చెను సుమా అని చెప్పగానే ఇంద్రుడు దీనుడగు రాహువు నూరడించి

వేగముగా లేచెను. ఇంద్రుడట్లు లేచి మిక్కిలి ప్రకాశించు బంగారు మాలికను దాల్చి కైలాస శిఖరసమానమును, సుందరమైన భూషణములతో అలంకరింపబడినదియు, ఘంటల సమూహముచే ధ్వనులు చేయుచున్నదియు, అగు నాల్గుదంతములు గల ఏనుగు (ఐరావతము) నెక్కి వేగముగా రాహువు ముందుండగా సూర్యుడును వానర బాలుడును ఉన్నచోటునకు వెళ్లెను. రాహువు ముందుముందుగా సూర్యునిపట్టుటకు వెళ్లెను. ఓ మహాబాహూ! రామచంద్రా! పర్వత శిఖరమోయనునట్లు వంగి వేగముగా వచ్చుచున్న సాహసవంతుడగు అతనిని చక్కగా గమనించి వానరశ్రేష్ఠుడియ్యది మేలుగానున్నదని యెంచి తాను సూర్యుని వదలి రాహువు వెంట పడెను. వాడు భయముతో వేగముగా వెనుదిరిగినవాడై ఇంద్రా! ఇంద్రా! నాకు నీవే దిక్కు సాహసియైన వానరునిచే చిక్కకుండ దయతో నన్ను గాపాడవేయని మాటిమాటికి అరవసాగెను. ముఖము మాత్రమే శేషించిన వాడగు రాహువు ఈ విధముగా భయముతో అభయము వేడగా ఇంద్రుడు భయపడకుము. ఆ యర్భకుని సంహరించెదనని చెప్పుచుండగా ఈ వాయుపుత్రుడు ఇంద్రుని యేనుగును జూచి మిక్కిలి సంతోషముతో పెద్ద పండనుకొని దానిని పట్టుటకై వేగముగా వెళ్లెను. అభ్రము వల్లభుడగు ఐరావతమును ఆకాశమార్గమున పట్టవచ్చు అంజనా తనయునిపై మహేంద్రుడు తనచేతనున్న వజ్రాయుధమును విపరీతమైన కోపముతో వేసెను. ఆ దెబ్బతో వానరుడు బాధతో కలత జెందినవాడై పర్వత శిఖరముపై తెలివి దప్పి పడిపోయెను. రామచంద్రా! ఆ దెబ్బచే వాయుపుత్రునకు ఎడమ దవడ భగ్నమయ్యెను.

## వాయు నిరోధమున లోకములు బాధపడుట:

ఇంద్రుడు తన పుత్రున కాపద కలుగుజేయుటచే కోపగించి ఆ వాయుదేవుడు లోకములన్నింటికి ఆపద కలుగజేయదలంచి తనయునితో కొండగుహలోనికి ప్రజలకు కీడు కలుగునట్లు దేహములందు సంచరించుటమాని ఇంద్రుడు వర్షము నాపునట్లు ఉండెను. దానితో ప్రజలకు మలమూత్రములు వెడలవయ్యెను. నిశ్వాసము లేమియు వెడలుట లేదు. సంధులు విడిపోయి కట్టెలవలె ముడుచుట చాచుట అసాధ్యమయ్యెను. వేదపఠనము, హోమము సున్నయయ్యెను. నిత్యకర్మలన్నియును నిలిచి పోయెను. ఆగ్రహముతో వాయువు నిగ్రహించుటచే ధర్మకార్యములన్నియు తొలగి పోయెను. అప్పుడు గంధర్వులు, రాక్షసులు, దేవతలు అందఱును మిక్కిలి ఆపదతో ఉబ్బిన పొట్టలతో మహోదరము గలవారి వలె కదలలేక బ్రహ్మను చేరజని చేతులు జోడించి నమస్కరించుచు

ఓ బ్రహ్మదేవా! నాల్గు విధములుగా ప్రజలను సృజించి మాకు వాయుదేవుని ప్రాణముల కాధారముగా జేసితివిగదా. అట్టి జగములకు ప్రాణమైన వాడిప్పుడు ఈ విధముగా మమ్ము అంతఃపుర స్త్రీలను వలె ఇటునటు కదలకుండునట్లు పెద్ద బాధ కలుగజేసెను. ఎట్లు వేగుదుము? అభవా! మాకు శరణము నీవే. వాయువు మమ్ము చంప దలంచెను. ఈ వ్యథాభారమును తొలగింపుము అనగా జనులనుజూచి బ్రహ్మ కారణాంతరమున వాయువిట్లు చేసెను. సింహికాపుత్రుడైన రాహువు మాటచే ఇంద్రుడు వాయుపుత్రుని సొమ్మసిల్లునట్లు వజ్రాయుధపుటంచుతో కొట్టుటచే కోపము నంది వాయువు కదలక నిల్చినాడు. వాయువే శరీరములను సుఖముగా నుంచువాడు. వాయువు లేకపోవుటచే చలనము లేక కట్టెలతో సాటియగును గదా. గాలి నోదార్చి మీ భయము దీరునట్లు చేసెదను. ప్రజలారా! పదుడు. నేను గూడ వచ్చెదను. వాయుదేవుని శాంతుని జేసెదను. జగముల బాధ మాన్పెదను పదుండని సరస్వతీ పతి దేవతలును, గుహ్యకులును, నాగులును తనను కొలిచి రాగా వెళ్లి సూర్యునితో, బంగారముతో అగ్నితో సమానముగా ప్రకాశించు శరీరము గల తన పుత్రుని తన తొడయందిడుకొనియున్న వాయుదేవుని జేరబోయి ఆదరముతో బాలుని జూడగా బ్రహ్మదేవుని రాకను జూచి పుత్రుని ఆపదతో తపించినవాడై వాయుదేవుడు పుత్రునెత్తుకొని గ్రక్కున లేచెను.

★★★



# ముప్పదియాఱవ సర్గము

## బ్రహ్మాదులు హనుమంతునకు వరము లిచ్చుట:

కదలుచున్న కుండలములు, కిరీటము, హారములు, బంగారు ఆభరణములు గలవాడయి వాయుదేవుడు బ్రహ్మకు ముమ్మాఱు సాగిలి మ్రొక్కగా బ్రహ్మ అతనిని లేవనెత్తి తన చేతులతో బాలుని శరీరము నిమిరెను. అంత వాడిన పైరు నీరు పడుటచే తెప్పరిల్లి లేచిన విధముగా హనుమంతుడు తిరిగి జీవించుటచే వాయువెంతో సంతోషించి పూర్వము వలెనే జనుల శరీరములందు సంచరించుచుండెను. వాయుబాధ విడిచి ప్రజలు చలిగాడ్పు వలని బాధ తొలగుటచే పద్మములతో గూడిన తూండ్లు ప్రకాశించునట్లు సంతోషించిరి. వాయువునకు మేలు చేయదలంచి బ్రహ్మ యిట్లనెను. ఓ ఇంద్రా! ఓ శంకరా! ఓ వరుణా! ఓ కుబేరా! ఓ యమా! ఈ వాయుపుత్రుడు అరుదైన ఒకానొక భవిష్యత్కార్యమును సమర్థతతో నెఱవేర్పుగలడు. మీకెల్లరకునిది బాగుగా తెలియును. బలవంతుడగు నట్టి వాయుపుత్రునకు వరముల నొసంగుడు. వాయువునకు సంతోషమధికమగును గాక. అని బ్రహ్మ చెప్పగానే ఇంద్రుడు పద్మములతో గూడిన మాలిక నిచ్చి నా వజ్రపు దెబ్బచే గదా ఈతని హనువిట్లు నొచ్చినది. కాన జగత్ప్రఖ్యాతముగా హనుమంతుడను పేరు పొందునుగాక. ఇంక ముందితడు వజ్రపు దెబ్బచే మృత్యువు నొందకుండును గాక అని వరమునిచ్చెను. అంత సూర్యుడు కరుణతో నిండిన మనస్సు గలవాడై యిట్లనెను. శూరశ్రేష్ఠుడైన ఈ వాయుపుత్రునకు నా తేజస్సు నందు నూరవవంతు నిచ్చితిని. ఇతనికి శాస్త్రములు చదువు శక్తి వచ్చినప్పుడు వీనిని వాగ్మి చేయు శాస్త్రమును కీర్తి ప్రఖ్యాతమగు విధముగా నేర్పెదను. శాస్త్రజ్ఞానము నందు వినితో సమానుడు లేనట్లు చేసెదనని చెప్పెను. అంత వరుణుడు ఇతడు పది లక్షలయేండ్ల కైనను నీళ్లయందుగాని నాపాశముల చేతిగాని మృతి చెందకుండుననెను. కాలదండము మొదలయిన వానిచే చావు లేకుండుటయు, ఎప్పుడును వ్యాధియనునది యెఱుగకుండుటయు, యుద్ధభూమి యందు విషాదము నందకుండుటయు ఇతనికి వరములుగా నిచ్చితినని యమధర్మరాజు పలికెను. కుబేరుడు తన గద చేత చావులేకుండునట్లు వరమిచ్చెను. త్రిలోచనుడు మిక్కిలి ప్రశస్తములైన తన

యాయుధముల సమూహముచే చావకుండ వరమిచ్చెను. బ్రహ్మ హనుమంతునకు చిరాయువునిచ్చి ఈ యనుఘుడు బ్రహ్మదండముల కన్నింటికి అవధ్యుడగు గాక అని వరమిచ్చెను. బాలసూర్యునితో సమానుడైన బాలుని జూచి విశ్వకర్మ ఈ విశ్వనుతుడు నాచే నిర్మింపబడిన అస్త్రశస్త్రములచో చావకుండును గాక దీర్ఘాయువై యుండును గాక అని పల్కెను. అప్పుడు సంతోషించి బ్రహ్మ వాయువుతో నిట్లనెను. ఓ వాయుదేవా! నీ పుత్రుడు విరోధులకు భయము గలిగించువాడును, తప్పక మిత్రులకు సంతోషమును గలిగించువాడును అగును. ఘన బలశాలి, దుర్జయుడు, కామగమనుడు, కామరూపి ఎందును ఎదురులేని ఉత్తమకీర్తిగలవాడు తలచిన చోటునకు వెళ్లగలవాడును అగును. రావణవధ విషయమున సీతానాథునకు బాసటగా నుండి తాను యుద్ధభూమి యందు అద్భుతములైన కార్యములను జరిగించునని బిడ్డనందజేసి వెళ్లెదనని చెప్పి దేవతలతో గూడ బ్రహ్మ వెళ్లగా వాయుదేవుడు బిడ్డనితో వచ్చి ప్రేమతో జరిగిన సమస్త వృత్తాంతమును దెలిపి అంజనాదేవి చేతికి బిడ్డ నిచ్చి వెళ్లెను.

## మునులు హనుమంతుని శపించుట:

అంత హనుమంతుడు వరబలముచే సముద్రము వలె పొంగుచు మునిశ్రేష్ఠుల యాశ్రమములందు భయము లేక ప్రవేశించి నారవస్త్రములను జించుచు, అగ్నిహోత్రములను చల్లార్చుచు, హోమపాత్రలను నాశనము చేయుచు, చిందర వందర చేయుచుండ మునిశ్రేష్ఠులు బ్రహ్మ వరమిచ్చుట యెఱిగిన వారగుటచే శాంతము వహించియు, వానరుడు పెట్టుచున్న కష్టములను భరింపలేక, మిక్కిలి కోపమును పొందకుండ ఓ వానరుడా! యే వరశక్తి బలముచే ఇంత చేయుచున్నావో అట్టి బలమంతయు నీవు మరచిపోయెదవు నిన్నెవ్వరైనను పొగడినచో అప్పుడు నీశక్తి నీకు తోచును గాక అని ఋషులు శపించుటచే ఈ అనఘుడు తన శక్తిని మరచి అది మొదలుకొని సాధుచరితుడై యెందైనను మృదుభావముతో సంచరించుచుండెను. తరువాత వానరకులములకు శూరవరుడు వాలిసుగ్రీవుల తండ్రియైన ఋక్షరజుండనువాడు రాజై యుండెను. సూర్యసమానమైన తేజస్సు గల అతడు చిరకాలము రాజ్యము నేలి స్వర్గము చేరగా మంత్రులు తండ్రి పదవి యందు పెద్దవాడైన వాలిని రాజుగా నియమించి సుగ్రీవుని యువరాజుగా నిల్పిరి. ఈ హనుమంతుడును బాల్యము మొదలుకొని నిర్మలము, దోషరహితము, భేదరహితము అయిన స్నేహమును సూర్యపుత్రుడై సుగ్రీవునితో

చేయుచుండెను. రామచంద్రా! హనుమంతుని పుట్టుకను అతని వీర్యమును వింటివిగదా. మునుల శాపము చేత తన శక్తిని తెలిసికొనలేనివాడై వాలి సుగ్రీవుని తరముచుండగా తానును పిరికివాని వలె పరువెత్తుచుండెను. సుగ్రీవున కీ విషయము తెలియకపోవుటచే అతడును జ్ఞాపకము చేయడయ్యెను. అందుచేతనే గదా ఏనుగు మీదకు రాగా బలవంతమైన సింహము పరువెత్తు విధమున అతడు యుద్ధరంగమున పారిపోయెను. వింటివా. స్థైర్యము, ధైర్యము, పరాక్రమము, సాహసములందును, శౌర్యము గాంభీర్యము బుద్ధులందును, చాతుర్యము, నీతి, యుక్తులందును, మాటనేర్పు, కార్యనిర్వహణములందును, ప్రజల కానందము గలిగించు కృత్యములందును సూర్యశిష్యుడైన ఈ వాయుపుత్రునకు సమానమైన వారుందురా? ఉదయపర్వతము నుండి అస్తాద్రి వఱకు అతివేగముగా సూర్యునితో వెళ్లుచు నితడు వ్యాకరణము నంతను గట్టిగా వల్లించెను. ఓ పద్మదళాక్షా! సూత్రములతో గూడ వృత్తియు, సూత్రములకు అర్థము, పదము, మఱియు మహార్థము, ఇతర శాస్త్ర సమూహము, ఛందస్సు చక్కగా నేర్చెను. కీర్తింపబడిన చరిత్ర గల ఈ హనుమంతుడు సామాన్యుడా? ఓ రామచంద్రా! సర్వవిద్యల యందును ఈతడు దేవతాచార్యుడైన బృహస్పతితో సమానుడు. తొమ్మిది వ్యాకరణముల నభ్యసించెను. నీ దయచే బ్రహ్మకాగలడు. వాయుపుత్రుడు జగములను ముంపబూనిన సాగరుడు భువనములను గాల్పబూనిన అగ్ని, ప్రళయకాలమున విజృంభించు యముడు అట్టివాని యెదుట నెవడు నిలువగలడు. వాయుపుత్రుని వలెనే నీకు యుద్ధమున తోడ్పడుటకు దేవతల చేత సుగ్రీవుడును, మైందుడును, ద్వివిదుడును, రంభుడును, సైన్యనాథుడైన నీలుడును, అంగదుడును, తారుడును భూమియందు జన్మించిరి. రామా! నీకు అంజనాపుత్రుని చరిత్రమును సర్వమును వినిపించితిని. అని చెప్పగా రాముడును సౌమిత్రియు వానర నాయకులును ఆశ్చర్యమునందిరి. అంత లోపాముద్రాపతి రామభూపాలునితో మరల నిట్లనెను.

### అగస్త్యాదులు శ్రీరాముచే ననుజ్ఞగొని పోవుట:

రామచంద్రా! ఎల్లవృత్తాంతములను వినిపించితిని. నీ వఖిలమును వింటివి. ఓ ఆర్తజనరక్షణదక్షా! ఇంక మాకు వెళ్లుట కనుమతి నిచ్చెదవా? అనగా రాఘవుడు సంతోషముతో చేతులు జోడించి ఆ మునిశ్రేష్ఠునితో నిట్లనెను. ఓ అనఘా! నిన్ను చూచుట యను పుణ్యము నేడిట్లు నాకు కలుగుటచే నా దేవతలును, తాతలును,

తండ్రియు సంతోషము నొందిరి. ఓ మునివరా! నా బంధువులందఱును శాశ్వతముగా సంతోషమందిరి. ఒక విన్నపమును వినుడు. ఇక్కడకు రమ్మని నేను కోరినచో నా మనవిని స్వీకరించి మీరు దయ దప్పక ఇచ్చటికి రావలయును. నేనడవుల నుండి తిరిగి వచ్చితిని. పౌరులందఱను తమ తమ పనులను తడబాటు లేక యధావిధిగా చేయునట్లు చేసి యాగము చేయ బూనుకొనెదను. మీరా క్రతుసమయమునందు కార్యములన్నియు జరిగించుటకై దయతో ఎల్లప్పుడు నిచ్చటనే యుండవలయును. పవిత్రులైన మిమ్ము సమ్మతితో ఆశ్రయించి ఈ క్రతుకార్యములను పూర్తిచేసి పితృదేవతల యనుగ్రహమునకు నేను పాత్రుడనగుదును అని పల్కగా ఆ మౌనులందఱును అట్లేయగు గాక యని చెప్పి వెడలగా దశరథపుత్రుడు యజ్ఞవిషయమునే చింతించుచు సూర్యాస్తమయమగుచుండగా వానరశ్రేష్ఠులను బంపి తాను సంధ్య వార్చి రాత్రి కాగా హాయిగా అంతఃపురమున నుండెను. పట్టాభిషేకము పొందిన మొదటిరాత్రి పౌరుల సంతోషము నందునట్లీ విధముగా గడచెను.

★★★



# ముప్పది యేడవ సర్గము

## శ్రీరాముడు సభాసదులతో గలసి కొలువుదీరుట:

అట్లా రాత్రి గడవగా తెల్లవారుచుండ అతిమనోహరమైన కంఠములతో వంది జనులందముగా 'కౌసల్యానందనా'! దయగలవాడా! మేలుకొనుము. వీరాగ్రణీ! నీవు నిద్రించిన నిఖిల జగములును నిద్రించునయ్యా! నీవు విక్రమమున విష్ణుడవు రూపమున అశ్వినీ, దేవతలను బోలెదవు. బుద్ధియందు దేవగురువుతో సమానుడవు. నీవు బ్రహ్మతో సమానుడవు. ఓర్పులో భూదేవితో సముడవు. తేజమున నీవు సూర్యుడవు. వేగమునందు వాయుసమానుడవు. నీవు గాంభీర్యగుణముచే సాగరమును బోలియుందువు. స్థైర్యగుణముచే శంకరుడవు. సౌమ్యతయందు నీకు చంద్రుడే సాటి పూర్వపురాజులలో నీవంటి రాజులు లేరు. ఇది సత్యము. ఎదుర్కొనరాని వాడవగుట చేతను భూజనులకు హితమైన విధముగా ఎప్పుడును నడచుట చేతను ఓ రాజా! కీర్తియు, లక్ష్మియు ఎల్లప్పుడును ఎచ్చటికిని వెళ్లక నిన్నే ఆశ్రయించి యున్నవి. సిరియు, ధర్మమును, ఓ నృపతీ! నీ యందే స్థిరముగా నివసించియున్నవని హర్షముతో నిట్లు పలుకగా మిక్కిలి మధురమైన సూక్తులతో సూతులు పొగడుచుండగా శేషశయ్యనుండి నారాయణుని వలె తెల్లవస్త్రముచే కప్పబడిన మణిమయమైన శయ్యనుండి జానకీపతి లేవగా వారలు చేతులు జోడించి ప్రకాశించుచున్న శుభ్రమైన పాత్రలతో జలములందీయగా శుచియై అగ్నిహోత్రుని యధావిధిగా పూజించి రాముడు ఇక్ష్వాకులు భక్తితో సేవించిన శుభమైన దేవగృహమును ప్రవేశించి శ్రద్ధాభక్తులతో దేవతలయొక్క పితృదేవతలయొక్క బ్రాహ్మణులయొక్క పూజలన్నిటిని వరుసగా యధావిధిగా పూర్తిచేసి యెంతయో సంతోషముతో వెలుపలి కక్ష్యకు రాగా మంత్రులును వసిష్ఠుడు మొదలైన మునులును అగ్నుల వలె వెంటరాగా జనులు కీర్తించుచుండగా వెళ్లి రాముడు సింహాసనమున ఆసీనుడయ్యెను. ఆసీనుడైన రామభూపాలుని చెంత అనేక దేశముల రాజులు నిలువగా ఒప్పుచున్న వేదత్రయము వలె సుమిత్రానందనులిద్దఱును కైక కుమారుడును కొలువగా పెక్కుమంది సేవకులు ఆనందముతో నిండినవారై మ్రొక్కి ఒక ప్రక్క వివిధాసనములపై గూర్చుండగా, సూర్యపుత్రాదులగు వానరశ్రేష్ఠులిరువదిగురును

నలువురు మంత్రులతో గూడిన విభీషణుడును కొలుచుచుండగా రాముడు గుహ్యకులు సేవించుకుబేరునివలెనొప్పెను.వేదశాస్త్రములనెఱిగినవారలుసత్కులసంజాతులుచేతులు జోడించి ఆ పద్మాక్షునకు నమస్కరించి తమ కుచితములైన యాసనములందుపవిష్టులై సేవింపగా ఋషులు దేవతలు సేవింపగా స్వర్గము నందున్న ఇంద్రుని మించు ఠీవితో రాముడు కొలువులో ప్రకాశించెను. కౌసల్యా తనయుడిట్లు నిండు కొలువున నుండగా పౌరాణికులెంతో ఆసక్తితో తగువిధముగా పురాణకథా వ్యాసంగము గావించిరి.

★★★



# ముప్పది యెనిమిదవ సర్గము

## శ్రీరాముడు జనకాదిరాజులను వారివారి పురముల కంపుట:

ప్రతిదినము నీవిధముగా తగు పద్ధతితో జనపదములందు రాష్ట్రములందు దేశమునందు గల జనులు సమ్మతించునట్లు జగత్పరిపాలనము చేయుచు ఒకనాడు పవిత్రుడైన మిథిలాధిపతిని జూచి రాముడు చేతులు జోడించి ఓ రాజచంద్రా! ఎల్లప్పుడును నీవే మాకు దిక్కు. నీ మహిమచేతనే నేను రావణాసురుని జయించితిని. ఓ నిర్మలశీలా! నీ కృపచే రక్షింపదగిన వారము. విదేహులకు ఇక్ష్వాకులకు కలిగిన బంధుత్వము మిక్కిలి సంతోషమునకు గారణము. కీర్తి నొసగునది. మీరిక్కడకు వచ్చి చాలా దినములైనది. మీరు ప్రజల రక్షణము నందధికమైన ప్రీతి గలవారలు. మీరు మీ ప్రజలను జూచుటకు వెళ్లెదరేని ఈ రత్నములను తీసికొని వెళ్లుడు. భరతుడు మీ వెంట వచ్చును. అని చెప్పుచున్న శ్రీరాముని మాటలను విని ప్రేమతో జనకుడిట్లనెను. ఓ కకుత్థ్సవంశవర్ధనా! రామా! నీ దర్శనము చేతను, నీ విధేయత చేతను మనస్సెంతయో సంతోషము నందెను. గాన నీవిచ్చిన ఈ రత్నములనన్నిటిని నా కుమార్తెలకు బహుమతిగా నిచ్చుచున్నానని చెప్పి తన పట్టణమునకు వెళ్లెను. తరువాత కేకయరాజపుత్రునితో నిట్లనెను. ఓ రాజా! భరతుడును లక్ష్మణుడును, మా సంపదలును, మారాజ్యమంతయును మీవియే. మీరే మాకెప్పుడును దిక్కు. మీరిచ్చటికి వచ్చి పెక్కునాళ్లయ్యెను. అక్కడ మీరు లేకుండుటచే వృద్ధుడైన మీతండ్రి ఆరాటపడుచుండును. మీరలిష్టముతో నేడే వెళ్లదలచితిరేని మిక్కిలి విలువగలిగిన రత్నములను ధనమును దీసికొని లక్ష్మణుడు సహాయుడుగా వచ్చును అని మ్రొక్కగా ఆతడు ఓ గొప్ప గుణములు గల రామా! నీకెల్లప్పుడును రత్నములధికములగుచుండునని తిరిగి నమస్కరించెను. వృత్రాసురుని వధించిన తరువాత జయము నందిన యింద్రుడుపేంద్రునితో వెడలినట్లు లక్ష్మణ సహితుడై కేకయ రాజు తన పురమున కేగెను.

## రావణ యుద్ధమున సహాయకులుగా వచ్చిన రాజులను శ్రీరాముడు సత్కరించి పంపుట:

తన మిత్రులలో శ్రేష్ఠుదును దయావంతుడును కాశీపతియు నగు ప్రతర్దనుని శ్రీరాముడు చనవుతో కౌగలించుకొని ఓ రాజా! ప్రేమతోను, మిక్కిలి స్నేహముతోను భరతునితో గలసి గొప్ప యుద్యమమును జేసితివి. నిన్నేమని మెచ్చువాను. సుగుణనిధీ! ఇంక నీపురమున కేగివచ్చెదవా? ఓ శూరుడా! పరమగుణాఢ్యా! నీ పరిపాలనలో నున్న వారణాసీ పురము తోరణయుతమై ప్రాకారములతో చుట్టబడి మిగుల సుందరమై యొప్పుచుండును. అని పలికి రఘురాముడు సింహాసనము దిగివచ్చి కాశీరాజును ఔమ్మున గ్రుచ్చిపట్టి గౌరవమైన మాటలతో అనుజ్ఞ నీయగా అతడు తన పురమునకు వెళ్లెను. అంత రామ విభుడు చిరునవ్వు ముఖమునలంకరింపగా మూడు వందల మంది రాజశ్రేష్ఠులను జూచి మీ పరాక్రమములచేత సురక్షితులై యుండి మాపై ఎక్కువైన ప్రేమనుంచితిరి. మీరు నిరతమును ధర్మనిష్ఠ గలవారు. నిత్యమును సత్యమున కాటపట్టులు, గొప్పనైన బలముగలవారలు. మీ ప్రభావము చేతను, తేజము చేతను పాపాత్ముడును దుష్టబుద్ధియు నయిన రావణుడు బంధుసమూహముతో గూడ దండధరుని జూడనేగెను. ఆ కార్యమునందు నేను నిమిత్తమాత్రుడనే చూడుడు. జనక రాజపుత్రి వనములందు దొంగలింప బడిన దను వార్త విని భరతుడు మిమ్ము పిలిపింపగా ఓ అనఘాత్ములారా! స్నేహాతి శయముతో మీరెల్లరును వచ్చితిరి. రావణుని మీద దండెత్త వచ్చిన మీకిచ్చట చాలా రోజులు గడచినవి. ఉత్తమమతులారా! మీకిష్టమైనచో మీరిప్పుడు పురములకేగ వచ్చును. అని చెప్పగా రాజులందఱును జానకీ భర్త చెప్పిన మధుర వాక్యములకు మనస్సులందు సంతసించి యిట్లనిరి.

## రాజులు శ్రీరాముని పొగడి సెలవుగొని పోవుట:

ఓ విశ్వస్తుత్యా! రామచంద్రా! వినయమనునది నీ సహజగుణము. మా యదృష్టము చేత నీవు సుఖముగా వనములందుండి తిరిగి వచ్చితివయ్యా! ఓ భద్రచరిత్రా! మా యదృష్టము చేత మహిమ వృద్ధినందగా నీవు పట్టభద్రుడవైతివి గదా. రామచంద్రా! మా యదృష్టముచేతనే విరోధులనెల్ల రణసీమ ద్రుంచితివి. ఓ కౌసలేయా! మా యదృష్టము చేతనే తిరిగి భూపుత్రిని గ్రహింపగలిగితివి. శత్రువులను జంపి జయశాలివైన నిన్ను

కన్నులార చూడగలుగుట మా పుణ్యము. రమ్యమైన గుణములు గలిగిన రామచంద్రా! ఇదియే మా కోరిక. యిదియే మాకు ప్రీతికరము. ఓ దశరథేశ్వరనందనా! ఎంత ప్రశంసించుటకైనను నీవే అర్హుడవు. ఇట్లు మమ్మింతగా మెచ్చి పలికెదవు. ఏమనవలెను? ఇట్టి చర్య నీకెంతయో యోగ్యమైనది. ఈ విధముగా చెప్పుటకైనను మేము నేరము. కోరిన సత్ఫలితములు నిచ్చునట్టి ఓ విశిష్టచరిత్రా! ఇంక మేము పోయివత్తుమా? మా కోరిక ఒక్కటి యున్నది. మేమేవిధముగా నిన్నెల్లప్పుడును మనస్సునందుంచెదెమో ఆ విధముగా నీవును మమ్మెప్పుడును ప్రేమతో మనస్సున నిల్పవయ్యా సీతాపతీ! అని కోరగా రాముడట్లే కానిండని చెప్పగా వారు సంతోషముతో తమ పురములకు సైన్యములతో వెళ్లిరి.

★★★



# ముప్పది తొమ్మిదవ సర్గము

## సకల రాజులు వారి వారి రాజ్యములకు పోవుట:

పూర్వము భరతుని యాజ్ఞచేత రాజులు తెచ్చిన ఏన్గులు, గుఱ్ఱములు, రథములు, కాల్బలములు గల అక్షౌహిణుల సైన్యములు ఆశ్చర్యకరముగా భూమి కంపించు విధముగా నడచెను. అప్పుడు దర్పము బలము గల యారాజులు ఒకరితో నొకరు ఇట్లు పలికిరి. అక్కటా! యుద్ధమునకై భరతుడు మనలను రప్పించుటంతయు వ్యర్థమైపోయినదే. రావణుని యుద్ధమును చూడమైతిమి గదా. రాజపుత్రులే రాక్షసులను శీఘ్రముగా చంపివేసిరే. ఏమనవచ్చును. ఆ రామలక్ష్మణుల అండయున్నచో చింత లేకుండ సముద్రమును దాటి విరోధి సంఘములను చంపజాలమా? అని కొందరనుకొనుచుండగా కొందరు రామచరిత్రల నానందముతో చెప్పుకొనుచు ధనధాన్యములతో నిండియున్న తమ తమ రాష్ట్రములకు వెళ్లి శ్రీరాముని సంతోషమునకై రథములు, గుఱ్ఱములు, ఏనుగులు, మిక్కిలి విలువైన మణులు, పల్లకులు, చందనము మొదలైన సుగంధద్రవ్యములు, బంగారు భూషణములు, ముత్యములు, అందమైన పరిచారికలు అందమైన కంబళ్లును, పగడములు మొదలగునవి వందలు వేలుగా అందఱును భక్తితో కానుకలనిచ్చిరి. భరతలక్ష్మణ శత్రుఘ్నులు వాని నన్నిటిని తీసికొని పురము చేరవచ్చి రామభూపతికి వేర్వేరుగా విశదముగ చెప్పి యిచ్చిరి. రాముడవి యన్నియు అనురాగముతో గ్రహించెను.

## శ్రీరాముడు సుగ్రీవాంగద హనుమదాదుల బహూకరించుట:

అంత రాముడు సూర్యపుత్రుడైన సుగ్రీవునకు ఉత్తమమైన భూషణములనిచ్చి యట్లే రాక్షస రాజునకును ఉత్తమములైన భూషణములనిచ్చెను. ఆ విధముగనే వానరులకును రాక్షసులకును భూషణములనీయగా అందఱును సంతోషముతో తలలయందును చేతులందును సాటిలేని భక్తితో ధరించిరి. రామభూపతి సంతోషముతో అంగదహనుమంతులను తన యొడిలోనికి తీసికొని సుగ్రీవునితో ఇట్లనెను. ఈ అంగదుడు నీ కుమారుడు. ఈ హనుమ నీకు మిత్రుడును మంత్రియు నగును. నాకు మేలైన

ఆలోచనలను దెలిపి మేలు కోరుచుందురు. వీరిరువురును మంచి నడవడి గలవారలు. వీరు నీ నిమిత్తముగా విశేషముగా పూజింపదగిన వారలని చెప్పి తన శరీరముపై నున్న భూషణములన్నిటిని రాముడు వారలకలంకరించెను. వానరులందఱును మేలు మేలని పొగడిరి. తరువాత నలుడు, నీలుడు, పనసుడు, కేసరి, గంధమాదనుడు, కుముదుడు, మైందుడు, ద్వివిదుడు, జాంబవంతుడు, ఇంద్రజానుడు, దరీముఖుడు, దధిముఖుడు, సన్నాదుడు, వినతుడు, సుషేణుడు, ధూమ్రుడు, దధిముఖుడు, ప్రజంఘుడు, గవాక్షుడు అను పొగడబడిన బలము గలవారును మహాపరాక్రమవంతులును రాజ కార్య సాధనము నందాసక్తి గలవారును అయిన వానరసేనాపతులను గాంచి మధురమైన మాటలతో ఓ శూరులారా! మీరెల్లరు నాకు మిక్కిలి స్నేహితులు. నాతో బుట్టిన సోదరుల వంటి వారలు మీరు చేసిన సహాయమునకు నేనేమి తిరిగి చేయగలను. అంతము లేని వ్యసన సముద్రమున మునిగి బాధనొందుచున్న నన్ను మీ పరాక్రమముతో ఉద్ధరించితిరి. దానికి సాటి కాగలదియేది గలదు? ఆహా! మీ యంతటివారు మిత్రులుగా గల సుగ్రీవుని భాగ్యమే భాగ్యము. మంచి మనస్సుతోనే నిచ్చెడి ఈ స్వల్పమును మీరు గ్రహింతురు గాక యని తగు విధముగా మణులు ఆభరణములు నిచ్చి కౌగలించి రాముడు వారందరిని సంతోష సముద్రమున దేల్చెను. ఆ వానరులందఱును తనవిదీర తేనెలను ద్రావుచు, మాంసమును, ఫలములను మెక్కుచుండగా ఒక నెలకంటే అధికమగు దినములు క్షణము వలె గడచెను. రాక్షస వానరసమూహములతో వినోదముగా రాముడు గడపుచుండ అట్లే రెండవ శిశిర మాసము గూడ గడచెను. ఈ విధముగా ఎడతెగని సుఖములందాసక్తులై వారానందించు చుండగా [చైత్రమున పట్టాభిషేకము. కావున ఫాల్గుణము వఱకు నుండుటచే కపులొక సంవత్సరమయోధ్యయందుండి రని యేర్పడుచున్నది]

★★★



# నలువదియవ సర్గము

## శ్రీరాముడు సుగ్రీవాదులను కిష్కింధకు పంపుట:

అంత రామచంద్రుడు సుగ్రీవునితో నిట్లనెను. వానరరాజా! ఇక ఆలస్యము చేయక పరివారముతో గలిసి దేవతలకు గాని రాక్షసులకుగాని చేరరాని కిష్కింధకు వెళ్లుము. మంత్రులతో గలిసి భూమిని చక్కగా పాలింపుము. విరోధి వర్గములను సంహరింపుము. ఈ యంగదుని వాయుపుత్రుని వలెనే అత్యధికమైన ప్రీతితో జూడుము. గొప్ప బలవంతుడైన నలుని, నీ మామయగు సుషేణుని, మైంద ద్వివిదులను, గంధమాదనుని, తారుని, కుముదుని, నీలుని, వీరుడైన శతవలిని, గజుని, గవాక్షుని, శరభుని, గవయుని, ఋషభుని, ఈ బ్రహ్మపుత్రుడైన జాంబవంతుని ప్రఖ్యాతమైన ప్రేమతో బాలింపుము. వీరు నాకై ప్రాణములిచ్చిరి. ఈ వానరుల ఋణము నేనెట్లు తీర్పగలను.

## శ్రీరాముడు విభీషణుని లంకకనుపుట:

వీరలకెప్పుడైనను అప్రియములైన పనులను చేయబోకుమని చెప్పి రాక్షసవంశాధి పతియైన విభీషణుని జూచి ఓ ధీరచరిత్రా! కుబేరుని దివ్యపురమైన లంకను మంచి ధర్మమార్గమున అవినీతిని విడచి పాలింపుము. ఓ ఉత్తమ గుణవంతుడా! రాజు బుద్ధిమంతుడై ధర్మమార్గమును విడువక రాజ్యమేలినచో జగత్తు నందు కీర్తియు, అధికారమును సర్వసంపదలును నిత్యమును అతని యొద్ద నిలిచి యుండును. నన్నును సుగ్రీవుని నీ మదిలో నెన్నడును మరవకుము. పొమ్ము అని పల్కగా వానర రాక్షస సమూహములు అన్నన్నా! మేలు మేలని రాముని బొగడెను. రామా! నీ బుద్ధి బ్రహ్మదేవుని యందువలె నియమముతో ఋజుమార్గమున నుండును. నీ మాధుర్యము, నీ సాటిలేని అమితమైన బలము పొగడుటకు శక్యమగునా?

## శ్రీరాముడు హనుమంతునకు వరములిచ్చుట:

అనుచుండగా హనుమంతుడు వినయముతో నిట్లనెను. రామచంద్రా! నా మనస్సెల్లవేళలను విడువని భక్తితో నీయందుండుగాక. నేనెప్పుడు నీయందు

స్నేహభావముతో నుందునుగాక. నా మనస్సు ఎందును వెళ్లకుండును గాక. ఓ సీతాపతీ! నన్ననుగ్రహింపుము స్వామీ! ఓ సూర్యవంశరత్నమా! నీ దివ్యచరిత్ర మీ భూమి యందెంతవఱకు నిలిచియుండునో యందాక నా శరీరమున ప్రాణములు నిలిచి యుండునట్లు వరమిమ్ము – ఓ సచ్చరిత్రా! అప్సర స్త్రీలెల్లప్పుడును నీ చరిత్రను వినిపింతురు గాక. దానిని వినుటచే నేనధికమైన నాయుత్కంఠను వాయువు మేఘసమూహమును వలె తొలగించుకొందును. అని హనుమ కోరగానే రామచంద్రుడు తన శ్రేష్ఠమైన యాసనమునుండి లేచి ఆంజనేయుని తన కౌగిట బొదివి పట్టి మిక్కిలి యనురాగముతో నిట్లనెను. హనుమా! నీ మనస్సున కోరినట్లే జరుగును గాక. ఆనందము నొందుము. నా చరిత్ర భూమిమీద నుండు నంతదాక నీకు కీర్తియు, శరీరమున ప్రాణములు నుండును గాక. [ఇది శ్రీరాముల మానుషత్వమును దెల్పును] ఈ నా కీర్తి లోకములున్నంతవఱకు నిలిచియుండును. ఓ కేసరి తనయా! నీవు చేసిన ఒక్కొక్క యుపకారమునకే పనిపడినచో నా ప్రాణములనే ఈయకుందునా? ఉపకారము చేసిన వానికి ప్రత్యుపకారము చేయవలెనని తలచుట ఆలోచింపగా తాను ఆ ఉపకారికి ఆపదయెప్పుడు గల్గునా అని ధ్యానించుచుండుట కాదా. అని చంద్రసమానమైన ముత్యాలహారము సాటిలేని వైడూర్యము నాయకమణిగా గలిగినది తన మెడ నుండి తీసి కోరికతో వాయుపుత్రుని కంఠమున వేసెను. చంద్రబింబమును శిరమున ధరియించు (మేరు పర్వతము) బంగారు కొండ వలె ఆ మాలచే ప్రకాశించినవాడై వాయుపుత్రుడు వెలిగెను. రాముని వాక్యములను విని వానర సంఘములు లేచిలేచి మిక్కిలి భక్తితో రాముని పాదపద్మముల పలుమారులు నమస్కరించి వెళ్లుటకు సిద్ధమైరి. సుగ్రీవుడును విభీషణుడున తమను రామచంద్రుడు బహుమాన పురస్సరమైన సాంత్వనవాక్కులతో ఎంతయో యనురాగముతో కౌగిట జేర్చి గౌరవించగా కన్నులనీరు గార్చుచు మూఢులై ఆ రాముని విడచి వెళ్లుట కిష్టములేనివారై తపించుచుండగా కన్నీరుగారుచున్న కన్నులతో వానరశ్రేష్ఠులు తెలివిలేనివారై బొమ్మలవలె ప్రాణములు లేని శరీరములవలె మనస్సులందు సంతోషము లేనివారై నివాసముల కేగిరి.

★★★

# నలువది యొకటవ సర్గము

## కుబేరు నొద్దనుండి పుష్పకము శ్రీరాముని గొల్వవచ్చుట:

శ్రీరామచంద్రుడీవిధముగా అందఱను బంపించి సుఖముగా నుండగా అపరాహ్ణ సమయమున ఆకాశము నుండి యొక వాక్యము వినిపించెను. భూనాథచంద్రా! నావంక చూడుము. నేను పుష్పకమును. [పుష్పకము నిర్జీవమైన ఆకాశయానము. ఇవి దానిని నడపువాడు చెప్పెడు మాటలు] కుబేరుడు సంతోషము నందినవాడై మరల నన్ను నీకడకు బంపెను. నీయాజ్ఞను పొంది నేను వెళ్లగానే ఆ యక్షనాథుడు నాతో నిట్లనెను. ఓ పుష్పకమా! ఎంతయో ప్రతాపముతో రామచంద్రవిభుడు రావణుని వధించి నిన్ను గెలుచుకొనెను. యుద్ధమున బంధువలతో గూడ రావణుడు సంహరింపబడుట నాకును ఎంతో సంతోషకరము. నీవు రాముని దానవే. నీ వచ్చుటికే తిరిగి వెళ్లుము. నీకనుజ్ఞ నిచ్చితిని. భూమియందా మహనీయుడు నీపై ఆనందముతో తిరుగదగిన యర్హత గలవాడు అని చెప్పగా నేనిచ్చటికి వచ్చితిని రాఘవా నా ప్రభావము చేత ఎవ్వరికిని గానరాకుండ ఇష్టము వచ్చిన విధముగా సంచరించుచుండును. ఓ భూతనయాపతీ! నీయాజ్ఞ చొప్పన నడచుకొందుననగా రామచంద్రుడు అట్లయినచో నీకు నేను స్వాగతము నిచ్చెదను స్వీకరింపుమనుచు పుష్పములతో, ధూపములతో, లాజలతో దానిని పూజించి యిట్లనెను. ఓ పుష్పకమా! నిను పనియున్న సమయమున తలచెదను. అప్పుడు రమ్ము. అంతవఱకు హర్షముతో నీ వాకాశమార్గమున అడ్డు లేక తిరుగుము.

## భరతుడు శ్రీరామునకు ప్రజల సుఖస్థితి దెలుపుట:

అని చెప్పగా అట్లేయని పుష్పకము వెడలగా అంత భరతుడు లేచి చేతులు జోడించి యిట్లనెను. ఓ దాశరథీ! నీవభిషిక్తుడవై ఒక నెల దాటినది. అంతలోనే నీవు దేవుడవుగా గనిపించుచున్నావు. ప్రజలందఱు రోగరహితులై సుఖముగా జీవించుచున్నారు. అమానుష సత్వములు మాట్లాడుచున్నవి. నిండు ముసలితనముచే శరీరము శిథిలమైనను మరణ భయము లేదు. స్త్రీలు బాధ కాని దిగులు గాని లేక ప్రసవించుచున్నారు. ప్రజలు

బలవంతులై యున్నారు. మానవులందఱును ఎంతో సంతోషముతో నున్నారు. వానలు తగిన సమయమునందు కురియుచున్నవి. గాలులన్ని చోటులను హాయిగా వీచుచుండెను. ఈ రాజే ఎల్లప్పుడును స్థిరముగా నుండి మమ్ము పాలించుగాక యని ప్రజలు చెప్పుకొనుచుందురని చెప్పగా శ్రీరాముడు సంతోషమునందెను.

★★★



# నలువది రెండవ సర్గము

## శ్రీరాముడశకోవనమున సీతాదేవితో క్రీడించుట:

చందన వృక్షములు, అగురు చెట్లు, మామిటి చెట్లు, మందార వృక్షములు, సురపొన్న చెట్లు, పనస చెట్లు, మ్రాని పసుపు చెట్లు, పారిజాత వృక్షములు, సంపెంగ చెట్లు, దానిమ్మ చెట్లు, నేరేడు చెట్లు, ప్రేంకణ వృక్షములు, కడిమి చెట్లు, ఏఱుమద్ది చెట్లు, ఏడాకుల అరటి చెట్లు, పూలగురివింద చెట్లు, పొన్న చెట్లు, అరటి చెట్లు, ఇప్ప చెట్లు, నాగకేసర వృక్షములు, కడప చెట్లు, ఎల్లప్పుడును పూలగుత్తులతో పండ్లతో నిండినవై యుండగా, ఆ విధముగనే దివ్యమై శిల్పి నిర్మితములైన వృక్షముల శిల్పములు అందము లొలుకు చుండగా, మదించిన తుమ్మెదల ఝుంకారముతో నిండి, తుమ్మెదలు కోకిలలు, ఇంకను వివిధ వర్ణముల పక్షులతో మనోహరమై, బంగారు వర్ణము, అగ్ని వర్ణము, నలుపు వర్ణము గల వృక్షములతో గూడి, సువాసనలు వెదజల్లుచున్న పుష్పములును, సుందరమైన మాల్యములును అందమైన దిగుడుబావులు, మనోహరములైన మాణిక్యపు మెట్లు స్ఫటికపు తిన్నెలు గలదై, వికసించిన కలువలు పద్మములు, అందమైన జక్కవపక్షుల జంటలును, బాగుగా వికసించిన పూలుగల మంచి వృక్షములును, ఉల్లాసమును గలిగించు సరస్తీరములు గలదై, బెగ్గురు పక్షులు, వానకోయిలలు, చిలుకలు, హంసలు, మధురధ్వనులు చేయుచుండగా మిక్కిలి సుందరమై ఆ వనము మనస్సునకు సంతోషము గలిగించుచుండెను. అనేక రూపములు గల ప్రాకారములు విశాలములై నునుపైన నాపరాళ్లును, వైడూర్యమణుల వలె ప్రకాశించు పచ్చిక ప్రదేశములును, మనోహరములైన పుష్పవనములు ఆకాశమున చుక్కలవలె ఱాళ్లపై రాలిన పువ్వులును అందమును గలిగించుచుండ నందన వనమో లేక బ్రహ్మ మందిరమో కాక కుబేరుని చైత్రరథమనెడు ఉద్యానమో అనునట్లు మిక్కిలి సుందరమై మెఱుగులీను చోట్లును, పుష్పములతో అలంకరించిన ఆసనములును పూలపొదరిండ్లును, గల తన యశోకవనమున ప్రవేశించి శ్రీరాముడు ఆహ్లాదకరమైన ఒక శుభప్రదమైన ప్రదేశమున జానకీదేవి చేతిని తన చేతితో పట్టుకొని ఇంద్రుడు శచీదేవినివలె తన ప్రియురాలైన సీతను పవిత్రమైన మధుమైరేయమును తనివిదీర మ్రావించెను. పనివారలు తీసికొనిరాగా

ఫలములను, మృష్టాన్నభోజనములను భుజించిన తరువాత ఆ రాముని సంతోషమునకై గానము, నాట్యము ప్రవర్తిల్లెను. అందమైన స్త్రీలు రామచంద్రుని సంతోషింపజేయగా ఆ కాంతలందఱకును అతడా భరణ సమూహములతో తృప్తి కలిగించెను. సీతసహితుడైన వశిష్ఠుని వలె ప్రకాశించెను. ఇట్లు శ్రీరాముడు దేవకాంతను బోలిన సీతాదేవితో దేవేంద్రునివలె సుఖముల ననుభవించుచుండగా భోగకాలమైన శిశిరఋతువు మెల్లగా గడచెను. [పట్టాభిషేకానంతర మొకయేడు వానరాదుల నాదరించుటతో గడచెను. సీతతో క్రీడింప అనువుపడదయ్యెను. పట్టాభిషేకానంతరము రెండవ సంవత్సరమిట్లు గడచెను.] ఇట్లా మహానుభావులు వివిధ భోగములను వేడుకగా అనుభవించచుండ పదివేల సంవత్సరములు గడచెను. [వర్షములు దినపర్యాయములని కొందఱు. వివాహము మొదలెంచిన నించుమించు సరిపోవును. 28 × 365 = 9980 దినములగు చున్నవి] దినమందు మొదటిభాగమున ఆ ధర్మ విదుడైన రాముడు ధర్మపద్ధతిగా ధర్మకార్యములను నడపి తక్కిన సగము దినమును ప్రేమతో అంతఃపురమున ప్రొద్దు పుచ్చుచుండెను. స్త్రీరత్నమగు సీతాదేవియు పూర్వాహ్ణకాలమున చేయదగిన విధులను దేవపూజలను సర్వమును నెరవేర్చి అత్తలను మిక్కిలిగా పూజించి చిత్రమైన ఆభరణములను వస్త్రములను ధరించి యింద్రుని జేరవచ్చు శచీదేవివలె రాగా ఆమె విచిత్రమైన రూపమును వేషమును జూచి శ్రీరాముడు సంతోషముతో మెచ్చుకొనెను.

## సీతాదేవి ఋష్యాశ్రమములకు పోవగోరుట:

అట్లు పొగడి కల్యాణ సమన్వితమైన పత్నిని గాంచి మానినీ! నీ మేనియందు గర్భలక్షణములు గనిపించుచున్నవి. జానకీ! నీ మనస్సున ఏమి కోరిక గలదో చెప్పుము. తీర్చెదను అని రాముడడుగగా చిఱునవ్వుతో వికసించిన ముఖపద్మముతో నాథా! తపోవనములను జూడవలెనని మనస్సు కోరిక కలిగినది. గంగా తీరమున నున్న ఆశ్రమము లందున్న తపస్వులను జూచి పూజించి తృప్తి నొందించెదను. ఒక్కరాత్రియైనను అచ్చట నిలువవలెనని కోరిక కలిగినది. అని చెప్పగా రాముడు ఓ నీరజనయనా! నీవు కోరినట్లుగా రేపే నిన్ను బంపించెదను. మనస్సు నందు నీ వనుమానమును విడువుమని చెప్పి తాను నడిమి కక్ష్యకు తన మంత్రులతో వచ్చెను [ఇప్పటికి శ్రీరామునకు 41 సంవత్సరములు]

★★★

# నలువది మూడవ సర్గము

## శ్రీరాముడు భద్రుని లోకవార్తలడుగుట:

ఇట్లు మంత్రులతో గలసి రాముడచ్చట గూర్చుండెను. స్నేహితులును విజ్ఞులును భజింపగా అనేక రూపములు గలిగిన హాస్యకారులగు విజయుడు, కులుడు, కాశ్యపుడు, మధుమత్తుడు,కాళియుడు,సుమాగధుడు,భద్రుడు,దంతవక్త్రుడు,సురాజి,పింగళుడు తమ నేర్పు గనపడ పరిహాస వార్తలు పలుకుచు శ్రీరాముని ఆనందపరచుట పూర్తియైన పిమ్మట రామభద్రుడు భద్రుడనువానిని జూచి యిట్లనెను. భద్రా! పల్లెలందును, పట్టణములందును వార్తలేమిరా? భరత లక్ష్మణ శత్రుఘ్నులను గూర్చి జానకిని గూర్చి కైకేయిని గూర్చి లోకులందఱును ఏమనుచున్నారు? జనులకు మేలు కలుగునట్లు ప్రజాపరిపాలన చేయు రాజు తనను గూర్చి తన పురమునకు, రాష్ట్రమునకు సర్వవిషయములందును లోకులే మనుకొనుచున్నారో వినదగును. రాజట్లు చేయకున్నచో వనములందును, పల్లెలందును, పురమునందును నిజముగా జనులచే నిందింపబడును. అని అడుగగా భద్రుడు చేతులు జోడించి రాజా! పట్టణము నందును పల్లెలందును జనుల నీయొక్క అద్భుత వార్తలనే ఎల్లప్పుడును అనుకొనుచుందురు. మేలుగా దశాననుని చంపుట, ఆ జయమును అన్నిచోట్లను సంతోషముతో చెప్పుకొనుచుందురు అనగా రామచంద్రుడు ఉన్నది యున్నట్లుగా చెప్పుము. జగత్తు నందలి జనులు ఏమని మంచిగా చెప్పుకొనెదరో, ఏమి కీడు మాటలను చెప్పుకొందురో అన్ని వార్తలను జెప్పుము. అన్నియును తెలిసి కొన్నగదా కీడులను తొలగించి శుభములను కలుగజేయవచ్చును. మనస్సునందు పాపమని సందేహింపకుము. జనులేమనుచున్నారో వినగోరుచున్నాను.

## భద్రుడు శ్రీరామునకు సీతావిషయకాపవాదమును దెలుపుట:

ఇట్లు ధైర్యము గలుగునట్లు చెప్పిన ప్రభువుతో నతడిట్లనెను. తోటలందు బాటలందు ఉద్యానవనములందు, అంగళ్లయందు, శాలలందు అన్ని ప్రదేశములందును అరరే! రామభద్రుడు మహాత్ముడు. దేవతలకును రాక్షసులకును అసాధ్యమైన సేతువును

సముద్రమునకు గట్టెను. సేనాసహితుడగు రావణుని నోడించెను. వానరులను తన వశము చేసికొనెను. ఎలుగుబంట్ల గుంపులనేలెను. రాక్షస కోట్లకు ప్రభువయ్యెను. అయిన నేమి కాని రాక్షసుడు తన భార్య నపహరింపగా అది మరచినాడు మరల ఆమెను ఏలుకొనుచున్నాడు. బలవంతముగా దేవతావిరోధి ఆమెను తన సందిటబట్టి తీసికొని వెళ్లెను. ఆ దుర్మార్గుడే లంకయందశోకవనము నందుంచెను. రాక్షసస్త్రీలను కాపుంచెను. ఆ జానకిని తిరిగి తెచ్చి తన యింట నుంచుకొన్నాడు. ఛీ! మనస్సునందసహ్యము నొందదు. రాముడాసీతను గూడి మోహముతో సంభోగించుట వలన నేమి సౌఖ్యమును పొందుచున్నాడో. తమోగుణప్రధానుడైన రాక్షసుని గృహమునందు చాలాకాలమట్లు చెఱబడిన భార్యను రాముడసహ్యించుకొనక కలిసియుండెను. కాముకులగు వారికెంద్దైనను కన్నులుండునా? రాజునకు సమ్మతమైనదే ధర్మము. రాజు విధమునే అనుసరించుట ప్రజలకర్తవ్యమైన పద్ధతి గదా. ఇక ముందు రాజువలెనే మనకు కూడా మన భార్యలేమి పనులు చేసినను సహించుటయే ధర్మమగును. అని వారు వారికి దోచిన విధముగా పురమునందును, పల్లెలందును అనుకొనుచున్నారు అని భద్రుడు చెప్పగా రాముడు మనస్సునందు విపరీతమైన ఆర్తితో బాధచెందుచు మిత్రులందఱను జూచి యిట్లనెను. మీరందఱును ఇట్టి విధమును విన్నారా యని అడుగగా వారలు తలలు వంచి నమస్కరించుచు దీనుడైన రాజును జూచి యందఱును రాజచంద్రా! ఇందు సందేహమేమియు లేదనగా మనస్సు విచారాభారముతో డోలాందోళితము కాగా వారల నందఱను రాముడు వెళ్లబనిచెను.

★★★



# నలువది నాల్గవ సర్గము

## శ్రీరాముడు సోదరులను బిలిపించుట:

అట్లందఱను పోవబంచి రామచంద్రుడు తరువాతి కార్యమును నిశ్చయించుకొని సమీపమున నున్న ద్వారపాలకుని బిలిచి పుణ్యవంతుడైన కైకపుత్రుని శుభశీలుడైన లక్ష్మణుని, శత్రులచే చెనకరాని శత్రుఘ్నుని వేగముగా తీసికొని రమ్మని చెప్పగా అతడు వేగముగా లక్ష్మణుని మందిరమున కేగి నమస్కరించి రాఘవా! మిమ్ము రాజు వెంటనే రమ్మని యాజ్ఞాపించెనని చెప్పగా వెంటనే తన భవనము విడచి రథముపై లక్ష్మణుడు అగ్రజుని గృహమునకేగెను. అతడు రాజగృహమునకు వెళ్లుట చూచి ద్వారపాలకుడు కైకపుత్రుని కడకు వెళ్లి మ్రొక్కి రాజాజ్ఞవిధమును చెప్పగా అతడు తొందరగా కాలినడకనే బయలుదేరెను. అది చూచి ద్వారపాలకుడు శత్రుఘ్నుని కడకు వేగముగా వెళ్లి నమస్కరించి రాజశాసనము నెరిగింపగా అతడును వేగముగా వెళ్లెను. ఆ ద్వారపాలకుడు వేగముగా రామునితో తమ్ములు వచ్చుటను తెలియజేసెను. తమ్ములు వచ్చిరను వార్తను విని తలవంచుకొని కలత చెంది యున్న మనస్సు గల రాముడు ద్వారపాలకునితో నిట్లనెను. వారి నందఱను లోనికి బంపుము. వారే నాకు ప్రియులు. వారే నా శరీరమున ప్రాణవాయువులు అని చెప్పగా అతడు వారికామాట దెల్పగా ముువ్వురును వినయముతో వంచిన శిరస్సులు గలవారై చేతులు జోడించి వెళ్లి గ్రహణము పట్టిన చంద్రుడో సంధ్యాకాలపు సూర్యుడో యనునట్లు మిక్కిలి కాంతి తప్ప కన్నుల నీరు గారుచుండ ఉన్న అన్నను, శోభ తరిగిన పద్మమువలెనున్న ఆయన ముఖమును జూచి పాదముల మీద పడగా కన్నీరులోననే అణచుకొనుచు తమ్ములను కౌగలించి యుచితమైన ఆసనముల మీద గూర్చుండ నియోగించి స్నేహముతో నిట్లు చెప్పెను. ఓ అనఘులారా! సోదరులన్నను మీరే. నా ప్రాణములన్నను మీరే. సర్వమైన ధనమును మీరే. మీరార్జించిన రాజ్యమును నేను పాలించుచున్నాను. వింటిరా? ఓ భూపతులారా! మీరలు శాస్త్రార్థములను పూర్తిగా ఎఱిగిన వారలు. ధైర్యవంతులు. బుద్ధిమంతులును. నేనొక కార్యమును మీకు దెల్పెదను. దానిని నా

కొఱకై మీరు కాదని యనక ఆచరింపుడు అని చెప్పగా ఆ సోదరులు రాముడేమి చెప్పునో యని ఆరాటపడు మనస్సులతో ఏకాగ్రతతో దీనమైన మొగములతో నుండగా వారితో ఆ భూపతి యిట్లనెను.

★★★



# నలువది యైదవ సర్గము

## శ్రీరాముడు తమ్ములకు లోకాపవాద విధము తెలుపుట:

సోదరులారా! నా మాటల నేకాగ్రతతో చక్కగా వినుడు. భూపుత్రిని గూర్చి పురములందును సర్వప్రదేశములందును ప్రజలు పల్కుచున్న మాటలు వినరానివి కుత్సితములైనవి. అవి నేను విన్నది మొదలుగా తలచినంతనే మర్మభేదన మగుచున్నది. ఆ నిందా వాక్యము లెట్లు చెప్పుదును? లోకమున మంచి కీర్తి గలవారలిక్ష్వాకులు. అటువంటి వారి పుణ్యవంశమున పుట్టితిని. సీత మహాత్ములలో శ్రేష్ఠుడైన జనకుని సద్వంశమందు తాను జన్మించినది. దండకారణ్యములో రావణుడు సీతను దొంగలించుటయు, నేనతనిని జంపుటయు నీ వెఱుగుదువు గదా. అప్పుడే నాకు మనస్సు నందు పరుని యింట నున్న స్త్రీని సీతను ఎట్లు పురమునకు తీసికొని పోదునని సందేహము కలిగి నేను వెనుదీయగా నమ్మకము గలుగుటకై ఆ పతివ్రత అగ్నియందు పడినది గదా. అగ్నిహోత్రుడు సీత పతివ్రతయని చెప్పలేదా? లక్ష్మణా! నీవప్పుడచ్చటనే యున్నావు గదా. సీత పాపములు లేనిదని సూర్యచంద్రులు వాయుదేవుడు ప్రఖ్యాతిగా పలికిరిగదా. దేవతా సమూహముల ముందఱ ఋషీశ్వరులెల్లరును సీత పతివ్రతయని చెప్పిరి గదా. సాధ్వి పతివ్రతయని చెప్పుచు లంకలో ఈ ఉత్తమ శీలవతిని మహేంద్రుడు నా చేతియందుంచెను గదా. అంతే కాదయ్యా నా అంతరాత్మ కూడ భూపుత్రి పవిత్రురాలని ఎఱుగును. లక్ష్మణా అందుచేతనే గదా ఆమెను తిరిగి యయోధ్యకు తీసికొని వచ్చితిని. ఇప్పుడు పురమున పల్లెలయందును విపరీతమైన వార్తలు వినబడుటచే ఆ యపవాదము భరింపరానిదై నా మనస్సు నెంతయో తపింపజేసినది. ఎవని యపకీర్తి ఎంతదనుక లోకమున వినబడునో అంతవఱకు పాపముల ననుభవించుచు అతడధో లోకలములందుండగలడు. దేవతలపకీర్తిని నిందించి కీర్తిని మెచ్చుకొనుచుందురు. కాన మానవుడెప్పుడును మంచి కీర్తిని గోరియే పనులను చేయుచుండవలెను. పవిత్రమైన కీర్తికొఱకై నేను మిమ్మందఱనైనను నా ప్రాణముల నైనను విడచిపెట్టెదను. ఇప్పుడు కలిగిన అపకీర్తి భయముచే నేను భూపుత్రిని విడచుట

ఆశ్చర్యమగునా? ఓ భూపతులారా! నేనెట్టి యపవాదమునకు గుఱియైతినో మీరే చూడుడు. ఇట్టి మహాదుఃఖమును నేనెట్టి దశలయందును పొందియుండలేదు. ఇంక నేమందును.

## శ్రీరాముడు సీతను వాల్మీకాశ్రమ సమీపమున విడువుమని లక్ష్మణునాజ్ఞాపించుట:

రేపే తెల్లవారగనే సుమంత్రుడు రథమును తేగా లక్ష్మణా! నీవు భూపుత్రిని తీసికొని వెళ్లి అన్నియూళ్లకు ఆవల గంగానది కావలి తీరమందున్న వాల్మీకి ఆశ్రమముననున్న వనములందు తమసా నదీ తీరభూమి యందు జన సంచారము లేనిచోట విడిచి పెట్టి తొందరగా తిరిగి రమ్ము. మారు మాటాడకుండగా నేను చెప్పినట్లు చేయుము. దీనియందాలోచింపవలసినదేదియు లేదు. కూడదని చెప్పితివో నీపై కోపగించుకొనెదను. నా పాదముల మీదను, నాప్రాణముల మీదను ఆన పెట్టుచున్నాను. దీనికి నీవు బదులు చెప్పరాదు సుమా. ఎవరైనను దీనికి అడ్డము చెప్పినచో నా కిష్టమైన విషయమునందు విఘ్నము కలిగించుటచే వారిని నాకు మిక్కిలి పగవారి వలె భావించెదను. నా యాజ్ఞకు లోబడియుందురేని, నాయందు మీకు గౌరవమున్నచో నేనాజ్ఞాపించినట్లు చేయుడు, అవి యివి యను మాటలు చెప్పకుడని ఆజ్ఞాపించుచున్నాను. గంగాతీరమునకు వెళ్లుట తన కోరికని జానకి చెప్పియున్నది. ఆ మాటకు సరిపోవునట్లు లక్ష్మణా ఆమెను తీసికొని వేగముగా వెళ్లుము. అని చెప్పి వారలను వెళ్లుడని యనుమతినిచ్చి కన్నుల నీరు గారుచున్న ముఖముతో తన మందిరమునకు వెళ్లి ఆ పవిత్రుడు ఏనుగు వలె నిట్టూర్చుచుండెను.

★★★



# నలువది యాఱవ సర్గము

## లక్ష్మణుడు సీతాదేవిని ఋష్యాశ్రమములకని పిలుచుకొనిపోవుట:

మిక్కిలి దీనవదనుడై లక్ష్మణుడు తెల్లవారగనే వేగముగా సారథియైన సుమంత్రుని బిలిచి వాడిన ముఖముతో నిట్లనెను ఓయీ! సుమంత్రా! అతి వేగముగా రథమును సిద్ధపరపుము. మెత్తని పరుపును రాజగృహము నుండి తెచ్చి దానియందు పరువుము. రాజాజ్ఞచే సీతను ఋష్యాశ్రమములకు నేనే తోడుకొని పోయెదను. అని చెప్పగా అతడట్లే అన్నియును సిద్ధపరచి దేవా! రథము సిద్ధమైనది అనగా అంత లక్ష్మణుడు రాజగృహము ప్రవేశించి సీతను చూచి వదినే! నీ హృదయనాథుని వరమును గోరితివట. ఆయనయు ఇచ్చెద ననెనట. జాహ్నవీ తీరమున నున్న మునిశ్రేష్ఠుల ఆశ్రమములకు నిన్ను తీసికొని పొమ్మని రాజచంద్రుడు నాకాజ్ఞనిచ్చెను. దేవీ! వేగముగా బయలుదేరుము అని చెప్పగా జానకీదేవి సంతోషముతో లక్ష్మణా! నిన్ననే సుమీ మీయన్నను నేనడుగగా అట్లేయని చెప్పెను. నిన్నంతలోనే పంపించెనా? నా ప్రాణేశ్వరుని హృదయము వెన్నగదా. నేను రాజు భార్యనై యుండి మునీంద్రుల భార్యలను వట్టి చేతులతో నెట్లు చూడనేగుదును? వస్త్రములు అందమైన భూషణములు ప్రేమతో నేను పట్టుకొని వెళ్లి మునిపత్నులకు సమర్పించెదను. ఆలస్యమేమియును లేదని సీత వానినన్నిటిని ఏఱి ఒకచోట నుంచి లక్ష్మణా! ఇవి వారు తీసి కొనదగినవేనా? ఇవి మనమివ్వదగినవేనా? ఇవి మంచివే గదా. అవును కాదు అనవేల? అని యడుగగా అతడు తన మనస్సు నందలి బాధను తనలోనే యణచి కొనుచు అవునవుననెను. సీతాదేవి మనస్సు నందెంతెంత సంతోషపడుచుండెనో అంతంతగా సుమిత్రాసుతుడు మనస్సు నందు విచారించుచుండెను. అతడు ధైర్యవంతుడు గాన అది యించుకంతయు బయటికి కనబడదయ్యెను. అంత జానకీదేవి సమస్తమును తీసికొని ప్రయాణము కాగా ఆమెను రాజాజ్ఞచే నెమ్మదిగా రథముపై నెక్కించి సూతా! గుఱ్ఱములను వడిగా దోలుమనగా ఆ సూతుడట్లే రథమును నడపెను.

## సీతాదేవి యపశకునములను గని పరితపించుట:

అంత సీతతన ప్రియమైన మరదిని జూచి యిట్లనెను. లక్ష్మణా! ఇది యేమియో గాని గొప్ప యపశకునములు గనిపించుచున్నవి. మనస్సు నెమ్మదిలేక ఆందోళన చెందుచున్నది. ఏమిటికో కుడి కన్నదరుచున్నది. ఒడలు వఱకుచున్నవి. మనస్సు కళవళ పడుచున్నది. నా హృదయము దడదడలాడుచున్నది. ధైర్యము చెడినది. ఏమి కీడు రానున్నదోగదా. ఓ ధీరచరితా! ఆ మున్యాశ్రమములను చూడ ఆశ అధికమయ్యెను. ఏమియును ధైర్యము లేదయ్యెను. ప్రపంచమంతయును పాడుగా దోచుచున్నది. నిబ్బరమంతయును నీట గలసెను. అయ్యా! లక్ష్మణా! అన్నయందు ప్రేమకలవాడా! పల్కుమా! మీయన్నకు సేమమే గదయ్యా! అత్తలందఱును సౌఖ్యముగ నున్నారా? చెప్పుము అని చేతులు జోడించి సీత యిట్ల పలికెను. ఓ దేవతలారా! పౌరులకును జనపదులకును సుఖము కలిగించుటకై మిమ్ము వేడుచున్నాను. అని మ్రొక్కుచున్న ఆమెకు నమస్కరించి లక్ష్మణుడు అన్నిచోట్లను అందఱకును సుఖమే అని చెప్పి మనస్సునందు దుఃఖించుచు వేళ్లి గోమతీనదిని జూచెను. అచ్చట నొక యాశ్రమమున ఆ రాత్రి గడిపి సూర్యుడుదయింపగనే సూతునితో నిట్లనెను. రథమును తెమ్ము. భాగీరథీ జలమును శివుడు ఆకాశగంగను శిరస్సున ధరించిన విధముగా నేను శిరస్సున ధరించెదను అని చెప్పగా వెంటనే సూతుడట్లేచేసి జానికీదేవితో దేవీ! రథమెక్కుమనగా ఆ రామచంద్రుని పత్ని రథమెక్కెను. తరువాత సౌమిత్రియు నెక్కగనే యెంతో వేగముతో రథము పావన గంగాతటమును అరదినములోనే చేరునట్లు వెళ్లెను. భాగీరథిని చూచి లక్ష్మణుడు వ్యసనము నేవిధముగను ఆపుకొన స్థైర్యములేనివాడై విపరీతమైన ఆర్తితో హా! యని పెద్ద ధ్వనితో నేడ్వదొడగెను.

## సీతాదేవి లక్ష్మణుడు దుఃఖింప నూరార్చుట:

అతని విధమును జూచి జానికీదేవి యిట్లనెను. ఓ పవిత్రచరిత్రా! ఏల ఏడ్చెదవు. ఈ విధముగా ఏడ్చుట తగునా? ఎన్నిదినముల నుండియో నా మనస్సు నందు గలిగిన కోరిక నేటికి సిద్ధించినది గదా. పవిత్రమైన గంగానదీ తీరమును చూడగలిగి కూడా ఏడ్చెద వేల లక్ష్మణా! సంతోషింపదగిన కాలమున ఇటు లింతగా ఏడ్చుచు నా మనస్సున కెంతో దుఃఖమును గలిగింపదగునా? ఓ మరదీ! నీ విధము చూడగా వింతగా నున్నదే. ఎప్పుడును రాముని కొలువును ఒక్క క్షణమైనను విడువవు. నేనెరుగుదును. దానికి రెండు

రాత్రులు భంగము గల్గినది నిజమే. అన్నా! దానికై యింతగా ఏడ్చెదవా? వినుము. ఆ పురుషోత్తముడు నాకు ప్రాణములకంటెను ప్రియుడైనను నేనీవిధముగా వెతజెందితినా? లక్ష్మణా! అల్పత్వమును విడువుము. ఇక గంగానదిని దాటింపుము. ఎదురులేని విధముగా వెళ్లి ఋషి పత్నులకెల్లను బంగారు నగలను, మంచి వస్త్రముల నిచ్చుచు భక్తితో నమస్కారములు చేసి ఒక్కరాత్రియే కోరిక తీర మనమక్కడ నుండి వేగముగా పురమునకు తిరిగి వెళ్లుదము. సుందరుడైన నా భర్తను చూడ నాకు హెచ్చైన తహ తహ కలుగుచున్నది. మనస్సు తొందరపడుచున్నది.

★★★



# నలువది యేడవ సర్గము

## లక్ష్మణుడు శ్రీరామునాజ్ఞ చెప్పలేక యేడ్చుట:

అని సీత చెప్పగా లక్ష్మణుడు కన్నీటిని తుడుచుకొని నావికులను బిలిచి నావ తెమ్మని ఆజ్ఞాపింపగా వారలు వేగముగా నావను సిద్ధపరచి చెప్పగా వెళ్లి భూపుత్రితో నావనెక్కి సుమంత్రుని రథముతో నిలబడుమని ఆజ్ఞ యిచ్చి వేగముగా జాహ్నవీ నదిని దాటి ఆవలి తీరమును జేరి స్త్రీరత్నమగు మిథిలారాజపుత్రిని జూచి శరీరమంతయు కంపించుచుండగా కన్నీటితో తడియుచు కలత జెందిన మనస్సు గలవాడై యిట్లు విన్నవించెను. కటకటా! ఇట్టి కష్టపు కార్యమును చేయుటకు నన్నాజ్ఞాపించి అన్నయే ప్రఖ్యాతముగా లోకనిందలలో మునుగునట్లు చేసెను గదమ్మా! అదియే గొప్ప హృదయశల్యమై నన్ను బాధించుచున్నది. క్రూర స్వభావుడనైన యిట్టి నాకు తొందరగా మృత్యువు ప్రాప్తించినను శ్రేయమగును. ఘోరమగు నిట్టి పనిచేయుట కారాజునకు నేనే దొరికితిని. ఓ ధీరమతీ! అయ్యో! ఉత్తమగుణవంతుడైన రామచంద్రునికిది తగునా? ఇది పాపపు పనియే యైనను నన్ను పాపాత్ముడనంచు తలపవలదు సుమాతల్లీ! భూపుత్రీ! నాపాపమును క్షమింపుమని చెప్పుచు అతడు భూమిపై బడిపోయెను. అయ్యో నాకు మృత్యువైన రాదేయని యేడ్చుచున్నవాడును, ఎఱ్ఱబడిన నేత్రములు గలవాడును విపరీతమైన దుఃఖమున మునిగిన వాడును అనుగ్రహింపమని చేతులు జోడించిన వాడును అగు లక్ష్మణుని జూచి జానకీదేవి మిక్కిలి భయమును పొందినదై ఇదియేమియో ఎఱుగజాలకున్నాను. ఒక్కడవే యిట్లు దుఃఖించెదవేల? లక్ష్మణా! కారణమేమియో చెప్పుము. మహారాజు క్షేమమే కదా! చెప్పుము. రామచంద్రునిపై ఒట్టుపెట్టుచున్నాను. మానక చెప్పుము. నా యెదుట నీవీవిధముగా ఏల యేడ్చెదవు? నిన్నాజ్ఞాపించుచున్నాను అని ప్రేరేపింపగా

## లక్ష్మణుడు సీతాదేవికి శ్రీరామాజ్ఞ నెఱిగించుట:

అంత లక్ష్మణుడు తల వ్రేల వైచుకొని కన్నుల వెంట నీరు కారగా డగ్గుత్తిక పడగా బాధనొందుచు మనస్సునందున్నది యున్నట్లుగా సర్వమును ఆ సీతాదేవికి అతడిట్లు

విన్నవించెను. తల్లీ! యేమని చెప్పుదును. పట్టణములందును, పల్లెలందును నిన్ను గూర్చి జన సమూహము దారుణమైన మాటలను పల్కుచున్నారని ఎల్లరు తనకు కొలువునందు చెప్పగా విని రామచంద్రుడు దుఃఖము నంది తన మనస్సున నున్న దంతయును నాతో చెప్పి తన యింటికి వెళ్లెను. ఓ పతివ్రతాశిరోమణీ! ఆ మాటలన్నియును నీముందు చెప్పరాదు. నేను కన్నులార నీ మహిమను చూచితిని. నిన్ను భూజనుల వలన వచ్చిన నిందకు భయపడి రాజు విడిచి పెట్టెను. అంతియేగాని వేరుగా మనస్సు నందు తలంపకము. ఆ రాజ్ఞచే నేను నిన్నీ యాశ్రమ సమీపమునందు విడిచి వెళ్లెదను. ఆ మహారాజు నీకు గలిగిన చూలింత కోర్కెలనెపమును బెట్టి ఈ విధముగా యింతటి పనిచేయుమని చెప్పెను. ఇవియే ఆ గంగాతీర తపోవనములు. ఇవి కడు సుందరమైనవి. మిక్కిలి పవిత్రములైనవి. దుఃఖపడవలదమ్మా. అక్కడ దశరథ రాజునకు మిత్రుడును, బ్రాహ్మణుడును, స్వచ్ఛమైన మనస్సు గలవాడును, తపోవంతుడును, మిక్కిలి కీర్తి గలవాడును, అగు వాల్మీకియను ముని నివసించుచుండును. ఓ జానకీదేవీ! నీ వాతని పాదసేవ చేయుచు దినములను గడపుము. రాముని మనస్సు నందు నిల్పుకొని పతివ్రతా ధర్మనిష్ఠతో జీవింపుము నీకు శుభము కలుగగలదు అనెను.

★★★



# నలువది యెనిమిదవ సర్గము

## శ్రీరామాజ్ఞ విని సీతాదేవి విలపించుట:

ఆ నిష్ఠుర వాక్యములాలకించి సీతాదేవి భరింపరాని గొప్ప విషాదముతో సొమ్మసిల్లి ఒక ముహూర్తకాలము పడియుండి తిరిగి తెలివి నందినదై దుఃఖములందు ముంచి వేయుటకే బ్రహ్మ నా శరీరమును సృజించెను. సర్వదుఃఖములు వచ్చిపడినవి. ఇక చెప్పుకొన్నచో ఫలమేమున్నది లక్ష్మణా! ఎట్టి ఘోర పాపములను నేను చేసితినో పూర్వమున నెట్టి మహాత్మురాలిని భర్తనుండి నేనెడబాసితినో గదా. కాకున్నచో ఇట్లు కారణము లేకుండ ఏ పాపమును ఎఱుగని నన్ను నట్టడవిలో విడువమని మహారాజాజ్ఞాపించునా! దోషమునెంచునా? స్వామి యైన రఘురాముని పాదపద్మముల పరిచర్యచేయు సంతోషముతో ఆశ్రమములందు ఉగ్రమైన అమితమైన బాధల సమూహమునా విధముగా ఓర్చుకొనగల్గితిని. ఇప్పుడీ నిర్జనమైన అడవులందు ఒంటరిగా నేవిధముగా నివసింతును. లక్ష్మణా! నా దుఃఖముల నేమని ఎవరికి నేను చెప్పుకొందును. పుణ్యశీలుడు రాజు నయినయి రామ విభుడు నిన్నీ వవసీమలకు బంపెను? ఓ బోటీ! అటువంటి చేయరాని పని యేమి చేసితివి? అని నన్ను మునిపుంగవు లడిగిన నేమి చెప్పుదును? ధర్మము తప్పి నా భర్త దయలేని వాడని యెట్లు చెప్పుదును? నా భర్త యొక్క రాజవంశము ఈ భూమిపైన విచ్ఛిన్నమై పోవకున్నచో సౌమిత్రీ! ఈ క్షణము నందే నా శరీరమును జాహ్నవీ నది యందు విడువకుందునా? అదియే గాక దుఃఖభారము చేత మనస్సు నందసహ్యమును జెంది నేను శరీరమును విడచినచో నిర్దయుడు రాముడని రఘుకులమున వదలని యపకీర్తి నా భర్తకు గలుగును గదా.

## సీత శ్రీరామాదులకు కడపటి వాక్యములు చెప్పుట:

కావున లక్ష్మణా! రాజు నాజ్ఞ ప్రకారము ఈ దుఃఖబాగినిని ఈ దురదృష్టవంతురాలిని నన్ను ఈ వనసీమలందు విడువుము. భూవరుని యాజ్ఞలో నిలువుము. నీకు పుణ్యము వచ్చును. నా మాటలను వినుము. మా అత్తగార్లతో నేను మ్రొక్కితినని చెప్పుము. సౌమిత్రీ! నా

మారుగా రామచంద్రునకు పాదముల వ్రాలి మ్రొక్కి మీయొక్క క్షేమమడిగినదని చెప్పుము. అత్తలకును ఈ విధముగనే చెప్పుము. ఆ రాజుతో ధర్మమార్గమున దృష్టి తప్పకుండ ప్రవర్తిల్లుమని చెప్పుము. జానకి నిర్మలస్వాంత యనియును, ఆమె తత్వమంతయు నీవెరిగినదే యని చెప్పుము. నీ హితమును కోరుదానను. నీ భక్తురాలనని ఎల్లప్పుడును నీ మనస్సునకుస్పష్టమనిచెప్పుము.అపవాదమునకుభయపడునీచేతఅనాథవలెవిడువబడితి ననుము. నీవు నాకు పరమగతిని గాన నీ యపకీర్తిని బాపుట నాకు ధర్మమనుము. నాయనా! నా మాటలుగా మీయన్నతో నివన్నియును దయతో వినిపించుము. పౌరలనందఱిని తన సోదరులవలె చక్కగా రక్షించుచు శ్రేష్ఠమైన ధర్మమార్గమున నెల్లప్పుడు భూభారము వహించు రాజు ఓ భూపతీ! శ్రేష్ఠమైన గతిని బొందును. ధర్మమును ఎల్లప్పుడును గొప్పనైన మంచికీర్తిని పొందదగుననియు విన్నవించుము. దుఃఖముచే నా శరీరము కృశించునని నేను బాధపడను కాని మూర్ఖులైన పౌరల యొక్క అతికఠినమైన వాక్కులను తలచి తలచి మిక్కిలి దుఃఖింతును. పౌరుల వృథాపవాదములకు పాలుగాకుండునట్లు భూభారమును వహింపుమని చెప్పుము. ఆలోచింపగా భార్యకు ప్రాణవిభుడే దైవము, బంధువు, గురువు నగుటచే ప్రాణము కంటే నెక్కుడుగా స్త్రీ భర్త అవసరములను దీర్చుటయే యెల్లప్పుడు నుత్తమము గదా. అని నేను సంగ్రహముగా జెప్పిన మాటలను పతితో జెప్పుము. ఇంక పురమునకు బొమ్ము. గర్భచిహ్నమును దాల్చిన నన్ను జూడుము. ఎట్టి కష్టము వచ్చినది.

## లక్ష్మణుడు సీతాదేవి యనుజ్ఞ గొని మరలి గంగదాటుట:

అని యిట్లు సీత చెప్పగా లక్ష్మణుడు దీనచిత్తుడై ఆమె పాదసమీపమున తన శిరస్సు నేలకు తగులునట్లు వ్రాలి భూపుత్రితో ఒక్కమాటను గూడా చెప్పలేక ప్రదక్షిణము చేయుచు గొప్ప ధ్వనితో నేడ్చుచు ఒక ముహూర్త కాలము తన మదిలో ధ్యానము చేయుచు సీతతో నిట్లు పలికెను. ఓ పవిత్ర చరిత్రురాలా! ఏమని పలికితివి? నేను నీ స్వరూపమును ఇంతవఱకు నీ పాదద్వయమును తప్ప చూచినది లేదు. ఓ సాధ్వీ! జనసంచారము లేని యీ యడవి యందు రాముడు లేని సమయమున నేను నిన్ను చూచుట జరుగునా? అనుచు వేగముగా మ్రొక్కి నావను జేరనేగి నావనెక్కి తొందరగా నడవుమని నావికును తొందరచేసి ఆవలి యొడ్డున దిగి దుఃఖభారముచే బాధనొందుచు వెళ్లి మూఢాత్ముని వలె రథము నందు పడెను. మాటిమాటికి రాముని భార్యను చూచుచు అనాథవలె హృదయ విదారకముగా నేలబడి పొరలుచు మిక్కిలిగా ఏడ్చుచున్న సీతను వెనుదిరిగి చూచుచు వెళ్లెను. రథము

వేగముగా దూరదూరమగుచు వెళ్లుటను చూచి చూచి గుండెలదరుచుండగా సీతాదేవి ఒంటరిగా దుఃఖించుచు నేలబడి దొరలుచుండెను. దిక్కులేనిదై దుఃఖభారముచే సోలుచు నెమళ్ల శబ్దములతో అందమైన ఆ వనము నందు కీర్తిశాలిని యగు నా పద్మాక్షి మిక్కిలి గొంతెత్తి ఏడ్చుచు బాధనొందుచుండగా.

★★★



# నలువది తొమ్మిదవ సర్గము

## ముని కుమారులు వాల్మీకికి సీతవృత్తాంతమును దెల్పుట:

అంత వాల్మీకి శిష్యులైన ముని కుమారులు సీతాదేవిని జూచి పరుగున వెళ్లి వాల్మీకి మునికి నమస్కారములు చేసి తాము చూచిన విధముగా ఆమె యున్న విధమును ఇట్లు వినిపించిరి. మునినాథా! ఆమె ఏ మహాత్ముని యిల్లాలో మహాలక్ష్మి యని చెప్పనొప్పును. ఇంతకు ముందెప్పుడును ఆమెను చూడలేదు. స్వర్గమునుండి దిగిన దేవకాంతయో యన నొప్పుచుండెను. అనఘా! ఆలోచింపుము. ఏటి యొడ్డున ఆమె యేడ్చుచున్నది. మేము చూచితిమి. అట్లేడ్చుట యెందులకో తెలియదు. దిక్కులేని దానివలె ఒక్కతియే యున్నది. ఆమెను చూడగా మానవ స్త్రీ వలె కనిపించుటలేదు. దుఃఖముల కనర్హయగు నామె దుఃఖపడుచున్నది. ఆశ్రమ సమీపమున చాలా దగ్గరలో నుండుటచే ఇంక ఆ స్త్రీకి నీవే శరణము. కాపాడు వాడు లేకుండుటచే మిగుల తాపము చెందుచున్నది. ఈ సమయమున ఆ కీర్తి శాలినిని నీవు రక్షకుడవై కాపాడుమా అని శిష్యులు విన్నవింపగా ముని మనస్సు నందాలోచించెను. దివ్యదృష్టిచే సర్వమును దెలిసికొని పాదములతోడనే పరుగువెట్టి వేగముగా అర్ఘ్యమును బట్టుకొని శిష్యులెల్లరును వెంటరాగా గంగను జేరి సీతను జూచెను.

## వాల్మీకి సీతాదేవి నూరార్చి ఆశ్రమమునకు తీసికొనిపోవుట:

అట్లు రాముని ప్రియ భార్యను, దుఃఖముచే అమితముగా తపించుచున్న దానిని, అనాథ వలెనున్న దానిని స్త్రీలలో మణి వంటిదైన సీతాదేవిని చూచి ఆనందము కలుగునట్లామెతో నిట్లనెను. అమ్మా! దశరథ మహారాజు కోడలవు నీవు. శ్రీరామ భూపతికి పట్టమహిషివి. జనకరాజు పుత్రివి. పతివ్రతలకాదర్శమైనదానా! నీకు స్వాగతము. శిష్టులచే పొగడబడినదానా! నీ రాకకు గారణమును సర్వమును నేను యోగదృష్టిచేత చూచితిని. ఓ స్త్రీశ్రేష్ఠమా! సర్వలోకములందు జరుగుచున్నవన్నియును నాకు దెలియును. నా యొక్క తపస్సుచే లభించిన దృష్టి మహిమచే చూచితిని. నీయందొక్కింతయు పాపము కలుగనేరదు. భయపడవలదు తల్లీ! నాయాశ్రమము నందు ఉండుము. మనస్సు నందు

పరితాపము నందకుము. అమ్మా! నన్ను నమ్ముము. ఆర్తిని బోనాడుము. ఈ అర్ఘ్యమును గైకొనుము. నీ స్వంత గృహమున నున్నట్లుగా ఆనందింపుము. తల్లీ! నిన్ను చూచుటకు నిన్ను తమ పుత్రిక వలె ఆదరించి రక్షించుటకు నా ఆశ్రమప్రాంతమందు నియమము గల తపస్వినులున్నారు. అని పల్కగా సీతాదేవి మిక్కిలి అద్భుతములైన ముని వాక్యముల నాలకించి ముగ్ధురాలై శిరము వంచి చేతులు మోడ్చి నమస్కారము చేసి ఆ ముని వెంట ఆశ్రమమున కేగెను.

## వాల్మీకి సీతాదేవిని మునిసతుల కప్పగించుట:

అట్లు జానకితో గలసివచ్చు మునిశ్రేష్ఠుని జూచి తాపసస్త్రీలు సంతోషము నిండిన మనస్సులతో మునివరా! స్వాగతము. మీరిచ్చటికి వచ్చి యెన్నినాళ్లయినదో గదా. దయతో మా యందఱి మ్రొక్కులను స్వీకరించి వచ్చిన కార్యమేమియో ఆనతిండు అనుచున్న ఆ మునిపత్నులతో మునీంద్రు డిట్లనెను. ఈమె సీతాదేవి. రాముని ప్రియభార్య. దశరథ మహారాజు కోడలు. జనకరాజపుత్రిక. సాధుచరిత్ర. పతివ్రత. పాపరహితురాలయ్యును భర్త చేత విడువబడినది. ఎల్లప్పుడీమె నాచేత రక్షింపదగినది. కాన యీమెను మిక్కిలి స్నేహముతో మీరు కాపాడవలయును. నా మాటలను మన్నించి ఓ కాంతలారా! గౌరవముతో చూడుడు. అని మరల మరల నొక్కి నొక్కి సీతాసతిని వారికప్పగించి శిష్యులతో గలిసి తన యాశ్రమమును చేరెను. అట్లు సీతాదేవి మునియాశ్రమమును చేరుట యంతయును లక్ష్మణుడు చూచెను.

★★★



# ఏబదవ సర్గము

## లక్ష్మణుడు శ్రీరాముని గురించి సుమంత్రునితో చెప్పి యేడ్చుట:

సీత మున్యాశ్రమము చేరుటను చూచి లక్ష్మణుడు దుఃఖముచే కలిగిన మనస్సుతో సుమంత్రునితో నిట్లనెను. సూతా! చూచితివా? జానకీ విరహముచే గలిగిన రఘురాముని దుఃఖమును. లోకములచే కీర్తింపబడు సాధ్విని జనకపుత్రిని తాను విడనాడెనే. ఇంతకన్న దుఃఖమింకొకటి యుండునా కీర్తిశాలి యగు రామమూర్తికి? రామభద్రుడిట్లు వైదేహి లేనివాడై దుఃఖించుట చూడగా సూతా! ఇది దైవము చేష్టగానే తోచుచున్నది. దైవము నతిక్రమించుట భూమి యందు మానవునికి శక్యమా? దేవతలను, గంధర్వులను, దేవశత్రువులగు రాక్షసులను సంహరించిన సీతానాథుడు నేడు దైవమును దాటజాలక పోవుటచేదీనత్వముతోదానికిలొంగియుండెను.జనకునిఆజ్ఞచేనిర్జనమైనదండకారణ్యము నందు వనములలో పదునాల్గు సంవత్సరములు దుఃఖములనుభవించెను. అంతకన్నను ఈ జానకీ వియోగమును భరించుట కష్టము. పౌరలు వాక్యములను విని సచ్చరితయైన ప్రియురాలిని విడుచుటకు ఎంత దయలేని వాడో కదా. సీత సాధ్వియని తానెఱుగును. ఇట్లెఱిగి యుండియు భార్యనడవిలో విడచెను. ఇంతటితో నిందపోవునా? కఠినుడని యనకుందురా? ఇంక కాగలదేమున్నది. ఇక ఏ ధర్మమునే విధముగా సంపాదించును? అయ్యో! తన మనస్సును త్రిప్పుకొనడు ఎంతటి ధైర్యవంతుడో గదా.

## సుమంత్రుడు లక్ష్మణునకు మనస్తాపోప శమనము చేయుట

అని యనేక విధములుగా దుఃఖముతో చెప్పుచున్న లక్ష్మణుని మోమును జూచి బుద్ధిమంతుడగు సుమంత్రుడు ఈ విధముగా అనునయపు మాటలను చెప్పి అతని యార్తి నణగజేసెను. ఓ సౌమిత్రీ! జానకి విషయము నందు సంతాపమేమిటికి? ఇది ముందే తెలిసినదే. సౌఖ్యములనుభవింప నర్హుడైన రామచంద్రుడు ప్రేయసి వియోగముచే దుఃఖభాజనుడగును. కొంతకాలము గడవగా శ్రేష్ఠమతీ! నిన్నును భరత శత్రుఘ్నులను, భూపుత్రికను ఎడబాయును. దీనిని నీవెవ్వరితోడను, భరతునితో శ్రీరామభద్రునితోనైనను

చెప్పకుందువేని పూర్వము దుర్వాసుడు దశరథ మహారాజును, నేనును, వసిష్ఠ మహర్షియు వినుచుండగా చెప్పిన వృత్తాంతము నంతయును ఓ నిర్మలాత్మా! నీకు చెప్పెదను. ఆ మహారాజు సుమంత్రా! ఈ రహస్యము నెవ్వరికిని చెప్పబోకమని ఆజ్ఞాపించెను. ఆ రాజాజ్ఞను నేనెప్పుడును భక్తితోను వినయముతోను నెఱవేర్చుచుందును. నీకైనను నేనిట్లు చెప్పదగును. ఐనను దైవతంత్రమును దాటవశమౌనా? ఈ విధమైన దుఃఖముతో నీవు శ్రమపడుచుండుట చూడగా ఈ దురవస్థను బాపుటయే నేడు శుభమని నాకు తోచుచున్నది. కావున ఓ రాజపుత్రా! ఇట్లు చెప్ప దలచితిని. నీకు వినుట యిష్టమైనచో ఎట్టి దశయందైనను తమ్మునకు అన్నగార్లకును చెప్పబోకుము. అని సుమంత్రుడు చెప్పగా నీమాట ప్రకారమే నేను నడచెదను సుమంత్రా! ఆ వార్తలను ఉన్నవి యున్నట్లు తెల్పుమని లక్ష్మణుడడిగెను. అప్పుడు సుమంత్రుడాలస్యము చేయక యిట్లు చెప్పెను.

★★★



# ఏబది యొకటవ సర్గము

## దశరథ దుర్వాసుల సంభాషణము సుమంత్రుడు లక్ష్మణునకు చెప్పుట:

అత్రి మహాముని కుమారుడగు దుర్వాసుడను మహర్షి వానకాలము నాల్గునెలలను చాతుర్మాస్యదీక్షను నియమముతో జరుపుటకు వసిష్ఠుని యాశ్రమము నందుండగా మీ తండ్రి గురువును సందర్శించుటకు వెళ్లి మధ్యాహ్నసూర్యునివలె వెలుగొందుచున్న వసిష్ఠుని యెడమ ప్రక్కనున్న యతిచంద్రుని జూచి మిక్కిలి భక్తితో ఇరువురు మునులకు మ్రొక్కెను. అంత నా మునులును ఆ రాజేంద్రునకు పాద్యము ఫలములు మొదలైనవి యిచ్చి సత్కరించి, వినదగిన కథలను మధురబాషణములతో వినిపించిరి. ఆకాశ మధ్యమున సూర్యుడు ప్రకాశించుచుండగా ఆ గాథలు పూర్తియైన తరువాత రాజు చేతులు జోడించి అత్రికుమారునితో నిట్లనెను. ఓ బ్రహ్మసమానుడా! మహాత్మా! భూమియందు నా వంశము ప్రమాణమెంతయో చెప్పుము. మునీంద్రా! నా రాముని ఆయువెంతయో తక్కిన కుమారులీ భూమిపై నెన్నినాళ్లుందురో! శ్రీరామభద్రునకు కొడుకులు గల్గుదురా? వారి యాయుః ప్రమాణమెంత? నా వంశవిధమును చెప్ప నిన్ను వేడుకొనుచున్నాను తెలుపుము.

## భృగుమహర్షి విష్ణువును శపించుట:

దశరథ మహారాజిట్లడుగగా దుర్వాసుడిట్లనెను. వినుము. పూర్వము రాక్షసులు గర్వించి యుండ వారి నందఱను దేవతలు తరుమగా వారు భయముతో పారిపోయి భృగుమహర్షి యొక్క భార్యను శరణువేడగా ఆమె వారికభయ మొసగెను. రాక్షసులు దిగులు లేక తగు విధముగా సుఖించుచుండగా విష్ణువు ఆ భృగుపత్నిని తన చక్రధారచే ద్రుంచెను. అంత భృగువు తన భార్య పాటు జూచి కోపించి ఓ శ్రీవత్సాంకా! చంపదగని నా సతిని చంపుటచే నీవు భూమి యందు జన్మించి భార్యావియోగ దుఃఖముచే అనేక సంవత్సరములు తపింపుమని శపించెను. తరువాత తన మాటలకు తానే తపించుచు ముని విడువని దృఢ భక్తితో హరిని పూజించి భజించెను. పాపులకు రక్షణనిచ్చిన తన భార్య విధమును, తాను కోపించి లోకనాథుడైన విష్ణువును శపించుటయు, ఆ గజేంద్ర వరదుడు తానిచ్చిన

శాపమును నిగ్రహించినచో తనకు కలుగబోవు అధికమగు నరకబాధయు, ఇదియన్నియు తాపమును గలిగింపగా శాంతుడయి మునీంద్రుడు తనను పూజింపగా భక్తవత్సలుడు, పరమదయాళుడు అయిన శ్రీమహావిష్ణువు లోకములకు క్షేమము గలుగజేయుటకై జన్మాంతరంబున మౌని శాపమును గ్రహించెను. ఇదియే పూర్వవృత్తాంతము మహారాజా! [ఇది శ్రీరాముల యేక పత్నీత్వమును, విష్ణ్వవతారమూర్తిత్వమును స్థాపించుచున్నది.]

## శ్రీరాముని వృత్తాంతమును దుర్వాసుడు దశరథున కెరిగించుట:

దశరథా! ఆ శ్రీహరియే నీ తనయుడగుచు ఇచ్చటికి నెమ్మదితో చనుదెంచి లోకములందు రాముడను ఖ్యాతి వహించెను. ఆ ముని శాప ఫలము ననుభవించును. రాజేంద్రా! ఆ రాముడు రాజై చాలా కాలమయోధ్యను పాలించును. అతని యాశ్రితులందఱును సంపదలు సౌఖ్యములు ఎల్లప్పుడును పొందుదురు. పదివేల సంవత్సరములును, పది నూర్ల సంవత్సరములును జనులానందించునట్లు భూమిని పాలించి తరువాత వైకుంఠమును చేరజనును. రాముడు అశ్వమేథముల నెన్నిటినో చేసి దండిగా దక్షిణలనిచ్చి ధర్మతత్పరుడై రాజవంశముల ననేకములను ధరణి యందు స్థాపించును. రాజా! రామునకు సీతయందు కవలు పుత్రులు పుట్టెదరు వారు రాజులై యయోధ్యను సామముగా జనప్రియులై యేలెదరు. మహారాజా! రాముడే పుత్రులకు పట్టాభిషేకము చేయును అని యా మౌని సకలమును తెలియజెప్పగా ఆ రాజేంద్రుడు మునీశ్వరుని గౌరవించి పురంబున కేగెను. ఇది ముని చెప్పగా విన్నాడను. ఇన్ని దినాలు నా మనస్సు నందే యుంచితిని. ఇది యెట్లును తప్పదు. ఆ సీతను రామచంద్రుని గూర్చి యిట్లే మిటికి వ్యర్థముగా విచారించెదవు? నీవు పరిశుద్ధమైన మనస్సుతో నిబ్బరించుకొనుము. కలత మానుము అని సూతుడు తెల్పగా ఆ పరమాద్భుతమైన మాటలను మనస్సున మెచ్చుకొనుచు లక్ష్మణుడు మేలు మేలని దుఃఖమును వీడెను. వారిరువురిట్లు సంభాషించు కొనుచు వెళ్లుచుండగా సూర్యుడు పడమటి కొండను చేరబోయెను. సంధ్యా కాలమయ్యెను.

★★★

# ఏబది రెండవ సర్గము

## లక్ష్మణుడు శ్రీరాముని దర్శింపబోవుట:

అంతట ఆ సుమంత్రుడును లక్ష్మణుడును కేశినీ నది చెంత ఆ రాత్రి గడిపి తెల్లవారగనే అతి వేగముగా ప్రయాణము సాగించి సూర్యుడు ఆకాశ మధ్య భాగమునకు వచ్చునప్పటికి పట్టణము సమీపించుచుండగా లక్ష్మణుడు తన మనస్సు నందిట్లు తలంచెను. రామునకేమని చెప్పుదును. ఆయన ముఖమెట్లు చూచెదను. సీతను విడచి వచ్చి అన్నకు తగిన తమ్ముడవు నీవని పలుకు తల్లులకు బదులేమి చెప్పుదును. నన్నందఱును కఠినాత్ముడందురు గదా. ఔరా! యని నిట్టూర్చుచు, ఆరాటము నందుచు రాజమందిర ద్వారమును జూచి అచ్చట రథము దిగి ముఖము వంచుకొనుచు వెళ్లి ఆ మహాసౌధము నందు బంగారు పీఠమున దీనుడై కూర్చున్నవాడును, కన్నీరు గారుచున్న కన్నులతో నిశ్చేష్టుడై యున్నవాడును అగు రాముని చూచి

## లక్ష్మణుడు సీతావృత్తాంతము దెలిపి శ్రీరామునూరడించుట:

లక్ష్మణుడు వినయముతో చేతులు జోడించి అతి దీనత్వముతో ఇట్లు విన్నవించెను. రాజా! నీ ఆజ్ఞ మేరకు జానకిని నేను జాహ్నవీ నది సమీపమున విడచితిని. పవిత్రమైన వాల్మీకి యాశ్రమమున మంచి కీర్తి గలిగిన శుభశీలను విడచి వేగముగా నీ పాద పద్మములను సేవించుటకు తిరిగి ఇచ్చటకు వచ్చితిని. పురుష శ్రేష్ఠుడా! దుఃఖింపకుము. చూడగా కాలగతి విధమిట్టిదిగదా. రాజా! ధైర్యనిరతులు సర్వజ్ఞులునైన నీబోటి బుద్ధిమంతులు దుఃఖింతురా? ధనములు చివఱకు నశించునవియే. వృద్ధినందు వస్తువులన్నియు చివఱకు నశించునవియే గదా. జన్మించుట మరణముతో ముగియును. సంయోగములు వియోగముచే అంతమగును. కాన బుద్ధిమంతడు పుత్రులయందును, భార్యాధనములందును, మిత్రులందును మిక్కిలి ప్రేమతో ప్రవర్తింపరాదు. ఏ వేళనో వియోగ యోగము కలుగును. మనసుచే నిన్ను నీవు, జనులనందఱను సరిదిద్ద సమర్థుడవు. అనఘా! ప్రాకృత జనుని వలె ఏల దుఃఖించెదవు? మహాత్మా! నీవిట్లు చేయదగునా?

అపవాదభయమున నీవు భూపుత్రిని విడిచితిని గదా. తిరిగి నీవిటు లేద్చుచున్నచో నింద తొలగి పోనేరదు. మఱింత అధికమై ఈ భూమండలమున నిలుచును. ఇది నీకు తగదు. ఈ తాపమును మానుము. రాజచంద్రా! దుర్బల బుద్ధిని విడువుము. ధైర్యము వహింపుము అని చెప్పగా రామచంద్రుడు సోదరా! నీవు నిజము చెప్పితివి. నా ఆజ్ఞను నీవు నెరవేర్చుటచే సంతసించితిని. మఱల ధైర్యము వహించితిని. శోకమును దూరముగా బంపితిని. నీవు చెప్పిన మధురమైన మాటలను వినుటచే మనస్సునందు సంతోషము నిండినది అని మాటిమాటికి మెచ్చుకొనుచు తిరిగి యిట్లనెను.

★★★



# ఏబది మూడవ సర్గము

## శ్రీరాముడు లక్ష్మణునకు నృగుచరిత్రము దెలుపుట:

లక్ష్మణా! అవసర సమయమున ప్రేమగల చుట్టముండవలెను. నా మనస్సునకు నచ్చునట్లుగా చక్కగా చెప్పితివి. నిజముగా నీ వంటి నీతిజ్ఞుడుండునా? సోదరా! నా మనస్సు నందు ఒక్క చింత నాటియున్నది. అది నీతో చెప్పెదను. నీవట్లు చేయుము నాయనా! పౌరుల కార్యములను బరిశీలించి నాలుగు నాళ్లైనది. అట్లు చేయుట తగినది కాదు గాన ప్రస్తుతము కార్యావసరమున్న జనులను స్త్రీలను పురుషులను వేగముగా పిలువ బంపుము. పురోహితునకు గూడా వార్తనంపుము. సభాభవనమున కలియుడని చెప్పి పంపుము. ప్రతిదినమును పౌరుల కార్యములను దీర్చకుండగా బద్ధకించెడి రాజు నిక్కముగా గాలిలేని నరకమున దుఃఖించును. లక్ష్మణా! పూర్వము నృగుని చరిత్రను నీవు వినలేదా? పూర్వము బ్రహ్మణ్యుడును, సదాచార పరుడును, సత్యసంధుడును అయిన నృగుడను రాజు పుష్కరక్షేత్రమున బంగారు ఆభరణము లలంకరించిన గోవులను దూడలతో గూడి కోటిమంది బ్రాహ్మణులకు దానముగా నిచ్చెను. వానిలో నిరుపేదయు, ఆహితాగ్నియునగు బ్రాహ్మణుని ఆవు తన మందయందు గలియగా దాని నెఱుగక ఆ నృగుడు దానిని గూడ దానమిచ్చెను. ఉంఛవృత్తితో జీవించు ఆ బ్రాహ్మణుడు ఆకలి బాధతో దానికొఱకై ఇక్కడ అక్కడ చాలా సంవత్సరములు వెదకెను. ఎక్కడను గనబడలేదు. చివఱకు కనఖలమను గ్రామము నందు తన యావును చిక్కిన దూడను ఒక బ్రాహ్మణుని యింట గనిపించగా చూచి ఓ శబలా! వచ్చివేయుము అని పిలువగా అది ఆ బ్రాహ్మణుని స్వరమును గుర్తించి ఆలస్యము చేయక అగ్ని సమానుడగు బ్రాహ్మణుని వెంట వెళ్లెను. దానిని పోషించుచున్న విప్రుడు వెంట వెళ్లి యీ యావు నాది. ఓ బ్రాహ్మణా! దీనిని తీసికొని వెళ్లుట తగునా? దీని నా నృగమహారాజు నాకు దానముగా నిచ్చెను. అని చెప్పగానే ఆ బ్రాహ్మణుడు ఇది నాయావు. దీనిని రాజు నీకెట్లు దానముగా నిచ్చెను. అనుచు ఒకరితో నొకరిట్లు వాదములకు దిగి ఇద్దఱును నృగమహారాజును చేరనేగగా అచ్చటి ద్వారపాలకులు రాజును చూడ వెళ్లనీయక పోవుటచే చాలా సంవత్సరములచ్చట నుండి విసుగుతో మిక్కిలి కోపించి మిక్కిలి కఠినమైన

మాటలతో వారు రాజు నిట్లు శపించిరి. ఎచ్చటనైనను రాజు ఈ విధముగా చేయదగునా? పని గలిగి కార్యార్థులు ద్వారము నందీ విధముగా కావలి కాచుచుండ ఐశ్వర్యమదముచే కొలువు కూటమున దర్శనమీయని ఈ రాజు మాన్యుడా? ఈ అనార్యుడు భూతజాలముల కెల్ల కనబడకుండ చాలా సంవత్సరములొక బిలము నందు ఊసరవెల్లియై యుండుగాక. ద్వాపరాంత మందు నరుడును నారాయణుడును భూభారమును తగ్గింప జన్మించెదరు. యదువంశమందు పురుషుడై పుట్టిన వాసుదేవుని చేత వీని దుఃఖము తీరును. అని శపించి ఆ బ్రాహ్మణులా యావును బలహీనయు ముదసలియునై యుండుటచే నింకొక బ్రాహ్మణునకచ్చటనే దానముగా నిచ్చివెళ్లిపోయిరి. ఆ నృగమహారాజు ఇప్పుడు శాపవశమున బాధనొందుచున్నాడు. లక్ష్మణా! ఓర్మితో జనులను విమర్శించని రాజు దుర్గతి నందును. కార్యము కోరి వచ్చిన వారిలో కలహము బలపడుటకు కారణము ప్రభువు దోషమే సుమా. కలహములు లేకుండగా ప్రజలను మెలకువతో రక్షించు రాజునకు మేలు కలుగును. కావున ఏ పనుల కొఱకైనను ఎవరైనను కాచుకొని యున్నచో నీవు తెలిసికొనుటకు వెళ్లుమనగా లక్ష్మణుడు రాజా! యమదండ సదృశమైన శాపమును విని నృగమహారాజేమి చేసెనని ప్రశ్నించెను.

★★★



# ఏబది నాలుగవ సర్గము

## నృగోపాఖ్యాన శేషము:

అంత రామచంద్రుడిట్లు చెప్పెను. అప్పుడా రాజు ఆ దుర్వార్త విని దుఃఖముతో మంత్రులను హితులను తన యొద్దకు పిలిచి విచారించుచు నిట్లనెను. ప్రజలారా! నారదుడును, పర్వతుడును వచ్చి ఘోరమైన శాపమును దెల్పి వాయువేగముతో స్వర్గమునకు వెళ్లిరి. ఏమనవలెను? మీరందఱును నాపుత్రుడైన వసువును రాజ్యమునేలుటకు శుభముగా పట్టాభిషిక్తుని జేయుడు. సుఖకరముగా నుండునట్లు ఒక పెద్ద బిలమును నా కొఱకు నిర్మించుటకు నేర్పరులైన శిల్పులను దయతో నియమింపుడు. నేనందుండి శాపఫలము ననుభవించెదను. వర్షము పడకుండగా, మంచు పడకుండ, ఎండ తగులకుండగా నుండునట్లు మూడు బిలములను నిర్పింపుడు. సొంపుగా వాని చుట్టును మేలైన ఫలవృక్షములను పుష్పములతో నున్న లతాసమూహములను నాటి దట్టముగా నీడలుండునట్లు పొదరిండ్లను గల్పింప అందు శాపాంతము వఱకు నుందును. అర్థయోజనము వఱకు పుష్పము లుండునట్లు చేయుడని చెప్పి తన కుమారుడైన వసువును దగ్గఱకు బిలిచి కుమారా! నీవు ధర్మమార్గమును విడువకుము. క్షత్రియ ధర్మముతో భూమినెల్ల బాలింపుము. చిన్న అపరాధమునకై విప్రుఱ నాకు విపరీతమైన శాపము నిచ్చిరి. చూచితివా? మేలును కీడును గలుగజేయుటకు సమర్థుడు దైవమే కదా. దీనికై విచారింపకుము. కలుగునవేమియో కలుగును. పోవున వేవియో తామంతట అవియే తొలగిపోవును. మానవుడు పూర్వము చేసిన పుణ్యపాపముల ఫలములగు సుఖదుఃఖములు ప్రాప్తములై కలుగుచుండెను. అని పుత్రునితో చెప్పి ఆ రాజు చక్కగా సిద్ధపరుపబడిన బిలములోనికి వెళ్లి దీనత్వముతో దినములు గుడుపుచుండెను.

★★★

# ఏబది యైదవ సర్గము

## శ్రీరాముడు లక్ష్మణునకు నిమికథ దెలుపుట:

అని చెప్పి రాముడు లక్ష్మణా! ఈ విషయమున నీకు విననిష్టమైనచో ఇటువంటిదేయగు పావనమైన మఱియొక కథను వినిపించెదను అనగా లక్ష్మణుడు అన్నా! ఆశ్చర్యకరమైన కథలయందు నేను తృప్తి నందను [ఇంకను వినవలయుననియే యుండును] అని పల్కగా శ్రీరాముడిట్లు చెప్పసాగెను. ఇక్ష్వాకుని పండ్రెండవ సుతుడు మిక్కిలి ధర్మనిరతుడు నిమియను రాజచంద్రుడు గౌతమాశ్రమ ప్రాంతము నందు ఇంద్రుని పట్టణముతో సమానమైన వైజయంతమను నగరమును నిర్మించి తగిన విధముగా దీర్ఘమైన సత్రయాగము నొకదానిని చేయదలంచి ఇక్ష్వాకునకు దెల్పి యజ్ఞకార్యము నిర్వహించుటకై వసిష్ఠుని బిల్వగా ఆతడు నేనింతకు ముందే ఇంద్రునిచేత కోరబడినాడను. కాన నేను వచ్చునందాక ఓర్చి యుండుమని చెప్పి వెళ్లగా నిమి అత్రి గౌతమాంగిరసులను బిలిచి వారు సహాయపడగా హిమవత్పర్వతము చెంత తన పట్టణ సమీపమున యజ్ఞమును ప్రారంభించి ఐదువేల సంవత్సరములు సాగించెను. అంత ఇంద్రుని యజ్ఞమును పూర్తిచేసి వసిష్ఠ మహర్షి ఆ ప్రదేశమునకు వచ్చి గౌతమునిచే యధావిధిగా చేయింపబడుచున్న యాగమును జూచి కోపించి ఆ రాజేంద్రునికై ఒక మహూర్తకాలము వేచియుండెను. దురదృష్టవశమున ఆనాడా రాజు పగటనే నిద్రించుయుండెను. వసిష్ఠుడు కాచుకొని యుండి క్రోధముతో నన్ను నిరాకరించి యజ్ఞము చేయించుట కితరుని దెచ్చితివి. ఈ విషయమును చెప్పుటకు నేను రాగా ఇంట నుండియును నీవు దర్శనము నీయవైతివి. రాజా! నీ వచేతనుడ వగుమని శాపమిచ్చెను. ఆ విషయము నెఱిగి రాజు వేగముగా బయటకు వచ్చి రోషము నందినవాడై నేనొడలు తెలియక నిద్రించుచుండగా కడు ఘోరమైన శాపము నిచ్చుట తగునా? నీవును అచేతనుడవై చెడుము. నీ శరీరమున అందము చెడకుండుగాక అని శపించెను. రోషవశమున ఆయనఘులిట్లొకరి నొకరు శపించుకొనిరి. క్రోధము చేయలేని దేమున్నది? అని రాముడు చెప్పగా విని లక్ష్మణుడిట్లనెను.

★★★

# ఏబది యాఱవ సర్గము

## వసిష్ఠుడు దేహము ధరించుట:

అన్నా! శరీరమును విడచిన వారలు మఱల నెట్లు శరీరములు పొందిరో ఆ కథను దెల్పవేయన రాముడిట్లనెను. తమ శరీరములనట్లు విడచి ఆ మహారాజును తపోధనుడును వాయువులై ఆకాశమున సంచరించుచుండిరి. అట్లు తిరుగుచు వసిష్ఠుడు వేఱొక శరీరమును ధరింప గోరి తన తండ్రి చెంత కేగెను. అట్లు వెళ్లి బ్రహ్మకు మ్రొక్కి ఓ తండ్రీ! పద్మమునందు జన్మించినవాడా! బ్రహ్మాండమునందున్న సర్వదేవతలకు అధిపతియైనవాడా! నేను నిమిరాజు శాపముచే శరీరమును బోగొట్టు కొంటిని. శరీరములు లేకున్నచో ఇంతింతనరాని వ్యసనములకు గుఱియగుదుము. క్రియలకు లోపము గలుగును. కాన ఇంకొక శరీరమును ప్రసాదింపుము అనెను. అంత బ్రహ్మ యిట్లనెను. ఓ బ్రాహ్మణోత్తమా! మిత్రావరుణుల తేజమును ప్రవేశించి భూమియందు నీ వయోనిజుడవై పుట్టుము. గొప్పనైన తపస్సు చేత నా చెంత జేరెదవని చెప్పగా ముని బ్రహ్మకు మ్రొక్కి వేగముగా వరుణుని నివాసమునకు వచ్చెను. అప్పుడు మిత్రుడు వరుణునితో గలిసి రాజ్యపాలన మొనరించుచుండెను. పద్మదళముల వంటి నేత్రములు గలదియు, పూర్ణచంద్రుని వంటి ముఖము గలదియునగు ఊర్వశి చెలులతో గూడ అప్పుడచ్చటికి రాగా వరుణుడా స్త్రీని జూచి తన వలపు తెలుపగా ఆమె అయ్యా! నన్ను మొదట మిత్రుడు వలచెను. నీతో గలియుట తగునా? యనెను. అతడు ఓ మృగాక్షీ? నేను మన్మథుని ధాటి కోర్వజాలకున్నాను. దేవ నిర్మితమైన ఘటము నందు నా తేజము నుంచెదనని చెప్పగా ఆ యూర్వశి యిట్లనెను. నాకిది సమ్మతమే. మిత్రుడు శరీరసుఖము ననుభవించును. మనఃపద్మము నీదే. అదియే గదా మిన్నయైనది అనగా వరుణుడు అగ్నిశిఖతో సమానమైన తన వీర్యమును కుండయందుంచెను. ఊర్వశి మిత్రుని చేరజనెను. ఆతడామెను జూచి క్రోధముచే కలుషితమైన మనస్సు గలవాడై ఆమెతో నిట్లనెను. ఓసీ! దురాత్మురాలా! పాపముచే నిండిన చరిత్ర గలదానా! మునుముందుగా నాకు మాట యిచ్చి ఈ మధ్య చెడిపెవై యింకొకని గూడెదవా? ఇది దోషము కాదా? ఈ విపరీతమైన దోషము

చేత కీర్తినశించునట్లు మానవునికి భార్యగా భూమిపై కొంతకాలము నివసింపుము. ఓ మతిలేనిదానా! బుధుని పుత్రుడును కాశీరాజును అయిన పురూరవుని భార్యగా నుండుము అనెను. అంతనా యూర్వశి పురూరవుని జేరి అతని భార్యగా నుండెను. అతని పుత్రుడాయువు. ఆతని పుత్రుడు నహుషుడు. ఆ నహుషుడు ప్రఖ్యాతిగా రాజ్యమేలుచు, ఇంద్రుడు వృత్తాంతమును నూరు వేలయేండ్లు పాలించెను. ఇక్కడ అరచంద్రుని వంటి పాలము గలదియు, పద్మదళముల వంటి కన్నులు గలదియు నగు ఊర్వశి భూమియందు చాలా సంవత్సరములుండి శాపాంతమునందు మఱల నింద్రుని పురమును జేరెను.

★★★



# ఏబది యేడవ సర్గము

## వసిష్ఠుడు మైత్రావరుణుడై పుట్టుట:

అని రాముడు చెప్పగా తిరిగి లక్ష్మణుడిట్లనెను. అన్నా! ఆ మునియు రాజును శరీరముల నెట్లు పొందిరో ఆ విధమును తెలియజెప్పవే యని అడుగగా రాముడు తమ్మునితో నిట్లనెను. ఆ మహాత్ములగు మిత్రావరుణుల తేజస్సుల వలన ఆ ఘటము నందు పూర్ణతేజస్సుతో మునివర్యులు జన్మించిరి. ఊర్వశి కారణముగా మిత్రుడు ముందుగా తన తేజస్సును దివ్యఘటమున నుంచెను. తరువాత దానియందే వరుణుడు తన తేజస్సు నుంచెను. ఆ కారణముగా అగస్త్యుడు ముందుగా బుట్టి మిత్రుని జూచి నేను నీ పుత్రుడను గానని చెప్పి వెళ్లెను. మఱికొంత కాలమునకు ఆ కుండనుండి వశిష్ఠుడు జన్మించెను. రెండు తేజస్సుల వలన జన్మించిన కారణమున తాను మైత్రావరుణుడని పేరుగాంచెను. ఆ మహాతేజుని నిక్ష్వాకుడాశ్రయించి ధర్మవిదుడగు అతనిని తన పురోహితునిగా జేసికొనెను. ఇంక నిమిమహారాజు శరరీము ధరించిన విధమును చెప్పెదను తత్వజ్ఞవినుతా వినుము.

## దేవతలు ఋషులు నిమికోరిన వరమునిచ్చుట:

ఆ నిమిరాజు శరీరమును ఋషులు గంధము మాల్యములు, మాలిన్యము లేని వస్త్రములతో అలంకరించి రక్షించుచు యజ్ఞమును పూర్తి చేయగా – భృగుమహర్షి ఆ నిమి ప్రత్యగాత్మతో ఇట్లనెను. ఓ పాపరహితా! నిమీ! నీవేమి వరమును కోరెదవో చెప్పుము. నీ ప్రాణముల నెచ్చట నిల్పమనెదవో చెప్పుము. అనగా అప్పుడు దేవతలును సంతుష్టులై పార్థివశ్రేష్ఠుడా! నీ జీవములనెచ్చట నిల్పమనెదవో కోరుకొనుమనగా ఆ నిమి ఓ దేవతలారా! సమస్త భూతముల దృష్టియందును నిలువవలెనని కోరుచున్నాననెను. వారు అట్లే నీవు వాయురూపముతో నిలువుము. నీ మూలమున భూతములకు కన్నులు తెరచుట మూయుట లుండునని చెప్పిరి. అలసట పోవుటకై భూతజాలములు పలుమారులు రెప్పలు మూయుచుందురని చెప్పి దేవతలు వెళ్లగా మునులు నిమి శరీరమునందు అరణిని జేర్చి పుత్రార్థముగా విధి పూర్వకముగా చిలికిరి. ఆ నిమి శరీరము నుండి మిథియను

రాజు పుట్టెను. మథనము వలన పుట్టుట చేత మిథియయ్యెను. జనన మందుటచే అతడు జనకుడయ్యెను. అతడు విదేహమున పుట్టుటచే వైదేహుడను ఖ్యాతి వహించెను. ఆ మిథిచే నిర్మింపబడుటచే అతని పురము మిథిలానగర మయ్యెనని రామచంద్రుడు చెప్పగా విని లక్ష్మణు డిట్లనెను.

★★★



# ఏబది యెనిమిదవ సర్గము

## శ్రీరాముడు లక్ష్మణునకు యయాతి చరిత్ర చెప్పుట:

ఔరా! చాలా విచిత్రమైన చరిత్రము. ఆ రాజు క్షత్రియుడు. బలశౌర్య ధురంధరుడు. అందును యజ్ఞదీక్షితుడు గదా. కోపమును నిగ్రహించుకొనక యిట్లు వసిష్ఠుని శపించిన కారణమేమియో! శాంతిని కోరడెందులకో! రామచంద్రా! అని యడుగ రాఘవుడిట్లనెను. నాయనా! లక్ష్మణా! కోపము దుస్సహమైనది. ఒక్క యయాతికి దప్ప దాని నణచుకొనుట తక్కిన వారికి శక్యమా? అతడు రాజులందు సత్వగుణ పూర్ణుడు. ఆ యయాతి రాజు యొక్క వృత్తాంతమును పూర్వము జరిగినదానిని చెప్పెదను వినుమని యిట్లు చెప్పసాగెను. నహుషుడను రాజునకు యయాతి యను పుత్రుడుండెను. అతనికి వృషపర్వుడను దైత్యరాజు పుత్రిక శర్మిష్ఠయనునదియు, శుక్రుని కూతురు సుందరాంగి దేవయాని యనునదియు ఇద్దఱు రూపవతులైన భార్యలుండిరి. ఆ సుందరాంగులు దర్పధనులైన పుత్రులను గాంచిరి. పూరుడు శర్మిష్ఠ పుత్రుడు. యదువు దేవయాని కుమారుడు. ఆయయాతి మహారాజు శర్మిష్ఠ మిక్కిలి ప్రియురాలగుటచే ఆమె పుత్రుడగు పూరుని మిక్కిలిగా లాలించుచుండగా యదువు మనస్సులో దుఃఖమును పొంది తల్లి యొద్దకు వెళ్లి శోకముతోను దైన్యముతోను తన మనస్సు నందు ఉన్నదంతయు నిట్లు తెలియజెప్పెను. అమ్మా! నీవు భార్గవుని పుణ్యకులమున పుట్టి రాజు భార్యవై యుండి యిట్టి మహావమానము నెట్లు సహించెదవు? ఈ నింద్యమైన జీవితమేల? వేగముగా రమ్ము. ఇప్పుడే మనమిద్దఱమును అగ్నిలో ప్రవేశింతము. లేదా నీవట్లు చేయవేని నా కాజ్ఞనిమ్ము. నేనైన అగ్నిలో ప్రవేశింతును. తల్లీ! మనమిరువురమును పోయినచో ఈ మహారాజు పీడపోవును. మఱియు ఆ రాక్షసితో మనసార సుఖించును అని యేడ్చుచున్న తనయుని జూచి దేవయానియు కోపముతో తన తండ్రియైన శుక్రుని తలచుకొనగా అతి త్వరగా ఆతడు వచ్చి యేడ్చుచున్న తన పుత్రికను జూచి కూతురా! యేమిటి కిట్లు దైన్యమునందెదవు? అని అడుగగా ఆమె తండ్రీ! ఈ శరీరమును విషముచేగాని, అగ్నిచేగాని నీళ్లయందుగాని విడిచిపెట్టెదను. ఇంక భూమిపై బ్రదుక మనసొప్పకున్నది. అవమానముతో బ్రతుకనేల? బ్రాహ్మణోత్తమా! ఒకనికిచ్చితివి గాని,

ఎప్పుడైనను వచ్చితివా? కీడో మేలో ప్రశ్నించితివా? చచ్చితినో ఉన్నానో నా చరిత్ర వినుటకు నీ మనసొప్పదు గదా. నీవు తెలిసికొన నొల్లనిచో నా కడుపు మంట నీకేమని చెప్పుదును. లోకమున చెట్టెండినచో ఆకులు పూవులు చిగురులు వీటియందమంతయు చెడును గదా. పెద్దవాడవని నీకే సత్కారము చేయనప్పుడు ఇంక నాగతు లేమని చెప్పవచ్చును. ఆ దానవి వలలో పడి పట్టుదలతో నీ యల్లుడు నాతో పలుకకున్నాడు. నా ముఖమైనను చూడడు. నా యింటి చాయనైనను త్రొక్క నిష్టపడడు. ఏమేమియో వినోదములు సలుపుచు ఎల్లప్పుడును ఆ దానవి యింటనే యుండును. తాను రాజు గాన ఆ రాజపుత్రికనే కోరును గాని చుక్కలు లెక్కపెట్టు బాపనవాని పుత్రికను తానేమని కోరును తండ్రీ!

★★★



# ఏబది తొమ్మిదవ సర్గము

## యయాతి పూరునకు వార్ధకమిచ్చి యౌవనము గొనుట:

అని చెప్పగానే శుక్రుడు కోపముతో నెఱ్ఱవడిన నేత్రాంతములు గలవాడై ఆ యయాతితో నిట్లనెను. రాజా! ఇదియేమి? నా పుత్రిక నేలక నన్నవమానించిన నేను సహింతునా? కుమతీ! వెంటనే యౌవనము పోయి డొక్కువై దినములను గడపుమని తిట్టి తన కుమార్తెను ప్రసన్నురాలిని జేసి తన యింటి కేగెను. అంత నారాజు ముసలితనము వచ్చినవాడై విచారించుచు దేవయాని పుత్రుడైన యదువును జూచి కుమారా! విషయ సుఖములందు పూర్తిగా తృప్తి చెందిన వాడును గాను. ఇంకను సుఖింపవలెనను కోరిక కలదు. అందుచే నీ యౌవనము నాకిచ్చి ఈ ముసలితనమును నీవు గ్రహింపు మనగా ఆతడిట్లనెను. రాజా! నీ ముద్దుల కుమారునే నీ ముసలితనమును తీసికొనుమనుము. నే నిందులకా ఉన్నది? తండ్రివై యుండి సుఖములను భవించుపట్ల నన్ను బహిష్కృతుని జేసితివి. చనవుతో ఎక్కడికైనను నన్ను చేరనచ్చితివా? దీనికైనచో తనయుడనైతినా? ఎల్లప్పుడును లాలన చేసి పెంచునట్టి నీ పుత్రుడు పూరుడే నీ ముసలితనమును వహించును గాని నేను దీనిని భరింపను. ఆడుటకు, పాడుటకు, వేడుకల యందు కలియుటకు పూరుడా! ముసలితనము గ్రహించుటకు నేనా! ఆహాహా! ప్రజలను గాపాడునట్టి రాజుకు ఈ విధముగా దాయభాగమును పంచుట ధర్మము గదా అని పల్కగా యయాతి పూరుని నాయనా! నా కొఱకై నీవే నా జరను తీసికొను మని కోరగా ఆతడు నేను ధన్యుడను గదా మహాత్మా! తండ్రి యాజ్ఞను కాదనుటకు నోరువచ్చునా యని పల్కగా ఆ రాజు సంతసించి తన ముసలితనమును ఆ కుమారున కిచ్చి అతని యౌవనమును గ్రహించి యేండ్లును పూండ్లును ఇంతింతనరాని సౌఖ్యసంపదలను పొందుచు నుండి వాటి యందలి కోరిక తీరగానే పుత్రుని జూచి కుమారా! నీ సుందరమైన యౌవనమును ఇల్లడగా నేను తీసికొని దానికి ప్రతిగా నీకడ నా ముసలితనము నుంచితిని గదా. ఇంక నా జరను నీవెతలు తొలగునట్లు నాకిచ్చి వేయుము. గుణములు పరాక్రమము గలవాడా! ఇంతవఱకును నీవు నాయాజ్ఞను పాలించుటచే ఈ భూమికి నిన్ను రాజుగా జేసెదనని ఆ రాజు యదువును

జూచి కోపముతో నిట్లనెను. ఓరీ! దుష్టాత్మకుడా! నీవు పుత్రుడవు గావు ఒక రాక్షసుడవు పుత్రాకృతితో నాయింట జన్మించితివి. నన్ను ధిక్కరించి పలికితివి. ఇది తగునా? రాజ్యాధిపత్యమునకు తప్పుదువు గాక. తండ్రి నను గౌరవముంచక నోటికి వచ్చినట్లు నన్ను ధిక్కరించి పల్కితివి. గాన రాక్షసులను కఠినాత్ములను నీవు పుత్రులుగా పొందగలవు. వినయరహితుడా! నీ సంతానమునకు చంద్రవంశఖ్యాతి కలుగదు. నీవు దుర్వినీతులను గనెదవు. పొమ్ము అనుచు సుశీలుడైన పూరుని భూమికి రాజుగాజేసి ఆత్మజ్ఞానము కలవాడై ఆశ్రమమున కేగెను. అట్లు కొంతకాలము తపస్సంపన్నుడై యుండి స్వర్గస్థుడయ్యెను. అతని పుత్రుడగు పూరుడు రాజై కాశీరాజ్యమును విక్రమముతో పాలించెను. ప్రతిష్ఠానపురమును రాజధానిగా జేసికొనెను. ఆ యదువు తన వంశము నిలుపుటకు క్రూరులైన రాక్షసులను పెక్కుమందిని కనెను. అట్లు బహిష్కరింపబడిన వాడై క్రౌంచవనమున దుర్గభూమి యందు నివసించెను. అధికమైన క్రోధముతో శుక్రుడు శపించినను యయాతి తిరిగి యేమియు అనడయ్యెను. ఆలకించితివా సోదరా? యయాతి శాంతిని, మనలను ఆ నృగుని వంటి దోషమంటకుండునట్లు చూడవలెను. అని చెప్పుచుండగా ఆకాశము ఎఱ్ఱని వస్త్రమును ముసుగుగా ధరించినదో యనునట్లు సంధ్యా రాగముతో గనిపించెను.

★★★



# అరువదవ సర్గము

## చ్యవనాదులు శ్రీరాముని దర్శింపవచ్చుట:

ఆ యన్నదమ్ములిట్లు ముచ్చటించు కొని రాజ్యరక్షణ క్రియలు నిర్వర్తించిన తరువాత కొన్ని దినములు జరుగ అంత అతిచలిగాక, వేడిగాక సౌఖ్యము గలిగించు వసంత రాత్రులు ప్రవేశింపగా ఒకనాటి యుదయమున నిత్య నైమిత్తిక క్రియలను పూర్తిచేసి యేదైన పనిమీద పౌరులు వచ్చిరేమె చూచి రమ్మని సుమంత్రునితో రాముడు చెప్పగా సుమంత్రుడు రాజాజ్ఞ ననుసరించి వెళ్లి చూచివచ్చి యిట్లు చెప్పెను. మహారాజా! చ్యవనుడు మొదలైన మునులు వచ్చి యున్నారట. నిన్నుచూడ వచ్చి ద్వారమునందు నిలిచి యున్నారలు. వారలేదియో కార్యభారము కలిగినట్లున్నారలు. యమునాతీర నివాసులు మిమ్ములను చూడ తొందరపడి మహారాజా! ఆ విమలాత్మకులు మీతో చెప్ప నన్ను బంపినారు. అని చెప్పగా రాముడు వారిని వేగముగా తోడ్కొని రమ్మని చెప్పెను. సుమంత్రుడు రాజాజ్ఞను పొంది మునినాథులకు నమస్కరించెను. కావలివారలు దారినీయగా గొప్పతపస్సుచే ప్రకాశించుచున్న వారందఱును రాజచంద్రుని మందిరము లోనికి తొందరగా ప్రవేశించిరి. గుణభద్రుడైన రాముడా నూర్గురు మునులను తగు విధముగా పూజించెను. అంత నా మునులును సమస్త తీర్థఙులతో నిండిన పాత్రలను, మంచి రుచి వాసన గల ఫల సంచయములను రాజునకిచ్చిరి. వానిని రాముడు ప్రీతితో పుచ్చుకొని మునులారా! నాయందు దయయుంచి మీరు తగిన పీఠములందు గూర్చుండుడనగా వారలు సంతోషముతో గూర్చుండిరి. రాముడు చేతులు జోడించి మునులను జూచి యిట్లనెను. ఓ మునీంద్రులారా! దయతో మీరలే పనికై యిటకు దయచేసితిరో సెలవీయుడు. మీకు దేనిని చేసిన సమ్మతమో ఆజ్ఞాపింపుడు. ఈ రాజ్యమును, ఈ శరీరమును, ఈ యైశ్వర్యమును, ఈ జీవితమును ఇన్నియును బ్రాహ్మణసేవ నిమిత్తమే. చూడుడు. తాపసులారా! సత్యముగా చెప్పుచున్నాను.

★★★

# అరువది యొకటవ సర్గము

## చ్యవనుడు లవణవృత్తాంతమును రామునకు చెప్పుట:

అని రాముడు పలుకగా మేలుమేలని మెచ్చుచు మహర్షులిట్లు పలికిరి. ఓ మహాత్మా! ప్రజలను రక్షించుట యందు నేర్పరి తనము గలవాడా! ఇట్లు పల్కుటకు నీవొకడవు దక్కయే రాజు శక్తి గలవాడగును? ఎందఱో రాజులు మా పని విని కార్యభారమును గుర్తించి యేమియును సమాధానము చెప్పరైరి. ఓ అనఘ గుణాఢ్యా! నీవన్ననో మా కార్యము విధ మావంతయును తెలియక పోయినను బ్రాహ్మణులపైనున్న దయతో చేసెదనని బాస చేసితివి. ఓ కాకుత్థ్సవంశశ్రేష్ఠుడా! కావున నీవే మా కార్యమును చేయనేర్తువు. మా మాటలను విని మాకు కలిగిన భయమును మాన్పి సౌఖ్యమును పొందజేయుము. అనగా రాముడిట్లనెను. మౌనులారా! మీకు కల్గిన భయమేదియో తెల్పితి రేని దానిని తీర్చెదను అనగా మిక్కిలి నిష్ఠగల మౌని చ్యవనుడిట్లు చెప్పెను. రామచంద్రా! మొదటి యుగము నందు లోలయొక్క జ్యేష్ఠ పుత్రుడు మహాబలశాలి మధుదైత్యుడనువాడు బ్రాహ్మణులకు శరణ్యుడైయుండెను. అతడు పరిశుద్ధమైన బుద్ధితో నిష్ఠతో దేవతా తతులను బూజించి వారి దయను బడసి గౌరీపతి మెచ్చునట్లు చాలా సంవత్సరములు గొప్పతపస్సును జేసెను. అంత ఆ తపస్సునకు మెచ్చుకొని శంకరుడు గౌరవింపబడినదియు, గొప్ప ప్రకాశము గలదియు అపరిమితమైన బలము గలదియు అయిన ఒక శూలమును తన శూలము నుండి లాగి ప్రీతితో అతని కిచ్చుచు నిట్లు చెప్పెను. ఋషీశ్వరులయందును దేవతలయందును భక్తితో నుండి సచ్చరితుడవై తపస్సు చేయుటచే నిన్ను మెచ్చి దీనినిచ్చుచున్నాను. విరోధమును బూని నీవు బ్రాహ్మణులను దేవతా సంఘములను బాధించితి వేని తీవ్రమైన యీ యాయుధము పనిచేయదు. వృథా అయిపోవును. నీతో ఎవరైనను యుద్ధమునకు వచ్చినచో నిది వానిని నేలగూల్చి యధావిధిగా నీ చేతికి వచ్చి చేరును. అని చెప్పగా శంకరునితో దానవుడిట్లనెను. ఓ శివా! దేవేంద్ర వంద్యా! ఈ మహాసాధనమును నా వంశమునందే ఎల్లప్పుడు నుండనిమ్ము అని కోరగా శంకరుడు అట్లు కాదు కాని నీ పుత్రుని యొద్ద మాత్రమే

నిల్చునట్లు ఇచ్చుచున్నాను. అని చెప్పగా ఆ మధుడట్లే యని తన గృహమునకు వచ్చి దానిని గొప్ప అర్చనా విధులచే ప్రతినిత్యమును పూజించుచుండెను. అతడా శూలము కొఱకు పెద్ద మందిరమును నిర్మించెను. ఆ మధుడు విశ్రవసుని వంశమందు బుట్టిన అనలుడను వాని పుత్రిక యగు కుంభీనసి యను పేరు గలదానిని భార్యగా వరించెను. అతనికి ఇంద్రుని భయపెట్టగలవాడగు లవణుడను పుత్రుడు గలిగెను. భయంకర శీలుడైన ఆ మధుపుత్రుడు చిన్ననాటి నుండియు దుష్టుడై ఎన్నో పాపకార్యముల నెల్లప్పుడును చేయుచుండెను. నీతి దప్పిన నందనుని జూచి మధుడు అతివ్యథ చెందియు, కోపగించియు, కన్న కుమారుడౌటచే నేదియు గాదనక యూరకుండెను. పుత్రునకాశూలము యొక్క మహిమను జెప్పి తండ్రి యీ లోకమును విడచి వరుణుని నివాసమున కేగెను. అప్పటి నుండి కల్మష హృదయుడగు ఆ లవణుడు ఆ సాధనము యొక్క శక్తిచే జగములను బాధించుచున్నాడు. అందునను తాపసులన్న ఆ పాపాత్మునకు పేలపిండి వలె నుండెను. రామభద్రా! ఆ శూలము విధమును వాని శక్తిని వింటివి గదా! ఓ సూర్యవంశ్యా! పరమపురుషా మాకింక నీవే గతివి. ఈ క్రూర చరిత్రుని భయముచే బాధనొందించు వీరులైన రాజులెందఱినో వీనిని మధింపుడని కోరితిమయ్యా! కానీ ఒక్కరైనను ధైర్యముతో వాని నెదుర్కొనుటకు తెగించరైరి. నీచే రావణుడు వధింపబడెనని విని సంతోషముతో ఇక నీవే గతి యని మనస్సులందు తలంచి యిచ్చటికి వచ్చితిమి. ఓ రాజా! మాకెల్లప్పుడును త్రాతవు నీవే. ఆ రాక్షస శ్రేష్ఠుడగు లవణుని చంప సమకట్టి మాపై కరుణ జూపుము. మాకు కలిగిన ఆపద యిది. ఇక ఆ రాక్షసుని చంపుటకు మా కోరిక తీర్చుటకు నీకంటే ఇతరుడెవ్వడును లేడు అని మునులు దెల్పగా రాముడు వారితో నిట్లనెను.

★★★



# అరువది రెండవ సర్గము

## శ్రీరాముడు మౌనులను లవణుని యాచారాదుల నడుగుట:

మౌనులారా! ఆ రాక్షసుని ఆచారాహారాదు లెట్లుండును? ఎచ్చట సంచరించును? ఓ సదాచారులారా! చెప్పుడు. ఆ నీచుని వధించి మీకు నెమ్మదిని గలుగజేయుదును అని చెప్పగా రాముని జూచి మౌనులు వాని యాచారము రౌద్రము. జంతుజాలములన్నియు వాని యాహారము. అందు మునులు ముఖ్యులు. మనుజులు, పెద్దపులులు, మృగములు, ఏనుగులు మున్నగువానిని ప్రతిదినమున వేలకు వేలుగా చంపి భక్షించుచుండును. అతని నివాసము మధువనమను ప్రదేశము. రాజా! ప్రళయకాలమున యముడు ప్రజలనెల్ల మ్రింగెడు విధముగా అచ్చటచ్చటనున్న సత్వములను నోరు దెరచి మ్రింగుచుండునని చెప్పగా రామచంద్రుడా మౌనులతో మునులారా! భయమును వదలుడు. ఆ రాక్షసుని యుద్ధమున సంహరించెదను అని చెప్పుచు తన తమ్ములను జూచి మదముతో నున్న ఆ లవణుని జంపుటకు వెళ్లునట్టి వంతును మీలో నెవ్వరు పుచ్చుకొందురు సోదరులారా!

## శత్రుఘ్నుడు తాను లవణుని జంపబోయెద ననుట:

భరత శత్రుఘ్నులందీ భాగమున వహింపనెవ్వరు కోరు వారని ప్రశ్నింపగా భరతుడు సంతోషముతో లేచి యిట్లనెను. అన్నా! నేనుండగా బాలుడైన లక్ష్మణ సోదరుని పంప దలంపదగునా? ఆ వీరుడైన లవణుని జంపుట నా వంతుగా విడువు డనగా శత్రుఘ్నుడా మాటల నాలించి మహావినయముతో రాజుతో నిట్లనెను. అన్నా! మీ రడవుల యందుండగా మీరు వచ్చునంత వఱకు శూన్యమగు అయోధ్యను పాలించెను. అధికమైన సంతాపముచే నేవిధమైన సుఖమును తానెఱుగడు. ఇన్ని అన్నియని చెప్పరాని వ్యసనముల ననుభవించెను. దుఃఖకరమైన పడకపై పరుండెను. ఫలములను దుంపలను తినెను. జడలను ధరించెను. మంచి వస్త్రములను మాని నార చీరలను ధరించెను. నీ కారణమున దుఃఖపడెను. ఇప్పుడైనను సౌఖ్యములననుభవింప వలదా? నేనెల్లప్పుడును బంటునై యుండగా భరతుని కష్టపెట్టదగునా?

## శ్రీరాముడు లవణు జంపి మధురాపురి నేల శత్రుఘ్నునాజ్ఞాపించుట:

శత్రుఘ్నుడిట్లు చెప్పగా రాముడిట్లనెను. మహాభుజా! అట్లే యగుగాక. నా ఆజ్ఞతో నీవు వెళ్లుము. దేవతావిరోధి యైన మధుని పురంబున నిన్నభిషిక్తుని జేసెదను. నీ ఇష్టము చొప్పున కైక పుత్రుడిందే నిలువనిమ్ము. రణదక్షుడవైన నీవు రాక్షసుని వధించి అచ్చట మేలైన పట్టణమును నిర్మించుకొని యందే నీవు రాజ్యముచేయుచు నెమ్మదిగా నుండుము. శత్రువును సంహరించి రాజ్యమును సంగ్రహించి యందు రాజు నుంచనివాడు నరకమున కేగును. ఏదియును బదులు చెప్పకుము. చిన్నవాడు జ్యేష్ఠున కెదురు చెప్పరాదు. అతడేది చెప్పిన దానిని చేయదగును. ఇదియే తగు సమయము. నేడే అభిషేకమును పొందుము. బ్రాహ్మణశ్రేష్ఠులగు వసిష్ఠాదులు తగిన విధముగా నీకభిషేకమును జేసెదరు. అని చెప్పగా సిగ్గు జెంది శత్రుఘ్నుడు శిరస్సు వంచి అల్లనల్లన అన్నతో నిట్లనెను.

★★★



# అరువది మూడవ సర్గము

## పట్టాభిషేకమొల్లక శత్రుఘ్నుడు పరితపించుట:

అన్నా! జ్యేష్ఠుడుండగా పిన్నవానికి అభిషేకము తగునా? ధర్మమా? నీ శాసనమును దాటరాదు గాన నీమాట ప్రకారముగా ఇప్పుడు వెళ్లెదను. జ్యేష్ఠున కెదురాడ రాదని నీచేతను, వేదములందును నేను వింటిని. వినియు తెలిసియు విపరీత బుద్ధిచే భరతుని గాదని నేనే లవణుని యుద్ధమున వధింతునని పలికితిని. ఓ అనఘ చరితా! ఆ చెడుమాటయే నాకిట్టి దుర్గతిని గలిగింప హేతువయ్యెను. వెనుక చింతించుట వెఱ్ఱితనము. చేసిన పనికి ఈ శిక్ష చాలును. ఓ నిశ్చలాత్మా! నీకు మాఱు పలుకజాలను. నాకు రెండవ శిక్ష కలుగకుండును గాక. ఒక మనవి వినుము. రఘురామా! నేను రాజ్యమును కోరను. శత్రు సమూహములను చీల్చి చెండాడిన వాడా! నీ మాటను నెఱవేర్పబోయెదను. ఓ కరుణామయా! అధర్మము నన్నంటకుండ కరుణతో కావుము అని చెప్పగా రామచంద్రుడు సంతసించి లక్ష్మణుని వంక జూచి యిట్లనెను.

## శ్రీరాముడు శత్రుఘ్నుని మధుర కభిషిక్తుని జేయుట:

నీవును భరతుడును మనపురజనులను, మంత్రులను, బ్రాహ్మణులను, పురోహితులను వేగముగా ఇచ్చటికి పిలువబంపుడు అనగా వారలు అట్లే అందఱిని పిలుచుటకు భటులను బంపగా వారి వెంట త్వరగా వారు రాగా విధియుక్తముగా అతిబలశాలియైన ఆ సుమిత్రాపుత్రునకు ప్రేమతో అభిషేకము చేయగా పూర్వమింద్రాదులచే నభిషేకింపబడిన కుమారస్వామి వలె అతడు శ్రీమహితుడై జనులెల్లరు పొగడగా తేజస్సుతో వెలిగెను. పౌరులు సంతోషించుచుండగా బ్రాహ్మణులు ఆనందింపగా ముగ్గురు తల్లులు మనస్సులందు సంతోషించుచు దీవింపగా తేజరిల్లుచున్న సుమిత్రాసుతుని జూచి యమునా తీరవాసులగు మునులు ఇక లవణాసురుడు చచ్చినవాడే యనుచు మనస్సులందు సంతోషించగా నెమ్మదిగా విరోధులను మర్దించువాడగు రాముడు శత్రుఘ్నుని తన యొడియందు జేర్చి యిట్లు చెప్పెను.

## శ్రీరాముడు శత్రుఘ్ననకు నారాయణాస్త్రమొసంగి లవణుని జంపు నుపాయము దెల్పుట:

అన్నా! శత్రుఘ్నా! దివ్యమైన యీ యాయుధమునుచే కొనుము. లవణుని దీని చేతనే వధించెదవు. పూర్వము మహాసముద్రమున స్వయంభువైన దేవుడు జయింపబడనివాడు సర్వదేవతలకు సకల రాక్షసులకు ఎల్లభూతావళులకు కనబడకుండ శయనించి యున్నవేళ ఉగ్రమైన క్రోధముతో మధుకైటభులను ద్రుంచుటకును, సర్వరాక్షసులను యుద్ధములో సంహరించుటకు దీనిని సృజించెను. ముందుగా మూడు లోకములను సృష్టించుటకై మధుకైటభులను జంపి జనుల భోగములకై ఈ శరశక్తితో జగములను సృష్టిచేసెను. వీరవర్యా! దీని మహిమను వింటివా? రావణుని జంపదలంచియు భూతజాలములకు బాధ కలిగించునని నేను దీని నాతనిపై వేయలేదు. లవణాసురుడు శంకరదత్తమైన శూలమును ఇంటి యందు పూజకై యుంచి తాను పురమును వీడి ఇష్టము వచ్చిన విధముగా ఆహారమునకై వెళ్లును. శత్రువు తన్ను యుద్ధమునకు బిల్చినచో శూలమును పట్టుకొని వచ్చును. కాన నీ వాలవణుడు పురమును విడిచి ఆహారమునకై స్వేచ్ఛగా సంచరించు సమయమున అతనిని యుద్ధమునకు బిలిచి శౌర్యముతో నిరోధింపుము. పురద్వారము నిలిచి ఆ దేవతా విరోధిపురమున ప్రవేశింపకుండ యుద్ధమునకు పిలిచినచో అతడు నీ బలముచే చచ్చును గాని ఇతర విధమున అతనిని జంప శక్యము గాదు. పార్వతీపతి యిచ్చిన శూలము జయింపరాని దగుటచే ఆ రాక్షసుడు దానిని చేత ధరింపని సమయమున అతనిని పరిమార్చుమని ప్రబోధించెను. మఱియు నిట్లనెను. నీవు నూఱు ఏనుగులను, రెండువేల రథములను, నాలుగు వేల గుఱ్ఱములను, నానాపదార్థములుండు అంగళ్లను, నటులను, నర్తకులను, లక్షసువర్ణములను వెంట తీసికొని వెళ్లుము. భటులకు జీతములను బత్తెములను ఇచ్చి మంచి మాటలతోను దానములచేతను సంతోషమును గలిగింపుము. అచ్చటనున్న వారలకు భార్యలో, పుత్రులో, అయినవారలో, పదార్థ సంతతులో యేవియును లేకపోవుటను గుర్తించి ఓ గుణివతంసమా! నీవే వారికి మంచి మాటలతో సంతోషము కలిగింపుము. ముందుగా సైన్యమును బంపుము. అది ఇంకను గ్రీష్మము మిగిలియుండగనే గంగను దాటుగాక. సుఖముగా ఆవలి యొడ్డు చేరి అందందు తగినచోటు లందా బలము విడిసి యుండ తరువాత నీవు చాపమును చేతబట్టి యొక్కడవే యెవ్వరికిని దెలియరాకుండ వేగముగా వెళ్లుము. ఆ దుర్మార్గుడు రవంతయైనను మనస్సు నందు సందేహపడరాదు.

ఈ మునులందఱు ముందుగా బలములతో గలిసి వెళ్లెదరు. సైన్యము జాహ్నవీ తీరమున నిలిచియుండగా నీవు ముందుగా విల్లు చేబూని వెళ్లదగును. విరోధి వచ్చుచున్నాడను వార్త తెలియగానే లవణుడు శూలమును చేత బట్టి శత్రువుల మదమణచును. ఈ వేసవికాలమును వెళ్లనిమ్ము. వర్షాకాలము రాగానే అతనిని సంహరింపుము. వానకాలమున యుద్ధమున కెవ్వడు వచ్చును లెమ్మను తలంపుతో అతడు శూలము లేక ఒంటిగా సంచరించుచుండును అని అన్న చెప్పగా

★★★



# అరువది నాలుగవ సర్గము

## శత్రుఘ్నుడు సేనలను ముందుబంపి తానొంటిగా లవణుపై బోవుట:

అన్న మాటలను విని శత్రుఘ్నుడు సేనాపతులను వేగముగా బిలిపించి యిట్లు చెప్పెను. సైన్యములు విడియ దగిన చోటులు మీకు తెలిసినవియే గదా. ఇంకా చెప్పనేల? మీరలు సేనలతో వేగముగా వెళ్లి దిగుటకు యోగ్యమైన తావులందు విడియుడు. అచ్చటనున్న ప్రజలనేమియు బాధింపకుడు వెళ్లుడని మంచి చరిత్ర గల శత్రుఘ్నుడు వారిని బంపి తరువాత తాను ముగ్గురమ్మల పాదముల వ్రాలి నమస్సరించి రామచంద్రునకు ప్రదక్షిణము చేసి శిరస్సు పాదములకు దగులునట్లు మ్రొక్కి లక్ష్మణునకు భరతునకు నమస్కారము చేసి, చేతులు జోడించి భక్తితో వసిష్ఠునకు నమస్కారములు చేసి సెలవు పొంది బయలుదేరి వెళ్లెను. గుఱ్ఱములు, రథములు, ఏనుగులు, కాల్బలము గల గొప్ప సైన్యమును ముందుగా బంపి తాను పురమునందొక నెలదినములుండి తల్లులకు, అన్నలకు, పురోహితునకు మ్రొక్కి వారి యనుజ్ఞ నొంది వేగముగా ఒక్కడే బయలుదేరి ఆ లక్ష్మణానుజుడు రెండు రాత్రులు త్రోవలో గడపి

## శత్రుఘ్నుడు వాల్మీకి ఆశ్రమము చేరుట:

అత్యంత పుణ్యమైన వాల్మీకి యాశ్రమము చేరి మునిశ్రేష్ఠునకు నమస్కరించి దోసిలొగ్గి మౌనీంద్రా! అన్న మాటచే నేను వెళ్లుచు ఇటు వచ్చియున్నాడను. మీ క్రియలకు హాని కలుగకున్నచో ఈ రాత్రి యిక్కడ నిలువ గోరుచున్నాను. తెల్లవారగానే పడమటి దిక్కుగా నా దారిని నేను వేగముగా వెళ్లెదను మునిచంద్రా! అని చెప్పగా ఆ రాజపుత్రుని మాటలను విని ముని చిరునవ్వుతో రాజా! నీకు స్వాగతము. పరస్థలముగా పల్కుచున్నావే. రఘువరులకిది సొంత సొమ్ముగా మనమున నూహింపుము. అని చెప్పి పాద్యమును, అర్ఘ్యమును ఆసనము నొసగగా అతడు సంతోషించి శ్రేష్ఠమైన ఫలములను తనివి దీర భుజించి సంతసముతో మునీంద్రునితో నిట్లనెను. ఓ మౌనీ! ఈ యాశ్రమ సమీపమున నెవ్వరో యాగము చేసిన గురుతులు గనబడుచున్నవి. అతడెవ్వడో చెప్పుమనగా వాల్మీకి యిట్లనెను.

★★★

# అరువది యైదవ సర్గము

## వాల్మీకి శత్రుఘ్ననకు సౌదాసు చరిత్ర దెలుపుట:

గుణనిధీ! సత్త్వధనుడైన మీ పూర్వీకుడొకడు సుదాసుడను రాజుండెను. ఆ సుదాసునకు పరిశుద్ధ చరిత్రగలవాడగు వీరసహుడను కుమారుడు గలడు. అతడు చిన్నతనము నందే వేటకై అడవికి పలుమారులు పోయి వచ్చుచుండెను. ఇద్దఱు రాక్షసులు పులుల రూపము ధరించి అరణ్య మందలి మృగములను చంపి తినుటచే ఆ వనప్రదేశ మంతయును మృగములు లేనిదయ్యెను. అది చూచి సౌదాసుడాగ్రహముతో క్రూరమైన బాణముతో అందొక్కనిని ద్రుంచెను. ఆ చచ్చిన వానిని చూచి తోటివాడు అమితమైన శోకముతో ఇట్లు పలికెను. దోషమేమియు లేకుండ నాతోటి వానిని జంపుట న్యాయమగునా? దీనికి మారుగా నేను నీకు కీడును గలుగజేసెదను. చూచుచుండుమని పలికి కనబడకుండ వెళ్లెను. తరువాత కొంతకాలమునకు ఆ మిత్రసహుడు రాజ్యభారమును వహించెను. [వీరసహునకే మిత్రసహుడని నామాంతరము] ఆ రాజు అశ్వమేథమను యజ్ఞము నిచ్చటనే చేయుచుండ వసిష్ఠుడు దానిని నిర్వహించుచుండెను. ఆ యజ్ఞము పూర్తియగు సమయమున ఆ రాక్షసుడు పూర్వ విరోధమును మనస్సునందు తలచుకొని వసిష్ఠుని రూపము ధరించి రాజా! నాకిప్పుడు మాంసముతో గూడిన యన్నమును బెట్టుమని కోరెను. సౌదాసుడు వంటలవానిని జూచి తొందరగా మాంసభోజనమును పురోహితునకు తృప్తి గలుగునట్లు సిద్ధము చేయుమని చెప్పగా అతడు ఈ మాటలకు విభ్రాంతి నొందెను. అంత ఆ రాక్షసుడే వంటల వాని వేషమును ధరించి మనుష్య మాంసమును తీసికొని వచ్చి రాజా! ఇది రుచికరమైన హవిష్యము. మాంసముతో గూడిన మనోహరమైన దీనిని తిని ముని మునస్సునందు మెచ్చుకొనెను అని చెప్పగా ఆ యాహారమును రాజు భార్యాసహితుడై మనస్సు నందు కల్మషమేమియు లేనివాడై గురునకు భుజింప నిచ్చెను.

## వశిష్ఠుడు సౌదాసుని శపించుట:

పాత్రయందుంచిన యా భోజనమును వశిష్ఠుడు మనుష్య మాంసముగా మనస్సు నందు తెలిసికొని రాజా! నీ వేది నాకు పెట్టితివో నిజముగా నీకదియే భోజనమగు

గాక అని శపించగా రోషముతో సౌదాసుడు మునిని శపించెదనని నీటిని చేతిలోనికి తీసికొనెను. అప్పుడతని భార్యయైన మదయంతి తన ప్రాణేశ్వరునితో నిట్లనెను. ఓ రాజా! భగవంతుడగు వశిష్ఠుని శపించుట నీకు తగునా? అనగా ఆ కాంత మాటలను విని పట్టుదలను వీడి ఆ రాజు రోషముచే ప్రజ్వలించి తేజోబలముతో నిండిన ఆ జలమును తన పాదములందు విడిచెను. ఆ తేజస్సు సోకుటచే ఆ భూమీంద్రుని పాదములు కమలిన వయ్యెను. అది మొదలుగా అతడు కల్మాషపాదుడను పేర ప్రఖ్యాతి వడసెను. ఆ రాజు తాను భార్యాసహితుడై తాను నిర్దోషినని వేయి విధములుగా ఆ మహర్షిని వేడుకొనెను. ఆ రాజు వ్యాపారము రాక్షసుని పని యని తెలిసికొని రాజా! నేను పల్కిన వాక్యములను త్రిప్పుట శక్యముగాని పని. నీకొక వరమునిచ్చుచున్నాను. దానిచే నూరడిల్లుము. ఓ రాజవర్యా! పండ్రెండు సంవత్సరము లీ శాపమును సహింపుము. తరువాత శాపవిముక్తి యగును. మనస్సునందు పూర్వ చరిత్రను మరచెదవు. అని ముని చెప్పగా రాజట్లే యని శాపమును సహించి తరువాత తన పట్టణమును జేరి ప్రజాపరిపాలనాసక్తుడై యుండెను. రాజపుత్రా! అతడు యజ్ఞము చేసినది యీ ప్రదేశమని ముని చెప్పగా సుమిత్రా సుతుడు సంతోషము నంది భక్తితో ముని నాథునకు మ్రొక్కి పర్ణశాలలోనికి బ్రవేశించెను.

★★★



# అరువది యాఱవ సర్గము

## సీతాదేవి కుమారుల గనుట:

ఆ రామసహోదరుడై రాత్రి యందు పర్ణశాల యందుండెనో ఆ రాత్రియందే భూపుత్రియైన సీతాదేవియు ఇద్దఱు పుత్రులను కవలలను గనెను. సీతాదేవిని సంరక్షించుచున్న తాపసస్త్రీలు అర్ధరాత్రివేళ వచ్చి వాల్మీకిని జూచి మునీంద్రా! రామచంద్రుని భార్య యిద్దఱు పుత్రులను గన్నది. బాల చంద్రుల వంటి ఆ బాలకులను భూతములు సోకకుండ కాపాడుమని చెప్పగా ముని వెళ్లి జనకపుత్రిక యొక్క పుత్రులను జూచి భూతములు నశించునట్టి మంత్రములను జదివి వేగముగా మంత్రపూతమైన దర్భలను వృద్ధతాపస స్త్రీలకిచ్చి కొనలతో ఒక పుత్రునికి, ఆదర్భల మొదళ్లచే మఱియొక పుత్రునికి మార్జనము చేయుడని చెప్పి పంపించెను. ఆ కారణము చేత కుశుడను పేరొకని కిచ్చి లవుడను పేరింకొకని కిచ్చి మౌని ఈ కవలలు ఇద్దఱును ఇప్పటినుండి కుశలవులనెడి పేర్లతో బరగెదరు. ఇదియే వీరలకు నామకరణమని చెప్పగా మునిపత్నులా రక్షను తీసికొని వెళ్లి ఆ విధముగా మార్జన మొనరించిరి. ఆ రాత్రి శత్రుఘ్నుడు ఆ ముని భార్యల మాటలను విని భూపుత్రి కవలలను గనెనా? ఎంత అదృష్టము తల్లీ! అని పలికెను. నెడతెగని సంతోషము నందుచుండగా సూర్యుడుదయించెను. శ్రావణమాసపు రాత్రి గడచెను. ఉదయము చేయవలసిన కార్యముల నన్నిటిని పూర్తిచేసి ముని చంద్రునకు మ్రొక్కి మహావేగముతో శత్రుఘ్నుడు ఏడు రాత్రులను దారిలో గడపి ముని సంఘములను జూచెను.

★★★

# అఱువది యేడవ సర్గము

## శత్రుఘ్నునకు చ్యవనుడు లవణునిచే మాంధాత మడిసిన విధము తెల్పుట:

భార్గవుడు మొదలుగా గల తపస్వుల ఆశ్రమములందుండి మౌనులు చెప్పుచున్న చిత్రమైన కథలను వినుచు శత్రుఘ్నుడు ఆ రాత్రి గడపుచు భార్గవుని నిట్టులడిగెను. మహానుభావా! చ్యవనమహర్షీ! శంకరుడిచ్చిన శూలమును బట్టి లవణుడు యుద్ధము లందు పూర్వము రాజులనెందఱినో సంహరించెనా? ఆ లవణుని బలమును శూలము శక్తిని చెప్పుమని కోరగా చ్యవనుడు రామసోదరుని జూచి ప్రీతితో రాజవరా! ఎందఱో రాజులు సంహరింపబడిరి. ఆ కథలన్నియు నేమిటికి? ఇక్ష్వాకు వంశజుడు, మిక్కిలి బలము గలవాడు, యువనాశ్వనందనుడు గొప్ప శౌర్యము గలవాడు మాంధాత యని ప్రఖ్యాతి చెందిన రాజు భూచక్రము నంతయును తన యాజ్ఞయందుంచుకొని స్వర్గమును జయించు కోరికతో దేవలోకమునకు వెళ్లెను. ఇంద్రునితో గూడ అతని అర్ధాసనమున గూర్చుండి దేవతలు నమస్కరించుచుండగా తేజరిల్ల గోరు అతని పాపపు కోరికను తెలిసికొని మంచి మాటలతో అతనితో నింద్రుడిట్లనెను. రాజేంద్రా! ఇదియేమి? నీయాజ్ఞ భూమియందే చెల్లదుగదా! స్వర్గమున కేల వచ్చితివి? నీవు భూలోకమంతయు నేల గలిగియున్నచో నీ సైన్యములతో స్వర్గమునకు రమ్ము అని చెప్పగా మాంధాతృ మహారాజు సిగ్గుపడి తలవంచుకొని యిట్లనెను. ఓ యింద్రా! భూమియందెచ్చట నా యాజ్ఞ చెల్లుట లేదో చెప్పుమనగా ఇంద్రుడు లవణుడను మాంసభక్షకుడు మధువనమున నున్నాడు మానవనాథా! అతని యందు నీయాజ్ఞ చెల్లుచున్నదా? చెప్పుము అనగానే

## మాంధాత లవణునిచే హతుడగుట:

ఘోరమైన వినరాని మాటలనిట్లు ఇంద్రుడు పల్కగా సిగ్గు నంది రాజచంద్రుడు తిరిగి వచ్చెదనని చెప్పి వెనుదిరిగి సెలవు గైకొని శూలము ధరించిన యా రాక్షసుని గెలువగోరి తన పురమును చేరనేగి ఒక దూతను వేగముగా లవణు నొద్దకు బంపెను. అక్కడ ఆ దూత అధికముగా ప్రేలగా క్రోధముతో లవణుడు వానిని సంహరించి భక్షించెను. అచ్చట

మాంధాతృ మహారాజు చాలా కాలమైనను దూత తిరిగి రాకపోవుటచే తానే వెళ్లి లవణునితో దలపడి వానిని బాణవర్షముతో ముంపగా ఆ రాక్షసుడు సైన్యము మీదను రాజుమీదను తన శూలమును వేసెను. అది రాజుతో గూడ అతని సైన్యమును తగులబెట్టి బూడిదగా జేసి వచ్చి రాక్షసనాథుని చేత నిలిచెను. ఓ భవ్యచరిత్రా! ఆ శూలాయుధము మహిమ సాటిలేనిది. ఓ శూరశ్రేష్ఠుడా తెల్లవారగనే శూలము నింటియందుంచి ఆహారమునకై వనములలో సంచరించుచుండగా నీవు దుర్వారమైన పరాక్రమమతో వానిని వధించెదవు అని చెప్పుచుండగా అంతట తూర్పుదిక్కు ప్రకాశము నొందెను.

★★★



# అఱువది యెనిమిదవ సర్గము

## శత్రుఘ్నుడు లవణుని పురములోనికి బోకుండ నిరోధించుట:

ఆ వేకువనే రాక్షసుడాహారకాంక్షచే పురము వీడి వనముల కేగెను. అంతట దాశరథి యమునానదిని దాటి ఆ రాక్షసుని పురము వాకిట విల్లు బాణములు చేత ధరించి కాచి యుండెను. సూర్యుడాకాశ మధ్యమునకు వచ్చి ప్రకాశించుచుండ క్రూరుడైన ఆ రాక్షసుడు అనేక మృగములను వధించి మోచికొని ఆ భారముతో వచ్చి పట్టణపు వాకిట నున్న లక్ష్మణ సోదరుని జూచి ఏరా! ఇచ్చట విల్లు బాణములు పట్టి యే కార్యమును చేసెదవు? ఈ విధము నీవు నా నోటిలోనికి వచ్చి ప్రవేశించుట వలన నాకాహారము సంపూర్ణమైనది అని బిగ్గరగా నవుచున్న రాక్షసాధముని జూచి సుమిత్రా సుతుడు పెద్ద క్రోధమున కన్నుల నీరు పొంగ శరీరము నుండి అగ్నిజ్వాలలు వెలువడుచుండగా నిట్లనెను. దురాత్మా! నిన్నెదిరించి యుద్ధము చేయ వచ్చియున్నాడను. దశరథ తనయుడను. రామునకు సోదరుడను. ఓ రాక్షసుడా! వినరా! నేను శత్రుఘ్నుడను. జనులను రక్షించువాడను. నిత్యశత్రుఘ్నుడను. కావున నీతో ద్వంద్వయుద్ధము చేయు కోరికతో వచ్చియున్నాడను. నీ చావు నిజము అని చెప్పగాపరిహాసముతోవికసించినముఖముగలవాడైఆరాక్షసుడుఆగ్రహముతోక్రూరుడా! ఆ రావణుడు నా తల్లి తోడబుట్టినవాడు. స్త్రీనిమిత్తముగా రాముడతనిని సంహరించెను. నేను మునుపటి వారలను, ఇప్పటివారలను రాజులనెందఱినో సంహరించితిని. తక్కిన వారిని మనస్సున లెక్కచేయక తృణీకరించితిని సుమా. అందులకే శాంతి వహించి కదలకుండ నుంటిని. రావణుని వంశమంతయును యుద్ధమున సంహరింపబడుటను వినియు సహించితిని. ఇచ్చటికి నీ యంతట నీవే యుద్ధమునకు వచ్చితివా? నేను శూలమును వేగముగా తీసికొని వత్తును. ఒక్కింతసేపు తాళు మనగా రాజపుత్రుడు నవ్వి ఓరీ! నేను ప్రాణములతో నుండగా నీవెట్లు శూలమును తీసికొనబోయెదవు? శత్రువు తలవని తలంపుగా గనబడినచో విడిచిపెట్టు మూర్ఖుడు భూమియందు గలడా? ఓ దుష్టాత్మా! నీవు జగములకే శత్రువు. నీ కవకాశమీయదగునా?

★★★

# అఱువది తొమ్మిదవ సర్గము

## లవణ శత్రుఘ్నుల యుద్ధము:

అని శత్రుఘ్నుడు పల్కగా మధుపుత్రుడట్ట హాసమొనర్చి చేతిని చేతితో నలిపి పండ్లు పటపట గొరుకుచు రాజపుత్రుని యుద్ధమునకు బిలువుగా అతడిట్లనెను. ఓరీ! నీవు పూర్వము గెలిచిన రాజులలోని వానిగా నన్ను తలంచవలదు. నిన్ను సంహరించి ఋషులను భయములేని వారినిగా జేసెదను. నాయొక్క క్రూరమైన బాణాగ్ని బడిన నిన్ను, రావణుని దేవతలు కన్నులార జూచినట్లుగా, బ్రాహ్మణులును, భూజనులును చూచెదరు గాక. నేడు మొదలుగా ఊళ్లును, పల్లెలును బాధలను విడిచి క్షేమమందును గాక. నాచే విడువబడిన వాడి బాణముల వరుసలు వజ్రాయుధముతో సమానమైనవి సూర్యకిరణములు పద్మములోనికి ప్రవేశించు విధముగా అతివేగముతో నీయొక్క హృదయమున బ్రవేశించును దుష్టుడా! చూడుము అనుచుండగా ఆ మధుపుత్రుడు రాజపుత్రునిపై ఒక పెద్ద వృక్షమును వేసెను. దానిని నూఱు ముక్కలుగా శత్రుఘ్నుడు ఖండించి భూమిపై బడవేయగా దానవుడు క్రోధముతో అతనిపై చెట్ల వర్షమును గురిపించెను. ఆ రాజపుత్రుడు వాడి బాణముల వరుసలచే వాటిని పడగొట్టెను. ఇట్లైనను రాక్షసుడౌద్ధత్యముతో ఒక చెట్టుతో రాజు శిరస్సును నొప్పించెను. ఆ దెబ్బతో శత్రుఘ్నుడు తన శరీరమునందలి సంధులన్నియు సడలగా బలము నశించి మూర్చిల్లి నేలపైబడెను. అట్లు సుమిత్రాసుతుడు నేల పడగానే ఆకాశమున దేవతలు, చారణులు, గంధర్వులు, ఋషిసంఘములును, అప్సరసలును భయపడి హాహాకారములు చేయగా రాక్షసుడు శత్రువు సంహరింపబడెనని మనస్సు నందు తలంచి లక్ష్యము చేయక అవకాశము లభించినను శూలమును సంగ్రహించు యత్నమును చేయడయ్యెను. తాను తెచ్చిన మృగములను తీసికొనుచుండగా ఒక ముహూర్తకాలమున శత్రుఘ్నుడు మూర్చదేరి మునులు సంతోషమునందగా లేచి

## శత్రుఘ్నుడు లవణుని వధించుట:

శత్రువు నెదిరించి వజ్రముఖము గలదియు, వజ్రవేగము గలదియు మేరు మందర పర్వతములతో సమానమైనదియు, వంగిన కణుపులు గలదియు, తీక్ష్ణమైనదియు,

ఎదురులేనిదియు రక్తచందనముతో అలంకరింపబడినదియు, అందమైన రెక్కలు గలదియు, దానవులను సంహరించునదియు, ప్రళయ కాలాగ్నితో సదృశమైనదియు, అయిన మహాస్త్రమును సర్వభూతములును సంభ్రమించునట్లు తీయగా కిన్నరులు, గంధర్వులు, దేవతలు, మునలుతోడను, అప్సరోజనులతోడను బ్రహ్మను చూడనేగి ఓ విధాతా! భూమియును, తక్కిన భువనము లెల్లను నాశనమగుచున్న విధముగా గన్పించు చున్నదని చెప్పగా బ్రహ్మ యిట్లనెను. దేవతలారా! మీకు భయము కలిగిన కారణము వినుడు. సుమిత్రాసుతుడు లోకవిరోధియైన లవణుని వధించుటకు ధనుస్సునందు భయంకరమైన అస్త్రమును సంధించినాడు. దాని తేజస్సు చేతనే సుమా నాకును, మీకును, ప్రపంచమంతటికిని మనస్సులు స్తబ్ధములైనవి. ఆ యస్త్రము సనాతనుడైన సర్వలోకాదికర్త దగుటచే తేజస్సుచే నిండియున్నది. పూర్వము నారాయణుడు రాక్షసులైన మధుకైటభులను సంహరించుటకై దానిని సృష్టించెను. దానినతడొక్కడే తెలిసినవాడు. ఇది నారాయణ తేజము గాన మీరాస్థలమున కేగి రాక్షస సంహారమును చూడుడని చెప్పగా వారందఱును యుద్ధభూమి కేగిరి. అంత శత్రుఘ్నుడు విల్లునందస్త్రమును సంధించి విరోధిని బిలిచెను. అతడును అధికమైన క్రోధముతో వేగముగా రాగా ఆ యస్త్రమును చెవి వఱకు లాగి శత్రుఘ్నుడు వేయగా అది దట్టమైన కాంతి ఆకాశము నిండగా వెళ్లి లోక విరోధియైన లవణుని ఱొమ్మునందు ప్రవేశించి అధోలోకము దాక వెళ్లి తిరిగి యిక్ష్వాకు వంశ్యుని అమ్ముల పొదియందు దేవతలాశ్చర్యము పొందగా ప్రవేశించెను. లవణుడు నారాయణాస్త్రముచే కొట్టబడినవాడై వజ్రాయుధపు దెబ్బచే గూలిన పర్వతము వలె నేల గూలెను. ఆ రాక్షసుడు యమపురము చేరగనే దేవతలందఱు జూచుచుండగా ఆ శూలము వెళ్లి శివుని గలిసెను. దేవతలు పొగడుచుండగా రామ సహోదరుడు సూర్యుడు చీకట్లను పారద్రోలిన విధముగా బలీయమైన ఒక్క యస్త్రము చేతనే మూడులోకముల మహాభయమును పోగొట్టెను. ఆ మధుపుత్రుడట్లు చచ్చుటచే మౌనులు, వేల్పులు, పన్నగులు, పాము వలని భయమును విడచినట్లు సంతోష వైభవము గలిగి శాంతచిత్తులయి వెళ్లగా.

★★★

# డెబ్బదవ సర్గము

## దేవతలు శత్రుఘ్నునకు వరము నిచ్చుట:

అగ్ని మొదలుగా గల దేవతలు ఇంద్రునితో గలిసి శత్రుఘ్నుని జాడవచ్చి మధురమైన మాటలతో నిట్లనిరి. ప్రఖ్యాతి చెందిన శౌర్యము గలవాడా! మధునందనుని నదృష్టవశమున జంపితివి. మేము వరమిచ్చు కోరికతో వచ్చియున్నారము. మా దర్శనమెప్పుడును వ్యర్థము కాదు. నీ కోరిక యేదియో యెఱిగింపు మని యడుగ శత్రుఘ్నుడు చేతులు జోడించి శిరమున దాల్చి యిట్లు పలికెను. దేవతలారా! దేవనిర్మితమైన ఈ మధురాపురము రాజధానిగా అమరుగాక యని కోరగా వారలట్లే యగు గాక రామసోదరా! మఱియు ఇది శూరులైన సేనలు గలదిగా నగును అని వారందఱును వరము నిచ్చి స్వర్గమున కేగగా శత్రుఘ్నుడు తన సేనల నెల్ల పిలువనంపగా వచ్చి వారెల్లరు మధురయందు తమ తమ కనువైన చోటులందు నివసించిరి.

## శత్రుఘ్నుడు మధురాపురము నభివృద్ధి పరచుట:

ఇట్లు శ్రావణమాసమున ఆ మధురా పట్టణమున శత్రుఘ్నుడు ప్రవేశించుట ప్రారంభమై పంద్రెండవ యేటికి పూర్తియయి అతని సేనలును ఆ శూరసేన జనపదములును నిర్భయముగా వర్తింపసాగెను. ఇంద్రుడు సకాలమున వర్షములను గురిపించెను. పైరులు పంటలు వృద్ధి నందెను. సర్వమానవులును ఆరోగ్యవంతులైరి. గృహములు సుందరములై సొగసుతో నుండెను. అంగడి వీధులు కళకళలాడుచుండెను. వర్తకుల సంపద లధికమయ్యెను. లవణునిచే నిర్మింపబడిన మహాభవనము పుణ్యము చేత అనేక విధముల అందముతో పేరు గాంచెను. ఆ పురము యమునా తీరమున అర్ధచంద్రాకారముగ ఒప్పుచుండెను. విహరించుట కనువైన సుందరోద్యానవనములా పురమునకు శోభను గూర్చుచుండెను. హాయిగా శత్రుఘ్నుడాపురము నేలుచుండెను. ఆ సమయమున ఇతర ప్రదేశములనుండి వైశ్యులు వచ్చి నిర్భయముగా ఆ పురము నందు నివాస మేర్పరచుకొనిరి. ఆ పురమిట్లు వృద్ధినందుటచే లక్ష్మణ సోదరుడు సంతోషముతో పొంగి పంద్రెండవ యేడు

ప్రవేశించి గడచుచుండగా రాముని పాదములను స్పృశించి నమస్కారము చేయవలెనను కోరిక తనకు గలుగగా పట్టణమును మంత్రిజనుల వశమునందుంచి మితముగా జనులు తన్ను సేవించుచుండగా

★★★



# డెబ్బది యొకటవ సర్గము

## శత్రుఘ్నుడు వాల్మీకి యాశ్రమంబున విడియుట:

తనతో నూఱు రథములు వచ్చునట్లు ఏర్పాటు చేసి ఏడెనిమిది చోట్లు నిలుచుట కేర్పాటులు చేసి అందందు నిలుచుచు ఆ శత్రుఘ్నుడు వాల్మీకి ఆశ్రమము చేరి ఆ మహాత్ముని పాదములకు మ్రొక్కి పాద్యమును స్వీకరించి అర్ఘ్యము నాతిథ్యమును పొంది అచ్చట నుండగా ఆ మునీంద్రుడెన్నియో చరిత్రలను చెప్పుచుండగా రాజపుత్రుడు వేడుకతో వినుచుండెను. వాల్మీకి మహర్షియు మాటల సందర్భమున లవణుని వధను గూర్చి యిట్లనెను. ఓ మృదుచరిత్రా! దుష్టచరితుడైన లవణుని వధించి శౌర్యము చేత లోకములకు భయము తొలగినది. ఆ సీతాపతి పెద్ద ప్రయత్నముతో దశాస్యుని సంహరించెను. నీవు ప్రయత్నము లేకుండగనే అరరే! యీతనిని వధించితివి. ఇంద్రునితో గలిసి ఆకాశవీధి నుండి నీవు దుష్టరాక్షసుని జంపిన విధము చూచితిని. నీయొక్క అద్భుతమైన విక్రమశక్తి నెల్లరును ప్రఖ్యాతిగా మెచ్చుకొనిరి. ఓ రాజనందనా నాకును ఎంతో సంతోషము గల్గెను. భూతజాలములు నీ యుపకారముచే ప్రీతి నందినవి. నాకును నీయందు నిండైన ప్రేమ కలిగినది. నేనిప్పుడు నీ శిరస్సు నాఘ్రాణించెదను. ఓ రామానుజా! వివేక వంతులలో శ్రేష్ఠుడి ప్రేమకిదియే కదా పరమగతి. అని శిరమును మూర్కొని తన ప్రేమను గనబరచి అతని పరివారమునకు వారు తృప్తి జెందునట్లు ముని వరుడాతిథ్య మొసగెను.

## శత్రుఘ్నుడు శ్రీరామాయణమును వినుట:

శత్రుఘ్నుడు ఆహారమును స్వీకరించి తృప్తి జెందియున్న సమయమున యథాక్రమముగా వీణ మీద లయసమన్వితము తాళముతో గూడి సంగీత మాధుర్యముతో గలిసి సులక్షణ సముపేతమైన సంస్కృతమున హృదయ కంఠమూర్ధములను త్రిస్థానములయందు మంద్రమధ్యమ తార స్వరములతో పాడబడుచున్నదియు, పూర్వము రచింపబడినదియు అయిన రామచరిత్ర యథావృత్తముగా మొదటి నుండి సర్వమును చేష్టలుడిగినవాడై గన్నులు చెమ్మగిల్లి ఆశ్చర్యముతో నిట్టూర్చుచు అప్పుడే

జరుగుచున్నట్లనిపించుచుండగా వినెను. ఆ రాజుతో వచ్చినవారును ఆ గీతము నాలకించి ఆశ్చర్యము నంది దీనతను పొందుచు తలలను వెంటనే వాల్చి వారిలో వారలు ఎచ్చటనైనను ఇట్లు జరుగునా? ఇట్టిది చిత్రము. ఇది కలయా? మనమెచ్చట నున్నారము? మునుపే విధముగా చూచితిమో అదియే ఈ ఆశ్రమమున వినగలిగితిమీగాన రూపమున. ఇది యేమి వింత? అని వారు శత్రుఘ్నుని సమీపించి యిది యేమిటో ఋషి వర్యునడుగుమని పలుకగా వారికి శత్రుఘ్నుడిట్లనెను. ఇట్టి విచిత్రము లీ మునీశ్వరుని యాశ్రమము నందెన్నియో యున్నవి. ఇవి యెట్టివని తెలిసికొనవలెనను కుతూహలము గలగగూడదు సుమండీ అని వారలకు చెప్పి ముని శ్రేష్ఠునకు వినయముతో మ్రొక్కి తన నివేశనమునకు వెళ్లి ఆ రామకథా గీత విషయమే తన మనస్సు నందు నిలిచి అనేకాలోచనలు గలిగించుచుండగా

★★★



# డెబ్బది రెండవ సర్గము

## శత్రుఘ్నుడు శ్రీరామ దర్శింప అయోధ్యకేగుట:

నిద్రరాక వినవింపై సంపూర్ణానందమును గలుగజేయు ఆ కథను, ముద్దులొలుకు మాటలను జగత్తును మోహింపజేయు సుకుమారమైన పాటలను వినుచుండగనే సూర్యోదయమయ్యెను. అంత నిత్య పూజా విధానములను పూర్తిచేసి మునికి నమస్కరించుచు. మునీంద్రా! నా ప్రభువయిన రఘుశేఖరుని చూడ మనస్సు ఉవ్విళ్లూగుచున్నది. అనుజ్ఞ నిచ్చినచో వెళ్లి వచ్చెదననగా ముని అతనిని కౌగిలించుకొని వెళ్లి రమ్మనగా రథము నెక్కి వడివడిగా రాముని చూడవలెననెడి కుతూహలముతో వెళ్లి అయోధ్యాపురము ప్రవేశించి శ్రీరాముడున్న ప్రదేశమునకు వెళ్లి ప్రకాశమానమగు బంగరు సింహాసనమున గూర్చుండి చుట్టును మంత్రిజనములు గొలుచుచుండ పూర్ణచంద్రుని వంటి ముఖము గలిగి దేవతల మధ్య నున్న యింద్రుని వలె నున్న శ్రీరాముని దర్శించి నేలపై వ్రాలి సాష్టాంగ నమస్కారము చేసి లేచి చేతులు జోడించి అన్నా! మీ యాజ్ఞ ప్రకారము లవణుని యుద్ధమున వధించితిని. పట్టణమును చక్కబరచితిని. జనులు అందఱును తగినచోటు లందు నివాసము లేర్పాటు గావించుకొనిరి. ప్రేమపాత్రులైన మిమ్ములను విడిచి పండ్రెండు సంవత్సరములైనది. ఇంకనే నొంటరిగా అచ్చట నుండ నిష్టపడను.

## శ్రీరామ శత్రుఘ్నుల సంభాషణము:

అన్నా తల్లినెడబాసిన దూడవలె మిమ్ము విడిచి యెన్నియో దినములనాథుని వలె అచ్చట నివసించుచు బ్రతికి యుండజాలను. ఓ శ్రేష్ఠమైన దయగలవాడా! నీ మనస్సు నందు నా యందు దయ దలంపుము. అనగా తల్లడిల్లుచున్న తమ్ముని జూచి రాముడెంతయో ప్రేమతో నిట్లనెను. తమ్ముడా! విచారింపకుము. క్షత్రియుడైన పురుషశ్రేష్ఠునకీ విధమైన ప్రవర్తన అర్హము గాదు. రాజునకు క్షత్రధర్మము నందు ధృడమైన మనస్సు గలవాడై ప్రజలను సమర్థముగా భరించుట అర్హము. కాన ఇచ్చట నిలుచుట తగదు. నీ వప్పుడప్పుడు ఇష్టము వచ్చిన విధముగా వచ్చుచు వెళ్లుచుండుము. అనురాగము నందు నీవు నా ప్రాణముల కంటే

నెక్కుడైనవాడవు. అట్లైనను భూమిని పాలించుటను విధి తప్పనిది గాన నీ కోరిక దీరునట్లు మాతో గలిసి యేడు దినములిచ్చట నుండి ఆ పైన రథములు, ఏనుగులు, గుఱ్ఱము గల సైన్యముతో మధురాపురమును చేరబొమ్ము. అని రాముడు చెప్పిన ధర్మసమ్మతములైన మాటలను విని దైన్యముతో అట్లేయని ఏడురాత్రులచ్చట నివసించెను. ఎనిమిదవనాడు ఆ రాజు నాజ్ఞను పొంది అన్నలు సాగనంపగా వేగముగా శత్రుఘ్నుడు తన పట్టణమునకేగెను.

★★★



# డెబ్బది మూడవ సర్గము

## బ్రాహ్మణుడు మృతబాలకుని కళేబరమును శ్రీరామునింటి వాకిట వైచి యేడ్చుట:

అట్లు పిన్నతమ్ముడు వెళ్లగా రామభద్రుడును తమ్ములతో గలిసి సధర్మవిధిగా ప్రజాపాలన మొనర్చుచుండగా ఒకనాడు బ్రాహ్మణుడొకడు చచ్చిపోయిన పుత్రునితో ఒక జనపదము నుండి రామచంద్రుని జాడవచ్చి ద్వారము నొద్ద చచ్చిన బాలుని పడవైచి ఆర్తుడై అనేక విధములుగా విలపించెను. కొడుకా! కొడుకా! యనుచు, కడుపుపైన బాదుకొనుచు, కన్నులవెంట నీళ్లు వర్షము వలె గారుచుండ నేడ్చుచు నిట్లనెను. నేను పూర్వము ఏమి చెడ్డ పాపమును చేసితినో గదా. కానిచో ఒక్కగానొక్క పుత్రుడీవిధముగా చిన్నప్రాయమునందే మరణ మెందునా? నా కర్మబలముచే పదునాల్గేండ్ల ప్రాయము ననే మరణించెను. నాయనా! నిన్ను విడిచి బ్రతుకగలమా? ఇక స్వల్పకాలము నందే నేనును నీ తల్లియును యముని జూడనేగుదుమయ్యా! ఇట్లెందులకు జరిగినదో గదా. ఎచ్చటను అబద్ధములను తలచిగాని పలికిగాని యెఱుగను. నేనే యెడనైనను ఎట్టి ప్రాణికైనను నిజముగా హింసచేయ తలపను. ఏ పాపముచే ఈ మా బిడ్డడు మా యిద్దఱకును పైతృక విధిని చేయకముందే తానీ విధముగా యమపురమున కేగెను? ఈ రాముని రాజ్యమందు పూర్వ అకాలము నందు చావనెడు ఇటువంటి ఘోరమైన కీడు చూచి యుండలేదు. వినను గూడ. వినలేదు. రాముని గొప్ప పాపమే మమ్మిట్లు ముంచినది. ఏదియో ఘోరమైన పాపము నీ రాజు చేసి యుండును. అదియే నా పుత్రుడైన ఈ బాలుని చంపినది. రాజా! నీ రాజ్యమునందువలె ఇతర రాజులు పాలించు రాజ్యములందు బాలుర మృతి వినబడదు. కాన ఈ బాలుని నీవే యిప్పుడు బ్రతికించవయ్యా! నీ విట్లీ బాలుని బ్రతికించకున్నచో ఈ రాజద్వారము నందు నేనును నా భార్యయు అనాధులవలె మరణించెదము. బ్రాహ్మణ హత్య చేసిన కీర్తి నంది నీవు సుఖముగా బ్రతుకుము. దీనిచేతనే నీవును తమ్ములును దీర్ఘమైన ఆయువును పొంది భోగములను విడువక యుండుడు. రాజా! ఇంతవఱకు నీ యేలుబడిలో దుఃఖమున నెట్టిదో యెఱుగక కోరికలు దీర నుంటిమి. ఇప్పుడు కుమారుడు మృతి చెందుటచే ఈ విధముగా భరింపరాని దుఃఖము కలిగినది. బాలురను చంపునట్టి రాజిట్లు

దాపురించుటచే ఇక్ష్వాకు రాజ్యమునందలి ప్రజలిక దిక్కుచెడి రాజపాపముచే అనవరతము చచ్చుచుందురు. రాజులు చేసిన దోషములు ప్రజల ననేక విధములుగా నశింపజేయును సుమా. రాజులు దుర్వృత్తులైనచో భూమియందలి జనుల కాలమృత్యువును పొందెదరు గదా. జనపదములందును, పట్టణములందును చేయరాని పనులను రాజు అణచడేని జనులలో అకాల మరణములు గనిపించును. ఇందు సందేహము లేదుకదా. ఓ రామా! నీవే పాపమును చేసితివేమో. దానిచే అయ్యో! ఈ బాలుడు ఏమియు నెఱుగని వాడయ్యును మరణమును పొందెనే అని పల్కుచు రామునకు అడ్డముగా వెళ్ళుచు మృతబాలకుని చూపించుచు కడుపు దుఃఖముచే ఎంతో తపించుచున్న ఆతనిని జూచి రాముడు మిక్కిలి దుఃఖముచే తపించుచున్నవాడై సోదర సమేతుడై

★★★



# డెబ్బది నాలుగవ సర్గము

## నారదుడు శ్రీరామునకు బాలకుడు మృతుడైన కారణము దెల్పుట:

బ్రాహ్మణులను, పౌరులను, మంత్రులను, గురువులను పిలువబంపగా, వసిష్ఠుడును, వామదేవుడును, ఎనమండుగురు బ్రాహ్మణులును వేగముగా వచ్చి రాజునకు దీవనలిచ్చి కొలువు నందు తగిన యాసనములందు గూర్చుండగా రఘురాముడు చేతులు జోడించి కాత్యాయన, మార్కండేయ మౌద్గల్య, గౌతమ, జాబాలి, కాశ్యప, వామదేవులను, వసిష్ఠుని, దేవముని యైన నారదుని, మంత్రులను, పౌరులను జూచి బ్రాహ్మణుడు వాకిటి కడ్డపడిన విధమునంతయును దెలియజెప్పి యిట్లెందులకు జరిగెనో చెప్పుడనగా రాజు యొక్క దీనమైన మాటలను విని నారదుడు మునుల యెదుట నిట్లు చెప్పెను. రాజా! బాలుడిట్లు మరణబాధ జెందుటకు కారణము చెప్పెదను. దానిని విని దానికి తగిన ప్రతిక్రియ చేయుటకు మనస్సునందు తలంచుకొనుము. పూర్వము కృతయుగమున బ్రాహ్మణులు మాత్రమే తపస్సు చేయచుండెడివారు. బ్రాహ్మణుడు గాని వాడు తపస్వి యెందును లేడు. ఆ యుగము బ్రాహ్మణులే పధానులుగా గలదై తపస్సు యొక్క తేజస్సుచే ప్రకాశించి అజ్ఞాన రహితగలదై తపస్సు యొక్క తేజస్సుచే ప్రకాశించి అజ్ఞాన రహితమై యొప్పగా జనులందఱు జ్ఞానవంతులును మృత్యురహితులునై యుండిరి. రాజా! తరువాత త్రేతాయుగము ప్రవేశింపగా మానవాళి వపుష్మంతమైన కారణమున [మనువంశపు రాజులు దేహబలము గలవారగుట చేత] క్షత్రియులు తపస్సు చేయనారంభించి మునుపటి కంటే తపశ్శక్తి చేత వీర్యవంతులయిరి. ఐనను పూర్వులకంటే తక్కువగానే యుండిరి [క్షత్రియులు తపస్సున కృతయుగము వారలను మించజాలరైరి] రామచంద్రా! త్రేతాయుగమున నున్న మహాత్ములగు రాజుల కంటే పూర్వరాజులు మిక్కిలి వీర్యవంతులు తపోధికులునై యుండిరి. పూర్ణబ్రహ్మ జ్ఞానము గల వారగుట చేత త్రేతాయుగమున క్షత్రియులును, బ్రాహ్మణులును తేజస్సుతో సమానవీర్యము గలవారై ప్రకాశించిరి. వారిలో ప్రఖ్యాతముగా ఎక్కువ తక్కువలు చెప్ప శక్యము గాకుండెను. అప్పుడు నాల్గు

వర్ణములకు అనుసరింపదగిన మంచి పద్ధతులను చెప్పిరి. అప్పటి విశిష్టులు వాటిని నిల్పిరి. రెండవ యుగము ప్రారంభము కాగానే భూమియంద ధర్మమొక పాదము ప్రవేశించెను. [త్రేతాయుగమున క్షత్రియులు దేహపుష్టి దేహాసక్తి గలవారై బ్రాహ్మణులతో నేమి పని యని స్వతంత్రించి తపస్సు చేయుటచే బ్రహ్మజ్ఞానము కొఱతపడెను. వారి సహాయమును కోరు బ్రాహ్మణులును అట్టివారే అయిరి. కాన అధర్మమొకపాదము ప్రవేశించెను. ఇక తక్కిన యుగములందును ఇట్లే క్రమముగా బ్రహ్మజ్ఞాన హీనులయిరి.] ఆ యాపదచే మోహమతులై జనులందఱును తేజస్సును పోగొట్టుకొనిరి. కృతయుగము నందు బ్రహ్మజ్ఞాన మెక్కువగా నుండుట చేతను, మహిమ హెచ్చుగా నుండుట చేతను, మనస్సు శ్రేష్ఠమైన విజ్ఞానముతో నుండుట చేతను లోకులెందును అనృతము పొంద పోకుండిరి. [అనృతము = సేద్యము] కృతయుగము నందలి జనులు అమేధ్యము వలె రాజసమైన కర్షకవృత్తిని త్రేతాయుగము నందలి జనులు మహిమతో జీవించు స్వాతంత్ర్యము లేక బ్రతుకునకై వృత్తిగా జేసికొనిరి. అనృతముతో ధర్మమునకు హాని కలిగెను. దానిచే దీర్ఘమైన ఆయువు నశింపసాగెను. ఆయువు తరుగుటచే భయపడి సత్యధర్మాసక్తితో శుభములు సలుపుచుండిరి. త్రేతాయుగమున క్షత్రియులును బ్రాహ్మణులును తపస్సు చేయుచుండిరి. తక్కిన వారలు వారలకు పరిచర్య చేయుచుండిరి. అందు శూద్రులకు ముఖ్యముగా సేవయే పరమ ధర్మమైనది. తరువాత ద్వాపరము ప్రవేశింపగా అధర్మపు రెండవ పాదమేర్పడెను. దానిచే భూమియందబద్ధము అధర్మము వృద్ధిపొందెను. అందుచే కృషి యెక్కువగా చేసి కష్టపడినను ఫలము తక్కువ యయ్యెను. అందు వైశ్యులు మేమేమి తక్కువ అనుభావముతో తపస్సు చేయ నిష్టపడుదురు. ఇట్లు మూడు యుగములందు మూడు వర్ణముల జనులు తపస్సు చేయగలుగుదురు. ఈ మూడు యుగములందును శూద్రుడు తపస్సు చేయదగడు. శుభ చరిత్రా! రామా! ఇది తథ్యము. కలియుగము రాగానే శూద్రులు ప్రకాశముగా తపస్సు చేయుదురు. ఓ రాజా! ఆ పాపపు ప్రవర్తన ద్వాపరము నందే ప్రారంభమైనచో అదియెంత ఘోరమో చెప్పనేల? ఓ పృథివీపతీ! నాల్గవజాతి వాడొకడు భూమిపై నిపుడు తపస్సు చేయుచున్నాడు. అదియే యిట్టి యకాలమృత్యువును కలిగించినది. ఆ పాపాత్ముడెవ్వడో నీ రాజ్యము నందుండుట చేత నీ బాలకుడు మృతినందెను. ఓ సూర్యవంశశ్రేష్ఠుడా! రాష్ట్రమునందు పట్టణమునందెవడైనను అలక్ష్మికి మూలమైన పాపము నాచరించినచో మూఢత్వముచే పాపాము చేయువానిని శిక్షింపజాలని రాజు అధోగతిని బడును. ఓ

రాజా! తపస్సునందును వేదాధ్యయనము నందును, పుణ్యకర్మసమూహములందును, తానెల్లప్పుడు ఆఱవ భాగమును తీసికొను రాజునకు ప్రజలను ధర్మముగా నేలకుండుట తగునా? కావున నీ రాష్ట్రమున ఏ దుష్టుడు అధర్మమైన పనిని చేసెనో వెదకి తగిన విధముగా ప్రతిక్రియ చేయుము. రాజెప్పుడును ధర్మమును రక్షింపుచుండినచో అందఱి జీవితములు నభివృద్ధి నందును. ఈ బాలకుడు బ్రతుకగలడు అని ముని చెప్పగా

★★★



# డెబ్బది యైదవ సర్గము

## శ్రీరాముడు పుష్పకము నెక్కి శూద్రమునిని వెదకుట:

అమృతముతో సమానములయిన ఆ ముని మాటల నాలకించి రాముడు సంతోషముతో సుమిత్ర పుత్రుని జూచి లక్ష్మణా! సువ్రతుడైన ఆ బ్రాహ్మణుని నూరడింపుము. అతని పుత్రుని శరీరము చెడిపోకుండ, శరీరసంధులు విడిపోకుండ కమ్మని నూనెల కాగునందుంచుము. అని చెప్పి తన మనస్సు నందు పుష్పకమును తలంచెను. అంత నా పుష్పకము వచ్చి మహాత్మా! ఏమి పని గలదో చెప్పు మన రామచంద్రుడు మౌని సమూహములకు నమస్కారములు చేసి తమ్ములను పట్టణమున నుండ నియమించి విల్లును బాణములను బట్టి పుష్పకము నెక్కి పడమటి దిక్కునకు వెడలెను. అచ్చటంతయును వెదకి ఉత్తరాభిముఖముగా వెళ్లి హిమవత్పర్వత ప్రదేశములన్నియు జూచి తూర్పుదిక్కునందలి ప్రదేశములన్నియు వేగముగా వెదకి అచ్చట ఏ పాపమును గనబడకుండుటచే రాజచంద్రుడు దక్షిణదిక్ప్రదేశములను వెదకుచుండ శైవల మను పేరు గల పర్వతమున సరోవర ప్రాంతము నందు తలక్రిందుగా వ్రేలాడుచు నుత్తమమైన తపస్సు చేయుచున్న వాని నొక్కని జూచి చేరనరిగి ఓ శీలీ! నీవు ధన్యుడవు! ఎవ్వడవో చెప్పుము. నీ జాతియేది? ఓ సువ్రతుడా! వినవలెనని కుతూహలముతో ప్రశ్నించుచున్నాడను. నేనీ భూమిని పాలించు రాజును. దశరథ పుత్రుడను. రాముడనువాడను. ఓ తపస్వీ! నన్ను జూడుము. ఏమి ప్రయోజనమును నీవు మనస్సు నందు తలంచితివి. స్వర్గమును పొందగోరియో! మఱి యొకటియో! ఇంతటి మహోగ్రమైన తపస్సు చేయనేల? బ్రాహ్మణుడవో, క్షత్రియుడవో, వైశ్యుడవో, శూద్రుడవో మహాత్మా! నిజముగా ఉన్నది యున్నట్లుగానే చెప్పుము. అని యడుగగా

★★★

# డెబ్బది యాఱవ సర్గము

## శ్రీరాముడు శంబుకుని వధించుట:

అతడు వంచిన ముఖము గలవాడై రామచంద్రునితో నిట్లనెను. రాజచంద్రా! నేను శూద్రయోనియందు జన్మించితినయ్యా! శంబుకుడను పేరుతో పిలువబడువాడను. శరీరము తోడే స్వర్గమున కేగు కోరికతో తపస్సు చేయుచున్నాడను. స్వర్గలోకమును పొందగోరుచున్నాను. రాజా! నేనబద్ధములు చెప్పువాడను గాను. శ్రీరామభద్రా! నేను శూద్రుడను. తపస్సు చేయుచున్నానని చెప్పగా రామచంద్రుడప్పుడే ఖడ్గమును ఒర నుండి లాగి దేవతలు పొగడుచుండగా అతని కంఠమును తెగ నరికెను. అంత కమ్మని పూలవాన రామచంద్రుని మీద గురిసెను. దిక్కులందు సువాసనలు గల పిల్లగాలులు వీచెను. అగ్నితో గూడిన దేవతలు ఇంద్రునితో గూడి ఆకాశమున నిల్చి కరుణాపరాయణుడగు రామవిభునితో నిట్లనిరి. [శాస్త్ర విహిత కర్మలను జేసిన వానికి స్వర్గప్రాప్తి. శంబుకుడధి కారము లేని కర్మను విధిగా జేసెను. ఇట్టివాడు స్వర్గార్హుడు కాడు. మరణ కాలమున భగవద్దర్శనము ప్రాప్తించుట వలన వానికి మోక్షము ఫలము. మోక్షమున కెవ్వడైన నధికారియే] ఓ రాజచంద్రా! దేవ కార్యమును నెరవేర్చితిని. మంచిది. నీకు వరము నిచ్చుటకై వచ్చితిమి. నీవు సంహరించుటచే ఈ శూద్రుడు దేవతాపురమున కేగడు. అనుచున్న యింద్రునకు నమస్కరించి రాముడిట్లనెను. దేవతలారా! నా యెడల మీరు మనస్సు లందు సంతసించినచో నా పాపము చేత చంపబడిన బ్రాహ్మణ బాలకుని మరల బ్రతుకు నట్లు చేయుడు. నీ పుత్రుని బ్రతికింతునని సభామధ్యమున బ్రాహ్మణునకు మాట యిచ్చితిని. నా మాట కసత్యదోషము రాకుండ చేయదగునని ప్రార్థింప రామచంద్రా! వ్యథను మానుము. బ్రాహ్మణబాలుడు ప్రాణములను బొంది బంధువులతో గలిసినాడు. ఏ నిమిషము నందు శూద్రుని నీ వాడియైన ఖడ్గధారతో జంపితివో ఆ నిమిషము నందే బాలుడు ప్రాణములను పొంది సుఖముగా నున్నాడు సుమా.

## శ్రీరాముడగస్త్యుని జూడబోవుట:

అది యట్లుండనిమ్ము మేమిప్పుడగస్త్యుని జూచు కోరికతో నేగెదము. అతడు పండ్రెండు సంవత్సరములు జలము లలో పరుండి తపము చేసెను. ఇప్పుడా దీక్ష ముగిసినది. ఆ దేవసముని నభినందింపదగును. మాతో గూడ అతని యాశ్రమమునకు వచ్చెదవా? అతనిని దర్శింపుము. ఓ మౌని హృదయాబ్జ భృంగమా! నీకు శుభములు గలుగును అని చెప్పగా రాముడట్లే కానిండని పుష్పకము నెక్కి విమానములందరుగు దేవతా సమూహముతో గూడ ముని తపోవనమును చూడగా ఆతడును వారికి తగు విధముగా అర్చనలు చేసి సంతోషపరచెను. అంతట దేవతలు స్వర్గము చేరనేగిరి. పుష్పక విమానము దిగి రామభూపాలుడు బ్రహ్మ సదృశుడగు ఆ మునీంద్రునకు నమస్కరింపగా మనస్సు సంతోషముతో నుప్పొంగ మౌనియు స్వాగతము చెప్పి రాజా! నీవెక్కుడు ఆదరముతో ఇట్లు వచ్చుటచే నా కెంతయో సంతోషమయ్యెను. నాకు పూజింపదగినవాడవు. అనంత కల్యాణగుణపూర్ణుడవు. గొప్ప అతిథివి. రామా! నీవు నా మనస్సు నందెల్లప్పుడును నిలిచి యున్నాడవు. బ్రాహ్మణ బాలకునకై శూద్రమౌనిని నీవు సంహరించుట దేవతల వలన విన్నాడను. ఈ రాత్రి యిచ్చట నిలువుము. రేపు వేకువనే పుష్పకము మీద పురమునకు వెళ్లుదువు గాని. నీవు ఆది లక్ష్మీపతివైన నారాయణుడవు. సర్వమును నీ యందే నిలుచును. నీవే భూతముల కెల్ల ప్రభుడవు. పుణ్యశీలా! రామభూపాలా! నీవే సనాతనుడైన పురుషుడవు.

## అగస్త్యుడు శ్రీరామునకు దివ్యాభరమ మొసగబోవుట:

రామచంద్రా! ఈ ఉత్తమమైన భూషణమును నీవు గ్రహింపుము. ఇది దివ్యమైనది. తన దివ్యమైన తేజస్సుతో దివ్యమైన దేహముతో ప్రకాశించుచున్నది. నీవు దీనిని దీసికొనిన నాకు సంతోషమతిశయించును. ఇది విశ్వకర్మచే నిర్మింపబడినది. భూమియందు వేరెవ్వరును దీనిని ధరింప శక్తులు గారు. ఇంద్రునితో గూడిన సర్వదేవతలను నీవే సంరక్షింపనేర్తువు. రఘురామా! అందువలన నీ కిది యిచ్చుచున్నాను. శాస్త్ర సమ్మతముగా సమ్మతింపుము. తనకితరులచే నీయబడిన ఉత్తమ పదార్థమును దానముచేసిన నెక్కుడు ఫలితము అని ముని చెప్పగా క్షత్రియుధర్మమును మనస్సునందు తలచి రామభూపాలు డిట్లనెను. మునినాథా! దానమును పుచ్చుకొనుట బ్రాహ్మణునకు దగును కాని క్షత్రియునకు తగునా? నేను రాజునై యుండియు బ్రాహ్మణుని చేత దానమును స్వీకరింపదగునా? దీనికేమి సమాధానమని రాముడడుగగా రామునితో మునిరాజిట్లు చెప్పెను.

## దివ్యాభరణము గొనవచ్చునని అగస్త్యుడు రాముని సమాధానపరచుట:

రామచంద్రా! పూర్వము కృతయుగమున రాజులేకుండగనే జనులొప్పుచుండ, ఇంద్రుడు దేవతలకు రాజై శోభిల్లు చుండగా దేవతలవలెనే తమకును ఒక రాజుండదగునని జనులు బ్రహ్మదేవుని గూర్చి తపస్సు చేసి దేవా! దేవతలకు వలె మాకును రాజునిమ్ము. ప్రజలు పాపముల పాలుగాకుండ నుండుదురు అని ప్రార్థింప బ్రహ్మదేవుడు దిక్పాలురతో నిట్లనెను. మీలో నొక్కొక్కరొక్క యంశము నిండు దానిచే రాజును సృష్టించెదనని చెప్పగా వారట్లే యిచ్చిరి. అప్పుడు బ్రహ్మక్షుప మొనరింపగా క్షుపుడను నొక్క పురుషుడుద్భవించెను. బ్రహ్మ అతనిని భూపతిగా జేసి యింద్రుని యంశమును భూమిపై ఆజ్ఞ చెల్లుటకును, వరుణుని యంశమును నిచ్చెను. [ఇది రాజుగా గ్రహించిన దానము గాదు. భగవద్భావంబున దాతలను దరింపజేయ నంగీకృతము] దుష్ట సమూహములను దండించినవాడా! నన్ను తరింపజేయుటకై ఇంద్రాంశచే ఈ ఆభరణమును గైకొనుము. ఓ అనఘా! దీనిచే పాపము లేదు. అని చెప్పగా పరమ ధార్మికుడైన ఆ మహానుభావుని మాటలచే దానిని తీసికొని మునిని జూచి మునీంద్రా! అద్భుతమైన యీ దివ్యాభరణము మీకెట్లు సంప్రాప్తమయ్యెను? ఆశ్చర్యములకు గని వంటివాడవైన నీవు నాకాచరిత్రను చెప్పుమని యడుగ ఆ ముని యిట్లనెను. ఆయాభరణము నాకడకు వచ్చిన విధమునంతయును గ్రమముగా చెప్పెదను. రామభద్రా! వినుము.

★★★



# డెబ్బది యేడవ సర్గము

## శ్వేతో పాఖ్యానము:

పూర్వము త్రేతాయుగమున నూఱుయోజనముల మేర మృగములు పక్షులు లేనిదై నిర్జనమైన అడవి యుండగా నేనందు నివసింపదలచి వెళ్లితిని. అది ఫలములు, కందమూలములు, పుష్పములు మొదలగు వానితో అందముగా నుండును. ఆ యడవి మధ్య కొలనొకటి జక్కవ పక్షులతోడను, హంసలతోడను, కన్నెలేడి పిట్టలతోడను మనోహరమై, నిండుగా పద్మములు, కలువలు గలదై నాచుతో గూడినదై మహాశ్చర్యకరముగాను సౌఖ్యకరముగాను ఉండెను. దాని సమీప ప్రదేశమున జనులు లేని యొక యాశ్రమమును జూచితిని. ఆ వేసవి రాత్రి అచ్చట నిద్రించి తెల్లవారగనే కొలనికి వెళ్లి ఆ నీటిపై నొక పీనుగును బాగుగా బలిసిన దానిని యౌవనమందున్న దానిని జీర్ణము కాని దానిని పంక్తి భేదబుద్ధిచే పెంచబడిన దానిని చూచితిని. దానిని జూచి బుద్ధియందేమియు దోపక ఆ సమయమున ఇది యెవ్వని శరీరము? అని నే నాలోచించుచుండగా అంతలో దేవతాస్త్రీలు కొలుచుచుండగా సుందరమైన శరీరము గలవాడును, మణిభూషణములతో ప్రకాశించువాడును, ఇంద్రసమూనుడును అగు నొకడు దేవతాకాంతలు వీవనలతో విసరుచుండ అందమైన విమానము నందుండ జూచితిని. సూర్యుడు మేరు పర్వతము నుండి దిగుచున్న విధముగా తన తేజస్సు చేత దిక్కులను ముంచుచు విమానము నుండి కొలని యొద్దున దిగి బలిసిన ఆ పీనుగును తిండికి వాచినట్లు పొట్టనిండ తినెను. తరువాత ఆ నదీ జలముల నాచమనము చేసి వెళ్లవలెనను తలంపుతో విమానమును సమీపించగా నేనాతనిని జూచి యిట్లంటిని. ఓ స్వర్గనివాసుడాఒ నీవెవ్వడవు? నీకిటువంటి వెగటైన తిండి యేమిటికి చెప్పుము. ఏమిటికి పీనుగును తినెదవు? ఇది తగినదా చెప్పవయ్యా! స్వర్గము నందు నివసించు వారలకిది తగిన పనిగాదని తోచుచున్నది అని యడుగగా నా మాటలను విని దేవతా మండలవాసి నమస్కరించి యిట్లు చెప్పెను. మౌనీంద్రా! విచిత్రమైన నా చరిత్రను చెప్పెదను వినుమయ్యా! యని యిట్లు చెప్పసాగెను.

★★★

# డెబ్బది యెమిమిదవ సర్గము

## శ్వేతుడు తన వృత్తాంత మగస్త్యునకు దెల్పుట:

నా యొక్క అతిక్రమింపరానిదైన దురవస్థనేమని చెప్పుదునయ్యా! మునుపు నా తండ్రి సన్నుతింపదగినవాడు, విదర్భదేశపు రాజు సుదేవుడను వాడు ఇద్దఱు భార్యలందు ఇద్దఱు పుత్రులను గాంచెను. నేను శ్వేతుడను – నా తరువాతివాడు సురథుడు. తండ్రి తరువాత నేను చాలా వేల సంవత్సరములు భూమిని పాలించితిని. అంత ఆయువు స్థిరమైనది కాదని తెలిసికొని నా సోదరుని రాజుగా జేసి ఈ యరణ్యమునకు వచ్చి ఈ సరోవర ప్రాంతము నందే మునీంద్రా! మూడువేలయేండ్లు తపస్సు చేసితిని. చివఱకు బ్రహ్మలోక పదమును బొందితిని. అక్కడ నన్ను ఆకలి దప్పులు మిక్కిలి బాధించుచుండ బాధ పడుచు బ్రహ్మకు నమస్కరించి నాగతి నిట్లు తెల్పితిని. ఓ పద్మగర్భా! ఈ విధమెందైన గలదా? బ్రహ్మలోకము నందుండుటయా? ఆకలి దప్పులు నశింపవా? ఏదో పెద్ద పాపమే నా వెంట పడినది. ఈ కడుపు మంటనెట్లు గడపగలను? అని యడుగగా బ్రహ్మ యిట్లనెను. ఓ సుదేవ కుమారా! నీ శరీరమున నున్న మాంసమే తిని యిక నీ కుత్తు నార్పుకొనుము. ఎందుచేత నంటివా? వినుము. ఈ శరీరమును చక్కగా బెంచితివి. దానము చేయుటనునది యెట్టిదో ఎఱుగవు. రాజా! వినుము. భూమి యందు గింజను నాటకుండగనే వృక్షము మొలచునా? ధీరసత్తమా! తపస్సును చక్కగా చేసితివి. ఇష్టము వచ్చినట్లు తిని శరీరమును రక్షించితివి. నీ వెప్పుడును కొంచెమైనను ఇతరులకిచ్చినది లేదు. దానిచే రాజశ్రేష్ఠా! స్వర్గమును పొందియు కష్టమైన క్షుత్తుచేతను దాహము చేతను బాధనొందుచున్నావు. చేసిన కర్మ మేదియైనను ఊరకపోవునా? కాన నిన్ను నీవే తిని తృప్తినందుము. తరువాత కొంత కాలమునకు అగస్త్యమౌని యీ వనమును ప్రవేశించి నిన్ను పాప విముక్తుని జేయును. రాజా! ఆ యనఘుడు దేవతలనైనను కాపాడ సమర్థుడు. అట్టిచో నిన్ను కాపాడగలుగునని యింక వేరుగా చెప్పనేల? అని పలికెను. ఆ బ్రహ్మమాటచే నా శరీరమునే యా హారముగా జేసికొని యీ విధముగా అనేక సంవత్సరములు గడపితిని గాని ఈ శవము కొంతయైనను తరుగ దాయెను. దీనిచేతనే నాకు తృప్తి గలుగుచున్నది. ఓ మౌనీ! నన్ను వేగముగా

కాపాడుము. ఓ పావనశీలా! తాపసోత్తమా! ఘటసంభవా! ఈ పాపమును పోగొట్టగదవే! కుంభసంభవునకు దప్ప నితరులకు నిందు ప్రవేశించుట శక్యమా? ఈ అందమైన ఆభరణమును తీసికొని నన్ను గొప్ప మనస్సుతో నీ మహిమచే తరింపజేయవయ్యా! దయ దలపవయ్యా! నన్ను రక్షింపగదయ్యా! అనుచున్న ఆ శ్వేతభూపాలుని బాధతో గూడిన మాటలను విని మనస్సు కరుగ ఆ భూషణమును నేను పుచ్చుకొంటిని. ఆభరణమును నేను తీసికొన్న వెంటనే ఆ కొలని యందున్న రాజు యొక్క పూర్వపు మనుష్య శరీరము నాశన మొందెను. ఆ స్వర్గనివాసియు సంతోషము నందెను. ఆ రాజిచ్చినది యిది. చంద్రబింబము వంటి ముఖము గలిగిన రామా! నేను తరింపగోరి నీ కిది యిచ్చితిని ఆదరముతో తీసికొనుము. ఇందు పాపభయము లేదు రామా అని చెప్పగా.

★★★



# డెబ్బది తొమ్మిదవ సర్గము

## దండకారణ్య చరిత్రమగస్త్యుడు శ్రీరామునకు దెల్పుట:

ఆ మునీంద్రుని అద్భుతమైన వాక్కులను విని గౌరవముతోను, ఆశ్చర్యముతోను రామచంద్రు డిట్లు ప్రశ్నించెను. మౌనీంద్రా! శ్వేతుని యరణ్యము నిర్జీవి యెట్లయినది? ఆ నిర్జనారణ్యమున వైదర్భుడు తపస్సు చేయదలచుట యెట్లు? నాకు తెలియజెప్పుమని కోరగా ముని యిట్లు చెప్పెను. పూర్వము కృతయుగమున ఈ భూమి నంతటిని మనువు పరిపాలించెను. అతని పుత్రుడు ఇక్ష్వాకుడు మిక్కిలి శౌర్యవంతుడు. తండ్రి యతనిని రాజుగా జేసి ఈ భూమియందు నీవు రాజవంశములకు కర్తవు కమ్మని పలుకగా ఇక్ష్వాకుడట్లే యనెను. ఆ మనువు సంతసించి గుణవంతుడా! నిజముగా నీవే కర్తవు. ఈ జనులను దండనీతి ననుసరించి చక్కగా రక్షింపుము. ఎవ్వరి మీదను కారణము లేకుండ కోపగింపకుము. దోషము చేసిన వానిని రాజు దండింపగా అదియే సుఖహేతువై ఆ రాజును స్వర్గమున నిల్పును సుమా. అని పుత్రునకు హితము చెప్పి అతడు బ్రహ్మలోకమున కేగెను. తరువాత ఆ మనుపుత్రుడు తండ్రి మాటననుసరించి యనేక సత్కార్యములను జేసి ధర్మమునందాసక్తి గలవాడై దేవసమానులైన నూర్వురు పుత్రులను గాంచెను. ఓ రామచంద్రా! వారిలో చిన్నవాడు మిక్కిలి జ్ఞానహీనుడు నీతిలేనివాడు చదువులేనివాడై పెద్దలను ఇష్టముతో గొలువక తెలివిలేనివాడై దుర్మార్గుడై సంచరించుచుండగా రాజు చూచి దండమెందును తప్పదని తలంచి వానికి దండుడని పేరుపెట్టి ఘోరమైన భూమి యేది యని ఆలోచించి వింధ్య శైవల పర్వతముల నడిమి రాజ్యము నేలుకొనుమని యిచ్చెను. ఆ అందమైన పర్వతసమీప ప్రదేశమునకు రాజైదండుడు మధుమంతమను పురమును అందముగా విహరింపదగిన విధముగా నిర్మించి శుక్రాచార్యుని గౌరవముగా వేడుకొని పురోహితునిగా జేసికొని స్వర్గము నింద్రుడేలిన విధముగా జనులందఱు ఆనందముతో నిండియున్న ఆదేశమునేలెను.

★★★

# ఎనుబదవ సర్గము

## దండుడు శుక్రుకూతు నజరను జెఱచుట:

శత్రుమర్దనుడగు దండుడు ఆ దేశము ననేక సంవత్సరము లేలెను. అట్లు పాలించుచు ఆ రాజొక చైత్రమాసమున సుందరమైన భార్గవుని ఆశ్రమమును ప్రవేశించి అందలి వన ప్రదేశమున సంచరించుచుండ దేవకాంతను బోలు సుందరియైన భార్గవుని పుత్రికను జూచి మోహితుడై ఆదుర్భావుడు మన్నథబాణముల బారి బడి ఆ కన్యతో నిట్లనెను. గజగమనా! యెవ్వరిదానవు? ఇట్టీ వనమందేల సంచరించుచున్నావు? చెప్పుము. నిన్ను చూడగానే మన్మథుడు బాధించుచున్నాడు. అనగా ఆ కాంత అతనిని మోహముచే మత్తుడని యెఱిగి అతనితో నిట్లనెను. ఓ రాజా! నన్ను శుక్రుని కూతురుగా తెలిసి కొనుము. నా పేరు అరజ యని యందురు. నన్ను స్పృశింపకుము. నేను తండ్రివశమున నున్నదానను, కన్యను. శక్రాచార్యుడు నీ గురువే కదా. అతడు కోపగించిన లోకములే రూపుమాసి పోవును. నీవనగా నెంత. నిజముగా రాజా! చెడెదవు. నన్ను వరింప దలచినచో నా జనకుని న్యాయ మార్గముగా వేడుకొనుము. మన్ననతో అతడనుమానము లేక నీ కిచ్చును. పొమ్ము అనగా ఆ దండుడు చేతులు తలపై నిడుకొని ఓ కన్నెరో నీ నిమిత్తముగా నా ప్రాణములే పోవుచున్నవి. ఆలస్యము నెట్లు సహింతును? చంపిన చంపుగాక, శాపమిచ్చిన నిచ్చున గాక, ఓ చంపక గంధీ! నన్నిప్పుడే మన్మథకేళిలో దేలింపుము. లేకున్నచో వాడే నన్ను చంపునని పల్కుచు వేగముగా వచ్చి క్రుచ్చిపట్టి మదముతో బలాత్కారముగా మాన భంగము జేసి మధుమంతమును జేరెను. అంత నా కాంత యేడ్చుచు.

★★★

# ఎనుబది యొకటవ సర్గము

## శుక్రుడు దండుని దేశముపై మట్టివాన గురియ శపించుట:

భయముతో ఆశ్రమ సమీపమున తండ్రికై యెదురుచూచుచుండ భూమిపై పొరలాడుచుండగా శుక్రశిష్యులు వేగముగా వెళ్లి గురువున కా విషయమును దెల్పిరి. ఆ పరమత పోధనుడది విని గొప్ప కోపమునకు వశుడై ఆకలితో వేగముగా తన ఆశ్రమమునకు వచ్చి ధూళి ధూసరితయై దీనురాలైయున్న అరజను జూచి విపరీతమైన క్రోధముతో నిండినవాడై రాజా యీ పాపమును చేసినవాడు? కండపొగరుతో వాడు కన్నులు గాన కున్నాడు. దర్పముతో అగ్నిజ్వాలలను తాక జూచుచున్నాడు. ఈ దుష్టాత్ముడు, పాపశీలి తనవారితో గలిసి గతిమాలి మసియై పోవుగాక. సాటిలేని ఈ మహాపాపకార్యమునకు తగిన ఫలమును పొందుగాక ఈ భూమి యేడు రాత్రులలో ధూళి వర్షముచే పాడగును గాక. ఈ రాజేలుచున్న నూరు యోజనముల యంత దూరమును ఇంద్రుడు మట్టివాన గురిపించి నాశనమొనర్చుగాక. ఇక్కడనున్న భూప్రజలు చరాచరములు నశించుగాక. అని శపించి ఆశ్రమమునుందలి వారిని జూచి మీ రాజ్యమును వదలి వేరొక స్థానమును చేరుడని చెప్పగా వారెల్లరు అట్లే వెళ్లిపోయిరి. ఆ శుక్రుడు కూతురును జూచి మతిచాలనిదానా! మనస్సు సమాధానపరచుకొని ఇచ్చటనే తీవ్రమైన తపస్సు నందు నిశ్చయము గలదానవై దినములను గడపుము. ఈ కొలనుకు యోజనము మేర ఏ ఆపద కలుగదు. మట్టి వర్షము పదుదినములందు నీయొద్ద నివసించు జంతువులే కష్టమును పొందవు అని చెప్పగా అట్లే యగుగాక యని ఆ యరజ తండ్రి మాటచే అధిక దుఃఖమును పొందెను. అప్పటి నుండి శుక్రుడు తన శిష్యులతో వేరొక చోటున నివసించెను. ఓ పద్మాక్షా! రాక్షస గురువు చెప్పిన విధముగా ఏడు దినములలో దండుని సైన్యము నందలి భటులును, తక్కిన వారును ఆశ్చర్యకరమైన మట్టివానచే మిక్కిలి ఘోరముగా జచ్చిరి. మునీంద్రుని శాపముచే దండుని విషయము నేల గలియుటచే దంకడయను పేరొందెను. రామచంద్రా! మునులిందుండుటచే దీనికి జనస్థానమను పేరు వచ్చెను. ఓ రఘురామా! నీవడిగిన దంతయును జెప్పితిని.

సూర్యుడు పడమటి కొండ కేగెను. మునులు స్నానములు చేసి సంధ్యోపాసన చేయుటకై వెళ్లుచున్నారు. సూర్యుడస్తమించెను. సూర్యవంశశ్రేష్ఠా! సంధ్యారాగము వచ్చెను. ఓ శుద్ధచరిత్రా! నీకును సంధ్యావందనము మొదలైన కర్మములు తీర్పదగును గదా.

★★★



# ఎనుబది రెండవ సర్గము

## శ్రీరాము డగస్త్యు నాజ్ఞగొని యయోధ్యకు మఱలి వెళ్లుట:

అని ముని చెప్పగా శ్రీరాముడు సంధ్యోపాసన చేయ దేవకాంతలతో గూడియున్న సరోవరమునకు వెళ్లి యచ్చట సంధ్యవార్చి మునిచంద్రుని యాశ్రమమునకు వెళ్లగా ఆ ముని శాల్యన్నముతో గూడిన రుచికరమైన భోజనమును, ఫలములను దుంపలను ఈయగా రాముడమృత సమానమైన అన్నమును భుజించి సంతుష్టి చెంది అచ్చటనే ఆ రాత్రి గడిపి వేకువ ఆహ్నిక విధులను దీర్చి అగస్త్యునకు మ్రొక్కి దేవా! పురమున కేగ నాజ్ఞనీయవయ్యా. తాపసోత్తమా నేను నీ దర్శనము చేత ధన్యుడనైతిని. నీ కృపాధనమును పొందితిని నేను పవిత్రుడనగుటకై అప్పుడప్పుడిచ్చటికి వచ్చి వెళ్లుచుందును. నాకాజ్ఞ యిచ్చెదరా యని యడుగ ఆ రాజచంద్రుని అద్భుతమైన మాటలకా మౌని శ్రేష్ఠుడు ధర్మజ్ఞులలో శ్రేష్ఠుడిట్లనెను. రామచంద్రా! యధార్థముగా నీవంటి పావనుడు భూతకోటి యందు లేడు. నీ యొక్క మధురమైన మాటలను వినుటచే ఆశ్చర్యము గలిగెను. రామచంద్రా! కల్మషము లేని ప్రీతితో నిన్నొక ముహూర్తకాలము చూచినచో నే మానవుడైనను నిర్మలుడై, స్వర్గమును జేరి నిత్యము దేవతలచే పూజింపబడును. నిన్నెవడైనను అతి క్రూరమైన దృష్టితో జూచినచో వాడాక్షణము నందేయమదండముచే హతుడై బాధనొందుచు నరక మార్గమున బడిపోవును. ప్రాణికోటిలో నీవు పావనమూర్తివి. భూవరా! యిట్టి నిన్నెవ్వరు విడువని భక్తితో కీర్తింతురో ఆ భూజనులు సిద్ధిని బొందెదరు. రాఘవా! ఇంక శుభప్రదమైన నీ పురమునకు బొమ్ము. ఈ భూభారమును నయమార్గమున భరింపుము. అనగా ఆఘట సంభవునకును, అచ్చటి మునులందఱకును మ్రొక్కి వారనుజ్ఞ నీయగా రాముడు పుష్పకము నెక్కగా వారందఱను దేవతలింద్రుని వలె దీవనలిచ్చి పూజించిరి. వర్షాకాలపు మేఘము చెంతనున్న చంద్రుని వలె మింటిపై పుష్పకమందు ప్రకాశించుచు రాముడు సూర్యుడాకాశ మధ్యమును జేరగా అయోధ్య ప్రవేశించి వరుసగా నడిమి కక్ష్య యందు దిగి మంచిమాటలతో పుష్పకమును యక్షరాజును సేవింపబంపి తన సోదరులకు తన రాక తెల్పుటకును, వెంటనే ఆలస్యము సేయక వారిని పిలుచుకొని వచ్చుటకును ద్వారపాలకుని బంపెను.

★★★

# ఎనుబది మూడవ సర్గము

## శ్రీరాముడు తమ్ములతో రాజసూయయాగము చేయ నాలోచించుట:

అతడు వెళ్లి వారితో జెప్పగా వారు వేగముగా వచ్చిరి. ద్వారపాలకుడు వారు వచ్చుటను రాజునకు జెప్పెను. అంత వచ్చిన యిరువురు తమ్ములను రాముడెంతయో సంతోషముతో కౌగిలించుకొని యిట్లనెను. సోదరులారా! చక్కగా బ్రాహ్మణ కార్యమును పూర్తి చేసితిని. అక్షయమైనదియు అతి మహిమగలగినదియు, ధర్మమునకు వంతెనయు, ధర్మమును వృద్ధిచేయునిదయు పాపములు పోగొట్టునదియు అయిన రాజసూయమను యజ్ఞమును మీ తోడ్పాటుతో ధర్మవృద్ధి కొఱకు చేయదలంచితిని. రాజసూయము చేయుటచేత గదా మిత్రుడు వరుణుడై శ్రేష్ఠత్వమును పొందినది. రాజసూయము చేతనే చంద్రుడు శాశ్వతమైన సత్కీర్తి నిలయమును ధర్మవిధిని పొందెను. ఇప్పుడే మీరలాలోచించి యాగమేది చేయ మేలో చెప్పుడనెను [ఇది తమ్ముల మనస్సు పరీక్ష చేయుటకు వేయబడిన ప్రశ్న. లక్ష్మణ విభీషణ విషయములందువలె.]

## భరతుడు రాజసూయ మర్హము కాదని చెప్పుట:

అంత భరతుడు ప్రాంజలియై జనులను రంజించువాడా! నీవు ధర్మపద్ధతితో నడచుటచే నీయందీ భూమియు, ధర్మమును, కీర్తియు స్థిరములై యున్నవి. ఓ శత్రుభంజనా! దేవతలు బ్రహ్మను సేవించునట్లు రాజులందఱును నిన్ను సంతోషముతో సేవింపగోరెదను. లోకులందఱును నిన్నెల్లప్పుడును తండ్రిగా జూచుచున్నారు. ఓ నిర్మలమైన దయతో గూడిన హృదయము గలవాడా! ఈ భూమి యందున్న భూత కోట్లకు నిజముగా నీవే ప్రాణమవు సుమా. ఇట్టి మహానుభావుడవగు నీకు ఎట్లైనను రాజవంశములను నాశనము చేయునట్టి యజ్ఞమును చేయబూనుట ఏమిటికో! రాజసూయయాగము వలన రాజుల సమూహమునకు రోషములు పుట్టును. దానిచే భయంకర రోషముచే చేయబడిన యుద్ధములు గల భూమి యందు భూజనులు హెచ్చుగా వినాశ మొందుదురు. ఈ భూచక్రమంతయు నీ వశమందుండగా సాటిలేని దయాసంపద

గలవాడా! ఈ యజ్ఞకారణమున లోకులకు విలయము కలిగింపదగునా? అనగా అమృత సమానమైన ఆ మాటలను రాముడు మిగుల మెచ్చుకొని కైకపుత్రుని జూచి యిట్లనెను. యధార్థమైనది, హితకరమైనదియగు మాటను భూమికి హితముగా గొప్ప బుద్ధితో పల్కితివి. ఇక నా మనస్సు నందు కలిగిన ఈ క్రతు చింతను వీడితిని. రాజు జనులకు బాధ గలిగించు పనిచేయదగునా? శుభము కలిగించునదైనచో బాలురు చెప్పిన మాటయైనను గ్రహింపదగును. ఓ లక్ష్మణాగ్రజా! మంచి బుద్ధి గలవాడా! శుభము కలిగించునదగుటచే నీవు చెప్పిన మాటను వినెదను.

★★★



# ఎనుబది నాలుగవ సర్గము

## లక్ష్మణుడు వృత్రుకథ శ్రీరామునితో జెప్పుట:

అని రాముడు చెప్పుచుండగా లక్ష్మణుడన్నగారిని జూచి యిట్లనెను. సర్వపాపములను పోగొట్టునది అతి పుణ్యమైనది పావనమైన అశ్వమేధమును చేయవచ్చును గదా. దేవవిభుడైన యింద్రుడు వృత్రుని జంపి బ్రాహ్మహత్యను దొలగించు కొనుటకై దానినే చేసెనని పెద్దలు చెప్పుదురు. పూర్వము నూఱు యోజనములు లావును దానికి మూడురెట్లు ఎత్తును గల దితిపుత్రుడొక్కడు వృత్రుడనువాడు మూడు లోకములను స్నేహము, ప్రియము నేర్పు గలిగి పరిపాలించెను. అతడు ధర్మజ్ఞుడు, మిక్కిలి ప్రాజ్ఞుడు, కృతజ్ఞుడునై యుండెను. అతని పాలనమున భూమి యంతయు కామధేనువు వలె కమ్మని దుంపలు, ఫలములు, పుష్పసమూహములు నిచ్చుచుండెను. భూమి దున్నకుండగనే సంపన్నయై పండెను. ఇట్లుండగా ఆతనికి ఈ సుఖములన్నియు మాయయే. తపస్సే గొప్ప ఫలమునిచ్చునదని తోచి వనములకు వెళ్లదలచి తన మధురాపురము నకు అధిక బలవంతుడైన తన పెద్దకుమారుని రాజుగా జేసి వనములలో అతి నిష్ఠతో తపస్సు చేయుచుండెను. అది చూచి ఇంద్రుడు మొదలైన దేవతలు మనస్సులందు బాధజెందిన వారైరి. అంత నింద్రుడు ఆర్తితో శ్రీహరిని సమీపించి మహాత్మా! వృత్రుడను రాక్షసుడు ఉగ్రమైన తపస్సునకు పూనుకొనగా లోకములు తత్తరపాటు నందినవి. వాడు మిక్కిలి శక్తి కలవాడు. యుద్ధరంగమున వానిని జయించుట నాక సాధ్యము. ఈ విధముగా అతని తపస్సు పూర్తియైనచో ఈ లోకములుండు నంత వఱకును మేమతనికి దాసులమై యీ శరీరములను పోషించుకొనవలయును. ఓ శ్రీ మహిళాపతీ! ఇప్పుడు వానిని సంహరించుటకు దగిన సమయము. నీకది యెంత? కోపగించినచో క్షణములో నశించును. నీ కరుణపొందిన నాటినుండి వాడీ లోకముల నన్నిటిని వశము జేసికొనెను. ఓ కరుణ గలవాడా! పద్మాక్షా! ఇపుడు నీవే దేవతల రక్షింపదలంపుము. ఓ దేవా! నీవలన దేవతలు స్వస్థచిత్తులై యుండుటకెదురు

చూచుచున్నారు. ఆ రాక్షసుని పొగరడగించి జగమును కాపాడుమయ్యా. ఓ ధీరాగ్రేసరా! సాధువులైన దేవతలకెల్లప్పుడును నీవే గతివయి యుంటివి. ఇంక దీనిని సరిచేయ నెవ్వరికైనను అసాధ్యము. కనుక మాకు దిక్కు నీవే.

★★★



# ఎనుబది యైదవ సర్గము

## విష్ణువు వాసవుతో వృత్రు జంపు నుపాయము దెల్పుట:

అని యింద్రుడు చెప్పగా విష్ణువిట్లు పలికెను. నేను వృత్రుని యెడ మైత్రీ బద్ధుడను. మీ సంతోషమునకై నేనచ్చటికి వచ్చి యుద్ధమున నతనిని చంపనిష్టపడను. ఐనను మీకు శ్రేయస్సు గలుగునట్లు చేసెదను. ఓ ఉత్తమశీలులారా! నా తేజమును ఇంద్రునందును, వజ్రాయుధము నందును, భూమియందును ఉండునట్లు చేసెదను. దానిచే ఇంద్రుడు వృత్రుని సంహరింపగలవాడగును అని చెప్పగా దేవతలందఱును నమస్కరించుచు నిట్లనిరి. లక్ష్మీనాథా! నీవతి కరుణతో మాకు దిక్కగుటచే బ్రతికితిమి. రాక్షసుని సంహరింప ఇంద్రుని యందు నీ మహిమ నుంచుమని ప్రార్థించి ఇంద్రుని గూడి వృత్రుడు తపస్సు చేయుచున్న వనము ప్రవేశించిరి. సాటిలేని తన గొప్ప తేజస్సుచే ఆకాశమార్గమును మండించునట్లు గొప్ప తపస్సు చేయుచున్న అతనిని జూచి దేవతలు భయము నంది యీ బలవంతుని జంపుటెట్లో! పరాభవము చెందక యుండుటెట్లో గదా యని చింతించుచుండగా ఇంద్రుడు క్రూరముగా భయంకరమైన వజ్రపుదెబ్బచే వృత్రాసురుని సంహరించెను. అతని శరీరము నుండి పుట్టిన అగ్నిజ్వాలలు గల్పాంతమోయనునట్లు జనులకు భయము కల్గించుచు పైకెగసెను. సాధుచింతునుడైన వృత్రుని నిట్లు నిష్కారణముగా నింద్రుడు నఱుకుటచే ఆ ఘోరపాపము వెంటనే [ఉద్యతాయుధులను బ్రాహ్మణులను స్త్రీలను జంపిన దోషము లేదు]

## ఇంద్రునకు బ్రహ్మహత్య ప్రాప్తించుట:

బ్రహ్మహత్యయై వెంటపడగా ఇంద్రుడు పరువెత్తగా అది యతనిని విడువకుండగా తరుమజొచ్చెను. అంతనింద్రుడు దుఃఖించి లోకముల చివఱనున్న చీకటి యందు దాగెను. ఇచ్చట దేవతలు శత్రువు మరణించగా, ఇంద్రుడు కనపడక పోగా అగ్నిదేవుని ముందిడుకొని రమాభర్తయైన విష్ణువును జూడనేగి అనేక విధముల పరిచర్యలు సల్పి ఓ జగత్పితా! జగములకు గతియైనవాడా! పరమేశా! పూర్వము నుండియు నున్నవాడా! జగత్తులను పాలించుటకై విష్ణుత్వమును నీవు స్వీకరించితివి. ఇప్పుడు మమ్ము దయార్ద్ర

దృష్టితో జూడుము. నీచేత వృత్రుడు చచ్చెను. ఇప్పుడు బ్రహ్మహత్య ఇంద్రునకు వచ్చెను. ఆ మంచి నడవడి గల వాసవుడు పాపముచే దుఃఖము చెందకుండ ఉపాయమును సెలవిమ్ము. అని వేడగా విష్ణుడిట్లనెను. నన్ను గూర్చి యింద్రుడు యజ్ఞము చేసినచో పవిత్రునిగా జేసెదను. కావున ఒక అశ్వమేథము నతడు చేయునట్లు ప్రయత్నింపుడు. అట్లు చేసిన అతడు మఱల దేవతలను గలియును. అని చెప్పగా వారట్లేయని సెలవు పొంది వెళ్లిరి. ఆ బ్రహ్మ హత్యాబలముచే ఇంద్రుడు గాఢాంధకారమున బొరలు చుండెను.

★★★



# ఎనుబది యాఱవ సర్గము

## ఇంద్రుడశ్వమేథము చేసి బ్రహ్మహత్య తొలగించుకొనుట:

పాము వలె మనస్సు చెడినవాడై తెలివి కోల్పోయినవాడై యుండగా భూమి తపించెను. అడవుల సమూహము లెండెను. నదులు, సరస్సులు నెండెను. అనావృష్టి కలిగెను. భూతజాలము లన్నియు భయముతో తత్తరపాటు నొందెను. అప్పుడు విష్ణుని యాజ్ఞననుసరించి దేవతలందఱును ఇంద్రుడన్నచోటును తెలిసికొని అతనికి ధైర్యము చెప్పి యజ్ఞము చేయింపగా యజ్ఞాంతము నందు ఆ మహాపాపము దేవతలను జూచి నేను నిలుచుటకు చోటును చెప్పుడనగా అందఱు నిట్లనిరి. ఓ పాపమా! నీవు నాలుగు భాగములుగా విభజింపబడుము. పర్వతములకు విరోధి యయిన యింద్రుని వదలి యెందైన నుండుము. అని చెప్పగా ఆ బ్రహ్మహత్యాపాతకమమిట్లనెను. వానకాలము నాలుగు నెలలును స్వేచ్ఛాచారిణినై పాపమానసుల దర్పమును హరించుదాననై నిండిన నదులందు ఒక భాగము నిలుతును. [వానకాలము నాలుగు నెలలు నదులకు రజోదోషము కలదు. అప్పుడు పూర్ణప్రవాహమున స్నానమాడరాదు. "సింహకర్కట యోర్మధ్యే సర్వానద్యో రజస్వలాః"।] ఇంకొక భాగమున భూమియందు చవుడుగా నెల్లప్పుడు నుండెదను. మూడవ భాగమున మదముతో నిండిన యువతులందు వారి కామ మదమును వారింప మూన్నాళ్లుందును. ఇక మిగిలిన నాల్గవ అంశము చేత కల్లలాడి దూషింపని బ్రాహ్మణులను జంపు వారియందుండెదను దేవతలారా! అని చెప్పగా ఆ దేవతాముఖ్యులు నీవు కోరిన విధముగా నుండుమని చెప్పగా అది వెడలిపోయెను. పవిత్రుడైన ఇంద్రుని తోడ్కొని దేవతలు భూజనులానందింపగా స్వర్గమునకు వెడలిరి.

★★★

# ఎనుబది యేడవ సర్గము

## శ్రీరాముడు లక్ష్మణునకు ఇలుని వృత్తాంతమును జెప్పుట:

అన్నా! అశ్వమేథమనగా ఇట్టి ప్రభావము గలది కాన నీవు దానిని చేయుమని సోదరుడు చెప్పగా రాఘవుడు పొంగి సంతోషించుచు నిట్లనెను. ఔనౌను. అశ్వమేథ మట్టిదే సుమా. మిక్కిలి కీర్తినందినవాడు కర్దముని పుత్రుడు ఇలుడను పేరుగలవాడు బాహ్లిక దేశపు రాజు పూర్వమీయజ్ఞమును జేసెను. లక్ష్మణా! అతడు ఈ భూమి యంతయును తన వశము నందుంచుకొని ధర్మపద్ధతిగా జనులను తన పుత్రులవలె రక్షించెను. దేవతలు, దానవులు, నాగులు, రాక్షసులు అతనికి వశులై భయభక్తులతో ఆ మహాత్ముని సేవించిరి. అతడు కోపించినచో మూడు లోకములును వణకుచుండెడివి. ఇలు డీవిధముగా ధర్మము, శౌర్యము, బుద్ధి యెంతో ప్రఖ్యాతి నొందునట్లు రాజ్యపాలనము చేయుచుండగా ఇంపు గలిగించు చైత్రమాసము వచ్చెను. వేటయందభిరుచి గలవాడై ఆ రాజచంద్రుడు బలములు భటులు వాహనములతో గూడి దట్టమైన అడవిలోనికి వెళ్లి వేలకొలదిగా జంతువులను జంపియు తృప్తినందక ముందుకు సాగుచు కుమారస్వామి పుట్టినచోటున కేగెను. అచ్చట శంకరుడు గౌరీ సమేతుడై పరిచారకులతో గూడ భార్యప్రీతికై ఆడు రూపమును ధరించి కేళీవినోదముల దేలుచుండెను. అచ్చట నున్న చెట్లును ప్రాణులును అన్నియు ఆడురూపమును బొంది ప్రకాశించుచుండెను. అచ్చటి కేగి యిలుడు వింత చూచుచుండగా తాను కూడా స్త్రీగా మారెను. అది చూచుకొని మహాదుఃఖ సముద్రమున మునిగి బాలచంద్రుని శిరస్సున ధరించిన వాడగు శంకరుని పని యిది యని తలంచి తన భటులతో గలిసి

## ఇలుడు స్త్రీయై పార్వతీ పరమేశ్వరుల శరణుజొచ్చుట:

త్రినయునుని శరణుజొచ్చెను [త్రినయన శబ్దము వైయాకరణ సమ్మతము గాదు] అంత శంకరుడతని జూచి నవ్వుచు లెమ్ము ఓ కర్దమపుత్రా! స్త్రీరూపమును విడుచుట తప్ప నేదైనను వరము కోరుము రాజా! అనగా ఆ శంకరుని మాటలను విని రాజు విచారించి ఇతరమేదియు కోర నిష్టము లేక పార్వతీదేవి పాదముల మీద వ్రాలెను. తల్లీ! నీ సేవకుడను.

నన్నుగాపాడి కీర్తిని గాంచుము. జగముల నన్నింటిని బ్రోచు నేలికయైనదానవు. దేవీ! కోరిన కోరికల నీయగల శక్తి గలదానవు. దయగలదానవు. వరముల నిచ్చుదానవు. ఎప్పుడైనను నీ దర్శనము ప్రఖ్యాతమైన సౌఖ్యములకు కారణమగుటచే సిరులతో నున్న చూపులు గలదానా! నా పాపమును పోగొట్టి నన్ను క్షమింపుము. ఓ పార్వతీ! నన్ను కరుణ జూడుము. మమ్ము గన్నతల్లివి నీవు. తల్లి గాక కుమారుని మొఱ లాలకించువారలెవ్వరు? నా చేయి వదలితివేని నీ చరణములను విడువనని పలుకుచున్న రాజు మనోభావమును గుర్తించి పార్వతి యిట్లనెను. ఓ రాజా! నేను సగము వరము నీయవచ్చును. తక్కిన సగము నిచ్చుటకు హరుడే కర్త.

## ఇలుడొక నెల స్త్రీగాను, ఒక నెల పురుషుడు గాను పార్వతి యనుగ్రహించుట:

రాజా! నీ వేది కోరెద వన రాజు సంతోషించి పర్వతపుత్రీ! నీవు నాయందు ప్రసన్నురాలవేని ఒక నెల పురుషుని వలె నుండి, ఒక నెల సాటిలేని సుందరాంగినై యుండునట్లు వరమిమ్మని వేడగా ఆ శాంకరి రాజా! అట్లేయుండుము. నీవు పురుషుడవై యున్న వేళలందు స్త్రీత్వమును, స్త్రీయైన వేళ పురుషత్వమును మనస్సు నందు మరచి యుండెదవు అనెను. ఇట్లు వరము పొంది కర్దమపుత్రుడు పురుషుడుగ ఒక నెలయు, ఇంకొక నెల స్త్రీయై ఇలయమను పేరుతో నుండి రాజై రాజ్యపాలనము జేసెను.

★★★



# ఎనుబది యెనిమిదవ సర్గము

## ఇలుడు స్త్రీయై బుధుని యాశ్రమము చేరుట:

అని రాముడు చెప్పగా విని ఆశ్చర్యముతో రాజును జూచి తమ్ములిట్లనిరి. అన్నా! ఆ రాజు స్త్రీయై యెట్లు సంచరించెను. అంతకంటే నీచమైన దుర్గతి యింకొకటున్నదా? స్త్రీయేమి చేసెనో మగవాడుగ నుండి యెట్లుండెనో తెలుపుమన రామచంద్రుడిట్లు చెప్పెను. మొదటి నెల యందతడు స్త్రీయై యిదివరకటి భృత్యులందఱును కాంతలై తనను కొలువ సాటిలేని అందమైన రూపకాంతి దిక్కులను ప్రకాశింపజేయగా మునుపటి వాహనములన్నిటిని విడిచి కాల్నడకతో వృక్షములు, పొదరిండ్లు తీగెలు గల వనములలో సంచరించెను. ఇట్లు సంతోషముతో చరించుచు ఆ కాంత పూర్ణచంద్రుని కాంతితో వెలుగుచున్న బుధుడచ్చట నున్న సరోవర మధ్యప్రదేశమునందు దపస్సు చేయుచుండగా జూచెను. యౌవన ప్రాయముననున్న చంద్రపుత్రుడగు బుధుని జలమధ్యమందు తపస్సు జేయుచుండగా జూచి ఆ యిల తన పరిచారికలైన స్త్రీలతో ఆ సరసీజలము లందు జలక్రీడలాడ సాగెను.

## బుధుడిలా దేవిని జూచి మోహించుట:

తామరల వంటి కన్నులు గల ఆ యిలను జూచి బుధుడు మన్మథ బాణములచే గొట్టబడి చలించిన మనస్సు గలవాడై తపస్సుచేయుట మాని దానియందే మనస్సు నిల్పి ఆ కాంత ముఖమును చూచుచు ఆ శ్రేష్ఠమైన చరిత్రగలవాడు దేవ కాంతల యందమును తలదన్ను అందమును నీటును జూచి ఇదియే స్త్రీయో! అప్సరసల యందును, దేవకాంతల యందును రాక్షస కాంతలయందును, మెచ్చదగిన నాగకన్యలయందును ఈ సుకుమారిని సాటివచ్చు దానిని చూచి యెఱుగను. ఇది యితరుని బెండ్లియాడకున్నచో ఈ సుందరాంగి నాకు దగిన భార్యయని తలంచి ఆ సరస్సు జలముల నుండి బయటికి వచ్చి తన యాశ్రమము లోనికి వెళ్లి యా స్త్రీలను బిలిచి ఓ కాంతలారా! ఈ యలివేణి యెవ్వతె? యేల ఈ వనమందు సంచరించుచున్నది? యథార్థముగా సర్వమును చెప్పరేయనగా ఆ సరసమైన మాటలను విని ఆ స్త్రీలు ఆ సుందరాంగి మాకు రాణి. ఆమెకు పెండ్లి కాలేదు. మా

వెంట ఈ వనభూములందు సంచరించుచున్నదని చంద్రబింబముల వంటి ముఖములు గల ఆ స్త్రీలు చెప్పగా తన విద్యామహిమచే వారి తత్త్వమంతయు తెలిసికొని వారలతో ఇట్లనెను. ఓ వనితలారా! మీరందఱును ఈ పర్వత ప్రదేశమున నివసింపుడు. మీకు కావలసిన ఫలములను దుంపలను సమకూర్చెదను. మీకు కింపురుషులు పతులౌదురని చెప్పగా వారందఱును అట్లే నెమ్మదిగా నివసించిరి.

★★★



# ఎనుబది తొమ్మిదవ సర్గము

## ఇలాదేవి బుధునితో గలియుట:

ఇట్లు రాముడు చెప్పగా భరతుడును లక్ష్మణుడును కింపురుషస్త్రీల పుట్టువును గూర్చి విని రామచంద్రా! ఆ రాజు తరువాతి చరిత్రను చెప్పమని యడుగ ఆ రాజచంద్రుడిట్లు చెప్పెను. ఆ కిన్నర స్త్రీలను దూరముగా బంపి ఆ మునీశ్వరుడు నవ్వుచు అచ్చటనున్న ఇలాసతితో నేర్పుగలిగిన మాటలతో నిట్లనెను. ఓ చంద్రాననా! నేను చంద్రుని పుత్రుడను. బుధుడను వాడను. ఓ భామా! నన్ను స్నేహపూర్వకమైన దృష్టులతో జూడుము. అనగా జనసంచారములేని ఆ ప్రదేశమున చాలా సంతోషముతో ఆమె యిట్లనెను. ఓ సోమపుత్రా! నేను స్వతంత్రురాలను. కాన నీ చెంతనుండెదను. నీవేమి చేయుమని చెప్పిన విడువక, చేయుదానను అనగా ఆ కాంత యొక్క మాటకు సంతసించి సుఖతత్పరుడై బుధుడామెను గూడి యుండగా ఒక మాసము ఒక నిమిషము వలె గడచిపోయెను. ఇట్లు వైశాఖమాసము గడవగనే నిద్రించుచున్న ఇలుడు దిగ్గన లేచి నీటియందు నిలిచి చేతులెత్తి తపస్సు చేయుచున్న ఆ బుధుని జూచి మునిశ్రేష్ఠా! ఈ అరణ్య మధ్యమునకు నేను వేటకై వచ్చితిని. నా సేవకులెందు బోయిరో తెలియకున్నాను. నీ మనస్సునందాలోచించి చెప్పుమనగా ఆ రాజుతో బుధుడిట్లననెను. రాజా! రాళ్ళవాన గురిసి నీ సైన్యమంతయు మంటగలిసినది. నాయాశ్రమమున నుండుటచే గాలివాన భయమువలన బ్రతికితివి. ఏల భయపడెదవు? ఫలములను దుంపలను దినుచు నీవిచ్చటనే యుండుమనగా అతడు తన సైన్యమంతయు నశించుటకు విచారించుచు వ్యసనము నందినవాడై బుధునితో నిట్లనెను. రాజ్యమును విడిచితిని. భృత్యులు నశించిరి. నేనిందు నిలుచుట మరియాదా? నాకు వెళ్ళుట కాజ్ఞనిమ్ము. నా కొడుకగు శశి బిందునకు రాజ్యపట్టాభిషేకము చేయ వెళ్లెదను. భృత్యులను, భార్యలను, ప్రజలను సౌఖ్యములను విడిచి మునివలె నేను వనముల నుండదగదు గదా. మునినాథా! అశుభమైన మాటలను పలుకకుండ అనుజ్ఞ నిమ్మనగా రాజేంద్రుని మాటలకు బుధుడాశ్చర్యపడుచు రాజా! యేల ఆలోచించెదవు. ఇచ్చట నిలువుము. ఒక సంతవ్సరము గడవగనే నేను నీకు గొప్పమేలు కలుగజేయుదుననగా

## ఇలాదేవి పురూరవుని గనుట:

కర్దమపుత్రుడగు ఇలుడు ప్రేమతో అచ్చట నిలిచి ఘోరమైన తపస్సు జేసెను. అట్లొక నెల గడవగానే తిరిగి స్త్రీయై బుధుని గలిసెను. ఇట్లు తొమ్మిది నెలలు గడవగానే ఆ యిలాదేవి పురూరవుడను కొడుకును గని ఆ పుత్రుని తండ్రికి తీసికొనుమని అప్పుడే యిచ్చి వేసెను. ఏడాది గడవగా రాజు పురుష రూపమును పొందగా తగిన విధముగా మనస్సును రంజింపజేయు కథలతో చంద్రపుత్రుడతని కెంతయో సంతోషమును గలుగజేసెను.

★★★



# తొంబదవ సర్గము

## బుధుడిలునకు శాశ్వతపురుషత్వము గలిగింప అశ్వమేథమును చేయుట:

అని చెప్పగా ఆ సంవత్సరాంతమున ఇలుడేమి చేసెనని సోదరులడుగగా రాముడిట్లు చెప్పెను. ఆ సోమపుత్రుడంత తన మిత్రులైన సంవర్తున చ్యవనుని కశ్యపుని దుర్వాసుని, ఇంకను గొందఱు యోగి శ్రేష్ఠులను రప్పించి యిట్లు చెప్పెను. ఈ రాజశ్రేష్ఠుడు కర్దముని పుత్రుడు. మీ యొక్క కరుణ పొందదగినవాడు. ఇతనియొక్క పరిస్థితి మీ మనస్సునకు తెలిసినదే గదా. ఈతడు తిరిగి పురుషుడై స్థిరముగా రాజ్యమేలునట్లు చేయవలెనని చెప్పుచుండగా కర్దముడు బయిలుదేరి దివ్యతేజము గల బ్రాహ్మణులతో అచ్చటికి వచ్చెను. క్రతువును, పులస్త్యుడును, వషట్కారమును, ఓంకారమును ఆనందముతో అచ్చటికి వచ్చిరి. అందఱును రాజునకు క్షేమము గలిగింప దలచి మాటలాడుచుండ కర్దము డిట్లనెను. దీనికి ముందు శంకరుని మెప్పించుట కన్న మఱొక్కటి లేదు. ఆ పార్వతీపతి మెచ్చునట్టి యజ్ఞము అశ్వమేథ మొక్కటే కావున శంకరుడు సంప్రీతి నొందుటకు గాను మనమందఱము రాజు కొఱకై ఆ యజ్ఞమును చేయదగునని చెప్ప ఆ ఋషులందఱు దాని కంగీకరించుటచే శంకరార్పితముగా బ్రాహ్మణ శ్రేష్ఠులు విధియుక్తముగా యజ్ఞము చేయ బూనుకొనగా అన్ని వస్తువులను సంవర్తుడను రాజర్షి శిష్యుడగు మరుత్తు సమకూర్చెను. ఆ బుధుని యాశ్రమసమీప ప్రదేశమున యథావిధిగా యాగములను జేయగా యజ్ఞసమాప్తి సమయమున సంతోషించినవాడై శివుడు ప్రత్యక్షమై

## ఇలుడెప్పటియట్లు పురుషత్వము నందుట:

మునులారా! ఈ ఇలునకు ఏమి మేలు చేయగోరుచున్నారలు? అనగా వారలు దేవా! అస్ఖలితముగా ఈ రాజచంద్రుడు పురుషత్వముతో నొప్పుగాక యని ప్రార్థింప యా భూతేశుడు మీ కోరిక యట్లే తీరును గాక యని అంతర్ధానమయ్యెను. అంత నా మునులు యజ్ఞమును పూర్తిచేసి తమ తమ యాశ్రమముల కేగ ఇలుడు తన రాజ్యమునకు బయలుదేరి వెళ్లెను. అచ్చట స్వచ్ఛమైన మనస్సు గల శశిబిందుని రాజుగా జేసి పురము

నుండి బయలుదేరి మధ్య దేశము నందు ప్రతిష్ఠాన మను పురము నందు బుధపుత్రుడైన పురూరవుని రాజుగా నుండునట్లు నియమించి ఇలుడు సమయమగుటచే స్వర్గమును జేరెను. తమ్ములారా! విన్నారు గదా! అశ్వమేధ మిటువంటి మహా మహిమ గలది. ఆ రాజు స్త్రీయై తిరిగి పురుషత్వ మందెను. అశ్వమేధము చేయ నేకోరికయైనను కొఱత లేకుండ తీరును.

★★★



# తొంబది యొకటవ సర్గము

## శ్రీరాముడు పురోహితాదుల బిలిపించి అశ్వమేధ మొనర్తునని చెప్పుట:

మన పురోహితులైన వసిష్ఠుని, వామదేవుని, జాబాలిని కాశ్యపుని శ్రేష్ఠులైన బ్రాహ్మణులను లక్ష్మణాతోడ్కొని రమ్ము. అశ్వమేధమును సాగించెదను. సర్వలక్షణములు గల యశ్వము నొకదానిని విడిచెదను. అని చెప్పగా సౌమిత్రి వేగముగా వెళ్లి వారలను బిలువగా వారెల్లరు త్వరగా వచ్చి నమస్కరించుచున్న రాజును దీవించి తగిన యాసనము లందు గూర్చుండనంత రామరాజు చేతులు జోడించి నమస్కరించుచు వారలను జూచి యిట్లనెను. మునులారా! నేను అశ్వమేధ యాగమును చేయతలంచినాడను. ఆజ్ఞనిచ్చెదరా? యని యడుగ వారలు మనస్సులందు హరునకు నమస్కరించి అశ్వమేధ యాగము చేయుట సర్వరాజులకును తగినదే అది శుభప్రదము. అనగా రాముడు సంతసించి సుమిత్రాసుతుని జూచి అప్పుడిట్లనెను. ఈ యాగమహోత్సవము ననుభవించుటకు సర్వవానరులతోడను సుగ్రీవునిచ్చటకు బిలువ దూతలను బంపుము. రాక్షసులతో గూడ విభీషణుని, నా మేలుగోరెడు రాజులను పరివారములతో గూడ వచ్చునట్లు దూతలను బంపుము. దేశాంతరము లందున్న ధర్మాత్ములై బ్రాహ్మణులను భార్యలతో గూడ యజ్ఞము కొఱకు బిలిపింపుము. మునుల నందఱను పూనుకొని రప్పింపుము. నటులను, తాళము వేయువారలను, వర్తకులను బిలువనంపుము. నైమిశారణ్యమున గోమతీనదీ తీరమందు యజ్ఞశాలలను నిర్మింపుము. అనఘులను, ధర్మవేత్తలను మహాత్ములను ఎల్లరను బిలువబంపుము. తనివి తీర యజ్ఞ విధానమును జూచి సుఖములందు పాల్గొని మనస్సులు సంతోషించునట్లు తృప్తినందినవారై వారి యిండ్లకు వెళ్లెదరు సోదరా! నూఱువేల (లక్ష) దృఢమైన గుఱ్ఱములపై బియ్యమును, పదివేల ఎడ్లపై పెసలు, నూవులు, సెనగలు, ఉలువలు, మినుములు, ఉప్పు తగినంతగా నూనె నెయ్యి మొదలగునవియు, మఱియు గందపు చెక్కలును ముందు వెళ్లు నట్లుగా బంపి కోటి బంగారు నాణెములను పదికోట్ల వెండి నాణెములను తీసికొని భరతుడు వేగముగా వెళ్లవలెను. నటులు, వర్తకులు, వేదపండితులు, వంటలవారు, శూరవరులైన భటులు, వర్ధకులును (వడ్రంగులు) కోశాధ్యక్షులు,

పనులు చేయువారు, తల్లులందఱును, చిన్నవారల (భరతాదుల) అంతఃపురస్త్రీలును వెళ్లవలయును. నా భార్యయొక్క బంగారు ప్రతిమను, [దీనివలన శ్రీరామునకు రెండవ భార్య లేదని తెలియుచున్నది.] దీక్షకు గావలసిన వస్తువులను తీసికొని భరతుడు వెళ్లును గాక. రాజులకును, గొప్పవారికి ప్రకాశించు విధముగా, అందముగా, సుఖకరముగా నొప్పు మేడలు గల గృహరాజములను నిర్మింపబంపుము తమ్ముడా యని రాముడు చెప్పగా

★★★



# తొంబది రెండవ సర్గము

## శ్రీరాముడశ్వమేథ యాగము చేయనుపక్రమించుట:

సోదరులన్నియు నేర్పరుపగా రాముడు నల్లని జింక వంటి రంగు గలదియు, సర్వలక్షణములు గలదియు నయిన అశ్వమును ఋత్విజులును, మేఘనాదవైరియగు లక్ష్మణుడును కాపాడుచుండ విడిచెను. తరువాత వేగముగా నైమిశారణ్యమునకు వచ్చి అందు యజ్ఞ వాటికను గాంచి అద్భుతముగా నున్నదని రాముడు మనస్సు నందు సంతోషించెను. అట్లు నైమిశమున రఘురాముడుండగా రాజులు కానుకలను తీసికొని రాగా ఆదరముతో రాముడు వానిని గైకొని ప్రేమతో వారిని అర్చించి విశాలభవనములలో విడియించెను. అనుచరులతో గూడియున్న వారందఱును భరత శత్రుఘ్నులు అన్నములు, పానీయములు, వస్త్రములు ఏవి కావలెనన్న అవి యన్నియు సమకూర్చుచుండిరి. సుగ్రీవునితో గూడి వానరులందఱును బ్రాహ్మణులను వెదకి వెదకి పూజించుచుండగా వృద్ధులను ఋషులను విభీషణుడు రాక్షసులతో గూడి అర్చనలు మొదలైన విధానములచే సంతుష్టి కలిగించుచుండెను. గుఱ్ఱమును సుమిత్రా తనయుడు రక్షించుచుండగా విధివిధానముగా క్రతువు జరుగుచుండగా పరితుష్టిగా ఇవ్వుడు ఇవ్వుడను మాటల శబ్దమే అధికముగా వినబడుచుండెను. కండచక్కెర బెల్లముతో చేసిన పిండవంటలు చాలుచాలని యాచకు లనెడు వఱకు తెండు తెండను మాట వినరాక ముందే వడ్డించుచున్నవారు పెట్టుచుండిరి. మాసిన వస్త్రములు గలవాడు గాని, దీనుడు గాని, చిక్కిపోయినవాడు గాని మాట చెప్పుటకైనను ఆ మహాయజ్ఞము నందొక్క డైనను గాన రాడయ్యెను. ఎంతో కాలము నుండి జీవించి యున్న మునీశ్వరులిట్లు తలంచిరి. పూర్వమెప్పుడును ఇటువంటి యజ్ఞమును చూచి యుండలేదు. మణులు చేతను ధనాదుల చేతను అందఱకు తనివి చెందునట్లు కోరికలు తీరినవి. బంగారమును గోరువారు బంగారమును, ధనములను గోరువారు ధనమును, వస్త్రములను గోరువారు వస్త్రములను కొఱత లేకుండా కోరినవన్నియు పొందుచుండిరి. ఇది వఱకు ఇంద్రుని యజ్ఞమును జూచితిమి. కుబేరుని యాగమును, యముని యాగమును, వరుణుని యాగమును జూచితిమి. అవి దీనికి

కొంచెమైనను సాటియగునా? అని యాశ్చర్యపడుచు తపస్సంపన్నులు పలుకుచుండ వానర సమూహమును, రాక్షసులును చేతులతో పట్టు వస్త్రములను, ధనములను, భోజనములను, వస్తువులను ఆయా చోటులందు నిలిచి యాచకులకు కావలసిన వన్నియు నిచ్చుచుండిరి. ఇట్లే లోటులేకుండా సర్వగుణ సమన్వితముగా ఏడాది పాటు ముగియకుండ ఆ యజ్ఞము సాగుచుండెను.

★★★



# తొంబది మూడవ సర్గము

## వాల్మీకి మహర్షి కుశలవులను రామాయణము గానము సేయ నియమించుట:

ఈ విధముగా సాటిలేని రీతిగా యజ్ఞము జరుగుచుండ వాల్మీకి ముని శిష్యులతో గూడి చాలా ఆసక్తితో క్రతువు చూడవలెనని వచ్చి ఋషులున్నవాడకు సమీప ప్రదేశమునందున్న పర్ణశాలలందు పలములు దుంపలతో గూడిన శకటము లొప్పుచుండగా నివసించెను. రాజు చేతను, ముని రాజుల చేతను పూజలు గ్రహించి ఆత్మజ్ఞానము, మహాతేజస్సు గలవాడును అయిన ఆ ముని అచ్చట నుండి తన శిష్యులయిన కుశలవులను జూచి ప్రేమతో నిట్లనెను. నాయకలారా! బ్రాహ్మణ జనులుండుచోట్లను, మౌనులుండువాడలందును, విశాలమైన రాజమార్గములందును, రాజుల యిండ్లయందును రామచంద్రుని భవన ద్వారమునందును, యజ్ఞము జరుగుచున్నచోట్లను, వీధులందును సంతోషము గలిగించునట్లు చెవులపండువుగా రామాయణము నంతను పాడుడు. అందును విశేషముగా ఋత్విజుల బృందములు వినునట్లు పాడుడు. కొండలలో పుట్టిన అందమైన తీయని ఫలములను దుంపలను పొందగా భుజించి గానము చేయదగును. బాలకులారా! పట్టణము వెలుపల నున్న వనములందలి రుచిగల పండ్లను దిన్నచో అలపుగాని సొలపుగాని యెంత మాత్రము నుండవు. ఎంత పాడినను మీ కంఠస్వరము ఊపునొందదు. ఆ రాజైన రఘురాముడు పిలువబంపినచో మీరా ప్రదేశమునకు వెళ్లి తాపససంఘము లందఱు వినుచుండ లలితమైన మృదువైన మాటలతో నేను నేర్పిన విధముగా అనేక ప్రమాణములను మనస్సులందు నిల్పి కుమారులారా! దినమునకు నిరువది సర్గల చొప్పున గానము చేయుడు. కొంచెమైనను ధనకాంక్ష గొనకుడు. గుణవంతులారా! లోభము తగదు. ఫలములు దుంపలు తిని జీవించు ఆశ్రమవాసులకు ధనమెందులకు? బాలకులారా! ఒకవేళ మీరెవరి చిన్నవారని రాజైన రాముడడిగినచో మేము వాల్మీకి మహర్షి శిష్యులమని భయము లేకుండ చెప్పుడు. పూర్వమువలెనే మీరు మూర్ఛనా పద్ధతి తప్పనీయక వీణ తంత్రులందు అపూర్వమైన సుస్వరము పొలుపొంద జంకులేక గానమును లెస్సగా జేయుడు. రాజునెడల మీ కవజ్ఞ తగదు. మొదటినుండి పాడుడు. బాలులారా!

ధర్మపద్ధతితో జూడగా సర్వభూతములకును భూమిని పాలించు రాజేగదా జనకుడగును. రేపటి నుండి మీరు పరిశుద్ధమైన మనస్సులతో వీణలను బూని నేను నేర్పిన విధముగా పాడుడని నిర్మలచిత్తుడైన వాల్మీకి ముని చెప్పగా ఆ బాలురును మునీంద్రా మీరాజ్ఞాపించిన విధముగానే చేయుదుమని యెంతయో సంతోషముతో చెప్పి వెళ్లి యా రాత్రి గురువు చెప్పిన మాటలను మనస్సు లందు తలంచుచు కుతూహలము గలవారై గడపిరి.

★★★



# తొంబది నాలుగవ సర్గము

## కుశలవులు రామాయణ గానము చేయ శ్రీరాముడు వినుట:

ఆ బాలురు వేకువనే లేచి స్నానము చేసి అగ్నిహోత్రము లందు హోమములు చేసి ఋషీశ్వరుని యాజ్ఞననుసరించి గాన మొనరించుచుండగా రాఘవ రాజచంద్రుడు వీనుల విందుగా దానిని వినెను. అంత పూర్వాచార్యులచే రచింపబడినదియు, అపూర్వమైయున్నదియు, పాఠ పద్ధతి యందు గాన పరిపాటి యందు ఒప్పుచున్నదియు, ప్రమాణాతిశయముచే గూడినదియు, తంత్రీలయ సమన్వితమైనదియు, అగు దానిని బాలురు పాడుచుండగా విని కుతూహలము గలవాడై రాముడు యజ్ఞకర్మల మధ్య కాలమున ధర్మజ్ఞులను, మౌనిశ్రేష్ఠులను, పండితులను, రాజులను, వణిజులను, పురాణముల నెఱింగిన వారిని, సర్వకళలయందు ప్రావీణ్యము కలవారలను, పాదములను, అక్షరములను, సమాసముల నెఱింగిన వారిని, జ్యోతి శాస్త్రమందు నేర్పరులను, సాముద్రికమునందనుభవజ్ఞులను, కళామాత్రా విభాగము నందు నేర్పరులను, వేదముల నెఱింగిన వారిని, గాయకులను, పురమునన్న వారిని, హేతువాదములు చేయుటయందు దక్షులైన వారిని, కార్యనిపుణులను, సత్క్రియలు చేయుంచువారలను, వృత్తసూత్రములు దెలిసినవారిని, సంగీతము నెఱింగిన వారలను, నీతినిపుణులను, శాస్త్రజ్ఞులను, ఇంగితజ్ఞులను, భాషయందు గొప్పనేర్పుగలవారిని, వేదాంతార్థము నేర్పుగా బోధించువారిని, వైదికఛందస్సు లెఱిగిన శ్రేష్ఠులైన పౌరాణికులను, వాదించుట యందు నేర్పుగలవారిని, చిత్రకవిత్వము చెప్పువారిని సభయందు సమావేశమొనర్చెను. అట్లు సభ చేసి అందఱును వినుచుండగా ఆ సుందర బాలురు గీతములును మనస్సులు కరగునట్లు సొంపుగా పాడుచుండ అమందానందముతో వినుచు మఱియు ఆ జనులు

## కుశలవుల యెడ శ్రీరాముని మొకట్లు చూచి జనులు విస్మితులగుట:

రామభూపాలుని ఆ గాయకులు తృప్తి దీరక కన్నులతో త్రాగుచున్నట్లు చూచుచు ఆ బాలురు రూపము నందు రాజును బోలి యున్నారలు. ఇట్టి వింత యెందైనను గలదా? బింబము ప్రతిబింబములవలె రాముడును మునిబాలకులును ఒక్క

విధముగా బ్రకాశించుచున్నారు. ఔరా! ఇది చిత్రముగా నున్నది. ఇది యేమియో ఎట్లు తెలియనగును? జడలను, నారవస్త్రములను విడచినచో ఈ బాలురకును రాజునకును రూపము నందు భేదముండదని చెప్పుకొనుచుండగా ఆ గానము జనమనోహరమై మానవాతీతమై ప్రవర్తిల్లెను. అతిమధురముగా నుండుటచే వినువారలందఱును వీసమంతైన మనస్సులందు తృప్తితీరక వినుచు శరీరములు తెలియని వారై యుండగా ఆ సీతాతనయులు నారదమౌనిచే చూపబడిన ప్రథమ సర్గనుండి ఇరువది సర్గములను గానము చేసిరి. అంత మధ్యాహ్నసమయమయ్యెను. ఆ యిరువది సర్గలను విని రాముడు సంతసముతో తమ్ములను జూచి యిట్లనెను.

## శ్రీరాముడిచ్చిన కానుకలను కుశలవులు నిరాకరించుట:

సోదరులారా! పదునెనిమిది వేల బంగారు నాణెములను మునిపుత్రుల కొసగుడు. మఱియు వేనిని కోరినను మనసార వేగముగా నిచ్చివేయుడని చెప్ప భరతుడును లక్ష్మణుడును వేగముగా ఆ ధనమును దెచ్చి ఆ ముని బాలురతో ఎంతయో అనురాగముతో మీరలివి మంచి మనస్సులతో వేరువేరుగా బుచ్చుకొనుడని చెప్పిరి. పచ్చనిబంగారుమాడలను ఆ చిన్ని బాలురు చూచి ఆశ్చర్యమును పొంది తాము వానిని గైకొన నిష్టపడరైరి. వనవాసులమైన మాకు వీని వలన వచ్చు ఫలమేది? వనములందు నివాసముగా నుండుచు పండిన పండ్లు వేరులు వెల్లకులు దినుచు ముక్కు పట్టుకొని ధీరతతో నెల్లప్పుడు దైవచింతనతో దినములు గడపుచున్న మాకు రాజా! ఈ బంగరు నాణెములేల? వీనిని దీసికొని భూమి యందు బాతర వెట్ట ఎచ్చట యేపని మాకగునని పల్కగా

## రామాయణము గూర్చి శ్రీరాముడు కుశలవులను ప్రశ్నించుట:

ఆ బాలుర మాటలను విని రామచంద్రుడును, సభనున్న వారలును విస్మయమున మునుగగా రఘురాముడు సంతోషించి యిట్లనెను. కుమారులారా! ఈ కావ్యమేమునిచే రచింపబడినది? దీనికి మూలమేది? దేనిని గూర్చి చెప్పబడినది. నేను వినవలెనని మనస్సు నందాశతో నున్నాను వినిపింపుడన వాల్మీకి మౌని దీని కృతికర్త. ఈ యజ్ఞము చేయు ప్రదేశమునందే నివసించి యున్నాడు. రాజా! ఈ కావ్యముననున్న విషయము సమస్తము నీ చరిత్రము. ఇరువది నాలుగు వేల శ్లోకములు గలది. నూఱుపాఖ్యానములు గలవు. ఐదువందల సర్గము గలవు. ఆరుకాండములు గలవు మఱియు ఉత్తరకాండ మొకటి

గలదు. ఇది యిట్లు శోభిల్లునట్లుగా రాజా! మౌని శ్రేష్ఠుడు భార్గవుడు అయిన మా గురువు శుభాశుభము లెల్లను దెలియునట్లుగా శుద్ధమైన పద్ధతితో నీ చరిత్రమునే యిందు నుడివెను. దీనిని పూర్తిగా వినవలెనని కోరిక కలదేని రాజా! కర్మాంతరములందు [రెండు కార్యములకు నడిమి విరామ సమయము] నీ సోదరులతో గలిసి వినుము వినిపించెదమని చెప్పగా ఆ ముని తనయులతో రాముడట్లే యని చెప్పగా ఆ బాలురు సంతోషముతో గురువును చేర పర్ణశాలలకు వెళ్లిరి. ఆ రామభూపతియు శ్రేష్ఠమైన సంగీతము సుస్వరముతో పాడబడిన దానిని స్వరలయలతో గూడిన దానిని సర్గలతో నున్నదానిని ఆలకించి యజ్ఞశాల కేగెను.

★★★



# తొంబది యైదవ సర్గము

## కుశలవులు తన కొమరులని యెఱిగి శ్రీరాముడు వాల్మీకి మహర్షి యొద్దకు దూతలనంపుట:

తరువాత రామచంద్రుడు మునులతోను, ఆప్తజనులతోను, రాజులతోను, తనను సేవించుచున్న వానరులతోడను ప్రతిదినము ఆ గీతమును వినెను. ఆ గీతము వలన ఈ కుశీలవులు సీతాపుత్రులని యెఱింగి ఆ రాజు సభవారు వినుచుండగా దూతలను బిలిపించి యిట్లనెను. [ఉత్తర కాండలో కుశలవోత్పత్తి వినువఱకు ఆ బాలకులు తన కుమారులని శ్రీరాముడెఱుగడు. ముందెచ్చటను నీ విషయము చెప్పబడలేదు. తమ గానము విను ప్రభువు శ్రీరాముడు తమ జనకుడని కుశలవు లెఱుగరు.] దూతలారా! మీరు వెంటనే వెళ్లి వాల్మీకి మునికి నా మాటగా నిట్లు చెప్పుడు. మునిపుంగవా! భూపుత్రి పరిశుద్ధురాలని మీ మనస్సునందు గలదేని, ఆమె పుణ్య చరిత్రయనియు కల్మషము లేనిదనియు మా కందఱకు తెలియునట్లు మీ అనుజ్ఞతో రేపే సీత శపథ మొకటి చేయగలుగునా? యని ముని యభిప్రాయమును సీతాదేవి యుద్దేశమును తెలిసికొని రండని చెప్పగా వినుచున్నవారలు ఇది అద్భుతమని పలుకుచుండ ఆ దూత లధికవేగముతో వెళ్లి మునికి మ్రొక్కి మృదువైన మాటలతో రాముని వాక్యములను చెప్పిరి.

## సీత శపథము చేయునని వాల్మీకి శ్రీరామునకు చెప్పి పంపుట:

అది విని ఋషి శ్రేష్ఠుడిట్లనెను. రామచంద్రుడు చెప్పిన విధముగా భూపుత్రి రేపే శపథము చేయును గాక. స్త్రీలకెందైనను దైవము ప్రాణవిభుడే కదా యని చెప్పగానే ఆ దూతలు తిరిగి వచ్చి ఆ మాటలను రామునితో జెప్పగా సంతుష్టి చెందిన మనస్సు గలవాడై రాముడు ముని సంఘములను రాజులను జూచి యిట్లనెను. సేవకులతో గూడియున్న రాజులారా! శిష్యులతో గూడియున్న మునీశ్వరులారా! మనస్సులందు సందేహమున్న పౌరులారా! అందఱును తప్పక రేపు రండు. భూపుత్రి అపవాదమును తొలగించుకొనుటకై

జగములకు తెలియునట్లుగా శ్రేష్ఠమైన శపథము చేయునని చెప్పగా మునులు మేలుమేలని మెచ్చుకొనిరి. ఎంతయో పొగడుచు రాజులు రామా! ఈ విధముగా చేయుట నీకే తగియున్నది. ఎవ్వరైననిట్లు చేయగలరా? అని పలుకగా రేపు మీరిందఱును రండని రాజు సెలవీయగా వారలా ముచ్చటలే చెప్పుకొనుచు వెడలిరి. ఆ రాత్రి యట్లు గడవగా

★★★



# తొంబది యాఱవ సర్గము

## సీతాశపథము చూచుటకు లోకులు గుంపులుగా జేరుట:

అంత తెల్లవారగనే రామభూపతి యజ్ఞప్రదేశమునకు వెళ్లి వసిష్ఠుని, వామదేవుని, జాబాలిని, ధీమంతుడైన కాశ్యపుని, విశ్వామిత్రుని, దుర్వాసుని, గర్గుని, చ్యవనుని, పర్వతుని, నారదుని, భార్గవుని, శక్తిని, వామనుని, భరద్వాజ మునిని, గౌతమర్షిని, మార్కండేయుని, పులస్త్యుని, కాత్యామునిని, అగస్త్యమౌనిని, అగ్నపుత్రుడైన సుప్రభుని, సుయజ్ఞమౌనిని, మౌద్గల్యుని ఇంకను ఇతరులైన మునులను, వానరులను, రాక్షసులను, రాజులను, వైశ్యులను, శూద్రులను అందఱిని చూచుటకై పిలిపించెను. అనేక దేశముల నుండి వ్రతము లవలంబించినవారును, జ్ఞాననిష్ఠ కర్మనిష్ఠ యోగనిష్ఠ గలవారును అగు బ్రాహ్మణ శ్రేష్ఠులును సీతాశపథము చూడ వచ్చిరి. అట్లు వచ్చిన వారందఱును మిక్కిలియుత్కంఠతతో పర్వతమువలె కదలకుండిరి. అట్లు జనులెల్లరు మూగిన జాడ తెలిసి మైథిలితో గూడి వాల్మీకి మహర్షి వచ్చెను.

## సీతాదేవిని తోడ్కొని వాల్మీకి మహర్షి యజ్ఞశాలకు వచ్చుట:

ఆ ముని శ్రేష్ఠుని వెంట భూపుత్రియు ముఖము వంచుకొని దశరథ రాముని తన మనస్సు నందు ధ్యానించుచు కన్నీటిని కంఠము నందు నిలుపుకొనుచు పద్మముల వంటి చేతులు జోడించుకొని రాగా బ్రహ్మ వెంట వచ్చుచున్న వేదము వలె ముని వరుని వెంట వచ్చుచున్న ఆ ముగ్ధను జూచి జనులు ఎంతయో శోకభారమున హలహల రవములతో గోలగా అరచుచు మేల్మేలనుచు ఆ జానకిని కాకుత్థ్సుని జూచుచుండిరి. బాపురే! రామా! యనియు, బాపు! భళీ! సీత యనియు జనులు పలుకుచుండ చూపరులు ఇంతింతనరాని దుఃఖముచే తపించుచు బాపురే యని యా యిద్దఱిని మెచ్చుకొనిరి. భూతనయతో గూడి వచ్చి ఆ వల్మీకము నందు పుట్టిన పుణ్యమౌని ప్రజల మధ్యలో నిలిచి యెల్లరును వినుచుండ రాఘవుని జూచి బిగ్గరగా యిట్లు పలికెను. ఓ రాఘవా వినుము.

## సీతాదేవి పతివ్రతయని వాల్మీకి మహర్షి సత్యము చేసి చెప్పుట:

రామా! జానకి సువ్రతాత్మ. శుభధర్మచరిత్ర. నీవేమో లోకనింద మాటలకై ఈ సాధ్వీమణిని నా ఆశ్రమ సమీపవనము నందు విడిచితివి. ఈ భూపుత్రి లోకాపవాదముచే భీతుడవగు నీవు నమ్మునట్లు అందఱును జూచుచుండ శపథము చేయగలదు. అనుమతి నిమ్ము. ఈ కవలలు జానకీ తనయులే యదార్థము నీకు జన్మించినవారు. ఎదిరింప శక్యము గానివారు. రఘువంశమణీ! నేను సత్యమును చెప్పితిని. శ్రీరామచంద్రా! నేను ప్రచేతనుని పదియవ పుత్రుడను మనస్సు నందైనను అబద్ధమును తలంపను. ఈ పుత్రులిర్వురును నీ పుత్రులే సుమా. నేననేక వేల సంవత్సరములు ఘోరమైన తపస్సు చేసితిని. ఈ భూపుత్రి దుష్టురాలైనచో నేను చేసిన తపస్సంతయును దగ్ధమై పోవునుగాక. మనస్సు చేతను, వాక్కుచేతను, కర్మచేతను నేనెప్పుడును పాపము చేయలేదు. ఈ భూపుత్రి పాపము చేయనిదైనచో ఆ సత్ఫలము నాకు లభించుగాక. రామచంద్రా! నా పంచేంద్రియములచేతను బుద్ధిచేతను జానకి పవిత్రురాలని తెలిసియే ఆమెను గ్రహించినాడను. [ఇది చదివినవారు వాల్మీకి క్రూరవృత్తియందుండెనను కథ నెంతవఱకు విశ్వసింతురో] ఈమె పాపహీనురాలు. పతియే దైవమని భావించునది. మిక్కిలి పవిత్రమైన నడవడి గలది. భూ జనుల నిందకు భయపడు నీకు చక్కగా నమ్మిక కలుగజేయుటకు ఇప్పుడు బాస చేయును. నా దివ్యదృష్టి చేత యీ జానకి భవ్యమైన యాత్మ గలది యని నే నెఱిగినాడను. జనుల నిందలను పడజాలక ఈమె పరిశుద్ధురాలని తెలిసియు నీ వీమెను అడవి యందు విడిచితివి. [ఈమె పాతివ్రత్యమున, మహిమను లోకమున స్థాపించుటకే వాల్మీకి శ్రీమద్రామాయణమును ఆమె తన యాశ్రమముందుండు కాలములో రచించెను.]

★★★



# తొంబది యేడవ సర్గము

## లోకాపవాదమును బాపుకొన సీతాదేవి శపథము చేయవలెనని శ్రీరాముడనుట:

అని యిట్లు వాల్మీకి చెప్పగా విని రామచంద్రుడు చేతులు జోడించి ఆ జనమందు సీతాదేవిని జూచుచు నిట్లనెను. ఓ మహాతపస్వీ! నేను నీ మాటలను నమ్మితిని. నా మనస్సు నందు సందేహమేమియును లేదు. నిజముగా భూపుత్రి కల్మషము లేనిదే. ఆమె పూర్వము దేవతల సన్నిధియందు సమ్మతితో విశ్వాసము గలిగించెను. అందువలననే గదయ్యా అప్పుడు నేనామెను గృహమునకు దెచ్చితిని. కాని లోకనింద సహింపశక్యమా? కావున లోకభీతిచే భూపుత్రిని పరిశుద్ధురాలని యెఱిగియు నేనీవిధముగా విడువవలసివచ్చెను. మునీంద్రా! దానికై నీవు నన్ను క్షమింపుము. ఈ బాలకులిద్దఱును నా కుమారులే యని నా మనస్సు నందెఱుంగుదును. ఈ భూమండలము సీత పవిత్రురాలని యన్నచో ప్రీతినందెదను. [సీత బాస చేయవలయునని శ్రీరాముడడిగెను గాని యట్లు చేసిన గ్రహింతునని యాయన యనలేదు. బాస చేయునని వాల్మీకి చెప్పెను గాని మఱల గ్రహించుమని యాయన కోరలేదు. కాగల సంగతి నిరువురు నెఱుంగుదురు.] అని చెప్పుచున్న దశరథ తనయుని యభిప్రాయము నెఱింగి ఇంద్రుడు మొదలు బ్రహ్మ వఱకు దేవతలందఱును ముందుగా సీత శపథమున జూచుటకై సంభ్రమముతో వచ్చి ఆకాశమున నిలిచిరి. వసువులు, రుద్రులు, అప్సరసలు, గంధర్వులు, ఆదిత్యులు, మరుత్తులు, అశ్వినులు, విబుధులు, సిద్ధులు, సాధ్యులు, విశ్వదేవతలు, మహర్షివరులు – ఎల్లరును రాగా వారి నందఱిని జూచి రాముడిట్లనెను. సురలారా! మునులారా! ఈ మౌని వాక్యములచేత భూపుత్రి నిర్మలాత్మయని పూర్తిగా నమ్మినాడను. ఈ జగము నమ్మినచో సంతసించెదను. అని చెప్పుచుండ దివ్యమైన సువాసన గలదియు, సుఖము గలిగించునదియు, మనోహరమైనదియునై వాయువు సర్వజనులకు హాయి గలిగించుచు గృతయుగము నందన్నట్లు వీచెను. జనులు మహాద్భుతమని సంభ్రమముతో జూచుచుండ భూపుత్రియు గావి వస్త్రమును ధరించి సభాజన మధ్యము నందు

## సీతాదేవి శపథము చేయుట:

నిలిచి పద్మముల వంటి చేతులు ముకుళించి శిరస్సు వంచి భూమిని జూచుచు అందఱును వినుచుండగా ఆ పద్మాక్షి నిశ్చలమైన మనస్సు గలదై యిట్లనెను. మనస్సు నందైనను శ్రీరామచంద్రుని దప్ప ఇతర పురుషుని తలంపనేని పవిత్రమైన శీలముచే నేను పవిత్రురాలనేయైనచో తల్లీ! యో మాధవీదేవీ! దారినిమ్ము. మనస్సు చేతను, మాటల చేతను, క్రియల చేతను ప్రాణవల్లభుడైన శ్రీరామభద్రునే సదా పూజించుట నిజమైనచో తల్లీ! యో మాధవీదేవీ! దారినిమ్ము. ప్రాణవల్లభుడైన రామభద్రుని దప్ప పరపురుషుని నేనెఱుగను. నేను చెప్పు ఈ మాట ముమ్మాటికి అబద్ధము కాదేని అందఱు చూచుచుండగ తల్లీ! యో మధావీదేవీ! దారినిమ్ము. [మఱల అగ్నిలో ప్రవేశింపరాదా! యని కొందఱు సీత నధిక్షేపింతురు. మఱల మఱల నిదియే చేసిన అగ్నిస్తంభన విద్యచే అట్లు చేయుచున్నదని లోకులందురు. లంకలోని వృత్తాంతమయోధ్యలోనివారు నమ్మనప్పుడయోధ్యలో జరిగినది దేశాంతరమున గాలాంతరమున వారెట్లు నమ్ముదురు. ఎన్ని మారులని యిట్టి పరీక్ష? భృగుశాపము ఫలింపజేయుటెట్లు? మాధవీదేవీ యనగా భూదేవి]

## సీతాదేవి రసాతలమునకు పోవుట:

అన సీతాదేవి శపథములను పల్కగానే ఎంతయో అద్భుతముగా ప్రజలు చూచుచుండ మిక్కిలి పరాక్రమము గల సర్పాధీశులు తలపై మోయచుండగా దివ్యమైన రత్నములతో ప్రకాశించుచున్న దేవతలచే నిర్మింపబడిన దివ్య సింహాసనము భూమి నుండి వెంటనే బయల్వెడలెను. అందుండి భూదేవి తన చేతులతో సీతను దరిజేర్చుకొని కుశలమడిగి సింహాసనమున గూర్చుండ బెట్టుకొని రసాతలమునకు వెళ్లెను. అపుడు భూపుత్రిపై నెడతెరపి లేకుండ పువ్వుల వాన గురిసెను. దేవతలు, ఋషులు ఇట్లా మెనుకొని యాడిరి. మేలు మేలమ్మా! జానకీదేవీ! మేలు! ఔరా! బాపురే! భళీభళీ! అహహా! బాగు! ఆహా! నీ శీలమెంత నిర్మలమో ఓ చిగురుబోణీ! యిట్టిదా నీ నడవడి అని ఆకాశముననున్న దేవతాసంఘములనుచుండగా మనస్సులు విస్మయ సముద్రమునందు మునుగగా మునులును, యజ్ఞాలయమందున్న జనులును బొమ్మలవలె అట్లే నిలబడి చూచుచుండగా. భూమి మీదను, ఆకాశమునందును, పాతాళము నందును నాగులు దానవులు ఎల్లరును, స్థావరములు జంగమములన్నియు చైతన్య రహితులై క్రియలను మాని యుండిరి.

కొందఱు సంతోషముతో అరచిరి. కొందఱు ధ్యానమున మునిగి చింతనొందిరి. కొందఱు రామచంద్రుని జూచిరి. కొందఱు మనసులలో భూపుత్రికను జూచిరి. సీతాదేవి యట్లు భూమియందు ప్రవేశించుటను జూచి భూతజాలములు చింతచేతను, అశ్చర్యము చేతను మనస్సులు వికలమై మోహమున మునిగియుండెను.

★★★



# తొంబది యెనిమిదవ సర్గము

## సీతావియోగమునకు శ్రీరాముడు పరితపించుట:

జానకీ దేవి రసాతలమును బ్రవేశింపగా మేలు మేలని వానరసంఘములనుచుండగా రామచంద్రుడు చేతి కఱ్ఱ నాధారముగా బట్టుకొని తల వ్రేలాడవైచి చింతలో మునిగి మిక్కిలి దుఃఖము నందిన వాడై కనులవెంట బాష్పములు కార్చుచు చాలాకాలమేడ్చి అధికమైన శోకమనెడి దోషముతో గూడినవాడై ఈ విధముగా బలికెను. నే డీవిధమైన దుఃఖము మనస్సు నావహించుచున్నది. నేను చూచుచుండగనే లక్ష్మివంటి నా ప్రియురాలగు సీత నష్టయైనది. అయ్యారే! యిట్టి దుఃఖమెట్లు సహింపవచ్చును? సముద్రపు ఆవలి తీరమున బలిష్ఠమైన లంకలో నిరోధింపబడిన బామినిని బలముచే మఱల దెచ్చిన నాకు ఈ భూమి దాచిన సీతను దెచ్చుటెంతటి పనియో! యని తలంచి

## శ్రీరాముడు భూదేవిపై గోపించుట:

శ్రీరాముడు ఓ భూదేవీ! సీతను తిరిగి వేగముగా దెచ్చి విడిచిపెట్టుము. అట్లు విడువకున్నచో విజృంభించి నా రోషమెట్టిదో విశదముగా నీకు తెలియునట్లు చూపించెదను. నాగలి చేతబట్టి జనకుడు దున్ను సమయమున గదా సీతను నీ నుండి బయటికి దెచ్చెను. ధర్మప్రకారము చూడగా నీవు నాకత్తగారివి. కాన నా భార్యను మఱల నిప్పుడు నాకు దెచ్చియిమ్ము. లేకున్నచో నాకు వెళ్ళుటకు దారియిమ్ము. రసాతలమునందో స్వర్గమునందో ఆ స్త్రీరత్నమును జేరి యౌత్సుక్యముతో విహరించుచుందును. నా దేవిని యధాస్వరూపముగా దేకుండ ఆలస్యము చేసితివేని అత్తా! జానకీదేవి కారణమున మత్తులోనున్న నేను కోపముతో, పట్టణములు, వనములు, పర్వతములతో గూడిన నిన్ను రూపుమాపి నీటిలో గలిపి వేసెదను చూడుము.

## బ్రహ్మ శ్రీరాముని శాంతుని జేయుట:

అని రోషముచే నెఱ్ఱవడిన నేత్రాంచలములు గలవాడై పల్కుచున్న రాముని జూచి దేవతలతో గూడియున్న బ్రహ్మ యిట్లనెను. రాఘవా! కోపగింపకుము. రామచంద్రా!

మనస్సునందు పూర్వభావమును దలంపుము [పూర్వభావము = విష్ణుత్వము] అనఘా! పూర్వమొనరించిన మంత్రాంగమును [అవతార మెత్తుటకు పూర్వము చేసిన ఆలోచన] ఓ ముగ్ధ సరోజవిశాలలోచనా! నీకు గుర్తు చేయుటకునే నెంతవాడను నీ మనస్సు నందీవేళ వైష్ణవమైన జననమును తలంపుము. ఓ పద్మాక్షా! చిత్త శాంతిని బొందుము. నీకు నిత్యానపాయిని యైన భూపుత్ర విమల సాథ్వి నీవందించిన తపోబలముచే సర్వసుఖములతో గూడినదై నాగలోకమున నొప్పుచున్నది.

## రామాయణ శేషము వినుమని బ్రహ్మ శ్రీరాముని వేడుట:

శ్రీరామచంద్రా! ఆమె తిరిగి స్వర్గమున నిన్ను కలియును. [స్వర్గము = వైకుంఠము] నిజము. నీ కావ్యమునంతను వినుము. [అది సర్వమును దెలుపగలదు. నా మాటలను మనస్సున నుంచుకొనుము. ఈ రామాయణము ఉత్తమకావ్యము. నీవు పుట్టినది మొదలు సుఖములను దుఃఖములను యథార్థముగా చూచుచున్నట్లు తెలియజేయునది. ముందు జరుగునది కూడా వచ్చునట్లు వాల్మీకి ముని చెప్పెను. దానినంతయు నిప్పుడు నీవు వినుము. ఓ రాజా! నీవే దానిని గ్రహింపనర్హుడవు. సమస్తము నీయందే స్థిరముగా నిలిచియుండును. రామా! యిది యాది కావ్యము. ఇది దివ్యమై అద్భుతమై అజ్ఞానమును పోగొట్టునదై సత్యమై ప్రకాశించును. నేను దేవతలతో గూడి దీనిని వినియున్నాడను. రామా! గొప్ప కీర్తిని గలిగించు ఈ సత్కృతి నందుటకు రాముడు తక్క నెవ్వడును తగడు. రామా! ముందు జరుగబోవు విషయములతో గూడిన రామాయణ శేషమును ముని సంఘములతో గూడి ప్రేమతో నాలకింపుము. ఉత్తర కాండమను పేరుగలది యది మిగిలినది. అది నీవే వినదగును. మిగిలిన రామాయణమును నీ వొక్కడవే వినదగినవాడవు. ఇతరులు వినదగదని చెప్పి దేవతలతోను ఋషులతోను అగపడకుండ స్వర్గమున కేగెను. తరువాత రాముడు బ్రహ్మ మాట మనస్సునందుంచి తరువాయి వినదలంచి వాల్మీకితో మునీంద్రా! నేను ముందు జరుగబోవునది సర్వమును వేగముగా వినవలెను అని చెప్పి. జనులను వెళ్లుడని ఆజ్ఞ నిచ్చి ఆ కవలబాలురతో ముని పర్ణశాలకు వెళ్లి జానకిని దలచుకొనుచు ఆ రాత్రి గడపెను.

★★★

# తొంబది తొమ్మిదవ సర్గము

## శ్రీరాముదుత్తర కాండ శేషమును వినుట:

అంత సూర్యుడుదయింపగనే తన పుత్రులైన కుశలవులను బిలిచి రాముడు ఇట్లనెను. బాలకులారా! మీరు సంకోచము లేక రామాయణ శేషమును నిర్మలమైన మనస్సులతో పాడుడని చెప్ప ఆ బాలురు అందముగా రామాయణమును జరుగనున్న విషయములతో నున్న యుత్తర కాండ శేషమును తత్త్వజ్ఞులైన మునులును భూపతియు వినుచుండ పాడిరి. అంతట రాముడు యజ్ఞము పూర్తికాగా జానకీదేవి లేకపోవుటచే భరింపరాని వేదనచే జగత్తంతయు శూన్యముగా గనిపించుచుండ విపరీతమైన శోకముతో బ్రాహ్మణ సంఘములకును, వానరులకును రాక్షకులకును

## శ్రీరాముడు కొడుకులతో అయోధ్య ప్రవేశించుట:

జనులకును బ్రాహ్మణులకు ధనములను సమర్పించి తమ యూళ్లకు బంపి, మనస్సున సీతనే తలంచుచు తన పుత్రులతో గలిసి యయోధ్యకు వెళ్లెను. ఆ నియమశాలి జానకిని దప్ప మరియోక స్త్రీని వరింపడయ్యెను. అతనికి ప్రతి యజ్ఞమునందును బంగారపు జానకీ ప్రతిమయే భార్యయయ్యెను. [శ్రీరాముని యేక పత్నీవ్రతము నిది స్థాపించుచున్నది. వాల్మీకి రామాయణ నాయకుడు బహుభార్యుడనుట వాల్మీకి మతము కాదు – సత్యమును గాదు] ఆ విధముగా పదివేల యేండ్లు అశ్వమేథ యాగములనేకములను, బెక్కు సౌవర్ణవాజపేయములను చేసి అధికముగా దక్షిణలను సమర్పించెను. భూవిభుడు నియమముతో అగ్నిష్టోమములను గోసవములను అనేకములైన అతిరాత్రములను చేసెను. ఇట్లు చాలా కాలము గడచెను. జనులెల్లరు సంప్రీతితో నుండి జీవించిరి. వానరులు రాక్షసులు తన యాజ్ఞలో నడచుచుండ, సకాలములో వర్షములు గురియుచుండ, కఱవులు లేక ధనసంపదలు గలిగి సంతుష్టి పుష్టి గలిగి జనులుండగా చాలాకాలము గడచెను. ప్రాణికోట్లకు వ్యాధులెచ్చుటను లేవు. అకాలముగా మరణించుట లెందును లేవు. ఎవ్వరును ఎట్టికీడును పొందకుండిరి. ఇట్లనేక సంవత్సరములు రాముడు రాజ్యము చేసెను.

## కౌసల్యా సుమిత్రాకైకేయులు మరణించుట:

కౌసల్యాదేవి పుత్రులతోడను, మనుమలతోడను చాలాకాలము సౌఖ్యములనుభవించి తరువాత స్వర్గమునకేగెను. ఆమె వెనుకనే అనఘురాలైన సుమిత్రయు, కైకేయియు చివఱ వఱకు ధర్మము లాచరించి వారందఱును స్వర్గమున కేగి దశరథునితో గలిసి సంతోషము నందిరి. [తక్కిన వారి బంధము వలె భార్యాభర్తల బంధమొక జన్మముతో దీరునది కాదు] ఆ తల్లులకై రాముడు బహుదానములు చేసి మునులను బ్రాహ్మణులను తృప్తిపరచి యౌర్ధ్వదైహికములన్నింటిని ఆచరించి పితృదేవతలకు చాలాప్రీతిని గలుగజేసి తరువాత చాలా వేల సంవత్సరములు రామచంద్రుడాసక్తితో రాజ్యము చేసెను.

★★★



# నూఱవ సర్గము

## యుధాజిత్తు గార్గ్యుని శ్రీరామునొద్దక బంపుట:

అంత నొక్కనాడు యుధాజిత్తు మిక్కిలి తేజస్సు గలవాడును, మహర్షిశ్రేష్ఠుడును, అంగిరుని పుత్రుడును, తన గురవును అయిన గార్గ్యుని దశరథపుత్రుని చెంతకు బంపెను. కంబళములను, రత్నాదులను, వస్త్రములను, పదివేల గుఱ్ఱములను రామచంద్రున కీయబంపెను. అతని రాకను విని రాజశ్రేష్ఠుడైన రాముడు సోదరులతో గౌరవపురస్సరముగా నెదురేగెను. అట్లొక క్రోశదూర మెదురేగి అతనిని జూచి దేవేంద్రుడు బృహస్పతిని పూజించిన విధముగా పూజించి ఆతడిచ్చిన ధనములను స్వీకరించి కుశల ప్రశ్నలడిగెను.

## గార్గ్యుడు యుధాజిత్తు సందేశమును రామునితో జెప్పుట:

ఉపవిష్టులైన యా బ్రాహ్మణునితో రాముడిట్లడిగెను. అయ్యా! మునీంద్రా! మా మేనమామ క్షేమమే కదా. ఏమి పనిని గూర్చి మిమ్మిచ్చటికి బంపించెనో ఆయన వాక్యములను చెప్పుడు. అని యడుగ ఆ బ్రహ్మర్షి నయముగా మీ మామ చెప్పినదంతయు చెప్పెదను విన నిష్టమేని వినవయ్యా! సింధునదికి రెండు ప్రక్కల నున్న దేశము ఫలములు దుంపలతో నొప్పుచున్నది. దానిని రక్షించువారు గంధర్వశ్రేష్ఠులు. ఆయుధములు గలవారు సాహసవంతులు యుద్ధములందు నేర్పరులు. మూడు కోట్ల మంది శైలూషుని పుత్రులు. రాఘవా! దారుణయుద్ధము నందా గంధర్వ పురమును గెలిచి నీ రాజ్యమున గలుపుకొనుము. ఇది యిష్టమైన చేయుము లేనిచో వదలి వేయుము. తగని కార్యము. అహితము నేను చెప్పనయ్యా! శూరశ్రేష్ఠా! ఆ రాష్ట్రముల వంక నెవ్వరికైనను పోవుటకు శక్యముగాదయ్యా! అని చెప్పగా శ్రీరాముడా మాటలను విని ప్రేమతో కైకేయి పుత్రుడైన భరతుని కోరికతో చూచెను. ముని శ్రేష్ఠుని జూచి వీరిద్దఱును భరతుని పుత్రులు. అచ్చట తమతాత తమను పూని రక్షిచుచుండగా నివసించెదరు. తక్షుడు, పుష్కలుడను వీరిరువురిని సైన్యము తోడుగానిచ్చి భరతునితో బంపెదను. విరోధి సంఘములను యుద్ధమున గూల్చి

బాహుబలశక్తితో ఆ పట్టణమును స్వాధీనము చేసికొని దానిని రెండుగా విభజించి వీరలకు నేర్పుగా పంచి యిచ్చి భరతుడు తిరిగి యిచ్చటకు వచ్చును మునీంద్రా! అని చెప్ప తగు విధముగా సైన్యముల నిచ్చి

## శ్రీరాముడు సపుత్రుడైన భరతుని గంధర్వుల జయింప బంపుట:

బాలురను శుభనక్షత్రమున పట్టాభిషిక్తులను జేసి శుభనక్షత్రమున బంపగా పుత్రులతోను, బ్రహ్మతో సమానుడైన గార్గ్యుని తోడను కైకపుత్రుడు వైభవముతో పురము విడచి బయలుదేరెను. రామునిచే అనుసరింపబడిన ఆ సైన్యము ఇంద్రునితో గూడినది వలె దేవతలకు గూడా తేరి చూడరానిదై తోచెను. ఈ విధముగా బయలుదేరి దూరము వెళ్లుచుండగా మాంసభోజులయిన ప్రాణులును, రాక్షసులును, భూతములును, యుద్ధమున గంధర్వుల మాంసమును గడుపార దినుటకై సైన్యము కంటే ముందుగా నడచెను. పులులును, సింహములును, పందులు ముందుగా బోవుచుండ సూర్యవంశజుడు ఒక నెల పదునైదు దినములు దారియందు విలాసముగా ప్రయాణము చేసి సైన్యములతో

★★★



# నూట యొకటవ సర్గము

## భరతుడు గంధర్వులను జయించుట:

భరతుడు కేకయ పురము చేరగా కీర్తింపబడిన శౌర్యము గల భరతుడు వచ్చిన వార్త దెలిసియుధాజిత్తుతనసైన్యములతోతరలెను.ప్రఖ్యాతబలులైనభరతయుధాజిత్తులిరువురు నిట్లు వేగముగా వెళ్లి గంధర్వ పురమును ముట్టడించగా వారును యుద్ధోత్సాహముతో బలముతో భటులతో బయలుదేరి ఏడు దినములు వెనుకంజ వేయక యుద్ధము చేయగా విండ్లు, శక్తులు, ఖడ్గములే మొసళ్లుగా రక్తపు టేరు మానవ కళేబరములతో అడ్డు లేకుండ అన్ని దిక్కులందును గగుర్పాటు గలిగించునట్లు ప్రవహించెను. ఆ ధూర్తులు సాటిలేని శౌర్యబలములతో సరియగునట్లు పోరుచుండగా ఆ విరోధులను పౌరుషమును జూచి భరతుడు వీరలను మాడ్చెదను గాక యని దారుణమైన సంవర్తమను పేరు గల యముని మహాస్త్రమును రోషముతో మండుచున్న ఆకృతి గలవాడై శత్రువుల మూకలపై వేయగా అది ప్రళయకాలాగ్ని జ్వాలల వంటి ఆయుధ సమూహములను గురియగా కోలాహలములు చేయుచు విరోధి సైన్యములను మూడుకోట్లను ఒక్క క్షణములో మాడ్చివేసెను. దేవతలు పూర్వమిట్టి దానిని చూచి యుండలేదను కొనుచుండ భరతుడు విరోధులను జయించి ఆ రెండు నగరములందు తన యిద్దఱుపుత్రులను

## భరతుడు తక్షపుష్కలులకు పట్టాభిషేకము చేయుట:

తక్షశిల యందు [తక్షశిల యిప్పుడు టాక్సిల్ అనబడుచున్నది] తక్షుడను పుత్రుని, పుష్కలావతి యందు పుష్కలుడను పుత్రుని ధనము రత్నములు వనములు మొదలగు వానితో నిండి ప్రకాశించు గాంధార దేశమున పట్టాభిషిక్తులను జేసెను. పాపము లేని వ్యవహారముల చేతను, మిక్కిలి సుందరమైన యుద్యానవనముల చేతను, చక్కగా ఏర్పరుపబడిన అంగళ్ల చేతను, క్రొత్తక్రొత్తలైన గోపురములచేతను, చూడగా చూడగా ఇంపు గలిగించు ఇండ్లచేతను, మనోహరములైన దేవాలయములచేతను, తిలక తాలతమాలాది సుందర వృక్షముల చేతను, వకుళపుష్ప సుగంధములచేతను ఒకదానితో నొకటి పోటీ

పడుచున్న వాయనునట్లును, వాదులాడుచున్నవా యనునట్లును ఆ రెండు పట్టణములును వృద్ధి చెంచుచుండగా భరతుడచ్చట ఐదు సంవత్సములుండి తిరిగి రాముని యొద్దకు వచ్చెను. అట్లు వచ్చి ధర్మమూర్తి యైన అన్నపాదములయందు వ్రాలి మ్రొక్కి అన్నమనస్సులో పొంగిపోవునట్లు తాము విరోధులను వధించుటయు తన పుత్రులను ఆ పురములందు నిల్పుటయు సర్వమును వినిపించెను.

★★★



# నూట రెండవ సర్గము

## శ్రీరాముడు లక్ష్మణ కుమారులను కారు పథ చంద్రకాంతములకు ప్రభువుల జేయుట:

తమ్ములతో గలిసి శ్రీరామచంద్రవిభుడు సర్వమును విని సంతోష సంభ్రమములతో లక్ష్మణుని జూచి నీ సుతులైన అంగద చంద్రకేతులు ధర్మవేదులు. అమిత బలులు. వీరలు భూభారమును వహింప సమర్థులు. వీరిని రాజులనుగా జేయుట ఏది తగిన ప్రదేశమో తెలుపుము. ఆశ్రమములకు గాని రాజులకు గాని పీడ కలిగించని దానిని చెప్పుదన కైక పుత్రుడైన భరతుడిట్లనెను. కారుపథమను అందమైన ప్రదేశము బాధలేనిది. ఆ దేశము నందు సుందరమూర్తియగు అంగదుని రాజుగా జేయదగును. అట్లే చంద్రకాంతమను దేశమున తగిన విధముగా చంద్రకేతుని భూభర్తగా జేయదగునని చెప్పగా రఘురాముడు సంతోషముతో పొంగి ఆ లక్ష్మణ కుమారులను అంగదీయపురికి అంగదుని రాజుగా, మల్లభూమి యందు మల్లుడైన చంద్రకేతుని చంద్రకాంతాపురికి రాజుగా అభిషేక విధులనాచరించెను. పడమటి భూమికి అంగదునితో లక్ష్మణుని బంపెను. చంద్రకేతుని వెంట భరతుని ఉత్తరదిశగా బంపెను. వారు ప్రీతితో ఆ భూములకు వెడలిరి. అందు జన పూజ్యుడైన లక్ష్మణుడు ఒక సంవత్సరముండి తన కుమారుని నా రాజ్యమున నిలిపి రాముని జూచు కోరికతో తిరిగి వెళ్లెను. చంద్రకేతునితో మాండవిభర్తయైన భరతుడొక సంవత్సరము పైగా నుండి మార్తాండ తేజుడైన రాముని గొలువ వలెనను కోరికతో తిరిగి వచ్చెను. సౌమిత్రియు, భరతుడును ఈ విధముగా అనురక్తితో రామపాదాబ్దములను గొలుచుచు నుండి కాలమేవిధముగా గడచుచున్నదో యెఱుగ కుండిరి. తమ పుత్రులనెప్పుడును మనస్సులందు తలంపరైరి. ఇట్లు పదివేల సంవత్సరములు గడచెను. ఎల్లప్పుడును జనుల కార్యములను దీర్చుటయందనురక్తులై, స్వచ్ఛమై పరిపూర్ణమైన మనస్సులు గలవారై ప్రకాశించు భాగ్యములతో విలాసులై అధిక తేజస్సు గలవారై ముగ్గురు సోదరులును ఆహుతులీయ ప్రజ్వలించుచున్న త్రేతాగ్నులతో సరిసమానముగా ప్రకాశించుచుండిరి.

★★★

# నూట మూడవ సర్గము

## శ్రీరాముని దర్శింప కాలుడు వచ్చుట:

అంతట కొంతకాలమునకు తామరల వంటి కన్నులు గల రాముని చూచుటకు యమధర్మరాజు ముని వేషమును ధరించి వచ్చి వాకిట నిలిచి లక్ష్మణుని జూచి కుమారా! నేను దూతగా రాజును జూచుటకు కార్యావసరమున వచ్చితిని. వార్తను బంపుము. నన్ను అమిత తేజస్సుచే ప్రకాశించు అతిబలుడను ముని పంపెనని చెప్ప లక్ష్మణుడు సంతసముతో అన్న యొద్దకేగి దేవా! సూర్యకిరణ సమాన తేజస్సు గల యతి యొక్కడు దూతగా వచ్చి మిమ్ము చూడవలెనని కోరుచుండెనని చెప్పగా రాముడు తమ్ముడా! వేగముగా తోడి తెమ్మనగా గొప్ప తేజస్సు గల ఆ ఋషిని సుమిత్రా పుత్రుడు లోనికి తీసికొని రాగా ఆ మునీంద్రుడు రామునకు దీవనలిచ్చి ఆదరింపగా సీతానాథుడు మౌనికి అర్ఘ్యపాద్యములనిచ్చి తగిన ఆసనమున నుంచి మహాత్మా! క్షేమమా? ఈ విధముగా మీరు వచ్చుటకు కారణమేమియో చెప్పుడనగా రాఘవా! నీవును నేనును రహస్య స్థలమున ఈ విషయము ముచ్చటించుకొనదగినది. మన మాటలను ఎవడైనను వినరాదు. మఱియు మనలను చూడనైనను చూడరాదు. అట్లు చేసిన వానిని వెంటనే సంహరింతువేని నీతో సంభాషించెదను. మునుల యొక్క మతము ననుసరించి నడవువలెనని నీ మనస్సున తోచెనేని వెంటనే యట్లు చేయుమని ముని చెప్పగా రామచంద్రుడట్లే చేసెదనని తన సోదరుని బిలిచెను. అట్లు పిలచి సౌమిత్రితో నిట్లనెను. లక్ష్మణా! నీవే ద్వారమున నిలబడుము. ద్వారపాలకుని దూరముగా బంపుము. మేమిద్దఱము మాటలాడుచుండ లోపలికి వచ్చువాడును వినువాడును నాచే చంపబడును. అని ద్వారమున సుమిత్రా సుతుని నిల్పి మునితో నిట్లనెను. ఓ నియమధనా! మీ సందేశమును జెప్పుడు. అదియే నా మనస్సునందు తలపబడుచున్నదనగా ముని యిట్లనెను.

★★★

# నూట నాలుగవ సర్గము

## బ్రహ్మ సందేశమును కాలుడు రామునకు వెళ్లుట:

రాజేంద్రా! నేను జెప్పు మాటల విధమునంతయు వినుము. నేను బ్రహ్మ పంపగా వచ్చినవాడను. పూర్వజన్మమున నేను నీకు పుత్రుడను. మాయచేత సర్వసంహారకుడనైతిని. నేను యముడను. ఓ దేవా! ఆ బ్రహ్మ సందేశమును వినిపించెదను వినుము. ఓ సౌమ్యచరిత్రా! నీవు స్వలోకమును చేరి రక్షింపనిదియే సమయము. నీవు పూర్వ జగములను నశింపజేసి మాయచేత స్వయముగా సముద్రమున శయనించి ముందుగా జలముల నుండి నన్ను సృష్టించితివి. ఆ తరువాత పెద్ద భోగము (సర్పశరీరము/పడగ) గల అనంతమనెడి సర్పశ్రేష్ఠమను మాయచే సృష్టించితివి. మహాసత్వ సంపన్నులైన మధుకైటభులను మర్దించితివి. వారల ఎముకల సమూహముల వలన పర్వతములతో గూడిన భూమి జన్మించెను. దివ్యమై సూర్య సమతేజముతో వెలుగు పద్మము నందు నీ నాభి నుండి నన్ను బుట్టించి ప్రాజాపత్య కర్మము నందు నీవే నిత్యముగా దేవా! నిలిపితివి. ఓ శ్రీకరా! నేను సర్వమును సృష్టిచేసియు రక్షింపనేరక సమస్త భారమును నీ పయి వేసి ఓ జగత్పతీ! దయతో లోకములను రక్షించి అచంచలమైన తేజము నాకు గలుగజేయుము అని ప్రార్థింపగా ఓ మహీధవా! అంత దయగల మనస్సు గలవాడ వగుటచేతను, నీవు దుర్ధర్షుడవు నిత్యుడవు నగుట చేతను భూతరక్షాకార్యమును దలచి నీవు విష్ణుడవైతివి. విశ్వేశా! తరువాత అదితి పుత్రుడవై మిక్కిలి శక్తితో సోదరులను రక్షించుచు కావలసిన చోట్లనెల్ల సాహాయ్య మొనరించుచున్నావయ్యా! అట్టి నీవు ప్రజలు బాధలచే దుఃఖము నందుచుండ జూచి రావణుని జంపుటకై భూమియందు మానవుడవై యుండ మనస్సు నందు తలచి పదివేల యేండ్లును పదినూర్ల యేండ్లును నివసింప నియమమును నీవు తలంచితివి. నీరజాక్షా! నీవు దశరథునకు మనోమయపుత్రుడవై [మనోమయపుత్రుడు = స్వసంకల్పము చేత దశరథ పుత్రభావము గలవాడు] వెలసితివి. అనుకొన్న విధముగా కాలము సమీపించినది. నీవు ప్రజలను కాపాడదలచినచో ప్రీతిగా నిలువవచ్చును. రామా! ఈ విధముగా లోకపితామహుడగు బ్రహ్మ చెప్పెను. నీవు దేవలోకమునకు బోగోరినచో

సర్వదేవతలును నాథుడు గలవారై సంతోషించెదరు. అని చెప్పుచున్న యముని వాక్యములను విని రామచంద్రుడు నవ్వుచు నిట్లనెను. నీవు వచ్చుటచే సంతోషము కలిగినది. నేను భూమియందు జన్మించుట లోక రక్షణ సల్పుటకు గాదా! ఎందుండి వచ్చినాడనో మఱల అందులకే వచ్చెదను. సర్వకార్యములును పూర్తియయ్యెను. సర్వసంహారకా! బ్రహ్మ పల్కిన విధముగానే నావశమందున్న దేవతానాథుల సర్వకార్యములను నిలువవలయును. నాకది కర్తవ్యము.

★★★



# నూటయైదవ సర్గము

## దుర్వాసుడు తనరాక రాముని కెఱిగింపుమని లక్ష్మణునితో చెప్పుట:

ఆ యమధర్మరాజును రామచంద్రుడును ఇట్లు మాట్లాడుచుండగా రామచంద్రుని జూడవలెననెడు కోరికతో దుర్వాసుడు ద్వారమును జేరి నిలిచి లక్ష్మణునితో నిట్లనెను. ఇప్పుడే నేను శ్రీరాముని చూడవలయును. కాలమతిక్రమించుచున్నది. ఇక ఆలస్యము చేయకుము. ఆ రామరాజునకిప్పుడే చెప్పి రమ్మనగా రాముని తమ్ముడు మునికి నమస్కరించి యిట్లనెను. మునీంద్రా! ఆలస్యము చేయను. ఏ పనిని చేయుదును. మీకేమి కావలయును? ఇప్పుడు రామభూపాలుడు కార్యాంతర వ్యగ్రుడై యున్నాడు. ఒక్క నిమిషమాత్రము సహించి యుండుము. అని చెప్పగానే మౌని కన్నుల నిప్పులు గురియు చుండ క్రోధముతో మండిపడుచు రాజువద్దకు వెళ్లి చెప్పుము. నీవీ క్షణము నందే వెళ్లుము. నిలువక పోపోమ్ము. ఈ నిమిషము నందే నేను వచ్చిన వార్తను చెప్పక మానెదవా? మీ పట్టణమును మీరాష్ట్రమును రామసోదరా! నిన్ను నీ యన్నలను విడువకుండగా మీ వంశమునంతయును మసి చేసెదను. చూడుము. నా కోపము పెరుగుచున్నది. శాంతింపవశమా? ఇంక ఓర్చుకొనను. ఇప్పుడే శపింతునని పల్కగా సౌమిత్రి ముని యొక్క పరుష వాక్యములను అతని నిశ్చయమును మనస్సు నందు తలించి ఇందఱను నశించుటయేల? నేనొక్కడనే మృతినందుట మేలుగదా అని తలంచి రామభూపాలుని చేరబోయి తానత్రిపుత్రుడైన దుర్వాసుని వాక్యములను చెప్పెను. అంత రాముడు సౌమిత్రి మాటలను విని యముని వీడ్కొని వేగముగా దుర్వాస మహామునిని చేరనేగి మునీంద్రా! నీ కార్యమును చెప్పుము తప్పక తీర్చెదనని రాముడు పలుకగా ఆ ముని యిట్లనెను. రామచంద్రా! ఎంతయో నిష్ఠతో వేయి సంవత్సరములు తపస్సు చేసితిని. అది యిప్పుడే పూర్తియయినది. ఇంక ఆకలి సహింపలేకున్నాడను. ఉన్న మాత్రముననే భోజనము పెట్టుమని యడుగగా రాముడు మునికి అమృతముతో సమానమైన రుచిరాన్నమును తినుటకు పూర్తిగా పెట్టగా ఆ ముని సంతుష్టుడై సంతోషించితినని మెచ్చుకొని తన యాశ్రమమునకు వెడలెను. రామచంద్రుడును మనస్సునందు కాలుని వాక్యములు తలంచి ఇంక నిది నిఖిల సంహార వేళ యగుగా యని నిశ్చయించెను.

★★★

# నూట ఆఱవ సర్గము

## లక్ష్మణుడు శ్రీరామునితో తన్ను వధించి సత్యము రక్షింపుమనుట:

అట్లు తలంచి రామచంద్రుడు దీనుడయి ముఖము వాల్చుకొని మౌనము వహించి కేతుగ్రస్తుడయిన చంద్రుని వలె తేజము కోల్పోయిన వాడై యుండగా చూచి లక్ష్మణుడు మధురమైన మాటలతో సంతసముతో నున్న మనస్సుతో నిట్లనెను. మహానుభావా! నన్ను గూర్చి యిట్లేల చింతించెదవు? పూర్వజన్మమున జేసిన కర్మచేత నియమబద్ధమైన కాలము ప్రవర్తించును. కాన నిట్లు జరిగినది. కావున నన్ను వధించి సత్యమును కాపాడుము. ఆడి తప్పిన జనులు నరకమున బడుదురు. నన్ను దయతో చూడవలెనని మనస్సునందు తలంచితివేని సన్నుతశీలా! నీకు నాపై గల విచారమును మానుము. ధర్మమును వృద్ధినందునట్లు నెఱవేర్పుము. నా హృదయమునకు నెమ్మది గలిగింపుము. అనగా రాముడు చలించని మనస్సు గలవాడై అప్పుడే మంత్రులను పురోహితుని పిలువ బంపెను. వారందఱును వచ్చి చేరగా రాముడు వసిష్ఠ మునీంద్రునితో తాపసితో తాను చేసిన ప్రతిజ్ఞను, దుర్వాసుడు వచ్చుటయును తెల్పెను.

## వసిష్ఠుని వాక్యములను విని శ్రీరాముడు లక్ష్మణుని విడచుట:

రాజులు, మంత్రులు, మునులు రాజు మాటలను వినుచుండగా వసిష్ఠుడు రాజుతో నిట్లనెను. రామచంద్రా! ఇది మున్నే తెలిసినది గదా. లక్ష్మణుని విడుచుట నీవు నశించుటయు. కాన వేగముగా ఈ గొప్ప గుణములు గల తమ్ముని విడిచిపెట్టుము బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా! కాలము యొక్క బలము తెలియనిదా? ధర్మజ్ఞా! ప్రతిజ్ఞను వ్యర్థము చేయరాదు. పలికి తప్పినచో ధర్మమునకే హాని సంభవించును. ధర్మము నష్టమైనచో మూడు లోకములును, చరాచరములును దేవతలును, ముని సంఘములును నశించును. మూడు లోకములను రక్షించుటకుగాను, ధర్మమార్గమును పాలించుటకై తమ్ముని విడిచిపెట్టుము. జగత్తునకు మేలును గూర్పుము. అని చెప్పగా రామచంద్రుడు ధర్మపరుడుగాన లక్ష్మణుని జూచి యిట్లు పలికెను. నా ప్రియసోదరా! ధర్మవిధి చెడ భూమియందు సాధులైన వారలను

ప్రీతిపాత్రులను విడిచి వేయుటయు, చంపుటయు ఒక్కవిధముగాన నిన్ను విడిచి తినని చెప్పెను.

## లక్ష్మణుడు మేనితో దివంబున కేగుట:

అంత లక్ష్మణుడు రాముని వాక్యముల నాలకించి కన్నుల నీరు గార్చుచు అప్పుడే తన గృహమునకైనను పోకుండగా తొందరతో చక్కగా సరయూనదీ తీరమునకు వెళ్లెను. ఆ జలములందా చమించి భక్తితో చేతులు జోడించి సర్వేంద్రియములను బిగబట్టి ఊర్పులను బిగించి యుండ అంత అప్సరసలు దేవతా సంఘములును పుష్పవృష్టి గురియుచుండగా ఎవ్వరికిని కనబడకుండగా ఇంద్రుడు వచ్చి కడు బలాఢ్యుడైన సుమిత్రా తనయుని శరీరము తోడనే గ్రహించి దేవతలు సంతోషించ స్వర్గమున కేగెను. విష్ణువు యొక్క నాల్గవ భాగమీ విధముగా స్వర్గమును జేరగా కన్నులార జూచి దేవతలు సర్వమౌనులతోడను గూడి పూజించిరి.

★★★



# నూట యేడవ సర్గము

## శ్రీరాముడు మహాప్రస్థానంబేగ నిశ్చయించుట:

అట్లు రాముడు సౌమిత్రిని విడనాడి మంత్రులను, పురోహితులను, పౌరులను అందఱును జూచి ఇప్పుడు అయోధ్యకు రాజుగా ధర్మపుత్రుడైన భరతుని పట్టాభిషిక్తుని జేసి లక్ష్మణుడు వెళ్లినట్లుగా నేనును వెళ్లువాడను. సర్వసామగ్రులను సిద్ధపరచుడనగా పౌరులు శిరములు వ్రేలవైచి జీవములు లేని వారివలె నుండిరి. భరతుడు నిశ్చేష్టుడగుచు మనస్సు నందు రాజ్యమును రోయుచు అన్నతో నిట్లనెను. రామచంద్రా! ఇది సత్యము. సత్యముగా చెప్పుచున్నాను. శపథము చేయుచున్నాడను. నీ యధీనమున నున్న కోసల రాజ్యమును కుశునకు పట్టము గట్టుము. స్థిరముగా లవుని ఉత్తర కోసలమున రాజును చేయుము. ఇంక దూతలను బంపి శత్రుఘ్నునిచ్చటకు బిలిపించుము. ఇప్పుడే యధార్థమును నీ ప్రయాణమును తెలియజెప్పుము. అని చెప్పెను. పౌరులు శిరములు వ్రేలాడవైచి చెప్పరాని విధముగా గొప్ప ఆర్తితో దుఃఖించుటను చూచి భరతుని యొక్క మాటలను విని అరంధతీ భర్తయైన వసిష్ఠుడిట్లనెను. రామచంద్రా! తండ్రీ! అదే పౌరులను జూడుము. వీరి కోర్కెను విని వీరి యిష్టమును దీర్చుట నీకు తగును. మహాత్మా! అని వసిష్ఠుడు పల్కగా నేలబడి యున్న జనులను లేవనెత్తి రామచంద్రుడు నా ఇష్టులారా! మీ కీచింతయేల? మీ కందఱకు నేనేమి చేయవలెనో మీ మనస్సులలో నేమున్నదో చెప్పుడు అని అడుగగా

## శ్రీరాముని వెంటబోవ పౌరులనుజ్ఞ గోరుట:

ఆ పురజనులందఱును రాముని వాక్యములను విని ఒక్కటే మాటగా నిట్లనిరి. ఓ రామచంద్రా! నీవు వెళ్లునప్పుడు నీ వెంట మేము కూడా వచ్చెదము. ఈ వరమును మాకిమ్మని వేడుకొనిరి. ఈ పౌరుల యందు స్నేహమును ప్రేమయు గలవాడవేని భార్యలతోను, పుత్రులతోను విడువక నీవు వెళ్లు మార్గముననే దేవా! మేమును వచ్చెదము. తపోవనమునందో, దుర్గమందో, యేటినీటి యందో లేక సముద్రపు నీటియందో నీవెందు ప్రవేశించిన ఈశ్వరా! మేమును అందే ప్రవేశించెదము. మమ్ము నీవెంట తీసికొని

వెళ్లుము. రామచంద్రా! ఇదియే మాకు శ్రేష్ఠమైన వరమగును. ఇష్టముతో ఇందఱును మనస్సులందిదియే కోరుచున్నారలు. నీ వెంట నంటి రావలెననియే కోరుచున్నారు. మంచిమనస్సు గల రామా! వీరలను తీసికొని వెళ్లదగును. అని వసిష్ఠుడు చెప్పగా పౌరవర్గము దృఢ భక్తిని జూచి అట్లే చేయుదునని చెప్పి వారి కలత దీర్చి కర్తవ్యమును దలచి దక్షిణ కోసల రాజ్యమున కుశుని రాజుగా నిలిపి, లవుని నుత్తర కోసలమున నుంచి పట్టాభిషేకములను గావించి రామచంద్రుడు కొడుకుల నిద్దఱను తొడలపై గూర్చుండ బెట్టుకొని ప్రేమతో తలలను మూర్కొనుచు కౌగలించు కొని పదివేల గజములను అనేక వేల రథములను, పదివేల గుఱ్ఱములను వేరువేరుగా నిచ్చి రత్నవిత్తములతో సంతుష్టి గలిగిన పౌరులతో నున్న పట్టణములకు వారలను బంపించి లక్ష్మణ సోదరుని గొని వచ్చుటకై దూతలను బంపెను. ఆ దూతలు మూడురాత్రింబవళ్లు దారి యందు నిలువక వేగముగా వెళ్లి మధురాపట్టణమున శత్రుఘ్నుని జూచి యిట్లు చెప్పిరి.

★★★



# నూట యెనిమిదవ సర్గము

## శత్రుఘ్నుడు కొడుకులకు పట్టాభిషేకము చేసి అయోధ్య చేరుట:

శ్రీరామచంద్రుని ప్రతిజ్ఞయు, రాముడు లక్ష్మణుని విడుచుటయు, పౌరజనులు రాముని వెంట వెళ్లదలంచి నిశ్చయించుటయు, రాముడు పుత్రులకు పట్టాభిషేకములు చేసి కుశునకు వింధ్యాద్రి సమీపమున గల కుశావతి యను పట్టణము నిచ్చుటయు, లవునకు శ్రావస్తి రాజధానిగా జేసి అయోధ్యను నిర్జనముగా విడిచి రాముడు భరతుడు ఇద్దఱును స్వర్గమార్గమున జను ప్రయత్నమున నుండుటయు దెల్పి దూతలు మహాత్మా! నీవు వేగముగా బయలు దేరి రమ్మని చెప్పగా ఆ వీరశ్రేష్ఠుడు అప్పుడు కులము కూలునట్లుండుట తెలిసి పౌరుల నందఱను పిలువ బంపి కాంచనాఖ్యుడగు పురోహితుని బిలిపించి వారలు రాగానే వారితో రాముని వృత్తాంతము సమస్తమును చెప్పి నాకు వారితోడివేయగు గతులు ప్రాప్తించునని చెప్పి ప్రేమతో రాజ్యము నంతయు తన పుత్రులకు బంచి యిచ్చి పట్టాభిషేకములుచేసి మధురారాజ్యమును సుబాహువను తన పెద్ద కుమారునకిచ్చి వైదిశమను పట్టణమును శత్రుఘాతి యను తన రెండవ పుత్రునకిచ్చి బలములను, సొమ్ములను అట్లే సమానముగా పంచి యిచ్చి ఒంటరిగా తాను రథము నెక్కి అయోధ్యకు వెళ్లి, అందు మెఱయుచున్న తెల్లని పట్టు వస్త్రములను ధరించి ప్రజ్వలించుచున్న అగ్నిహోత్రుని వలె ముని సంఘముల మధ్యనున్న సోదరుని జూచి చేతులు జోడించి నమస్కరించి నిలబడి ధర్మము నందు నడచునట్టి శ్రేష్ఠుడైన రాముని జూచి యిట్లనెను. ఓ నిర్మాలాత్మా! అన్నా! నా పుత్రులకు విధివిహితముగా పట్టాభిషేకము చేసి నీ వెంట వచ్చుటకు వచ్చితిని. నిర్మలాత్మా! నన్ను నీవెంట తీసికొని వెళ్ల గోరుచున్నాను. నా మనస్సు నందిది నిశ్చయించుకొన్నాను. విన్నావు గదా! ఏవియు అడ్డంకులను చెప్పకుము. వేగముగా నీ ఆజ్ఞతో నీవెంట వచ్చుటకు సమ్మతింపుము అని కోరగా రామవిభుడు తన తమ్మునితో అట్లే యగుగాక అని చెప్పుచుండగా అంతలో వానరులతో సుగ్రీవుడును, రాక్షసులతో విభీషణుడును గుంపులు గుంపులుగా వచ్చిచేరిరి.

## సుగ్రీవ విభీషణులు శ్రీరాముని జూడవచ్చుట:

అందులో సూర్యపుత్రుడైన సుగ్రీవుడు ముందుగా వచ్చి స్వర్గప్రయాణమునకు సిద్ధముగా నున్న రఘూత్తముని జూచెను. అట్లు వచ్చి చూచి మహాత్మా! నీ వెంటబడి యిందఱమును వచ్చెదము. నీ వెందు బోయినను ప్రేమతో విడువక మమ్మునెల్లఱను దయతో తీసికొని పొమ్ము. రామచంద్రా! మమ్ము విడచి నీవు వెళ్లినచో మాకు యమదండము పాలబడిన యట్లగును. పురుషశ్రేష్ఠా! మంచి మనస్సుతో మమ్ము కావగదే రామా! యనగా రామవిభుడు నవ్వి అట్లే యనెను. అంత సుగ్రీవుడిట్లనెను. రామచంద్రా! వానర రాజ్యమందు వానరశ్రేష్ఠుడైన అంగదుని నిల్పి మీ వెంట వెళ్ల దలంచి నిశ్చయముగా వచ్చినాడను. నన్ను విడుచుట న్యాయముగాదు సుమా యని పల్క రాముడు మనస్సు నందు వానరరాజు యొక్క మైత్రిని దలంచి యిట్లనెను. గొప్ప మిత్రుడవైన సుగ్రీవా! నేనెందైనను నిన్ను విడిచి వెళ్లదలంపను. వినుము వానరరాజా! దేవలోకమునకైనను పరమపదమునకైనను వెళ్లబోను.

## శ్రీరాముడు హనుమద్విభీషణాదులకు వరములిచ్చుట:

అని చెప్పి రామచంద్రుడు విభీషణుని జూచి యిట్లనెను. రాక్షసరాజా! ఈ ప్రజలు భూమి యందుండు వఱకు నిశ్శంక మతితో నీవు శరీరముతో లంకాపట్టణమునందుండుము. చంద్రుడును, సూర్యుడును, ఈ భూచక్రమంతయును, నా కథ లోకమున నశింపక ఎందాక యుండునో అంతవఱకు నీవు రాజువై యుండుము. స్నేహకారణమున నిట్లు చెప్పుచున్నాను. బదులు చెప్పకుండగా నా యాజ్ఞను నీవు పాలింపుము. ధర్మమును దప్పక ప్రజలను పాలింపుము. ఇంకను నీకేమి చెప్పుదునయ్యా! స్వర్గముననున్న దేవతలకు ఆరాధ్యుడైన ఇక్ష్వాకు కులదైవమైన ఆ జగన్నాథుని నీవు భక్తితో నర్చింపుము. అని చెప్పుచున్న రాముని శాసనమును మనస్సు నందు తలంచి రాక్షసరాజు అట్లేయని దశరథ పుత్రుని వాక్యములను వినయము గలవాడై గ్రహించెను. [ఈ మూర్తియే శ్రీరంగనాయకులు. యుద్ధకాండమున సంగ్రహముగా చెప్పబడినది. ఈ కాండమున వివరింపబడినది] తరువాత రామచంద్రుడు గుణ సముద్రుడైన వాయుపుత్రుని జూచి హనుమా! జీవితము నందాశను విడువకుము. నా ప్రతిజ్ఞను మానకుము. వానరశ్రేష్ఠా! ఈ భూవలయమునందు నాకథ యెంతదాక సుందరముగా నిలిచియుండునో నామాటగా అంతదాక హాయిగా సంచరింపుము

అని చెప్పగా హనుమంతుడు వినయముతో సంతోషసముద్రములో మునుగుచు నిట్లు విన్నవించెను. పవిత్రముగా నీకథ లోకము నందుండునందాక భూమియందు నీ యాజ్ఞననుసరించి సంచరించెదనని చెప్పగా రఘురాముడు తరువాత జాంబవంతునితో గూడ హనుమంతునకు చెప్పిన విధముగానే చెప్పి మైందద్వివిదులకు గూడ అట్లే చెప్పి ఆ అయిదుగురును కలియుగము సంప్రాప్తించునందాక జీవములతో క్షేమముగా నుండుడు. [వీరు ద్వాపరముననే మరణించిరి] అనిచెప్పి తక్కిన వానరులను భల్లూకములను చూచి మీరందఱును తలచినట్లుగా నాతో రండని చెప్పి ఆ రాత్రిని గడపి సూర్యోదయము కాగానే తన పురోహితుని జూచి యిట్లనెను.

★★★



# నూట తొమ్మిదవ సర్గము

## శ్రీరాముడు సకల ప్రాణులతో మహాప్రస్థాన మేగుట:

గురువర్యా! అగ్రజాతులైన బ్రాహ్మణులతో అగ్ని హోత్రములను ముందుగా బోనిండు. మార్గములందు వాజపేయ ఛత్రముండు గాక. అని చెప్పగా వసిష్ఠుడట్లే చేయించెను. వైదిక విధిగా మహాప్రస్థానికంబగు కార్యములను మిగులకుండ జరిపించి శ్రీరామచంద్రుడు చిన్న వస్త్రములను ధరించి దర్భలను వ్రేళ్ల సందుల బట్టుకొని మాటలాడకుండగా స్వయముగా పవిత్రమైన బ్రహ్మ మంత్రమును మనస్సు నందే పఠించుచు చేష్టలు డిగినవాడై మార్గము సుఖముగా నున్నదో లేదో యని మనస్సునకు తగులకుండగా ప్రకాశించుచున్న సూర్యుని ధిక్కరించు విధముగా తన మందిరమును విడిచి బయలుదేరి వెళ్లుచుండ కుడిదిక్కున బ్రహ్మహస్తయైన శ్రీదేవియు నెడమవంక హ్రీదేవియు భజింపగా సంహారశక్తి ముందుగా నడచుచుండ విల్లుబాణములు పురుషరూపములు ధరించియు సకలమైన ఆయుధములును వెంటనంటి కొలువగా వేదములు బ్రాహ్మణ వేషములతో వెళ్లుచుండ సర్వరక్షిణియై గాయత్రి వెంట వెళ్లుచుండగా ఓంకారమును వషట్కారమును ముందుండ బ్రాహ్మణులును ఋషులును రామభద్రుని వెంటవెళ్లిరి. ద్వారములు తెరచియున్న స్వర్గమును చేరనేగిరి. ఆ దశరథ తనయునితో అంతఃపురమున నున్నస్త్రీలును, బాలురతోను, వృద్ధులతోను, కింకరుల తోను దాసీ జనములతోను గలిసి భరతుడును సుమిత్రాసుతుడును అగ్నిహోత్రములతోను, ఎంతో అనురక్తితో వెళ్లిరి [ఇందు ఊర్మిళాదేవి చెప్పబడకుండుటచే లక్ష్మణునితో ఆమెయు నేగెనని యెఱుగదగును రామరాజ్యమున వైధవ్యము లేదు] మంత్రిశ్రేష్ఠులును, భృత్యులును భార్యలుపుత్రులు పశువులు బాంధవులతో గలిసి శ్రీరామభద్రుని వెంట ప్రేమతో వెళ్లిరి. స్నానములు చేసి శుచులై పరితుష్టి చెందిన మనస్సులతో వానరులందఱును కిలకిలమను ధ్వనులతో సందడి చేయుచు రాముని వెనుక వెళ్లుచుండిరి. ఆ వెళ్లుచున్న జనులయందు పరిశుద్ధుడు కాని వాడుగాని ఇష్టములేని వాడు గాని దుఃఖించువాడుగాని, సిగ్గుపడువాడుగాని దీనుడు గాని, మనస్సు నందిష్టపడని వాడుగాని ఒక్కడైనను గానరాకుండెను. అందఱును అద్భుతమైన ఆనందముతో నున్నవారై

ఆ రామచంద్రుని వెంబడి వెళ్లుచుండిరి. అతనిని దర్శింపవలెనని వచ్చు జనపదులు కూడా స్వర్గమునకు వెళ్లవలెనను మనస్సులతో ఏ కోరికలు లేనివారై వెళ్లిరి. పరమభక్తి శ్రద్ధలతో వెళ్లిరి. [దీనివలన మోక్ష ప్రాప్తికి భక్తియే యుపాయము. పండితుడైనను, పామరుడైనను, చేతనమైనను, అచేతనమైనను భగవద్దర్శన స్పర్శన సల్లాప నామసంకీర్తనాదులలో నేదిలభించినను ముక్తి నందునని తేలుచున్నది] ఆ పట్టణమునందు కన్నులకు గనబడకుండ నున్న భూతములును రఘువంశ వర్ధనుని వెంట నడచెను. స్థావర జంగమములన్నియు రామచంద్రుని వెంట వెళ్లెను. ఆ పురము నందు జీవమున్న ప్రతిప్రాణియు రాముని యందు భక్తి శ్రద్ధలతో ఆ శ్రీహరి వెంటబడి వెళ్లెను.

★★★



# నూట పదవ సర్గము

## బ్రహ్మాదులు శ్రీరాముని దర్శింపవచ్చుట:

అట్లు రామచంద్రుడు జనసంఘములు వెంటరాగా ఒక అర్ధయోజనము దూరము వెళ్లి యచ్చట పడమటి దిక్కుగా ప్రవహించుచున్న సరయూనదిని పుణ్యజలములతో ప్రవహించుచున్న దానిని జూచి ఆ రఘుచక్రవర్తులచే త్రవ్వబడిన నదీజలములలో దిగి ప్రజలతో గలిసి ఒక చోటికి వెళ్లగానే ఆ క్షణము నందే లోకపితామహుడైన బ్రహ్మ దేవతలును, ఋషులును తన్నుకొలుచుచుండగా స్వర్గమున కేగుటకై రాముడున్న చోటునకు వేగముగా వచ్చెను. ఆకాశమంతయు దివ్యవిమానముల సమూహముతో నిండిపోయెను. స్వయంప్రకాశమానులైన పుణ్యాత్ములైన స్వర్గలోక వాసులచే ఆకాశమంతయు దివ్యతేజస్సుతో నిండి జ్యోతిర్భూతమయ్యెను. పవిత్రము లైన వాయువులు వీచెను. దేవతల చేతులనుండి విడువబడి యెడతెరిపి లేకుండ పుష్పవర్షము కురిసెను, హెచ్చుగా దుందుభులు మ్రోగెను. ఆకాశమంతయు గంధర్వులతో అప్సరసలతో సంకులమయ్యెను. శ్రీరామ చంద్రుడు పాదచారియై సరయూ నదీ జలములలో ప్రవేశించుటకు ప్రయత్నించుచుండ బ్రహ్మ ఆకాశమున నిల్చి యిట్లనెను. ఓ విష్ణుదేవా! రారమ్ము. నీకు భద్రమగునుగాక. మా యదృష్టముచే వచ్చితివి. సాధురక్షా! దేవతలతో సమానులగు సోదరులతో నీవు కోరిన విధముగా నీ శరీరమున ప్రవేశింపుము. వైష్ణవమైన శ్రేష్ఠమైన మహావర తేజమునందు గాని సనాతనమైన నభమునందుగాని నీ మనస్సునకు నచ్చిన విధముగా ప్రవేశింపుము. ఈ జగత్తున కంతటికిని నీవే గతివి. నీ మాయ నెవ్వడు తెలియగలడు? పాపములను భంగపరచు స్వచ్ఛమైన దయతో గూడిన మనస్సు గలవాడా! నీ వక్షయుడవు నశించని వాడవు. మృతిలేని వాడవు. నీవు కోరిన విధముగా యే తనువునందైనను ప్రవేశింపుము. అని బ్రహ్మప్రార్థింప శ్రీరామచంద్రమూర్తి.

## శ్రీరాముడు సానుజుడై సశరీరముగా వైష్ణవ తేజము జొచ్చుట:

మనస్సునందు నిశ్చయించుకొని సోదరులతో గలిసి అప్పుడు సశరీరముగానే శ్రేష్ఠమైన వైష్ణవ తేజమున బ్రవేశించెను. దేవతలందఱును పొగడుచుండిరి. [దీనివలన

శ్రీరామునిది ప్రాకృతదేహము కాదని యేర్పడుచున్నది] అంతా విష్ణుమయమని అఖిల లోకేశ్వరుని దేవదేవుని, సర్వదేవతలును సాధ్యులును, మరుత్తులును, దైత్యులును, దానవులును, యక్షులును, గంధర్వులును, గరుడులును, నాగులును, దివ్య ఋషులును, అప్సరస్సంఘములును సర్వము పావనమయ్యెను. సర్వమును సంతుష్టి నిండినదయ్యెను. మా యిష్టములు సమకూరెను. అని పొగడుచుండ విష్ణువు బ్రహ్మను జూచి యిట్లనెను. సువ్రతా! ఈ జనులను జూచితివా? ఇందఱును అచంచలమైన భక్తితో స్నేహముతో నాతో వచ్చి తమ ప్రాణములు నిచ్చిరి. నన్ను విడిచి యుండుటను సహింపరైరి. నా యందను రక్తితో నున్న వీరందఱును పుణ్యాత్ములు.

## బ్రహ్మ సమస్తజనులకు నుత్తమ లోకముల నిచ్చుట:

కాన విధాతా! వీరలను తగిన లోకములందు నిలుపుము. అని చెప్పగా బ్రహ్మ యిట్లు పలికెను. లోకారాధ్యా! ఈ ప్రజలందఱును సంతానమను లోకమున నుండెదరు. ఈ విధముగా నిన్ను భక్తితో భావించుచు శరీరములను విడుచువారందఱును విడువకుండగా సాంతానిక లోకమున నిలిచెదరు దేవా! ఆ లోకము బ్రహ్మలోకమనకు పైన నిఖిల బ్రహ్మగుణ సమేతమై యుండునది. వీరలందఱందుండెదరు. వానరులుగా నున్న వారందఱును వారల పూర్వపు దేవతారూపముల బ్రవేశించెదరు. వానర రాజైన సుగ్రీవుడు సూర్యమండలమును బ్రవేశించును. మహాత్మా! వానరులందఱును దేవతలను పొందెదరు. అని బ్రహ్మ చెప్పుచుండగా ధరణి జనులు సంతోషముతో బాష్పజలములు కన్నులనుండి ధారలుగా కారుచుండ సరయూ నదియందు గోప్రతార తీర్థమున మునిగిరి. అప్పుడు వారందఱును రామభక్తితో తమ ప్రాణములను విడువగా ఎల్లప్రాణులును శరీరములనందే విడిచి దివ్యమైన విమానములందు ప్రకాశించుచు వెళ్ళిరి. అప్పుడా సరయువు నందు మునిగిన మృగములు పక్షులు చెట్లు మొదలైన తిర్యక్కులు సహస్రములుగా దేవ తేజములతో నున్న శరీరములు ధరించి స్వర్గమున కేగిరి. పందుగవలె కోతులు, కొండముచ్చులు, భల్లూకములు, రాక్షసులు ఆ క్షణము నందే సరయూనది యందు దేహములను విడిచి స్వర్గమున కేగిరి. అందఱునిట్లానందముతో ఆ శ్రీహరి దివ్యమైన దేవలోకములందు నిల్పి సంతసము చెంది మహా స్వర్గమునకు ప్రీతితో వెళ్ళెను.

★★★

# నూట పదునొకండవ సర్గము

## శ్రీరామాయణ ఫలశ్రుతి:

ఇట్టి ఈ రామాయణ కథ స్తోత్రముగా ప్రఖ్యాతినందును. ఇది బ్రహ్మచే పూజింపబడినది. రామాయణమను ప్రసిద్ధి గనినట్టిది. ముఖ్యమైనది. దీనిని నిర్మించినవాడు వాల్మీకి. చరాచరములకు ఆత్మయందుండు వాడగు విష్ణువు పూర్వపు విధముగా స్వర్గము నందు నిలిచెను. అంత ఎంతో ఆనందము వృద్ధి నంద అమృతపానము చేయు దేవతలందఱు కూర్చుండగా, దేవతలు గంధర్వులు, మునులు, సిద్ధులు మొదలైన వారందఱును ప్రతిదినమునను సంతోషముతో వైభవముగా ఎంతయో దివ్యమైన ఈ రామాయణమును స్వర్గమున వినుచుండెదరు. ఈ ఆఖ్యానము ఆయువును వృద్ధిపరచునది. పాపములను నశింపజేయునది. సౌభాగ్యముల నిచ్చునది. ఈ రామాయణము వేదములతో సమానమైనది. శ్రార్ధకాలములందు గానము చేయదగినది. ఒక్క పాదము మాత్రమైనను [శ్లోకమందు నాల్గవ భాగమైనను] పఠించినచో సంతానము లేనివాడు పుత్రవంతుడగును. ధనము లేనివాడు ధనవంతుడగును. సర్వపాపములును నశించిపోవును. ప్రతినిత్యము పాపములు చేయు దీనుడైనను శ్రద్ధతో ఒక పద్యమైనను జదివినచో పాపములంటవు. అగ్ని తగిలిన దూదివలె నశించును. ఇది యధార్థము. [శ్రీరామనామ మాహాత్మ్యమును పఠింపుడు. ఇది యెట్లు యధార్థమో తెలియగలదు] చదువు వానికి గోవును బంగారమును, దివ్యమైన వస్త్రముల నిచ్చిన, పురాణము చెప్పువాడు సంతోషమునందినచో నెట్టి చింతయు నుండబోదు. దేవతలందఱును తృప్తినందెదరు. ఆయువును వృద్ధినందించు నట్టి శ్రీరామాయణమును పఠించునాతడు పుత్రులతోను మనుమలతోను సంపదలు కలిగి సుఖములను పొందుచు తరువాత స్వర్గము నందింతింతనరాని సుఖముల నందును. అట్లు ధన్యమైన ఆ యయోధ్యా పట్టణము చాల కాలము శూన్యముగా నుండి తరువాత ఋషభుడనువాడు రాజై పాలించుచుండ జనులకు నివాసముగా వృద్ధినంది సౌఖ్యముల నిచ్చుచుండెను. ఈ భూమియందు ఉత్తర కాండతో గూడ ముందు జరుగబోవు దానితో గూడ వల్మీకమున జన్మించిన వాల్మీకి దీనిని రచించెను. లోకకర్తయైన బ్రహ్మ స్వయముగా దీనినంగీకరించెను. దీనిని దేవతలు పూర్తిగా విని సంతోషించిరి. వేలకొలది

యశ్వమేధయాగములును, శతసహస్ర వాజపేయములును చేసిన మంచి ఫలితములు రామచంద్రుని చరిత్రమును వినినను, ధ్యానము చేనినను, పొందును. దేవనది మొదలైన నదులయందు స్నానము చేసిన ఫలితమును, నైమిశము మొదలైన గొప్ప అరణ్య భూములందు తపస్సు చేసిన ఫలితమును, మఱియు ప్రయాగ కురుక్షేత్రము మొదలైన పుణ్యతీర్థములను చూచిన ఫలితమును ఈ రామాయణమును వినువారు పొందెదరు. గ్రహణ సమయమున దానమొనర్చిన ఫలమును, కురుక్షేత్రమునందు తపస్సు చేసిన ఫలమును దీనిని వినినవాడు పొందును. విడువని శ్రద్ధతో ఆ సీతానాధుని చరిత్రను విన్న ధన్యుడు ఘోర పాపములను విడుచుచు తాను విష్ణు సన్నిధానమున స్థిరముగా నిలుచును. ఇది ఆదికావ్యము. ఋషులచే చెప్పబడినది. వాల్మీకి ఋషిచే చెప్పబడినది. నిశ్చల భక్తితో ఎప్పుడును దీనిని వినువాడు యధార్థముగా విష్ణురూపమును బొందును. దీనిని నియమముతో వినుచున్నయనఘున కుదారము పుత్రులును వృద్ధినందుదురు. ఎడతెగని యైశ్వర్యము కలుగును. కులము తామర తంపరగా వృద్ధిజెందును. ఎల్లప్పుడును రామచరిత్రయే శ్రేష్ఠమైన మనస్సుతో భక్తితో వినువాడు పవిత్రుడై చాల సంవత్సరములు భూమి యందు జీవించి అంతమున మోక్షమును బొందును. నిరంతరము రఘురామ చింతాపరుడైన మనుష్యుడు కోరిన కోరికలను వెంటనే పొందును. ఇది ప్రతిదినమును బ్రాహ్మణులు చదివి వినిపించ వలయును. గాయత్రీ రూపమైన రామాయణమున ఒక్క పదమైనను చదివినచో అది పాపములను నశింప జేయును. పుత్రులను, అధిక ధనలాభమును అక్షయముగా పొందును. రామచరిత్రమును చదువువారలు నిశ్చలమైన మనస్సుతో నియతాత్ములై చదువు వారలు ఈ భూమిని వదలి వెళ్ళిన తరువాత విష్ణులోకమున నెల్లప్పుడును స్థిరముగా నుండుదురు. ఈ రామకథను విన్నచో తండ్రియు, తండ్రితండ్రియును, తండ్రితాతయును, అతని తండ్రియు, అతని తండ్రియు విష్ణులోకమున నివసించి యుండెదరు. రామచరిత్రము ధర్మార్థకామములను, శాశ్వతమగు పదమును ఇచ్చును. ఇది నిజము. కాన నిత్యమును జనులారా! మీరలు శ్రద్ధతో దీనిని జదువుటయు, వినుటయు చేయదగిన పనియని తెలిసికొనుడు. భక్తితో పదమైనను, పాదమైనను, చదివిన పాపము నశించును. రామాయణమును వినునాతడు బ్రహ్మలోకమున కేగును. బ్రహ్మచే పూజింపబడును. ఎల్లప్పుడును ఈ విధమైన హెచ్చు మాహాత్మ్యము గల్గిన యిట్టి పురాతన వృత్త శ్రేష్ఠమును సంశయమును చెందక మీరు పఠింపుడు. నిండు మనస్సుతో నమ్మి పఠించిన జనుల దోషములన్నియును దూరముగా తొలగిపోవును. మిక్కిలి భద్రములు

మీకు గలుగును. విడువకుండగా విష్ణుని మహామహిమచే మీరు వర్ధిల్లుదురుగాక. కడు వర్ధిల్లుదురుగాక.

## ఆంధ్ర కవికృత గ్రంథాంత నమస్కారములు:

ఓ జానకీనాథా! కలిగిన విఘ్నముల నణచుచు, ప్రాప్తించిన ఆపదలను చివఱి వఱకు తొలగించితివి. దయతో ఈ కృతిని స్వీకరింపుము రామా! ఓ అప్పా! నేను తప్పొప్పుల నెఱుంగను. నీవు పలికించినట్లుగా పలికితిని. దీనియందు కలిగిన తప్పొప్పులకు నీవే దిక్కు. దశరథ రామా! ఎందైనను హెచ్చుగా జెప్పియున్నను నీ అనురక్తి చేతనే. హెచ్చని విడిచి యుండినచో జ్ఞానము లేకుండుట చేతనే గదా. మహాత్మా! నీ కృతి ఈ ప్రబంధము సత్యముగా జీవములున్న మూర్తి విధముగా నుండెను. ఈ కృతి పాలసముద్రము వంటిది. దీని మహత్వమును నీవే యెఱుగుదువు. నేను తెలిసి కొంద మన్నను యెఱుగ వశమా? నన్ను తరింపజేయుటకే దీనిని నీవే కరుణాతి రేకముచే నిట్లు పల్కించితివి. కాని అంత మాత్రము చేత నేను స్వతంత్రుడనను అహము వీసమంతైనను లేదని నీవెఱుగవా? తరచిన కొలది అమృతమును బోలు తీపి లోతది. యెంతయో ప్రవేశించి చూడ పారమార్థిక స్థిరమతియై మనస్సు నిలకడగా నున్న కేసరి పుత్రునికి వలె నాతరమా? నన్ను గూడ రామా! నీయందే యేక చిత్తముతో నున్న వానినిగా జేయుము. [కేసరి పుత్రుని రీతిగా రామాయణమున హనుమంతుడు తప్ప తక్కిన యందఱు సహింపరాని దుఃఖముల ననుభవించిన వారలే. హనుమంతుని వలె శ్రీరామ భక్తియు, శ్రీరామ కైంకర్యము నందప్రతిహత శక్తియు గలవారు మరియొకరు లేరు. అఘటన ఘటనా చాతుర్యము చేత గొప్పకీర్తిని దెలియజేయుటకు నావంటి దాని చేత తేలికైన విధముగా నీయొక్క కృతిని పాపహరణా! నీవే పలికించితివి గాని అన్యము గలదా? దయతో నీ పాద ధూళి చేత రాతిని ఒక స్త్రీగా చేసితివి. బలవంతులైన విరోధి వర్గములకు దర్పకళ్లునే నివారింపలేని విధముగా చేసితివి. గ్రద్దకు స్థిరమైన మోక్షము నిచ్చితివి. అట్టి నీకు నన్నిట్లు కృతికర్తగా చేయుటనునది యెంతపని? నా యొక్క శక్తిని నేను వీసమంతైనను ఎఱుగను. నీ కృపకు పాత్రురాలనగుట చేత సంతోషమును శ్రద్ధయు హెచ్చయ్యెను. నీవు నాకు బాసను చేసితివి. ఈ సముద్రమును దాటింతునని. సత్యభాషణా! నీ వాడి తప్పవనునది లోకములు ప్రఖ్యాతిగా నెఱింగనదే. ఈ సముద్రమును దాటుమని చెప్పితివి. ఆ సముద్ర మీ కావ్యమో సంసారమో తెల్పితివి కాదు. కృతియను సముద్రమును దాటించితివి. దయతో [సంసారమును] పాప సముద్రమును గూడ అట్లే దాటింపుము. కాలము వ్యర్థముగా పోవుచున్నది. ప్రతిదినమందును కొంత విన్న వట్టి కథల వలన

ఫలమున్నదా? ఒక్క నిమిషమైనను నీ యొక్క కథల యందు మనస్సుంచినచో మంచి ఫలితమని తలచి రామచంద్రా! ఈ విధముగా కొంచెము కొంచెముగా రోజురోజును రచింప బూనితిని. నీ మాటనే మనస్సునందు నమ్మి క్రోధన ఆశ్వయుజ మాసమున శుద్ధ విజయదశమి నాడు కృతి ప్రారంభింప మధ్యమధ్య విఘ్నములు కలిగియు ఒక్క యేడు కొన్ని నెలలు కొలదిగానవి యన్నియును నీ కరుణ గల చూడ్కులచే తొలగిపోవ నీ మహా కావ్యము నొక్కటియే ఆధారముగా గొని భయపడక నీ సేవ సల్పుచుండుటచే శాలివాహన శకమునందు చాంద్రమానమున అక్షయ నామ సంవత్సరమున కీర్తిత శ్రావణమాస కృష్ణపక్ష ఏకాదశియందు పూర్ణమయ్యెను. సైరింపుము. దేవా! నాయపచారములవి యెన్నియో గలవు. ఇది సత్యము. నీ కరుణ నా మీద ప్రవహింపగా గైకొనుము. నమస్కారములర్పించుచున్నదానను. ఇంకే విధమైన శక్తిలేని దాననగుటచే ఈ అనేకవేల నమస్కారములనే అర్పించుచున్నదానను.

## మంగళమహాశ్రీ వృత్తము

మంగళము రామునకు మంజుగుణధామునకు మాన్యసుర సోమునకు నౌతన్
మంగళము సీతకసమాన పరిపూతకును మాతకును సంతతము నౌతన్
మంగళము భ్రాతృహిత మండల సమేతునకు మారుతి సమర్చితునకున్ స
న్మంగళము భక్తజన మానస నివాసునకు మానగుత మంగళ మహాశ్రీ

## గద్యము

ఇది శ్రీరామచంద్ర చరణారవింద మిళిందా యమాన వావిలి
కొలను సుబ్బారాయ ప్రణీతంబైన నిర్వచన మహాపద్యకావ్యము
నకు వచనాను సరణముగా శ్రీమొలుగు వెంకట నరసింహార్యతనూ
జ శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులు గారి ధర్మ
పత్ని వెంకట సీతమ్మ చేరచింపబడిన శ్రీమదాంధ్ర వాల్మీకి
రామాయణమున ఉత్తరకాండము సమాప్తము.

ఇందు సర్వము జగన్మాతృ ప్రసాదసిద్ధిగా రామార్పణమస్తు
మంగళ మహత్

శ్రీశ్రీశ్రీ

★★★